# యువభారతి
# వజ్రోత్సవ హారతి

షష్టిపూర్తి ప్రత్యేక సంచిక


*గౌరవ సంపాదకులు:*

సుధామ

*సంపాదకులు:*

డా॥ బి. జయరాములు



*ప్రచురణ*



(రి. సంఖ్య 1/64)

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు

తిలక్ రోడ్, హైదరాబాద్ - 500 001

*YUVA BHARATHI VAJROTSAVA HAARATHI*

(*A Souvenir Published on the Occasion*
*of the Diamond Jubilee Celebrations of Yuvabharathi*)



ప్రచురణ సంఖ్య : **207**

ప్రథమ ముద్రణ : **29 అక్టోబర్ 2023**

పుటలు : **304**

ప్రతులు : **1000**

ముద్రణ సహకారం : 'పుస్తకశిల్పి' **తాళ్లపల్లి మురళీధర గౌడు**

ముఖచిత్ర రూపకల్పన : **నవ్య ప్రింటర్స్**
మోతీనగర్, హైదరాబాద్.

డి.టి.పి & లే అవుట్ : **మను గ్రాఫిక్స్**
చిక్కడపల్లి
హైదరాబాద్

ముద్రణ : **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**
విద్యానగర్
హైదరాబాద్–500 044

ప్రతులకు : **యువభారతి**
తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాద్ – 500 001.
చరవాణి : 98499 09896
93913 73684

వెల : **రూ. 300/- $ 15**

# అంకితం

యువభారతి
అరువదేళ్ల ప్రస్థానంలో
విశేష సేవలందించి
సంస్థ అభ్యున్నతికి శ్రమించి
దివంగతులైన సభ్యుల
దివ్యస్మృతికి నివాళిగా
ఈ వజ్రోత్సవ సంచిక
అంకితం





డా॥ కె.వి.రమణాచారి, ఐ.ఎ.ఎస్ (రి)
తెలంగాణ ప్రభుత్వ సలహాదారు, హైదరాబాద్.

# నా'నుడి'

తెలుగు భాషా సాహిత్య పరిరక్షణ కోసం యువభారతి సంస్థ దశాబ్దాలుగా చేస్తున్న కృషి అభినందనీయం: అభినందనీయం.

ఆరోజుల్లో యువభారతి కార్యక్రమాలను చూసినవారికి కన్నుల పండుగ...

విన్నవాళ్ళకందరికి ఒడలు పులకరింత...

ఒక దివాకర్ల; ఒక సినారె; ఒక ఇరివెంటి; ఒక జీవియస్; ఒక తిరుమల శ్రీనివాసాచార్య... ఇలా ఎందరో మహానుభావులు ప్రసంగిస్తూంటే... వారి ప్రసంగధారను వింటుంటే.... వారి వారి పాండితీధారను కంటుంటే... మనం కూడ యువభారతి ధారలో... దారిలో ఎందుకు సాగిపోకూడదని అనుకొన్న యువకుల్లో... ఆనాటి యువకుల్లో... నేనూ ఒకణ్ణి!!

యువభారతి సాహితీ లోకానికందించిన మహోపకారం ఏంటంటే – ఒక 'మహతి'ని అందించింది.

ఒక 'కావ్యలహరి' నందించింది.

ఒక 'ప్రతిభా లహరి' నందించింది.

ఒక 'ఉపనిషత్ సుధాలహరి'ని అందించింది.

యువతను చైతన్యపరచడానికి 'చైతన్యలహరి'ని అందించింది.

ఒక 'హాస్యలహరి'నీ అందించింది.

యువతకు సాహితీ వికాసంతో పాటు వెలుగురేకల్ని జీవితంలో ప్రసరింపచేయడానికి యువభారతి చేసిన ప్రయత్నం అనల్పం; అపూర్వం; ఆనందవర్ధనం.

యువభారతి ప్రస్తుతం ఆచార్య ఫణీంద్ర ఆధ్యక్షనంలో శ్రీ జీడిగుంట వెంకట్రావు, శ్రీ అయల సోమయాజుల నాగేశ్వరావు, శ్రీసుధామ, శ్రీ రవీంద్ర, శ్రీ అశ్వినీకుమార్ పత్రి, శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యులు, ఆచార్య వంగపల్లి విశ్వనాథం, తాళ్లపల్లి మురళీధర్ గౌడు వంటి అరమై ఏళ్ళ ప్రాయం దాటిన ఉత్సాహవంతుల సారథ్యంలో శోభిల్లుతూంది. యువభారతికి యువతే పునాది... యువభారతి ఆశించేది యువతలోని నవనీత సదృశమగు ఆలోచనా నవత.... ఈతరం యువకులే కొందరైనా ముందుకొచ్చి; యువభారతి మహోన్నత ఆశయాల కనుగుణంగా కార్యభారాన్ని వహించేందుకు సిద్ధమై; యువభారతి సంస్థ ప్రగతికి "మేము సైతం" అన్నట్లుగా తోడ్పడుతారని ఆశ!!

అరవై ఏళ్ళుగా అలుపన్నది లేకుండా సత్కార్యాలెన్నో చేస్తూన్న యువభారతి ఖ్యాతిని – ఈ వజ్రోత్సవాల సందర్భంగా – అంతర్జాతీయస్థాయికి ఎదిగేలా చేస్తారని మనసారా ఆశిస్తూ – శుభాభినందనలతో–

(కె.వి.రమణ)

**(కె.వి.రమణ)**





శ్రీ మండలి బుద్ధప్రసాద్
ఆంధ్రప్రదేశ్ శాసనసభ పూర్వ ఉపసభాపతి, హైదరాబాద్

# సేవకు ప్రేరణగా నిలిచిన యువభారతి

యువభారతి ఒక అపూర్వ, అపురూప అద్భుత సాహితీ సేవా సంస్థ. యువతరం కోసం యువతరమే నాడు నెలకొల్పిన యువభారతి ఈ నాటికీ యువరక్తంతోనే వర్ధిల్లుతోంది. 'చుట్టూరా ఉన్న చీకటిని తిడుతూ కూర్చోవటం కన్నా ప్రయత్నించి ఒక చిరుదీపం వెలిగించటం మిన్న' అనే సూక్తిని అక్షరాలా ఆచరణలో పెట్టిన సంస్థ.

1972లో భారతస్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంలో "మహతి"ని యువభారతి వెలువరించింది. ఆ పుస్తకం నన్నెంతో ప్రభావితం చేసింది. 1973 లో నేను హైదరాబాద్ లో డిగ్రీ చదువడం, అదే సమయంలో మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావుగారు విద్యా సాంస్కృతిక శాఖామాత్యులుగా ఉండటం, వారితో పాటు యువభారతి కార్యక్రమాలకు, పుస్తకావిష్కరణలకు వెళ్తుండేవాడిని. దివాకర్ల వేంకటావధాని, డా.సి. నారాయణ రెడ్డి గార్ల ప్రసంగాలు యువభారతి సభల్లోనే మొదటగా విన్నాను. 1975 లో ప్రపంచ తెలుగు మహా సభలు జరగడం, యువభారతి కార్యనిర్వాహకులు అందరూ తెలుగు మహాసభలలో ప్రముఖ పాత్రను నిర్వహించడం, తరచూ వారు మా ఇంటికి రావడం, వారితో పరిచయాలు కలిగినవి. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, ఇరివెంటి కృష్ణమూర్తి, వంగపల్లి విశ్వనాథం, సుధామ, తాళ్ళపల్లి మురళీధరగౌడు గార్లతో ఆత్మీయ అనుబంధం ఏర్పడింది. "నందిని" పేరిట చిన్న పత్రిక యువభారతి వెలువరించేది. పత్రిక చిన్నదైనా ప్రబోధాత్మకంగా ఉండేది.

జి.వి. సుబ్రహ్మణ్యం గారి సంపాదకీయాలు ఆలోచనాత్మకంగా ఉండేవి. నందిని పత్రికను అతి జాగ్రత్తగా దాచుకునేవాడిని.

నిబద్ధతతో, నిర్మాణాత్మకంగా నియమబద్ధంగా కార్యక్రమాలు నిర్వహించటం యువభారతికి వెన్నతో పెట్టిన విద్య. కృష్ణాజిల్లా రచయితలసంఘం లాంటి ఎన్నో సంస్థలు 'యువభారతే మాకు స్ఫూర్తి' అని ప్రకటించాయంటే ఆ సంస్థ గుణశీలత అవగతం అవుతుంది. కార్యక్రమాలను నిర్వహించటంతో పాటు పుస్తక ప్రచురణకూడా ఒక యజ్ఞంలాగా భావించింది యువభారతి. ఈ సంస్థ పక్షాన ఎందరో సాహితీమూర్తుల్ని, కళాకారుల్ని, మేధావుల్ని గుర్తించి గౌరవించేవారు. నెల నెలా ప్రముఖుల ప్రసంగాలు, ఆ ప్రసంగాల్ని పుస్తకాలుగా ముద్రించటం, వాటిలో ఎన్నో అపురూప పరిశోధనాంశాలు ఇమిడి ఉండటం, ఎందరో పరిశోధకులకు అవి ఆకరగ్రంథాలుగా ఉపయోగపడటం ఇవన్నీ యువభారతికి ఒక ప్రత్యేకతను ఆపాదించాయి. ఏదైనా ఒక విషయాన్ని గురించిన సమాచారం కావాలంటే యువభారతి ప్రచురణల్లో దొరుకుతుందనే నమ్మకం ఈ నాటికీ ఉంది.

2006 లో ఆంధ్రప్రదేశ్ అవతరణ స్వర్ణోత్సవాల్ని పురస్కరించుకుని జాతీయ తెలుగు రచయితల మహాసభలు నిర్వహిస్తూ కృష్ణాజిల్లా రచయితల సంఘం 'తెలుగుపసిడి' గ్రంథాన్ని వెలువరించింది. ఈ గ్రంథం ముందు మాటల్లో ఆంధ్రప్రదేశ్ రజతోత్సవాల నాటి యువభారతి ప్రచురణ 'మహతి' స్ఫూర్తితోనే ఈ పుస్తకాన్ని ప్రచురిస్తున్నట్టు సంపాదకీయంలో పేర్కొన్నాము.

ఆధునిక ప్రాచీన సాహిత్యాల సమన్వయ పరుస్తూ, రేపటి తరాలకు వాటిని పదిలపరుస్తూ, భాషా సంస్కృతులను పరిరక్షించే లక్ష్యంతో సాగుతున్న యువభారతి నేటికీ ఆదర్శనీయమైన పాత్రనే పోషిస్తోంది. అరవై యేళ్ల క్రితం మొలకెత్తిన ఈ బీజం పుల్ల కుసుమిత శోభినాం అన్నట్టు మహావృక్షమై పుష్పఫలభరితంగా నిలిచింది.

యువభారతి నాలో సాహిత్యాభిలాషను పెంచింది. సాహిత్య సంస్థల నిర్వహణను నేర్పింది. భాషను అభిమానించేవారిని యువభారతి ప్రేమిస్తుంది. భాషను ప్రేమించేవారందరూ యువభారతిని అభిమానిస్తారు. భాష, సంస్కృతి సాహిత్యాలతో ముడిపడి సాగుతున్న యువభారతికి భాషాభిమానమే శిరోభూషణం. వజ్రోత్సవాల సందర్భంగా యువభారతికి నా నమోవాకాలు.





డా॥ అక్కిరాజు రమాపతిరావు
(మంజుశ్రీ)
సాహితీవేత్త, హైదరాబాద్

# ఆకాంక్ష

వజ్రోత్సవం జరుపుకుంటున్న
యువభారతి కార్యవర్గ సభ్యులందరికీ
శుభాభినందనలు.
యువభారతి సంస్థ
మరింతగా అభివృద్ధి చెందుతూ
మరొక వజ్రోత్సవం జరుపుకోవాలని
ఆకాంక్షిస్తున్నాను.





డా॥ కె.ఐ.వరప్రసాద్ రెడ్డి
చైర్మన్, శాంతా బయోటిక్స్, హైదరాబాద్

# నాటి యువభారతి నేటి ప్రౌఢభారతి

1963 విజయదశమి నాడు పురుడుపోసుకున్న 'యువభారతి' అన్న సంస్థకు రానున్న విజయదశమికి (2023) షష్టిపూర్తి అవుతుంది. 60 సంవత్సరాల సుదీర్ఘ ప్రస్థానంలో ఎన్నో విలువైన కార్యక్రమాలు, పుస్తక ప్రచురణలు, కవి పండితుల ఉపన్యాసాలు, సదస్సులూ నిర్వహించి తెలుగు సాహిత్యానికి, తెలుగు సంస్కృతీ వైభవాల మనుగడకూ ఎనలేని సేవచేసిన 'యువభారతి'కి అభినందనలు – అభివందనాలు!

ఈ అరవై సంవత్సరాల యువభారతిని ఆప్యాయంగా, సభక్తికంగా తమ భుజాలమీద మోస్తూ పెంచి పోషించిన నిర్వాహక కార్యవర్గ సభ్యులకు, వివిధ సంవత్సరాలలో అధ్యక్ష స్థానాల్లో వుండి దిశానిర్దేశం చేసిన మాన్యులకూ శిరః పూర్వక నమస్సులు –

యువభారతి సంస్థ నిత్యనూతనంగా, కార్యశీలంగా మనుగడ సాగించడానికి ఎన్నో అమృతహస్తాలు తమ తోడ్పాటు నందించాయి. ఎన్నో సమకాలీన సాహితీ సంస్థలూ, సాంస్కృతిక సంస్థలూ మరువలేని సేవలందించినందుకు ఆ సంస్థలకూ యువభారతి సభ్యులు, నిర్వాహక కార్యవర్గం, నాలాంటి వీరాభిమానులు ఋణపడివుంటారు.

ప్రస్తుత 'యువభారతి' కార్యనిర్వాహక సభ్యులు శ్రీయుతులు వంగపల్లి విశ్వనాథంగారు, ఆచార్య ఫణీంద్ర గారు, ఎ.నాగేశ్వరరావు గారు, జీడిగుంట

వెంకటరావు గారు యువభారతి వజ్రోత్సవాల సందర్భంగా వెలువరిస్తున్న ప్రత్యేక సంచికకు, కవిమిత్రులూ, పండితమాన్యులూ, అభిమానులూ, యువభారతితో వారికున్న సాంగత్య విశేషాలనూ, సాహితీ సౌరభంగల వ్యాసాలను పంపి తమకున్న అవ్యాజమైన అభిమానాన్ని చాటుకున్నారు. ఎందరో మహానుభావులు – అందరికీ వందనాలు – యువభారతి సహస్రశతాయుష్కరాలు కావాలని ఆకాంక్షిస్తున్నాను.

–వరప్రసాద్
**(వరప్రసాద్ రెడ్డి)**





డా॥ తంగెడ కిషన్‌రావు
ఉపాధ్యక్షులు, పొ.శ్రీ.తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్

# అభినందన

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అన్న వాక్యం స్ఫూర్తితో 1963 విజయదశమి నాడు ఉదయించిన సంస్థ – "యువభారతి". సమాజంలో సౌమనస్యాన్ని, సామరస్యాన్ని పెంపొందించటానికి సాహిత్యానికి మించిన సాత్విక సాధనం వేరొకటి లేదనే విశ్వాసంతో, "యువభారతి" సంస్థ దశాబ్దాల తరబడి అనేక వైవిధ్య భరిత సాహిత్య కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహిస్తూ వస్తున్నది.

యువభారతి సమకాలీన సాంఘిక, ఆర్థిక, రాజకీయ, యువజన సమస్యలను తీసుకుని ప్రముఖ రచయితలతో వ్యాసాలను వ్రాయించి "రచన", "మహతి", "Free India Forges Ahead", "యువత" వంటి అనేక ఉత్తమ పఠనీయ గ్రంథాలను ప్రచురించింది. తెలుగు సాహిత్యంలో పరిఢవిల్లిన కావ్యాలు, ప్రబంధాలు, ఇతిహాసాలు, నాటకాలు వంటి వివిధ ప్రక్రియల గురించి, ఆ యా రంగాలలో విశేష కృషి చేసిన నిష్ణాతులైన వక్తల చేత ఉపన్యాసాల నిప్పించి, వారి ఉపన్యాస పాఠాలను యువభారతి ప్రచురణల రూపంలో సాహితీప్రియులకు అందించింది. తెలుగు సాహిత్య రంగంలో ఆనాటి ప్రసిద్ధులైన ఆచార్యులు, కవులు, పండితులు అందరూ యువభారతి వేదికపై ప్రసంగించి సాహిత్యాభిమానులను అలరించారు. ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి "కావ్య లహరి" ప్రసంగాలను వింటున్న శ్రోతలు జోరుగా కురుస్తున్న వర్షానికి

కూడ వెరవక, కూర్చున్న కుర్చీలనే గొడుగులుగా చేసుకొని నిలబడి వినడం ఈనాటికీ యువభారతీయులకు ఒక తీపి జ్ఞాపకం. 1971 వ సంవత్సరంలో "కావ్య లహరి" తో ప్రారంభమైన "లహరి" కార్యక్రమాల పరంపరలో "చైతన్య లహరి" "ఇతిహాస లహరి", "వికాస లహరి", "హాస్య లహరి" వంటి ప్రచురణలతో 16 గ్రంథాలు యువభారతి నుండి వెలువడ్డాయి. ఈ పరంపర ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది.

ఇంకా – "కవితా వైభవాల" పరంపరలో భాగంగా ఆదికవి నన్నయభట్టు నుండి జ్ఞానపీఠ పురస్కార గ్రహీత డా. సి నారాయణ రెడ్డి గారి వరకు గల ఎందరో ప్రసిద్ధ ప్రాచీన, నవీన తెలుగు కవుల జీవిత, వ్యక్తిత్వాలను, వారి కావ్యాలను, కవితా వైభవాలను పరిచయం చేస్తూ గ్రంథాలు వెలువడ్డాయి. కాళిదాసు, పాల్కురికి సోమన, నంది తిమ్మన, సూరదాసు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, కుందుర్తి, దాశరథి, స్వామి వివేకానంద, శ్రీశ్రీ వంటి మహాపురుషుల కవితా వైభవాలను వివరించిన 26 గ్రంథాలను యువభారతి వెలువరించింది. వక్తృత్వ కళపై ఇరివెంటి కృష్ణమూర్తి గారు రచించిన "వాగ్భూషణం భూషణం" అన్న యువభారతి గ్రంథం యువతకు వ్యక్తిత్వ వికాస మార్గదర్శనం చేస్తూ బహుళ ప్రసిద్ధినొందింది. అంతే కాకుండా యువకవులను ప్రోత్సహించి వారి కవితలను, కథలను, వ్యాసాలను, నవలలను కూడ ప్రచురించి పాఠకలోకానికి పరిచయం చేసింది యువభారతి.

అతి విలువైన గ్రంథాలను ప్రచురించి, అతి తక్కువ వెలకు సాహిత్యాభిమానులకు అందించడం యువభారతి విశిష్టత. భారత స్వాతంత్ర్యానంతరం తొలి పాతికేళ్ళ తెలుగు సాహిత్య ప్రస్థానంపై విశ్లేషణగా ముద్రితమై, పాఠకుల విశేషాదరణకు పాత్రమైన "మహతి" గ్రంథం యువభారతి ప్రఖ్యాత ప్రచురణ. అందులో కవి సమ్రాట్ విశ్వనాథ, మహాకవి శ్రీశ్రీ – తామే స్వయంగా తమ సాహిత్య ప్రస్థానాలపై బృహత్ వ్యాసాలను వ్రాయడం విశేషం! అంతటి ఉద్గ్రంథాన్ని ఆ రోజుల్లో కేవలం 7 రూపాయలకే అందించడం విశేషం. అట్లాగే ఆచార్య సి. నారాయణ రెడ్డి గారు పోతన భాగవత పద్యాలపై వ్యాఖ్యానంగా రచించిన "మందార మకరందాలు" అన్న మరొక యువభారతి జగత్ప్రసిద్ధ గ్రంథాన్ని ఆ రోజుల్లో యువభారతి కేవలం ఒక రూపాయికే అందించింది. అదే స్ఫూర్తితో ఈ మధ్య గాంధీజీ 150వ జయంతి సందర్భంగా యువభారతి ప్రచురించిన "గాంధీ మహాత్ముని సూక్తులు" గ్రంథాన్ని ఐదు రూపాయలకే అందించడమే కాదు ... చాల ప్రతులను ఉచితంగా పంచిపెట్టింది.

ఈ విధంగా గత 59 ఏళ్ళలో 200 అత్యుత్తమ గ్రంథాలను వెలువరించి లక్షలాది ప్రతులను తెలుగు సాహితీ జగత్తుకు అందించింది యువభారతి.

"మహతి" గ్రంథాన్ని మళ్ళీ ఏబదేండ్ల తరువాత ఇటీవల యువభారతి పునర్ముద్రించింది. అంతే కాదు... ఆ గ్రంథానికి కొనసాగింపుగా, భారత స్వాతంత్ర్య అమృతోత్సవాల సందర్భంగా, తరువాతి 50 సంవత్సరాల తెలుగు సాహిత్య ప్రస్థానంపై, "అమృత భారతి" పేరిట మరో గ్రంథాన్ని కూడ ముద్రించి, సాహితీ ప్రియులకు సమర్పించింది.

దశాబ్దాలుగా ఇట్లా సాహిత్య సేవలో మమేకమై, పునీతమౌతున్న "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ – రానున్న విజయదశమికి 60 వసంతాలు పూర్తి చేసుకుని 61 వ వసంతంలో అడుగిడనుంది. ఈ వజ్రోత్సవాల సందర్భంగా యువభారతి సంస్థ గత అరవయ్యేళ్ళుగా తెలుగు సాహిత్య రంగానికి చేసిన సేవను విశేషంగా కొనియాడుతూ, నా పక్షాన, మా తెలుగు విశ్వవిద్యాలయం పక్షాన శుభాభినందనలను అందజేస్తున్నాను.





డా॥ ఎల్లూరి శివారెడ్డి
అధ్యక్షులు, తెలంగాణ సారస్వత పరిషత్, హైదరాబాద్

# యువభారతి నేటికీ ప్రవృద్ధభారతి

యువభారతి సాహిత్యసేవలో ఒక సుమధుర ఘట్టం. తెలుగు సాహిత్యోత్సవాలతో ఆ సంస్థది అనితర సాధ్యమైన సాహిత్య సాంస్కృతిక సేవ. కీ.శే. డా॥ఇరివెంటి కృష్ణమూర్తిగారు, డా॥ వంగపల్లి విశ్వనాథంగారు, డా॥జివి.సుబ్రహ్మణ్యంగారు, డా॥ తిరుమల శ్రీనివాసాచార్య, సుధామ గారి వంటి ప్రముఖ రచయితల నిర్వహణలో యువభారతి చేసిన సేవ సదా స్మరణీయం. కావ్యలహరి లాంటి సాహితీప్రసంగలహరుల సమ్మేళనంతో ఒక సాహితీ సముద్రంగా వెలుగొందింది.

ఈ సంస్థ కార్యక్రమాల తీరే వేరు. నిక్కచ్చిగా రూపొందించిన ప్రణాళికతో ప్రమాణ సహితంగా ఏర్పాటు చేయబడ్డ ప్రసంగాలు జనసామాన్యాన్ని ఆకర్షించాయి. వందలాదిగా ప్రసంగకర్తలు పాల్గొన్న లహరీ పరంపరలోని సంప్రదాయ, ఆధునిక సాహిత్యప్రసంగాలు, ఉన్నత ప్రమాణాలతో వెలువరించిన ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥సినారె ప్రసంగాలు మరపురానివి. యువభారతి ప్రచురించిన సాహిత్యగ్రంథాలు చదివితే తెలుగు సాహిత్య సమగ్రరూపం అవగతమవుతుంది. ఆ సంస్థ ప్రధాన కార్యకర్తలందరూ ఉద్యోగాలు చేస్తున్నా సేవాభావంతో ఆ సంస్థ ప్రతిష్ఠను పెంచారు.

ఆ సమయపాలనలో సంస్థకు ఒక నియమపాలన ఉండేది. ముఖ్యఅతిథి, అధ్యక్షుడు సమయానికి వచ్చినా రాకున్నా కార్యక్రమం ప్రారంభమయ్యేది.

రావలసినవారు మంత్రులైనా అధికారులైనా అంతే. దినారాత్రులు శ్రమించి ఆ సంస్థ పెద్దలు ఆ ఉపన్యాసాలను గ్రంథాలుగా వెలువరించారు. ప్రాచీనాధునిక సాహిత్యాలన్న తారతమ్యం లేదు. సాహితీసేవా తత్పరులైన తెలుగు ప్రముఖులందరిచేత ప్రసంగాలు చేయించారు. ఆనాడు అప్పటి ఆంధ్ర సారస్వతపరిషత్తు ప్రాంగణంలో జరిగిన యువభారతి కార్యక్రమాల సాహిత్యాభిమానులే కాదు, శాస్త్రజ్ఞులు కూడా విని ఆ జ్ఞాపకాలను మనసులో పదిలపరచుకున్నారు. అప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయం సైన్సు శాఖలోని అనేక మంది అధ్యాపకులు ఆ అనుభూతిని గురించి నాతో ప్రస్తావించిన సందర్భాలున్నాయి. యువభారతి కార్యక్రమాలు ప్రౌఢభారతి ప్రసంగాలుగా, వృద్ధభారతి ఉపన్యాసాలుగా కాక మరపురాని ప్రవృద్ధభారతి ప్రసంగాలుగా రూపొందాయి. ఇప్పటికి ఆ సంస్థ సాహిత్య పరిమళాలు తరిగిపోలేదు. ఆ లక్ష్యం చెరిగిపోలేదు. ఆనాటి ఈనాటి కార్యకర్తలు వజ్రసంకల్పం కరిగిపోలేదు. నిజంగా ఇప్పటి యువభారతి ప్రవృద్ధ భారతే.





# షష్ట్యబ్ది సంహర్షణం

డా॥ ఆచార్య ఫణీంద్ర
అధ్యక్షులు, యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ
99598 82963

సీ. *"సత్సాంప్రదాయక సాహిత్యమే సదా*
*మాన్యత గూర్చు సమాజమునకు*
*విఖ్యాత సాహితీవేత్తల గ్రంథాలె*
*సౌమనస్యము బెంచు జనుల యందు*
*పండిత ప్రముఖుల ప్రాసంగిక విషయా*
*లుద్ధరించును నవ యువత" ననుచు –*
*ఆశావహ మహోన్న తాశయ సిద్ధికై*
*సేవలో సఫల మగుచు*

తే.గీ. *అరువదేడుల పాటుగా నలుపెరుగక*
*భవ్యమగు సభల్, గ్రంథాల ప్రచురణమ్ము*
*జరుపుచు సమస్త సాహితీపరుల హృదుల*
*స్థిరముగా నిల్చె "యువభారతి" ఘన సంస్థ!*

"యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ – "చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అన్న సూక్తిని లక్ష్యంగా చేసుకొని 1963 సంవత్సరంలో విజయదశమి పర్వదినం నాడు భాగ్యనగరంలో ఆవిర్భవించింది.

సమాజంలో సౌమనస్యాన్ని, సామరస్యాన్ని పెంపొందించటానికి సత్సాహిత్యానికి మించిన సాధనం మరొకటి లేదనే విశ్వాసంతో "యువభారతి" కడచిన ఆరు దశాబ్దాలుగా అనేక వైవిధ్య భరిత సాహిత్య ప్రసంగ కార్యక్రమాలను నిర్వహిస్తూ వస్తున్నది. ఆచార్య దివాకర్ల వేంకటావధాని, శ్రీ వానమామలై వరదాచార్య, మహాకవి కాళోజి, డా. దాశరథి, ఆచార్య సి. నారాయణరెడ్డి, ఆచార్య జి.వి.

సుబ్రహ్మణ్యం, శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ, డా. పుల్లెల శ్రీరామచంద్రుడు, ఆచార్య రవ్వా శ్రీహరి, డా. తిరుమల శ్రీనివాసాచార్య, ఆచార్య ఎస్.వి. రామారావు, ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి, డా. ముక్తేవి భారతి, ఆచార్య మసన చెన్నప్ప వంటి ఎందరో తెలుగు సాహిత్య దిగ్గజాలతో ప్రసంగ కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించి, ఆ ప్రసంగ పాఠాలతో – అమూల్య సాహిత్య గ్రంథాలను ప్రచురించిన విషయం ఉభయ తెలుగు రాష్ట్రాలలోని సహృదయ తెలుగు సాహితీ మూర్తులకు, అశేష సాహిత్యాభిమానులందరికీ విదితమే!

ఈ ప్రచురణల పరంపరలో భాగంగా "కావ్య లహరి", "చైతన్య లహరి", "ప్రతిభా లహరి", "మహతి", "మందార మకరందాలు", "వాగ్భూషణం భూషణం", "సంస్కృత సాహిత్య లహరి", "హాస్య లహరి", "ఉపనిషద్సుధా లహరి", "గాంధీ సూక్తులు", "అమృత భారతి" .. ఇత్యాది అనేక పాఠక జన ప్రీతిపాత్రమైన గ్రంథాలను ప్రచురించి, లక్షలాది ప్రతులను తెలుగు నాట, చాల తక్కువ ధరకు విరివిగా అందించిన విషయం కూడ సర్వజన విదితమే! ఈ గ్రంథాలెన్నో ఎంతో మంది మహనీయులకు ప్రేరణగా నిలిచాయని వారే స్వయంగా చెప్పడం ఒక విశేషం. సాక్షాత్తు తెలంగాణ రాష్ట్ర ముఖ్యమంత్రి, గౌరవనీయులు శ్రీ కె. చంద్రశేఖరరావు గారు 2017 డిసెంబరు మాసంలో హైదరాబాదులో నిర్వహించిన ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఇదే విషయాన్ని చెప్పి, "మందార మకరందాలు", "వాగ్భూషణం భూషణం" వంటి యువభారతి గ్రంథాలను ప్రభుత్వమే పునర్ముద్రించి, వేలాది ప్రతులను ప్రపంచం నలుమూలల నుండి వచ్చే తెలుగు సాహిత్యాభిమానులకు అందించేలా చర్యలు చేపట్టడం మా కెంతో గర్వ కారణం!

దశాబ్దాలుగా ఇట్లా సాహిత్య సేవలో మమేకమై, పునీతమౌతున్న "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ – రానున్న విజయదశమికి 60 వసంతాలు పూర్తి చేసుకుని 61 వ వసంతంలో అడుగిడనుంది. ఈ వజ్రోత్సవాల సందర్భంగా "యువభారతి" సంస్థ ఉభయ తెలుగు రాష్ట్రాలలోని ప్రసిద్ధ విద్వత్ ప్రవచనకారులను రావించి, వారిచే – "మహాభారతోపన్యాస లహరి", "శ్రీమద్రామాయణం – మానవీయ సంబంధాలు" అన్న అంశాలపై ప్రసంగాలను ఇప్పించి, గ్రంథాలుగా ముద్రించి సాహితీ లోకానికి సమర్పించింది.

ఈ సందర్భంగా ఆనాటి నుండి "యువభారతి" ప్రఖ్యాతికి తోడ్పడిన స్వర్గీయ దివాకర్ల వేంకటావధాని గారు మొదలైన వక్తలకు, ఇతర ప్రఖ్యాత సాహితీవేత్తలకు, కవులు, పండితులకు శిరస్సు వంచి నమస్కరిస్తున్నాం. మా పూర్వాధ్యక్షులు స్వర్గీయ

డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారు, స్వర్గీయ ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారితోబాటు, డా. తిరుమల శ్రీనివాసాచార్య గారు, శ్రీ మాడభూషి అనంతాచార్య గారు అందించిన సేవలను నెమరువేసుకొంటూ, వారికి హృదయ పూర్వక కృతజ్ఞతా పూర్వక నమస్సులను సమర్పించుకొంటున్నాం. అట్లాగే, మా ప్రచురణల సంపాదకులుగా వ్యవహరించిన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి, శ్రీ సుధామ గారికి, డా. బి. జయరాములు గారికి ప్రత్యేక ధన్యవాదాలు!

యువభారతి అరవయ్యేళ్ళ ప్రస్థానానికి సాక్షిగా నిలవడమే కాకుండా, వ్యవస్థాపక సమావేశకర్తగా మా సంస్థకు నిరంతరం మార్గదర్శనం చేస్తున్న ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారికి మనఃపూర్వక నమోవాకాలు!

ఈ వజ్రోత్సవాల సందర్భంగా "యువభారతి" సంస్థ తెలుగు పాఠక లోకానికి ఉపాయనంగా అందిస్తున్న గ్రంథం – ఈ వజ్రోత్సవ సంచిక. ఇందులో యువభారతిని నడిపిన వారు, యువభారతితో కలిసి నడచిన వారు, యువభారతిని అభిమానిస్తూ, అనుసరిస్తూ నడచిన వారు, యువభారతితో స్ఫూర్తి పొందిన వారు, యువభారతి గ్రంథాల పఠనంతో ఎదిగి వివిధ రంగాలలో ఉన్నత శిఖరాలకు చేరుకొన్న వారు, ఇతర సాహితీ మూర్తులు – యువభారతి పట్ల తమకు గల గౌరవాన్ని, అనుబంధాన్ని, ఆత్మీయతను రంగరించి, వ్యాసాలుగా అందించారు. వారందరికీ పేరు పేరునా మా హృదయ పూర్వక ధన్యవాదాలను తెలియజేసుకొంటున్నాం.

అట్లాగే, ఇన్నేళ్ళుగా యువభారతి పల్లకీని మోసిన, ఇప్పటికీ మోస్తున్న కార్యవర్గ సభ్యులు, కార్యకర్తలు, ఇతర ఔత్సాహిక సభ్యులు, అభిమానులు, యువభారతిని నిరంతరం ప్రోత్సహిస్తూ ఆశీస్సులను అందజేస్తున్న తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు డా. కె.వి. రమణాచారి గారు, తెలంగాణ భాషా సాంస్కృతిక శాఖ సంచాలకులు డా. మామిడి హరికృష్ణ గారు, శాంతా వసంతా ట్రస్ట్ అధినేత – పద్మభూషణ్ బిరుదాంచితులు డా. కె. ఐ. వరప్రసాదరెడ్డి గారు .. ఇట్లా .. ఎందరో మహానుభావులు – అందరికీ వందనాలు!

ఈ గ్రంథం ఈ తరం పాఠకులకే గాక, భావి తరాల పాఠకులకు, తెలుగు భాషా సాహిత్యాభిమానులకు, సాహితీ సంస్థల నిర్వాహకులకు – విశేషమైన స్ఫూర్తిని అందిస్తూ, అశేషంగా అలరిస్తుందని ఆశిస్తున్నాం.





# సంస్థా'గతం'

శ్రీ సుధామ
పూర్వ ప్రధాన సంపాదకులు, యువభారతి, హైదరాబాద్
98492 97958

అరవై సంవత్సరాలు...

ఒక వ్యక్తి జీవితంలో షష్టిపూర్తిగా ఎంత ప్రాధాన్యతో మనకు తెలుసు! మఖలో పుట్టి పుబ్బలో మాడిపోయే సంస్థలు అనేకం. అలాంటిది ఒక సాహిత్య సాంస్కృతిక సంస్థ అరవై ఏళ్ళుగా మనగలుగుతూ రావడం సామాన్యమైన సంగతేమీ కాదు.

1963వ సంవత్సరంలో 28 సెప్టెంబర్ శనివారం విజయదశమి రోజు యువభారతి ఆవిర్భవించిది. "అలనాడు యిలనాడు కూడా సంఘ జీవితంతో వైయక్తిక జీవితాన్ని నిర్మాణాత్మకంగా సమన్వయ పరచుకోవాలంటే బాల్యం నుండి కొంత శిక్షణ అవసరమని అందరూ అంగీకరించినదే. అది స్వచ్ఛందంగా జరిగినప్పుడు ఆనందం ద్విగుణీకృతమై ఫలితాలు దీర్ఘకాలికంగా వుంటాయి."

ఆంధ్రప్రభ దినపత్రిక ఆ రోజుల్లో బాలవిహార శాఖల ఏర్పాటుకు స్ఫూర్తినిచ్చింది. అలా ఒక శాఖగా వెలసిన జంటనగరాల సభ్యబృందపు "భాగ్యనగర బాలవిహారశాఖ' యే బాల్యం తారణ్యంలోకి మలుపులు తిరిగి ఆ వయోధర్మాన్ని అనుసరించి 'యువభారతి' పేరు క్రింద సంఘటిత మయ్యారు. నిర్దిష్టమైన ఆశయాలు ఏర్పరచుకుని జనవరి 4, 1964 నుండి రిజిస్టర్ సంస్థగా పాదుకొంది. యువభారతి కృషి లక్ష్యాలు సాంస్కృతిక సాహిత్య సంస్థగా రూపుదాల్చాయి. వైయక్తిక జీవితానికి, సంఘజీవితానికి ఉభయ శ్రేయస్కరమైన సమన్వయాన్ని సాధించడంలో యువభారతి ఒక 'తాలింఖానా'గా తోడ్పడాలని ధ్యేయంగా పెట్టుకుంది. సామూహిక కృషికి మొదట అవసరం సహృదయం సాధన కనుక 'కలంస్నేహం' అనే విభాగాన్ని ఏర్పరుచుకొనడం కూడా జరిగింది. 'విశ్వం అన్నయ్య'గా ఆ లేఖినీమైత్రి నిర్వహణ అందులో సభ్యులయిన వంగపల్లి విశ్వనాథం గారిదయింది.

లేఖారచన పాటవమే గాక భావప్రకటనకు, వచోనైపుణ్యం, వక్తృత్వ పాటవం

కూడా అవసరం. ఆ సాధనకు రెండు కార్యక్రమాలుగా 'క్లుప్తగోష్ఠి', 'నాకు నచ్చినది–నేను మెచ్చినది, ప్రవేశపెట్టుకుని సాహిత్యంలో ఉత్తమాభిరుచులు పెంపొందించడం లక్ష్యంగా 'పుస్తకచర్చ'ను సభ్యులలోని కళాభినివేశానికి, సృజనాత్మకశక్తికి 'స్వీయ రచనాపఠనం' 'లలిత సంగీత నాటక కార్యక్రమాలు' ఏర్పాటుచేసి అప్పట్లో ప్రతినెలా రెండవ ఆదివారం మొదట్లో ఎ.శ్రీదేవిగారి ఇల్లు అయిన 102, జీరా సికింద్రాబాదులోనూ, ఆ తరువాత సికిందరాబాద్, రాష్ట్రపతిరోడ్‌లోని శ్రీ బూర్గు మహదేవహాల్‌లోనూ మధ్యాహ్నం రెండుగంటలకు జరిగేవి. నిజానికి యువభారతి రిజిస్టర్ కాకముందు శ్రీ.కె.రఘునాథరావు అధ్యక్షులు, శ్రీ యం.వి.యస్.ప్రసాద్ కార్యదర్శిగా ఉండగా, రిజిస్టర్ అయ్యాక శ్రీ పి.వి.రమణమూర్తి అధ్యక్షులుగా, శ్రీ టి.ఆంజనేయులు కార్యదర్శిగా, 'రచనశాయి'గా అనంతరకాలంలో పేరొందిన వై. శేషతల్పశాయి సహాయ కార్యదర్శిగా కార్యక్రమాలు సాగేవి. ఆంధ్రభూమి సంపాదకులు శ్రీ గోరాశాస్త్రిగారు, సికింద్రాబాద్ లయన్స్‌క్లబ్ కార్యదర్శి శ్రీ యం.జి.రామచందర్ సలహాదారులుగా వుండేవారు. వై.రాంబాబు, శాయి, గోరా లక్ష్మి, పి.వి.యల్.చంద్రమోహన్, కె.రఘునాథరావు, ఎ.శ్రీదేవి మిత్రబృందం తొలినాళ్ళ క్రియాశీలక యువత.

నేటికీ యువభారతి లోగోలో కనబడే సరస్వతి బొమ్మను చిత్రించింది టి.లక్ష్మీనారాయణ కాగా యువభారతి అన్న అక్షరాలను తన చేతిరాతతో అలంకరించింది వై.రాంబాబు, వై.రాంబాబే వ్రాయసకాడిగా యువభారతి పేరిట తొలుత ఓ ఏడాది సైక్లోస్టైల్డ్ మాసపత్రిక (వెయ్యి కాపీలతో) నడిచింది. ఆ తరువాత కాలంలో మీ సుధామ చేతిరాతతో లిఖిత మాసపత్రిక రాగా అటుపై 'న'ందిని' మాసపత్రిక అచ్చులో డా॥జి.వి.సుబ్రహ్మణ్యంగారి సంపాదకత్వంలో పలు సంవత్సరాలు అలరించింది.

1964లో యువభారతి జన్మదిన ప్రత్యేక సంచిక వెలువడేనాటికి యువభారతి సభ్యులు 37 మంది. యువభారతి ఆశయాలను ప్రోత్సహించటానికి వివిధ ప్రాంతాల నున్న తెలుగువారిని ప్రత్యేక సభ్యులుగా చేర్చుకున్న సంఖ్య 133. విశ్వం అన్నయ్య ఉత్తరాలద్వారా దగ్గరకుచేర్చడానికి నిర్వహించిన 'లేఖినీమైత్రి' సభ్యులు 120 మంది. 'కలం స్నేహం' అలా వెల్లివిరిసేది.

అరవై ఏళ్ళపాటు యువభారతిని వైభవ ప్రాభవాలతో నిలిపిన ఘనత డా॥ వంగపల్లి విశ్వనాథం (విశ్వం అన్నయ్య) గారిదే. 1964 ఫిబ్రవరి తొమ్మిది

నాటి సమావేశంలో, జూన్ 14 నాటి సమావేశంలో క్లుప్తగోష్ఠిలో విజేతగా పుస్తక బహుమతి గెలుచుకున్న నాటి యువభారతి సభ్యుల పట్టికలో 26వ పేరయిన శ్రీ విశ్వం 'యువభారతి' సంస్థను సాహిత్యచరిత్రలో యిలా సుస్థిర పరచగలరని బహుశా ఆనాడు ఆయనే ఊహించి ఉండకపోవచ్చు.

1964 అక్టోబర్ 11 ఆదివారం సాయంత్రం ఆరుగంటలకు యువభారతి ప్రథమ వార్షికోత్సవం నాటి రాష్ట్ర శాసనమండలి డిప్యుటీచైర్మన్ శ్రీ మామిడిపూడి ఆనందం గారి అధ్యక్షతన ఆంధ్రభూమి దినపత్రిక సంపాదకులు శ్రీ గోరాశాస్త్రి గారు ప్రారంభించారు. ఆకాశవాణి గాయని ఎ.వి.సావిత్రి లలిత సంగీతం, శ్రీ ధారా రామనాథశాస్త్రిగారి నాట్యావధానం, కుమారి కోవెల శాంత కర్ణాటక సంగీతం, శ్రీ నేరెళ్ళ వేణుమాధవ్ ధ్వన్యనుకరణ, రామానుజం బృందం వాద్యసంగీతం అనంతరం యువభారతి సభ్యులు శ్రీ ఎన్.వి.సుబ్బయ్య దర్శకత్వంలో భమిడిపాటి రాధాకృష్ణ రచించిన 'దంతవేదాంతం' నాటిక ప్రదర్శించారు.

తొలుత సాంస్కృతిక కార్యక్రమాలు యువభారతి కొన్ని చేసినా రవీంద్రభారతిలో రత్నపాప నృత్యప్రదర్శన ఏర్పాటు చేయడం, హైదరాబాద్ అబిడ్స్‌లోని జామురుద్ టాకీస్‌లో ఛారిటీషోగా 'దోస్తీ' సినిమా ప్రదర్శన చేయడం వంటివి నిర్వహించినా ఆ తర్వాత సాహిత్యానికి పెద్దపీట వేసింది. వంగపల్లి విశ్వనాథంగారి 5 కింగ్స్ వే, సికింద్రాబాద్ కార్యస్థానంగా సుల్తాన్‌బజార్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో ప్రతినెలా పైనగల సమావేశ మందిరంలో ఆదివారాల్లో పక్ష సమావేశాలు మొదట, మూడవ ఆదివారాల్లో మధ్యాహ్నం 2.30కు జరగడం మొదలయ్యాక ఒక సాహిత్య సంస్థగా యువభారతి వైభవ ప్రాభవ దీప్తి ఉత్తేజితమైంది. ఇరివెంటి కృష్ణమూర్తి గారు అధ్యక్షులుగా, కార్యదర్శిగా ఎస్.వెంకటేశ్వరరావు నిలువగా 'సమావేశకర్త' అంటూ వంగపల్లి విశ్వనాథం బాధ్యతలను వినమ్రంగా వహిస్తూ వచ్చినా అసలు సాహిత్య సంస్థలకు 'సమావేశకర్త' యే మూలాధారనాడి అన్న స్థాయిని సంతరించిపెట్టింది విశ్వనాథం గారే! అలాగే వనితావిభాగం సమావేశాలు విడిగా ప్రత్యేకించి జరిగేవి. వార్షిక కార్యక్రమాలు, లహరి పరంపరలు జరిగినప్పుడు మాత్రమే అంతా కలిసి పనిచేసేవారు.

యువభారతి ధనాఢ్యమైన సంస్థకాదు, నిజానికి అలాగని ప్రచురణ సంస్థా కాదు. కానీ వీలయినంత తక్కువధరకు వీలయినంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందించాలనే లక్ష్యంతో యువభారతి తొలి ప్రచురణగా అనుముల కృష్ణమూర్తిగారి

'సరస్వతీ సాక్షాత్కారం'  కావ్యాన్ని ప్రచురణ పూర్వ విరాళాలతో ప్రచురించడం జరిగింది. రెండు రూపాయలు ప్రచురణ పూర్వవిరాళంగా ఖలీల్ జిబ్రాన్ ది ప్రాఫెట్‌కు కాళోజీ గారి అనువాదం 'జీవనగీత' ద్వితీయ ప్రచురణగా బాపుగారి ముఖచిత్రంతో వెలువడింది. 1968లో తొలిసారిగా నలుగురు యువభారతి సభ్యులు ఇరివెంటి కృష్ణమూర్తి, చక్రవర్తి వేణుగోపాల్, అల్లంరాజు వెంకటరావు (సుధామ), వంగపల్లి విశ్వనాథంగార్ల కవితాసంకలనం 'వీచికలు' వెలువడింది. 1970లో 'మారుతున్న విలువలు–రచయితల బాధ్యతలు' అనే అంశంపై గోష్ఠి కార్యక్రమాన్ని నిర్వహించి 'రచన' గ్రంథాన్ని ప్రచురించింది.

పక్ష సమావేశాల ద్వారా ఎందరో యువతీయువకులు యువభారతి సభ్యులుగా వక్తృత్వ, రచనాది రంగాలలో రాటుదేలుతూ వచ్చారు. ప్రాచీన సాహిత్యంపట్ల యువతలో అభిరుచి పెంచాలన్న దృక్పథంతో తొలిసారి ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారిచే 'కావ్యలహరి'  ప్రసంగపరంపర ఏర్పాటుచేసి ఆ ప్రసంగాలను ప్రచురణ పూర్వ విరాళంతోనే ముద్రించి లహరి ప్రసంగాల చివరిరోజు ఆ గ్రంథావిష్కరణ చేసే లక్ష్యంతో తలపెట్టిన ప్రణాళిక అనూహ్యంగా ఆంధ్రసారస్వత పరిషత్తులో జరిగిన సమావేశాలతో విజయదుందుభి మ్రోగించి 11 వేల 500 ప్రతులు ముద్రించడం ఒక చారిత్రక సందర్భం. ఇక అక్కడి నుండి యువభారతి వెనుతిరిగి చూడలేదు. ఏటా 'లహరి' ప్రసంగపరంపరల కార్యక్రమాలు, ఆపై భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా 101 వ్యాసాలతో 'మహతి' ఏడు రూపాయల ప్రచురణ పూర్వ విరాళంతో వెలువరించడం; విశ్వనాథను, శ్రీశ్రీని కూడా మహతిలో పక్కపక్కన నిలిపి యువభారతి సాధించిన సమ్యక్ దృష్టి తెలుగు సాహిత్య రంగంలో పాతకొత్తల మేలుకలయికగా నిజంగానే క్రొమ్మెరుంగులు చిమ్మింది.

ఇతర ప్రాంతాల వారు యువభారతి సభ్యులు కావాలన్న తపనను సాహితీమిత్ర, భారతీమిత్ర పథకాల ద్వారా తీర్చింది. తదాదిగా యువభారతి ప్రచురణలు లహరి ప్రసంగవ్యాసపరంపరలుగా, సాహితీ వాహినిలుగా, ఇతరత్రా పలు రీతులుగా డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం, తిరుమల శ్రీనివాసాచార్య, సుధామ, బి.జయరాములు సంపాదకులుగా నేటికి రెండువందల పైబడినవి కావడం మాత్రమే కాదు, యువభారతి ప్రచురణలు అనేక సాహిత్య, సాహిత్యేతర విద్యార్థులకు, సాహితీపిపాసువులకు స్ఫూర్తిదాయక గ్రంథాలుగా, అకారగ్రంథాలుగా రాణిస్తూ వచ్చాయి. ఈనాడు ముఖ్యమంత్రి వంటి పదవుల్లోనూ, ప్రభుత్వపాలనా పరమైన ఉన్నతోద్యోగస్థానాల్లోనూ

వున్న ఎందరికో యువభారతి ప్రచురించిన ఏదో ఒక గ్రంథం స్ఫూర్తిప్రదాతగా నిలిచిందంటే యువభారతి చేసిన కృషి ప్రత్యేకించి చెప్పనక్కరలేదు.

యువభారతి సమయపాలనకు పెట్టింది పేరుగా నిర్వహించిన సాహిత్య సమావేశాల వెనుక, వీలయినంత తక్కువ వెలతో వెలువరిస్తూ వచ్చిన ప్రచురణల వెనుక యువభారతి సభ్యులు ఎందరెందరి కృషియో వుంది. ఎందరో పెద్దల అండదండలున్నాయి. ఈ అరవై ఏళ్ళ సంచికలో యువభారతి సభ్యులు రాసిన తమ అనుభవాల అక్షరాలు ఎందరో పెద్దల అభినందన వ్యాసాలు యువభారతి గురించిన అనేక అంశాలను అవగతం చేస్తాయి. చెప్పదలుచుకున్నవీ, చెప్పాల్సినవీ ఇంకా ఎన్నో అసంపూర్ణంగానే వుండిపోతాయి కూడాను. అయినా ఇది ఒక యువభారతీయుల 'స్వగతం' సంచిక.

విచిత్రంగానే వుండవచ్చు. కానీ యువభారతికి ఇప్పటికీ తనదంటూ ఒక స్థలం, ఒక కార్యాలయం, చిరునామా శాశ్వతమై లేదు. ఎందరో సాహిత్యాభిమానుల గుండెక్రింద చిరునామాగా మాత్రమే నేటికీ 'యువభారతి' విరాజిల్లుతోంది. ఆనాటి యువత ఈనాడు ప్రవృద్ధభారతీయులు కనుక యువభారతిని అందిపుచ్చుకోవాల్సిన యువతరం కోసం కృషి సాగుతూనే వుంది.

యువభారతి సభల్లో పాల్గొన్న మేరునగధీరులయిన సాహితీవేత్తలు, కవులు, పండితులు, వాగ్మివతంసులు ఈనాడు లేరు. యువభారతి సంస్థ అభ్యున్నతికి కృషిచేసిన క్రియాశీలక సభ్యులు కూడా కొందరు కనుమరుగైపోయారు. కాలగతిలో ఇదంతా సహజమే! కానీ యువభారతి సంస్థాగత చరిత్ర అక్షరబద్ధమై భావితరాలకు అందాలన్న తపన మాకుంది. అందుకే ఉన్నవాళ్ళం గుర్తున్నంతమేరకు విషయాలను ఒకచోట ప్రోగుచేసుకోవాలన్న కాంక్షయే ఈ వజ్రోత్సవ సంచిక రూపకల్పనకు ప్రేరణ.
ఇందుకు సహకరించిన ప్రతి ఒక్కరకూ వినమ్రకృతజ్ఞతలు. భవిష్యత్తులో ఈనాడు ప్రాచుర్యం పొందుతున్న సాంకేతిక మాధ్యమాలద్వారా యువభారతి చరిత్ర పరివ్యాప్తం కావాలని అభిలషిస్తున్నాం! ఇప్పటిదాకా వెలువరించిన యువభారతి రెండువందలపైబడిన ప్రచురణలూ ఉచితంగా అందరికీ అందుబాటులోకి తేబడ్డాయి. 'ద్విశతభారతి' ప్రచురణలో ఇవ్వబడిన 'క్యూ ఆర్ కోడ్'లను 'స్మార్ట్‌ఫోన్'లలో 'స్కాన్' చేసుకుని ఆ గ్రంథాలను చదువుకునే అవకాశం యువతరం అందిపుచ్చు కుంటుందని ఆకాంక్షిస్తున్నాం!





# నిత్య యౌవని "యువభారతి"

డా॥ బ్రాహ్మణపల్లి జయరాములు
సంపాదకులు, యువభారతి ప్రచురణలు, హైదరాబాద్
98498 74207

**భా**రతి అంటే సరస్వతీదేవి. దేవతలెప్పుడూ నిత్య యౌవనులే. (పాతిక సంవత్సరాల వయస్సు దాటరు.) అందుకే, సాహితీ సాంస్కృతిక సంస్థను ఏర్పరచి, నిరంతరం భాషా సాహిత్యాభివృద్ధికోసం, ఆ అభివృద్ధి జనంలోకి చేరడంకోసం, "భారతి" ఎప్పుడూ నిత్యయౌవనిగా ఉంటుందని సూచించడానికే పెద్దలు ఈ సంస్థకు "యువభారతి" అని నామకరణం చేశారు. దీనిలో సభ్యులుగా ఉన్నవారు, కార్యవర్గం వారు అందరూ మానవ మాత్రులే కాబట్టి వారు, వయస్సు మీద పడి వృద్ధులు కావచ్చును. కాని, భారతి మాత్రం "యువభారతి'యే. ఈ సంస్థ కూడా ఆరుపదుల వయస్సు దాటుతున్నా నిత్యయౌవనిలా పనిచేస్తుంది.

ఆనాటి 'లహరి' ఉపన్యాసాలు కాని, ఈ సంవత్సరం నిర్వహించిన భారతోపన్యాసాలు, రామాయణోపన్యాసాలు కాని ఢంకా బజాయించి ఈ విషయాన్ని చాటిచెబుతున్నాయి. ఆదినుంచి నేటిదాకా ప్రజాస్వామ్య పద్ధతిలో సాహిత్య కార్యక్రమాలను తెలుగునాట నిర్వహిస్తున్న ఏకైక సంస్థ "యువభారతి" మాత్రమే అని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఎందరో సరస్వతీ స్వరూపులైన సాహితీమూర్తులు ఈ సంస్థ వేదిక పైనుంచి ప్రసంగించారు, ప్రసంగిస్తున్నారు. సాహిత్యానికి సంబంధించిన అనేక గ్రంథాలను రచింపచేసి యువభారతి ముద్రించింది. ప్రసంగాలను గాలికి పోకుండా ప్రతి అక్షరాన్ని చిక్కబట్టి, ప్రతి తెలుగువాడు చదువుకొనే విధంగా గ్రంథరూపాన్ని సంతరింపచేసింది. ద్విశతాధిక గ్రంథాలు, వివిధ కోణాలను, దృక్పథాలను ప్రతిఫలింపజేస్తూ నేటిదాకా పాఠకులందరికీ జ్ఞానదాయకాలుగా, పరిశోధకులకు ఆధార గ్రంథాలుగా నిలిచాయి.

ఆది నుంచి నేటిదాకా ఉన్న ఆసక్తి, ఆ స్ఫూర్తితోనే "యువభారతి" షష్టిపూర్తి కార్యక్రమాన్ని "వజ్రోత్సవాలు"గా జరుపుకుంటూంది. ఈ సందర్భంలో గత మధుర స్మృతులను, అనుభవాలను నెమరువేసుకుంటూ పలువురు పెద్దలు, సంస్థ సభ్యులు వ్రాసిన అరవైకి పైగా వ్యాసాలను అచ్చువేసి అందంగా గ్రంథ రూపంలో అందరికీ "వజ్రోత్సవ సంచిక"గా యువభారతి అందిస్తూంది.

ఈ సంచికలో రెండు తెలుగు రాష్ట్రాల్లోని అత్యంత ప్రముఖులు, ఆచార్యులు, ప్రముఖ సాహితీవేత్తలు, సాహిత్యాభిమానులు తమ అనుభవాలను, అభిప్రాయాలను రసార్ద్రంగా వెలువరించారు. డా.కె.వి.రమణాచారిగారు, తెలంగాణ ప్రభుత్వ సలహాదారు, యువభారతితో తనకున్న అనుబంధాన్ని నెమరువేసుకుంటూ చాలా విషయాలు గుర్తుచేశారు. "యువతకు సాహితీ వికాసంతోపాటు వెలుగు రేకల్ని జీవితంలో ప్రసరింప చేయడానికి యువభారతి చేసిన ప్రయత్నం అనల్పం; అపూర్వం; ఆనందవర్ధనం" అని కీర్తించారు.

ఆంధ్రప్రదేశ్ శాసనసభ పూర్వ ఉపసభాపతి డా. మండలి బుద్ధప్రసాద్ గారు తమ వ్యాసంలో తనకు ప్రేరణ కలిగించిన సంస్థ యువభారతి అని, "నిబద్ధతతో, నిర్మాణాత్మకంగా నియమబద్ధంగా కార్యక్రమాలు నిర్వహించటం యువభారతికి వెన్నతోపెట్టిన విద్య" అని శ్లాఘించారు.

శాంతాబయోటిక్స్ అధినేత డా. కె.ఐ.వరప్రసాదరెడ్డిగారు, "60 సంవత్సరాల సుదీర్ఘ ప్రస్థానంలో ఎన్నో విలువైన కార్యక్రమాలు, పుస్తక ప్రచురణలు, కవిపండితుల ఉపన్యాసాలు, సదస్సులూ నిర్వహించి తెలుగు సాహిత్యానికి, తెలుగు సంస్కృతీ వైభవాల మనుగడకూ ఎనలేని సేవచేసిన "యువభారతి"కి అభినందనలు – అభివందనాలు" అన్నారు.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య తంగెడ కిషన్‌రావు గారు యువభారతి నాటి నుంచి నేటివరకు చేసిన కృషిని వరుస క్రమంలో విశదీకరించి, "ఈ వజ్రోత్సవాల సందర్భంగా యువభారతి సంస్థ, గత అరవ య్యేళ్ళుగా తెలుగు సాహిత్యరంగానికి చేసిన సేవను విశేషంగా కొనియాడుతూ, నా పక్షాన, మా తెలుగు విశ్వవిద్యాలయం పక్షాన శుభాభినందనలను అందజేస్తున్నాను" అన్నారు.

తెలంగాణ సారస్వత పరిషత్ అధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం పూర్వ ఉపాధ్యక్షులు ఆచార్య ఎల్లూరి శివారెడ్డి గారు – యువభారతి చేసిన సేవలను శ్లాఘిస్తూ, "ఆనాడు అప్పటి ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణంలో జరిగిన యువభారతి కార్యక్రమాలు సాహిత్యాభిమానులేకాదు, శాస్త్రజ్ఞులు కూడా విని ఆ జ్ఞాపకాలను మనసులో పదిలపరచుకున్నారు" అని గుర్తుచేశారు.

యువభారతి గౌరవాధ్యక్షులు, డా. తిరుమల శ్రీనివాసాచార్యగారు తమ అనుభవాలను, సంస్థతో తమకున్న అనుబంధాన్ని క్రోడీకరిస్తూ, యువభారతి సమయ పాలనను, సాహితీసేవను వివరించి, చివరగా "....జీవితాన్ని సాహిత్యానికి ఎలా అంకితం చేసుకోవాలో నేర్పిన 'గురువు' ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారు. 'యువభారతి'తో నాకున్న అనుబంధం జీవితాంతం నిలిచిపోతుంది" అని ఆర్ద్రంగా ముగించారు.

ఇంకా ఈ సంచికలో ప్రముఖ కవి, యువభారతి అధ్యక్షులు ఆచార్య ఫణీంద్ర గారు, యువభారతి వజ్రోత్సవ సంచిక గౌరవ సంపాదకులు శ్రీ సుధామగారు 'యువభారతి' సేవలకు అద్దంపట్టారు.

ఇంకా ఈ సంచికలో సమావేశకర్త శ్రీ పత్రి అశ్వనీకుమార్‌గారు నేటి సాంకేతిక పరిజ్ఞానానికి అనుకూలంగా యువభారతిని, దాని ప్రచురణలను తీర్చిదిద్దుతున్నారు. వారు యువభారతితో అనుబంధాన్ని నెమరువేసుకున్నారు. సంస్థ కార్యదర్శి జీడిగుంట వెంకటరావుగారు, ఆచార్య సి. మృణాళినిగారు, ఆచార్య ఎస్.వి.రామారావుగారు, డా. నందిని సిధారెడ్డిగారు, ఆచార్య టి. గౌరీశంకర్‌గారు, డా.రేవూరు అనంతపద్మనాభ రావుగారు, ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డిగారు, ఆచార్య మసన చెన్నప్పగారు, ఆచార్య వెల్దండ నిత్యానందరావుగారు, శ్రీ టి. ఉదయవర్లుగారు, డా.ముక్తేవి భారతి గారు– మొదలుకొని ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారి వరకు సుమారు 70 మంది ప్రముఖులు యువభారతితో తమ అనుబంధాన్ని, అనుభవాలను గుర్తుచేసుకున్నారు.

నిరంతరం క్రమశిక్షణతో, క్రమబద్ధ ప్రణాళికతో, సాహితీసేవలో నిమగ్నమై ఉండే ఏకైక సాహితీ సంస్థ యువభారతి. భవిష్యత్తులో కూడా ఇదే చైతన్యంతో యువభారతి తెలుగువారికి స్ఫూర్తినిస్తూ ముందుకు సాగుతుందని నిర్ద్వంద్వంగా మనవి చేస్తున్నాను.





# సాకారమైన కల

అయలసోమయాజుల నాగేశ్వరరావు
ఉపాధ్యక్షుడు, వజ్రోత్సవ సమన్వయకర్త
92473 28440

'యువభారతి' 1963 విజయదశమి నాడు స్థాపించబడి 2023 విజయదశమికి 60 సంవత్సరాలు పూర్తిచేసుకుని 61వ శరత్తులో అడుగిడనుంది. ఇది నిజంగా ఆనందించదగ్గ విషయం. చాలా సంస్థలు 'మఖలో పుట్టి, పుబ్బలో మాడిపోతుంటాయి'. మరి కొన్ని బాలారిష్టాలను తట్టుకోలేక 5 సంవత్సరాలలోపే మూతపడతాయి. అలాంటిది ఒక సాహిత్య సంస్థ ఒడిదుడుకులకు తట్టుకుని నిలబడి 60 శరత్తులు పూర్తిచేసుకుని 61వ శరత్తులో అడుగిడడం ముదావహం. కేవలం ఉనికిని చాటుకోవడమే కాకుండా 206 గ్రంథాలను ప్రచురించి, వందలాది సమావేశాలను నిర్వహించి, లక్షలాది ప్రతులను తెలుగు భారతికి అందించింది. ఒక 'విశ్వవిద్యాలయ'మో, ఒక 'సాహిత్య అకాడమీ'నో చేయగలిగినంత సేవను ఒక సంస్థ చేసిందంటే అది నిజంగా గర్వకారణం. అందుకు కారణం నిబద్ధతతో కూడిన కార్యకర్తలు.

'యువభారతి'లో అన్ని ప్రాంతాలవారూ, అన్ని కులాలవారు, మతాలవారు సభ్యులుగా ఉన్నారు. 'యువభారతి'లో చేరటానికి 'అర్హత' కేవలం సాహిత్యాభిమానం మాత్రమే! అంతేకాదు, 'యువభారతి' లో 'ఎఱ్ఱని ఎఱుపు' నుండి 'కాషాయం' దాకా అన్ని రకాల భావజాలాన్ని నమ్మేవారున్నారు. అయితే వారంతా వారి "రాజకీయ భావజాలాలను బయట విడిచి యువభారతి సభామందిరానికి వస్తారు. అదీ యువభారతి ప్రత్యేకత. 'ప్రత్యేక తెంగాణ' ఉద్యమ సమయంలో కూడా ఇరు ప్రాంతాలకూ చెందిన మేమంతా భుజం భుజం కలిపి కార్యక్రమాలను నిర్వహించడం యువభారతి సభ్యులకు సంస్థ ఆశయాలపట్ల ఉన్న అంకిత భావానికి నిదర్శనం.

ప్రతిసంస్థకీ స్థాపించినప్పుడు ఆశయాలు మంచివే ఉంటాయి. అయితే సరయిన నాయకత్వం లేనప్పుడు అవి మసకబారి 'సంస్థలు' కొంతమంది వ్యక్తుల 'జేబు' సంస్థలుగా మారిపోతాయి. అయితే మా అదృష్టం కొద్దీ మాకు కీ॥శే॥ డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి, డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం, డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు, శ్రీ మాడభూషి అనంతాచార్యులు, ఆచార్య వంగపల్లి విశ్వనాథం వంటి మేధావులు, పండితుల నాయకత్వం లభించింది. "ఆలోచన వారిది, ఆచరణ మాది". అలా ఇంతవరకూ సాగింది. అయితే 'యువభారతి'లో 'ప్రజాస్వామ్యం' లేదనుకునేరు. ఏదైనా ఒక కార్యక్రమం తలపెడితే, దాన్ని పూర్వాపరాలు కూలంకషంగా చర్చించేందుకు, తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేసేందుకు ప్రతి 'యువభారతీయుడికీ అవకాశం ఉంటుంది. అయితే, అలా చర్చల అనంతరం తీసుకున్న 'నిర్ణయం' మాత్రం అందరికీ శిరోధార్యం. ఒకసారి 'నిర్ణయం' జరిగితే, అభిప్రాయ భేదాలను మరచి, కలసిమెలసి పనిచేయడం 'యువభారతీయుల ప్రత్యేకత.

'సంస్థ' అన్నాక కొన్ని నియమ నిబంధనలు ఉంటాయి. 'సంస్థ' స్థాపించిన రోజున కేవలం ఏడుగురు మాత్రమే సభ్యులు. కానీ, తరువాత అనేకానేక మంది సభ్యులుగా చేరారు. అయితే 'సంస్థ'లో సభ్యునిగా కొనసాగటానికి "సభ్యత్వ రుసుము' చెల్లించడం అనేది అత్యంతావశ్యకం. తగిన రుసుము చెల్లించినవారే సంస్థలో సభ్యులుగా పరిగణింపబడతారు. అప్పట్లో 'ఆ జీవన సభ్యత్వం' లేదు. నెలనెలా కూడా సభ్యత్వ రుసుము చెల్లించే వీలుండేది. అలా 'యువభారతి' లో సభ్యులుగా చేరిన వారి సంఖ్య వందల్లో ఉంటుంది. కొంతమంది నచ్చక సభ్యత్వాన్ని కొనసాగించక పోయి ఉండవచ్చు. కొంతమంది ఉద్యోగరీత్యా నగరాంతరం వెళ్ళిపోయి ఉండవచ్చు. కొంతమంది ఆర్థిక కారణాలవల్ల మానివేసి ఉండవచ్చు. మరికొంతమంది పరమపదించవచ్చు. ఏది ఏమైనా మా సంస్థలో ఒకసారి సభ్యుడిగా చేరినవారు ఎల్లకాలమూ 'యువభారతీయుడే!

వీరు కాక మేము నెలకొల్పిన 'సాహతీమిత్ర', 'భారతీమిత్ర', 'భారతీభూషణ' పథకాలలో కూడా దాదాపు పదివేల మంది సభ్యులుగా చేరారు. వారు కూడా "మేము యువభారతి సభ్యులమే నండి"! అని తమ సభ్యత్వ సంఖ్యను ఉటంకిస్తారు గర్వంగా! నిజానికి అది సంస్థలో సభ్యత్వం కాదు. సంస్థ నెలకొల్పిన ఒక ప్రత్యేక పథకంలో సభ్యత్వం! అయినా వారి ఆనందాన్ని మనం ఎందుకు కాదనాలి?

కడచిన 60 సంవత్సరాలలో అనేకానేక మంది మా పుస్తకాలకు ప్రచురణ పూర్వవిరాళాల నందచేశారు. తమ మిత్రుల నుండి సేకరించారు. మా ప్రచురణలను కొన్నారు. వమ్ములను ప్రోత్సహించారు. వారు కూడా మాకు ఆత్మీయులే! ఇలా 'యువభారతి' కుటుంబం దేశమంతటా విస్తరించి ఉంది. ఆ కుటుంబ సభ్యులందరికీ ఈ వజ్రోత్సవ వేళ మా హార్దిక శుభాభినందనలు. "తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?" అని ప్రశ్నిస్తాడు మహాకవి శ్రీశ్రీ తన మహాప్రస్థానంలో. అలాగే "యువభారతి పల్లకిని మోసిన బోయీలెవ్వరు?" అని ప్రశ్నించుకుంటే కొద్దిమందే కనపడతారు. అలా సేవలందించి అలసిపోయినా, ఇంకా సంస్థతో అనుబంధాన్ని కొనసాగిస్తున్న సభ్యులు 'యువభారతి' తో వారికి గల అనుభవాలను, అనుబంధాలను, అనుభూతులను తమ వ్యాసాల ద్వారా ఈ వజ్రోత్సవ సంచికలో పంచుకున్నారు. వారికి మా కృతజ్ఞతలు. మిత్రులు టి.వి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఇక్కడ ఇ.సి.ఐ.ఎల్.లో పనిచేస్తున్నప్పుడు మాకు ఎనలేని సేవలు అందించారు. కాని వారు అటు తరువాత ఉద్యోగరీత్యా "ఆస్ట్రేలియా" వెళ్ళి అక్కడే స్థిరపడ్డారు. వారి చిరునామా గాని కాంటాక్ట్ నంబరు కాని లేనందువల్ల వారిని మేము సంప్రదించలేక పోయాము. అలాగే విశ్వనాథ సూర్యనారాయణ, పి.ఎస్.ఎన్.శర్మ, గంగిశెట్టి లక్ష్మీనారాయణ, పరవస్తు గోపాలకృష్ణ, డి.కృష్ణ ప్రసాద్ వంటి కొంతమంది కార్యకర్తలు వ్యక్తిగత కారణాలవల్ల, అనారోగ్య కారణాలవల్ల తమ అనుభూతులను వ్యాసాల ద్వారా మాతో పంచుకోలేకపోయారు. వారందరికీ గతంలో వారందించిన సేవలకు యువభారతి పక్షాన ధన్యవాదాలు.

కొంతమంది మిత్రులు కీర్తిశేషులయ్యారు. ఈ సందర్భంగా అటువంటివారిని సంస్మరించుకోవటం మన విద్యుక్త ధర్మం. వారిలో ప్రముఖులు మన పూర్వాధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారు, డా॥ జి.వి.సుబ్రహ్మణ్యంగారు, మన పూర్వ ఉపాధ్యక్షులు ఎస్.పాండు రంగారెడ్డిగారు, జి.ఎల్.నరసింహారావుగారు, శ్రీమతి కె.బి.లక్ష్మి గారు, డా॥ నాగినేని భాస్కరరావుగారు, శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు గారు, పూర్వ కార్యదర్శులు శ్రీ సి.వి.ఎ.ఎస్. సూర్యనారాయణ గారు, శ్రీ కె.వి.కామేశ్వరరావు గారు, శ్రీ రెడ్డి రాఘవయ్య గారు, శ్రీ మలపాక పూర్ణచంద్రరావుగారు, ఇతర పదవులలో సేవలందించిన శ్రీ శ్రీపతి రఘురాంకుమార్ గారు, మాడభూషి రంగాచార్యగారు, శ్రీ జీడిగుంట కామేశ్వరరావు గారు, శ్రీ

కె.బుచ్చిబాబు గారు, శ్రీ ఎస్.ఎస్.ప్రసాద్ గారు, శ్రీ గోళ్ళ కుమారస్వామి నాయుడు గారు, శ్రీ పింగళి జగన్నాథరావు గారు, చంద్రముఖి వేణుగారు, శ్రీ సుభాష్ బాబుగారు, మన యువభారతి కార్యాలయంలో రేయింబవళ్ళు పనిచేసిన శ్రీ శ్రీరామమూర్తిగారు, శ్రీ కృష్ణమూర్తిగారు, మహమ్మద్ జహంగీర్, ఎ.ఎస్.సూర్యనారాయణ (రాజు) గారు, పి.కుటుంబరావు గారు..... ఇలా జ్ఞప్తికి వచ్చిన వారు ఇందరు. ఇంకా జ్ఞప్తికి రాని వారు ఎందరో! వారందరికీ ఈ సందర్భంగా ఈ వజ్రోత్సవ సంచిక 'యువభారతి వజ్రోత్సవ హారతి'ని నివాళిగా సమర్పించుకుంటున్నాము. ఇంతకంటే ఏమిచ్చినా వారి రుణం తీరేది కాదు.

మాతో కలిసి పనిచేసి, సలహాలను సూచనలు అందించి సహకరించిన 'రసమయి', 'కిన్నెర ఆర్ట్ థియేటర్స్, విశ్వసాహితి, సాధన సాహితీస్రవంతి, మానస ఆర్ట్స్, 'తెలుగురథం' 'నవ్యసాహితీ సమితి' వంటి సోదర సంస్థలకు, ఆయా సంస్థల అధ్యక్ష, కార్యదర్శులకు మా ధన్యవాదాలు.

మాకు నిలువనీడనిచ్చి, మా కార్యక్రమాలను తమ ప్రాంగణంలో జరుపుకోవటానికి అనుమతించి ప్రోత్సహించిన అలనాటి ఆంధ్రసారస్వత పరిషత్ పూర్వాధ్యక్షులు శ్రీదేవులపల్లి రామానుజరావుగారికి, ఆఫీస్ మేనేజర్ హరికిషన్ రావుగారికి మా ధన్యవాదాలు.

పేరు మారినా మారని వాత్సల్యంతో 'యువభారతి'కి చిరునామా కల్పించిన మాన్యులు తెలంగాణ సారస్వత పరిషత్ పూర్వాధ్యక్షులు పద్మభూషణ్ డా॥సి.నారాయణరెడ్డి గారికి, ప్రస్తుత అధ్యక్షులు డా॥ ఎల్లూరి శివారెడ్డిగారికి, కార్యదర్శి జె.చెన్నయ్యగారికి మా యువభారతి పక్షాన ధన్యవాదాలు.

మా పక్ష సమావేశాలను తమ ప్రాంగణంలో జరుపుకోవటానికి అనుమతించి ప్రోత్సహించిన శ్రీ కృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం వారికి, ప్రత్యేకించి పూర్వ కార్యదర్శి శ్రీ ఎం.ఎల్. నరసింహారావు గారికి మా కృతజ్ఞతలు.

మా 'వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలను' తమ ప్రాంగణంలో జరుపుకోవటానికి అనుమతించిన 'నగర కేంద్ర గ్రంథాలయం', చిక్కడపల్లి వారికి, మేము నిర్వహించిన అనేకానేక కార్యక్రమాలకు తమ 'కళా సుబ్బారావు కళావేదిక' ను ఉచితంగా అందించి సహకరించిన శ్రీ త్యాగరాయగానసభ వారికి, ప్రత్యేకించి పూర్వాధ్యక్షులు కీ.శే. శ్రీకళా దీక్షితులు గారికి, ప్రస్తుత అధ్యక్షులు శ్రీ కళా జనార్దనమూర్తి గారికి, మేము

నిర్వహించిన 'మహాభారతోపన్యాస లహరి' 'శ్రీమద్రామాయణం-మానవీయ సంబంధాలు' ఉపన్యాస కార్యక్రమాలకు వేదికను ఉచితంగా అందించిన శృంగేరీశారదా శంకరమఠం, మోతీనగర్ వారికి, ప్రత్యేకించి ధర్మాధికారి శ్రీ సి.ఎస్.ఆర్.మూర్తి గారికి మా ధన్యవాదాలు.

మా యువభారతి ప్రచురణలలో వందకుపైగా ప్రచురణలకు ముఖచిత్రాన్ని అందించిన మా గౌరవ సభ్యులు, మాకు అత్యంత ఆత్మీయులు, కవి, కళాకారుడు, అన్నింటికీ మించి సౌమ్యులు, సహృదయశీలురు శ్రీ శీలావీర్రాజు గారికి ఏమని చెప్పి ఋణం తీర్చుకోగలం. వారి సేవలను 'యువభారతి' సదా గుర్తుంచుకుంటుంది. వారికి మా అభివాదాలు.

మేము ప్రచురించిన పుస్తకాల ముద్రణ బాధ్యతను స్వీకరించి, అందంగా అచ్చుపోసి అందించిన ముద్రణ సంస్థలెన్నో ఉన్నాయి. వారందరికీ పేరు పేరునా ఈ వజ్రోత్సవ సందర్భంగా మా కృతజ్ఞతలు. ప్రత్యేకించి నాగార్జున ప్రింటర్స్ అధినేత నారాయణ గారికి, దాసు నరసింహారావుగారికి మా ధన్యవాదాలు. అలాగే పుస్తక ముద్రణకు అవసరమైన 'బ్లాకు'లను సమకూర్చిన 'మోహన్ ప్రోసెస్' వారికి మా ధన్యవాదాలు.

మా కార్యక్రమాల రూపకల్పనలో, నిర్వహణలో అడుగడుగునా సూచనలు, సలహాలు అందచేస్తూ వెన్నుదన్నుగా నిలిచి, మమ్ములను ప్రోత్సహించి, ముందుకు నడిపిస్తున్న మా గౌరవసభ్యులు డా॥ కె.వి.రమణాచారి, డా॥ కె.ఐ.వరప్రసాదరెడ్డి గారలకు మా ప్రత్యేక హార్దిక అభివాదాలు.

మా 'యువభారతి'కి ఎంతో కీర్తి ప్రతిష్ఠలు, గుర్తింపు తెచ్చిపెట్టిన కార్యక్రమం 'కావ్యలహరి' ఉపన్యాస మంజరి. ఉపన్యాసకులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు.

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకంటే ప్రయత్నించి ఎంత చిన్నదీపాన్నైనా వెలిగించడం మంచిది" అనే ఉద్దేశ్యంతో మేము వెలిగించిన చిరుదివ్వెను దేదీప్యమానంచేసి, ఆంధ్రదేశమంతటా సాహితీవెలుగులను పంచిన వాఙ్మయ దివాకరులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు. వారు లేకపోతే 'యువభారతి' లేదు. వారికి ఆజన్మాంతం 'యువభారతి' ఋణపడి ఉంటుంది.

కావ్యలహరి సాహిత్య కార్యక్రమమైతే 'రచన' 'మహతి' 'యువత' వంటి

సామాజికోపయుక్తమైన కార్యక్రమాలు, మా యువభారతి సుదీర్ఘ ప్రస్థానంలో నిలిచిన కొన్ని మైలురాళ్ళు.

మేము కోరిన వెంటనే మా మీద గల అభిమానంతో తమ సందేశాలను, ఆత్మీయానుభూతులను పంచుకొని మాకు ఎంతో ఆనందాన్ని, ఉత్సాహాన్ని కలిగించిన పెద్దలకందరికీ మా నమోవాకాలు. ముందు ప్రణాళిక వేసుకున్నప్పుడు అత్యుత్సాహంగా అందరి రచయితలవి ఫోటోలు వేద్దామని అనుకున్నాము. కాని కొద్ది మంది మాత్రమే తమ ఫోటోలను పంపారు. కొంతమంది ఫోటోలు వేసి మరికొంతమందివి ఫోటోలు వెయ్యకపోతే బాగుండదని తలచి రచయితల వెవ్వరివీ ఫోటోలు వేయడం లేదు. మన్నించండి. మేము యువభారతి ఆత్మీయులను, సభ్యులను కూడా రెండు పేజీలకు మించకుండా తమ వ్యాసాన్ని అందించమని అడిగాము. కానీ కొంతమంది పది పేజీలవరకు గల పెద్ద పెద్ద వ్యాసాలనే వ్రాశారు. వారికి మా పట్ల గల అభిమానానికి మా కృతజ్ఞతలు. అయితే వీలయినంతవరకూ 'కత్తెర' వాడకుండా, అందరి అభిప్రాయాలను గౌరవిస్తూ వ్యాసాలను యథాతథంగానే అచ్చువేసేందుకు కృషి చేశాము. ఎవరి వ్యాసంలో నయినా మా సంపాదకుల వారి 'కత్తెర' పడితే క్షంతవ్యులం. మన్నించగలరు.

'యువభారతి' రజతోత్సవాలకు, ఉద్యోగరీత్యా ఇతరరాష్ట్రాలకు వెళ్లడంతో నేను రజతోత్సవ కార్యక్రమాలలో పాల్గొనలేకపోయాను. 'యువభారతి' స్వర్ణోత్సవాలు నేను కార్యదర్శిగా ఉండగా 2013లో జరిగాయి. స్వర్ణోత్సవ కార్యక్రమాలు 'రవీంద్రభారతి'లో నిర్వహించాము. అప్పటికి ఉన్న పరిస్థితులలో బాగానే నిర్వహించాము. కానీ 'స్వర్ణభారతి' పేర స్వర్ణోత్సవ సంచికను వెలువరించాలనే నా ఆకాంక్ష అలాగే మిగిలిపోయింది.

ఈసారి వజ్రోత్సవాలకు ఎలాగైనా వజ్రోత్సవ సంచికను వెలువరించాలని, అందులో యువభారతీయులు, యువభారతి ఆత్మీయులు అందరూ యువభారతితో తమకు గల ఆత్మీయతలను అనుబంధాలను పంచుకునే వ్యాసాలు ఉండాలని అనుకుని ఈ బృహత్తర కార్యక్రమాన్ని చేపట్టడం జరిగింది.

నా మీద నమ్మకం ఉంచి ఈ బృహత్తర కార్యాన్ని నా భుజస్కందాలపై మోపి,

ఈ వజ్రోత్సవ కార్యక్రమాలకు నన్ను సమన్వయకర్తగా నియోగించినందుకు 'యువభారతి'కి నా కృతజ్ఞతాపూర్వక నమోవాకాలు.

ఈ వజ్రోత్సవ సంచికలో కేవలం యువభారతీయులు, యువభారతికి ఆత్మీయులు వ్రాసిన వ్యాసాలేకాక యువభారతి 60 ఏళ్ళ ప్రస్థానంలో మైలురాళ్ళుగా నిలిచిన అనేకానేక కార్యక్రమాల వివరాలు, ఫోటోలు పొందుపరిచాము.

'యువభారతి' ప్రస్థానాన్ని కొండను అద్దంలో చూసినట్లుగా చూపించటానికి ప్రయత్నించాము. ఆ ప్రయత్నంలో మేము ఏ మేరకు సఫలమయ్యామన్న విషయాన్ని మీరు నిర్ణయించాలి. నా మట్టుకు నాకైతే 'నా కల సాకారమయింది' అని భావిస్తున్నాను. వ్యక్తులు మారవచ్చు. లేకపోవచ్చు. కాని వ్యవస్థ నడుస్తూనే ఉంటుంది. అలాగే మేము ఎంతమందిమి లేకపోయినా 'యువభారతి' ఉంటుంది. ఇప్పుడు విరివిగా లభిస్తున్న కొత్త సాంకేతికతను అందిపుచ్చుకొని, నవతరానికి కావలసిన రీతిలో కార్యక్రమాలను చేయగలుగుతుంది. 'శతజయంతి' ఉత్సవాలవైపు ముందడుగు వేస్తుందని ఆశిస్తూ, ఆకాంక్షిస్తున్నాను.



దివాకర్ల జయంతి సభలో డా॥ ఉత్పల సత్యనారాయణచార్యను సత్కరిస్తున్న సినారె



# యువభారతి తో నా అనుబంధం

శ్రీ పత్రి అశ్వనీకుమార్
సమావేశకర్త, యువభారతి, హైదరాబాద్
99875 11051

యువభారతితో నాకు 45 ఏళ్ళ అనుబంధం ఉంది.

నేను విజయవాడలో ఇంటర్మీడియట్ చదువుతున్న రోజుల్లో (1974) ఒకరోజున మా మాస్టారు (6 వ క్లాసులో నాకు, మా చెల్లెళ్ళకూ ప్రైవేటు మాస్టారు) మా ఇంటికి వచ్చి యువభారతి ప్రచురణ "వేమన్న వేదం" చూపించి, "నీకు తెలుగంటే ఇష్టం కదా అని నీ కోసం తెచ్చానురా అశ్వనీ..!! ఊరికే కాదు – నువ్వు కొని చదవాలి ఈ పుస్తకాన్ని." అన్నారు. మా అమ్మను అడిగి ఒక రూపాయి తీసుకుని (ఆరోజుల్లో మాకు అంత ఆర్థిక స్వాతంత్ర్యం ఉండేది కాదు) ఆ పుస్తకాన్ని కొనుక్కున్నాను. అదే యువభారతితో నా తొలి పరిచయం. ఆ పుస్తకం నాలో పఠనాభిలాషను పెంచింది. 5, కింగ్స్ వే, సికిందరాబాద్ లో ఉన్న ఈ సంస్థను సందర్శించాలన్న కుతూహలం కూడా పెరిగింది.

MBA పూర్తి చేసుకుని 1982 లో ఉద్యోగార్థం హైదరాబాద్ చేరుకున్నాక, ఏదో పని మీద అబిడ్స్ నుండి రాయల్ సినిమా హాల్ కు short cut లో నడిచి వెళ్తుండగా (అప్పట్లో) ఆంధ్ర సారస్వత పరిషత్ భవనాల క్రింద ఉన్న shops లో యాదృచ్ఛికంగా "యువభారతి" బోర్డు కనబడింది. ఎంతో ఆసక్తిగా మెట్లు ఎక్కాను.

.... అడుగుపెట్టగానే శ్రీరామమూర్తి గారి పలుకరింపు,

.... లోపలే కూర్చుని ఉన్న శ్రీ వంగపల్లి విశ్వనాథం గారితో పరిచయం,

.... ఆ పుస్తకాల racks వెనక కూర్చుని జాబులకు జవాబులిస్తున్న శ్రీరెడ్డి రాఘవయ్యగారితో కరచాలనం,

... అంతలోనే చిన్న కప్పులో 'టీ' తో ముఖంపై చిరునవ్వుతో జహంగీర్ ప్రవేశం.. వీరందరి ఆత్మీయత, ఆదరణ, అభిమానం – నన్ను యువభారతి వైపు బలంగా ఆకర్షించాయి. ఇవన్నీ నిన్న గాక మొన్న జరిగిన సంఘటనల లాగా అనిపిస్తున్నాయి.

ఆ తరువాత ప్రతి 'గురువారం' యువభారతికి వెళ్తూ, రెడ్డి రాఘవయ్య గారికి ఉత్తర ప్రత్యుత్తరాలలో సహాయపడుతూ, "నందిని' మాస పత్రికలను ప్రతి నెలా పోస్ట్ చెయ్యడానికి వీలుగా address slips తయారుచేస్తూ క్రమక్రమంగా సంస్థలో భాగమయ్యాను.

ఒకసారి, కుదురుగా ఉన్న నా దస్తూరి, ఇరివెంటి కృష్ణమూర్తి గారి దృష్టిని ఆకర్షించింది. వెంటనే (వ్యాస భగవానునికి వినాయకుడు దొరికినట్లు) కృష్ణమూర్తి గారి "వ్రాయస కాని" గా నాకు promotion వచ్చింది. ఆయన మాట – నా వ్రాతగా ఎందరో సాహితీ మూర్తులకు యువభారతి తరఫున ఉత్తరాలు వెళ్ళేవి. అది నా అదృష్టం.

1986 లో నాకు వివాహమైన సందర్భంలో నా శ్రీమతి పద్మను వెంటపెట్టుకుని, యువభారతీయులు శ్రీమతి కె బి లక్ష్మి, శ్రీ కె వి కామేశ్వరరావు దంపతుల ఇంటికి విందుకు వెళ్ళినప్పుడు, అప్పటికి మూడు నాలుగేళ్ళుగా యువభారతి దైనందిన కార్యకలాపాలలో చురుకుగా పాల్గొంటున్న నాకు పుస్తక పఠనంలో ఉన్న ఆసక్తిని గమనించి, నాపట్ల వారికున్న అభిమానంతో ఆ దంపతులు వాళ్ళ దగ్గర 'అదనంగా' ఉన్న దాదాపు నలభై అరుదైన యువభారతి ప్రచురణలను (ఇద్దరూ autograph చేసి మరీ) నాకు కానుకగా ఇచ్చారు. మేమిద్దరం ఆ పుస్తకాలనన్నిటినీ అపురూపంగా ఒక రిక్షాలో పెట్టుకుని, ఇంటికి చేరాం.

తరువాత ఒక్కొక్క ప్రచురణనూ చదువుతుంటే – యువభారతి 'విశ్వరూపం' నా కళ్ళముందు కదలాడసాగింది. ప్రముఖ సాహితీవేత్తలు, వాఙ్మయ దివాకరులు, వారి మేధోమథనం ద్వారా వెలికి తీసి, గ్రంథస్థం చేసిన అమృతతుల్యమైన ఈ సాహితీ సంపద గురించి వీలైనంత ఎక్కువమందికి తెలియజేయాలంటే, ఈ ప్రచురణలను సంక్షిప్తంగా పరిచయం చేస్తూ ఒక పుస్తకం వ్రాయడమే సరైన మార్గం అన్న ఆలోచన – ఆ క్షణంలోనే కలిగింది. వెంటనే ఆ ఆలోచనను కార్యరూపంలో పెట్టి, అప్పటిదాకా ప్రచురించబడ్డ దాదాపు 110 ప్రచురణలలో దాదాపు 90 ప్రచురణలకు పరిచయం వ్రాశాను. ఐతే కొన్ని అనివార్య కారణాల వల్ల 1987లో నేను హైదరాబాద్ నుండి

గుజరాత్ రాష్ట్రానికి, తరువాత మహారాష్ట్రకు ఉద్యోగార్థం వెళ్ళవలసివచ్చింది. అప్పుడు ఆ లిఖితప్రతిని యువభారతి కార్యాలయంలోనే ఉంచి, నేను అహమ్మదాబాద్ కు బయలుదేరాను.

Cut చేస్తే – 35 సంవత్సరాల తరువాత భారత స్వాతంత్ర్య అమృతోత్సవాల సందర్భంగా ప్రచురించిన ఐదు ప్రచురణలతో యువభారతి 200 ప్రచురణలను పూర్తిచేసుకుంటున్న శుభ తరుణంలో – ఈ 200 ప్రచురణలనూ సంక్షిప్త పరిచయం చేస్తూ "ద్విశత భారతి" ని 201 వ ప్రచురణగా తీసుకురావాలని యువభారతి కార్యవర్గం నిర్ణయం తీసుకోవడం, ఆ గురుతర బాధ్యతను నాకప్పగించడం కేవలం నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను. ఈ సందర్భంగా శ్రీ వంగపల్లి విశ్వనాథం గారికీ, నా అసంపూర్ణ రచనను అతిభద్రంగా దాచి ఉంచి, నాకు తిరిగి అందజేసిన శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు గారికీ నేనెంతో ఋణపడి ఉంటాను.

తెలుగు సాహిత్యాన్ని – సామెతలు, శతకాలు, బాలల కథలు, కృతులు, కీర్తనలు, రూపకాలు, కవితలు, కథానికలు, కథలు, నాటకాలు, నాటికలు, రుబాయీలు, కవిసమయములు – వంటి ఎన్నో సాహితీ ప్రక్రియలు సుసంపన్నం చేశాయి. వీటి ఈ ప్రక్రియలన్నిటి గురించి సాధికారికంగా చెప్పగలిగిన ప్రజ్ఞా ధురంధరుల చేత అందరికీ అర్థమయ్యే భాషలో వ్యాసాలను వ్రాయించి, వాటిని పుస్తకాలుగా ప్రచురించిన ఘనత కేవలం యువభారతిదే.

అలాగే 'కవితా వైభవం' series లో కాళిదాసు, మాఘుడు, నన్నయ, పాల్కురికి సోమనాథుడు, నన్నె చోడుడు, తిక్కన, నంది తిమ్మన, ధూర్జటి, పింగళి సూరన, అయ్యలరాజు రామభద్రుడు, తులసీదాసు, అల్లసాని పెద్దన, సూరదాసు, చేమకూర వేంకట కవి, కంకంటి పాపరాజు, స్వామి వివేకానంద, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, తిరుపతి వేంకట కవులు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, కుందుర్తి వంటి కవుల రచనలను విశ్లేషించి ప్రచురించింది. బహుశా ఇంతమంది ప్రాచీన, ఆధునిక కవుల కవితా వైభవాలను ప్రచురించిన ఘనత కూడా యువభారతిదే.

నాలుగు దశాబ్దాల పాటు (అంటే 1971 నుండి 2011 వరకు) నిర్వహించిన పధ్నాలుగు లహరీ కార్యక్రమాలలో ప్రాచీన కవులు – నన్నయ భట్టారకుడు, తిక్కన సోమయాజి, పాల్కురికి సోమనాథుడు, బమ్మెర పోతనామాత్యులు, నాచన సోముడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, శ్రీనాథుడు, శ్రీ కృష్ణదేవరాయలు, పింగళి సూరన,

తెనాలి రామకృష్ణుడు మొదలైన కవుల నుండి, గత రెండు శతాబ్దాలలో సాహితీరంగంలో విశేష కృషి చేసి, సాహితీ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగ్గ పేరు ప్రతిష్ఠలు సంపాదించుకున్న యోగి వేమన, శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు, శ్రీ గురజాడ అప్పారావు, శ్రీ గిడుగు రామమూర్తి పంతులు, శ్రీ పానుగంటి లక్ష్మీ నరసింహారావు, తిరుపతి వేంకట కవులు, శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావు పంతులు, శ్రీ ముట్నూరి కృష్ణారావు, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ, గుడిపాటి వెంకట చలం, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ జాషువా, శ్రీ నండూరి సుబ్బారావు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, శ్రీ కుందుర్తి, శ్రీ ఆరుద్ర, శ్రీ దాశరథి, శ్రీ నారాయణరెడ్డి గారలు చేసిన రచనలను సాహితీ ప్రియులకు దిగ్మాత్రంగా పరిచయం చేసింది యువభారతి.

అరవయ్యేళ్ళుగా ఇంతటి విశిష్టమైన, అనితరసాధ్యమైన సాహితీ సేవచేసిన యువభారతి సంస్థలో నేను భాగం అయినందుకు మహదానందంగా ఉంది. చదువులతల్లి ముంగిట వెలిగించిన ఈ 'యువభారతి' అనే చిన్న దీపం – మరో అరవయ్యేళ్ళపాటు ధగద్ధగాయమానంగా వెలగాలని, తెలుగు భాష, సాహిత్యాలు తిరిగి పూర్వ వైభవాన్ని సంతరించుకోవాలని నా ఆశ.






'స్వీయ కావ్యగానం' చేస్తున్న శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ



# ఎందరో మహానుభావులు...

శ్రీ జీడిగుంట వెంకట్రావు
కార్యదర్శి, యువభారతి
93913 73684

మేము కోరగానే, ఈ వజ్రోత్సవ సంచికకు గౌరవ సంపాదకులుగా ఉండేందుకు అంగీకరించడమే కాక, అనేక విషయాలలో మాకు మార్గదర్శనం చేసిన మా పూర్వ ప్రధాన సంపాదకులు శ్రీ సుధామగారికి మా హార్దిక ధన్యవాదాలు.

మా కోరికను మన్నించి, వజ్రోత్సవ కార్యక్రమాలకు సమన్వయకర్తగా ఉండటానికి అంగీకరించి, వజ్రోత్సవ కార్యక్రమాల భారాన్ని తన భుజస్కంధాలపై వేసుకుని సమర్థతతో నిర్వహించిన మా యువభారతి ఉపాధ్యక్షులు శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావుగారికి మా కృతజ్ఞతలు.

ఎప్పటికప్పుడు తగు సూచనలు చేస్తూ, సలహాలను అందచేస్తూ ఈ వజ్రోత్సవ సంచిక ప్రచురణకి సహకరించిన మా అధ్యక్షులు ఆచార్య ఫణీంద్రగారికి, వ్యవస్థాపక సమావేశకర్త ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారికి, ఇతర కార్యవర్గ సభ్యులకు నా కృతజ్ఞతలు.

యువభారతి వజ్రోత్సవ సంచిక "యువభారతి... వజ్రోత్సవ హారతి"కి ముఖపత్రానికి రూపరేఖల నందించిన మా సమావేశకర్త శ్రీ పత్రి అశ్వనీకుమార్ గారికి నా అభివాదాలు.

మా కోరికను మన్నించి, 'యువభారతి'తో వారికి గల అనుభవాలను, అనుభూతులను మాతో పంచుకుని, వ్యాసాలను అందచేసిన యువభారతీయులకు, యువభారతి ఆత్మీయులకు మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించి అందించటంలో సహకరించిన మా యువభారతి వరిష్ఠసభ్యులు "పుస్తక శిల్పి" శ్రీ తాళ్ళపల్లి మురళీధర గౌడు గారికిమా ధన్యవాదాలు.

పుస్తకానికి డి.టి.పి మరియు 'లే అవుట్' చేసిన మను గ్రాఫిక్స్, చిక్కడపల్లి, హైదరాబాద్ వారికి, పుస్తకానికి ముచ్చటైన ముఖపత్రాన్ని అందించిన 'నవ్య ప్రింటర్స్, మోతీనగర్, హైదరాబాద్' వారికి, పుస్తకాన్ని అందంగా ముద్రించి, సకాలంలో అందించిన 'కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, విద్యానగర్, హైదరాబాద్' వారికి మా ధన్యవాదాలు.

మా యువభారతి వజ్రోత్సవ సంపన్న కార్యక్రమానికి శ్రీ దేవులపల్లి రామానుజరావు సభామందిరాన్ని ఉచితంగా అందించి సహకరించిన తెలంగాణ సారస్వత పరిషత్ అధ్యక్షులు డా॥ ఎల్లూరి శివారెడ్డిగారికి, కార్యదర్శి డా॥ జె.చెన్నయ్య గారికి మా హార్దిక అభివాదాలు.

మా వజ్రోత్సవాల సంపన్న కార్యక్రమానికి వేదికను అందంగా అలంకరించి అందించిన EXOTIC EVENTS హైదరాబాద్ వారికి, ప్రత్యేకించి అధినేత శ్రీ కె.కె.రాజాగారికి మా కృతజ్ఞతలు.

మా విజ్ఞాపనను మన్నించి వజ్రోత్సవ కార్యక్రమానికి విరివిగా విరాళాలనందచేసి, సహకరించిన యువభారతీయులందరికీ మా ధన్యవాదాలు.

మా ఈ వజ్రోత్సవ సంపన్నకార్యక్రమాన్ని యువభారతి 'యూట్యూబ్' ఛానల్ ద్వారా ప్రత్యక్ష ప్రసారం చేయుటలో సహకరించిన 'కల్చరల్ టి.వి, చిక్కడపల్లి, హైదరాబాద్ వారికి మా ధన్యవాదాలు.

మా వజ్రోత్సవ సంచికకు తమ వ్యాపార ప్రకటనను అందించి సహకరించిన ' ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్ అండ్ కామర్స్, ఖైరతాబాద్, హైదరాబాద్' యాజమాన్యానికి, ప్రత్యేకించి కళాశాల ప్రధానాచార్యులు శ్రీ కూర రఘువీర్ గారికి మా కృతజ్ఞతలు.

ఈ వజ్రోత్సవ కార్యక్రమాలను విజయవంతం చేయడంలో సహకరించిన ప్రతి ఒక్కరికీ యువభారతి పక్షాన మా హార్దిక ధన్యవాదాలు.



# క్రమసూచిక

## అభినందనం 45-122


- అభిరుచిని తీర్చిదిద్దిన యువభారతి ........................................ 46
  – డా॥ సి.మృణాళిని
- 60వసంతాల యువ భారతీయం ........................................ 48
  – డా॥ ఎస్.వి.రామారావు
- అరవై యువభారతికి అభినందన ........................................ 52
  – డా॥ నందిని సిధారెడ్డి
- ఒక ఉపన్యాసం జీవితాన్నే మార్చేసింది ........................................ 54
  – డా॥ టి.గౌరీశంకర్
- షష్ట్యబ్ది 'నవ' భారతి ........................................ 61
  – డా॥ రేవూరు అనంతపద్మనాభరావు
- నమస్సుమాంజలి ........................................ 62
  – డా॥ ముదిగొండ శివప్రసాద్
- సాహిత్యచైతన్యంలో 'యువభారతి' ........................................ 63
  – డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి
- యువభారతి నవభారతి ........................................ 66
  – డా॥ మసన చెన్నప్ప
- నాటి యువభారతి నేటి ప్రౌఢభారతి ........................................ 69
  – డా॥ వెలుదండ నిత్యానందరావు
- "యువభారతి" కి వందనాలు ........................................ 74
  – శ్రీ టి. ఉదయవర్లు
- యువభారతితో నా అనుబంధం ........................................ 79
  – డా॥ ముక్తేవి భారతి
- అఖండ సాహితీ జ్యోతి 'యువభారతి' ........................................ 82
  – డా॥ కె.వి. కృష్ణకుమారి
- స్పందన ........................................ 86
  – డా॥ శ్రీరంగాచార్య
- యువభారతి–తెలుగువారి సాహిత్య చైతన్యదీప్తి ........................................ 89
  – శ్రీ విహారి
- సాహిత్య సంజీవనికి శుభాకాంక్షలు! ........................................ 91
  – డా॥ పుట్టపర్తి నాగపద్మిని
- వర్ధతాం యువభారతీ ........................................ 93
  – డా॥ కడిమిళ్ళ వరప్రసాద్

✵ చారిత్రాత్మక సంస్థ యువభారతి ............................................ 96
– డా॥ జె.చెన్నయ్య
✵ సరస్వతీ అమ్మవారిని సాక్షాత్కరింపజేసిన యువభారతి..................... 98
– శిరోమణి డా॥ వంశీ రామరాజు
✵ వజ్రోత్సవ భారతి ........................................................... 100
– శ్రీ మద్దాళి రఘురాం
✵ 'యువభారతి'కి వందనం.................................................. 101
– డా॥ రాపోలు సుదర్శన్
✵ యువభారతికి వజ్రశోభ .................................................. 104
– శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా॥ జి. వి. పూర్ణచందు
✵ యువభారతి ................................................................ 106
– డా॥ అక్కిరాజు సుందర రామకృష్ణ
✵ యువభారతి వెలిగించిన గండదీపం .................................... 111
– డా॥ వి.వి.రామారావు
✵ 'యువభారతి' నా పాలిట తక్షశిల......................................... 113
– శ్రీ ఎర్రాప్రగడ రామకృష్ణ
✵ ఏడు రంగుల ఇంద్రధనుస్సు కావ్యలహరి ............................... 115
– శ్రీ చీకోలు సుందరయ్య
✵ యువభారతితో నా అనుబంధం .......................................... 120
– శ్రీమతి శీలా సుభద్రాదేవి

## ఆత్మీయం 123-269

✵ ఆలోచనలు – అక్షరాలు – ఆచరణలు .................................. 124
– డా॥ వంగపల్లి విశ్వనాథం
✵ యువభారతి సంస్థతో నాకున్న అనుబంధం ............................. 129
– డా॥ తిరుమల శ్రీనివాసాచార్య
✵ యువభారతితో నేను ...................................................... 133
– శ్రీ సింగంపల్లి వెంకటేశ్వరరావు
✵ మనసు పొరల్లోంచి ......................................................... 141
– శ్రీ డి.ఎల్.ఎన్.ప్రసాద్
✵ యువభారతి ................................................................ 147
– శ్రీ ఎం.ఎస్.ఆర్.ఆంజనేయశర్మ
✵ అనంతం.................................................................... 150
– శ్రీ మాడభూషి అనంతాచార్యులు
✵ యువభారతితో నా అనుబంధం .......................................... 157
– శ్రీ సుధామ (అల్లంరాజు వెంకట్రావు)

* నేనూ (నా) యువభారతి .................................................. 159
  – శ్రీ అల్లంరాజు రాధాకుమార్
* ఐదున్నర దశాబ్దాల సుదీర్ఘ పరిచయం.................................... 161
  – శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడు
* పరిచయం – అనుబంధం–ధన్యవాదం.................................. 165
  – శ్రీ టి.కె. విజయ్‌కుమార్
* అనుభవాలు – అనుబంధాలు............................................. 170
  – శ్రీ ఎల్.ఎస్. భార్గవ
* నన్ను దిద్దితీర్చిన గురువు .................................................. 172
  – డా॥ వై. కృష్ణకుమారి
* యువభారతితో నా అనుబంధం .......................................... 174
  – శ్రీ జీడిగుంట వెంకట్రావు
* 'యువభారతి' ద్వారా నాకు సిద్ధించిన ప్రయోజనాలు .................. 176
  – శ్రీ చేగొండి రామజోగయ్య
* యువభారతి సంస్థతో నా అనుబంధం ................................... 179
  – అయలసోమయాజుల నాగేశ్వరరావు
* నే నెరిగిన 'యువభారతి' .................................................... 186
  – శ్రీ ఎస్.వి. ప్రభాకరరావు
* యువభారతితో నా ఆత్మీయత............................................. 194
  – శ్రీ ఆమాతి రవీంద్ర
* యువభారతితో నా అనుబంధం .......................................... 197
  – డా॥ ఎస్.నారాయణరెడ్డి
* యువభారతితో నేను ....................................................... 200
  – జస్టిస్ ఎ.రామలింగేశ్వరరావు
* స్ఫూర్తిదాయక సంస్థ 'యువభారతి'....................................... 203
  – డా॥ బ్రాహ్మణపల్లి జయరాములు
* యువభారతి – నేను ....................................................... 206
  – డా॥ ఆచార్య ఫణీంద్ర
* చదువులతల్లి హృదయం యువభారతి .................................... 219
  – శ్రీ పులుకూరి చంద్రప్రకాశరావు
* ఏ వెలుగుల కీ ప్రస్థానం ?................................................. 221
  – శ్రీ పత్రి అశ్వనీకుమార్
* 'యువభారతి' – నేనూ .................................................... 225
  – శ్రీ దినవహి వేంకట హనుమంతరావు
* స్ఫూర్తిప్రదాత .............................................................. 229
  – శ్రీ పి. జవహర్‌లాల్ నెహ్రూ
* వజ్రోత్సవ యువభారతికి అభినందన అక్షర సుమమాల................ 230
  – డా॥ జి.ఎల్.కె. దుర్గ

✺ నా యువ భారతి నవ్య భారతి, భవ్య భారతి ............................ 232
– *శ్రీ పోరూరి మారుతీ కిరణ్*

✺ సాహిత్య కల్పతరువు ........................................................ 237
– *శ్రీ గొడవర్తి నరసింహాచార్య*

✺ యువభారతి విన్నపాల విశ్వనాథం గారు ................................ 240
– *శ్రీ అంచూరి మల్లయ్య*

✺ యువభారతితో నా అనుబంధం .......................................... 243
– *శ్రీ మరుమాముల దత్తాత్రేయశర్మ*

✺ "యువభారతి"తో స్వర్ణోత్సవ సంబంధం ................................ 246
– *డా॥ వద్దేపల్లి కృష్ణ*

✺ ' యువభారతి'తో నా అనుబంధం ........................................ 249
– *శ్రీ సబ్బని లక్ష్మీనారాయణ*

✺ యువభారతి యౌవన భారతి ............................................. 250
– *డా॥ సంగనభట్ల నరసయ్య*

✺ యువభారతితో నా జ్ఞాపకాలు ........................................... 253
– *శ్రీ ఆచంట సుధాకర్*

✺ యువభారతితో నా మరపురాని అనుబంధం ............................ 256
– *శ్రీమతి ఆచంట అంజని*

✺ 'వికసిత తెలుగు' కు వారధి –'యువభారతి' ............................ 259
– *శ్రీ జ్వాలా సోమనాథ శాస్త్రి*

✺ సాహిత్య మహతి యువభారతి ............................................ 262
– *శ్రీ కస్తూరి మురళీకృష్ణ*

✺ యువ భారతి తో నా అనుబంధం – ఒక సింహావలోకనం ............ 265
– *శ్రీ కె.వి. ప్రసాదవర్మ*

✺ యువభారతితో నా అనుబంధం .......................................... 267
– *శ్రీ మత్స్యరాజ హరగోపాల్*


## అనుబంధం 270-304


✺ యువభారతీయులు ........................................................ 271

✺ కనుమరుగైన కొందరు యువభారతీయులు ............................. 278
– సుధామ

✺ యువభారతి సంక్షిప్త పరిచయం .......................................... 283

✺ యువభారతి పురస్కారాలు ................................................ 288

✺ యువభారతి ప్రచురణలు ................................................. 290

✺ యువభారతి 'వజ్రోత్సవ హారతి' సంచికకు
విరాళాలు అందజేసిన వదాన్యులు ................................. 303-304




# అభిరుచిని తీర్చిదిద్దిన యువభారతి

డా॥ సి.మృణాళిని
విశ్రాంత ఆచార్యులు, హైదరాబాద్
కన్వీనర్, కేంద్రసాహిత్య అకాడెమి, తెలుగు విభాగం సలహాసంఘం
98490 65147

యువభారతి సభ్యురాలిని కాను కనక చాలామందికి ఉన్నంత దగ్గరి అనుబంధం నాకు లేదు. అయితే ఆ సంస్థ నిర్వహించిన సాహిత్య సదస్సులకు హాజరై, అక్కడ ప్రసంగించిన పండితుల నుంచి ఎంతో కొంత నేర్చుకున్న పలువురిలో నేనూ ఒకదాన్ని. యువభారతితో ఎంతో కొంత అనుబంధం లేకపోతే, నేను బహుశా నా సాహిత్యరంగంగా విమర్శను ఎంచుకునేదాన్ని కానేమో.

యువభారతితో నా స్నేహం రెడ్డి మహిళాకళాశాలలో బి.ఎ చదువుతున్నపుడు (1975 ప్రాంతం) ప్రారంభమైంది. తెలుగు ఒక ప్రత్యేకాంశంగా తీసుకున్న నేను, నా మిత్రులు యువభారతి సాయంకాలపు సభలకు తప్పక హాజరయ్యేవాళ్లం. ఎన్ని పనులున్నా యువభారతి సభలున్నాయంటే, అందులోనూ దివాకర్ల వేంకటావధానిగారు, సి. నారాయణరెడ్డిగారూ, జి.వి. సుబ్రహ్మణ్యంగారూ మాట్లాడుతున్నారని తెలిస్తే ఖచ్చితంగా వెళ్లేవాళ్లం.

ఆ సభల్లోనే సాహిత్యవిలువలు, సాహిత్యాన్ని అర్థం చేసుకునేందుకు అవసరమైన పరికరాలు, సాహిత్య రసాస్వాదన ఎలా చెయ్యాలి, దాన్ని ఎలా విశ్లేషించాలీ అన్న విషయాలు మాకు అర్థమయ్యాయి. దివాకర్లగారు ప్రసంగిస్తూంటే, 'ఎప్పటికైనా సభలో మాట్లాడితే ఈయనలా అనర్గళంగా మాట్లాడగలగాలి' అనుకునేదాన్ని. ఎంత క్లిష్టమై విషయాన్నయినా ఎంతో సరళంగా చెప్పవచ్చునని అక్కడి వక్తలవల్ల తెలిసేది. యువతకు సాహిత్యంలో అభిరుచిని పెంపొందించడం యువభారతి సాధించిన గొప్ప విజయంగా నేను భావిస్తాను..

అవధానిగారు ప్రసంగవశాత్తు చెప్పిన ఒక వాక్యాన్ని నేను ఎన్నటికీ మరచిపోలేదు. 'తల యూపింపనిది కావ్యమె' అన్నారుగానీ, కేవలం తలయూపింపడం గురించి కాక, సాహిత్యంలో రసమంటే ఏమిటి, చమత్కారమంటే ఏమిటి అని గొప్పగా విశ్లేషించి

చెప్పిన సందర్భం నాకు ఇంకా గుర్తుంది. ఒక సాయంత్రం ఆయన ఉపన్యసిస్తూ, ఒక పద్యం లేదా ఘట్టం చదవగానే 'ఓహో' అనాలని మనకు అనిపిస్తే అది చమత్కారం; 'ఆహా' అనాలని అనిపిస్తే అది రసం అన్నారు. ఈ వ్యాఖ్య ఎందరో కవులను అర్థం చేసుకోడానికి ఉపయోగపడింది. ఎవరు 'ఓహో' కవులో (నా అనుభవంలో నాచన సోమన, రామరాజభూషణుడు, చేమకూర వెంకటకవి), ఎవరు 'ఆహా' కవులో (కవిత్రయం, పెద్దన, ధూర్జటి, తెనాలిరామలింగడు మొదలైనవారు). ఎవరు ఉభయకవులో (పోతన, శ్రీనాథుడు, రాయలు. సూరన ) ఇలా అంచనా వేసుకునేదాన్ని. తర్వాతి కాలంలో తరగతి పాఠాల్లోనూ దివాకర్లవారి ఇతరులవి ఎన్నో విశ్లేషణలు గుర్తుకువచ్చేవి.

ఇక యువభారతి ప్రచురణలంటే అపురూపమే. ఆ లహరి ఉపన్యాసాలు వినడం గొప్ప అనుభవమైతే ఆ పుస్తకాలను ఇప్పటికీ దాచుకోవడం మరో చక్కని అనుభూతి. వారి 'మహతి' ఇప్పటికి ఒక విశిష్టమైన ఆకరగ్రంథమే. ఏ కార్యక్రమం చేసినా (సాహిత్యోపన్యాసాల నుంచి వ్యక్తిత్వ వికాసపాఠాల వరకు), ప్రామాణికతను నిలుపుకున్న సంస్థ యువభారతి. సాహిత్యాభిరుచి అంటే ఏమిటో చెప్పిన సంస్థ యువభారతి.. దానితో కొద్దిపాటి అనుబంధమున్నా, అది గంగిగోవు పాలే.






'స్వీయ కావ్యగానం' చేస్తున్న శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

# 60 వసంతాల యువ భారతీయం

డా॥ ఎస్.వి.రామారావు
విశ్రాంత ఆచార్యులు, విమర్శకులు, హైదరాబాదు
98480 12053

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్ని అయినా వెలిగించడం మంచిది" అన్న ఆదర్శంతో ఆరు దశాబ్దాలుగా ముందుకు సాగుతున్న యువభారతి విశిష్ట రూపాలలో సాహితీసేవ చేస్తున్నది. సాహిత్య ఉపన్యాసాలు, సదస్సులు, విలువైన గ్రంథ ప్రచురణలు మున్నగు విలక్షణ కార్యక్రమాలే అందుకు ప్రత్యక్ష సాక్ష్యాలు. యువభారతి సామాన్య ప్రజానీకంలో సాహిత్య అభిరుచిని పెంపొందిస్తూ సాంస్కృతిక వికాసానికి, సమాజాభివృద్ధికి, విశేషంగా పాటు పడుతున్నది.

యువభారతి ప్రారంభమైన నాటి నుండి (1963) ఈ సంస్థతో అనుబంధం ఉన్నందుకు ఎంతో ఆనందిస్తున్నాను. యువభారతి త్రయంతో సన్నిహిత సంబంధం ఉంది. ఇరివెంటి కృష్ణమూర్తి, జి వి సుబ్రహ్మణ్యం గార్లతో విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో సహాధ్యాపకునిగా కలిసి పనిచేయడం నా మహద్భాగ్యం. వంగపల్లి విశ్వనాథం గారు కూడా అదే సంస్థలో వాణిజ్య విభాగ ఆచార్యులుగా నాకు సుపరిచితులు.

అనంతర కాలంలో అధ్యక్ష, కార్యదర్శులుగా, కార్యవర్గ సభ్యులుగా కొనసాగినవారు నాకు సాహితీ మిత్రులు, ప్రత్యక్ష విద్యార్థులు కావడం కూడా నాకు సంతోషకరమైన అంశం. తిరుమల శ్రీనివాసాచార్యులు గారు నాకు చిరకాల ఆత్మీయ మిత్రులు కాగా, ఎం అనంతాచారి (ఎం.ఏ), ఆచార్య ఫణీంద్ర (పిహెచ్.డి) నా విద్యార్థులు. యువభారతి గ్రంథాలకు అక్షరాలంకరణ చేస్తున్న సుధామ, కోశాధికారిగా ఉన్న రవీంద్ర కూడా మా తెలుగుశాఖ విద్యార్థులే. అయ్యదేవర పురుషోత్తమరావు (భువన విజయం), జీడిగుంట వెంకటరావు (కార్యదర్శి), పుస్తక శిల్పి తాళ్లపల్లి మురళీధర గౌడ్ మొదలైన వారు సంస్థ ద్వారా నాకు పరిచయం అయినారు.

అమూల్యమైన ప్రాచీన సాహిత్య సంపదను సామాన్య ప్రజలకు అందించాలన్న సదుద్దేశంతో, ఆరంభ దశలో ఐదు ప్రసిద్ధ ప్రబంధాలపై గురువర్యులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి ఉపన్యాసాలు ఏర్పాటు చేయడం, సారస్వత పరిషత్తు ప్రాంగణంలో జరిగిన ఆ ప్రసంగాలను అసంఖ్యాక శ్రోతలు విని ఆనందించడం ప్రత్యేకంగా స్మరింపదగిన అంశం. ప్రబంధ పద్యాల విశ్లేషణతో గంభీరమైన కంఠంతో గంటల తరబడి కొనసాగిన అవధాని గారి ఉపన్యాసాలు 'కావ్యలహరి' సంపుటంగా (1971) ప్రచురితమై పాఠకులను ఆకట్టుకుని పలు ముద్రణలు పొందింది.

ఆ ఉత్సాహంతో సాహితీ ప్రకాశంలో ముందుకు సాగిన యువభారతి సంస్థ – ప్రముఖ ప్రాచీన, ఆధునిక కవులపై రామాయణ, భారతేతిహాసాలపై ప్రసిద్ధమైన సంస్కృత, ఆంధ్ర రూపక వాఙ్మయ విద్వన్మూర్తుల ప్రసంగాలు ఏర్పాటు చేసి, 'లహరీ' ప్రచురణల పేరుతో వాటిని గ్రంథరూపంలో అందించటం అభినందనీయం. చైతన్య లహరి (1972), వికాస లహరి (1973), ప్రతిభా లహరి (1974), కవితా లహరి (1976), నవోదయ లహరి (1977), ఆలోచనా లహరి (1980), దశ రూపక సందర్శనం (1984), రామాయణ సుధా లహరి (1976), వ్యాస సాహితీ సంహిత (1985) మున్నగు వ్యాస సంపుటులను నా సిద్ధాంత గ్రంథం "తెలుగులో సాహిత్య విమర్శ" లో ఉత్తమ విమర్శ గ్రంథాలుగా ప్రస్తావించాను. 1971 లో ప్రారంభమైన ఈ ఉపన్యాస పరంపర నేటికీ కొనసాగుతూ ఉండటం గమనార్హం. ఇటీవలే ఆంధ్ర మహాభారత సహస్రాబ్ది ఉత్సవాల సందర్భంగా సాహితీ సప్తాహాన్ని నిర్వహించి మహాభారతోపన్యాస లహరిని (2022) ప్రచురించారు.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా యువభారతి ప్రచురించిన బృహత్ వ్యాస సంకలనం "మహతి" (1972) సంస్థ ప్రచురణలలో ప్రముఖంగా పేర్కొనదగినది. భాషా, సాహిత్య, సాంస్కృతిక రంగాలలో పాతికేళ్లలో తెలుగుజాతి సాధించిన ప్రగతిని సమీక్షించిన 101 వ్యాసాలు ఇందులో ఉన్నాయి. "పరిష్కృత గ్రంథాలూ పీఠికలూ" పేరుతో నా వ్యాసం కూడా ఇందులో చేరడం నా అదృష్టం. సాహిత్య విమర్శ పై నేను డాక్టరేట్ పరిశోధన చేస్తున్న కాలంలో నా కృషిని గమనించిన ఇరివెంటి కృష్ణమూర్తి గారు ఈ అంశాన్ని సూచించారు. స్వాతంత్ర్య అమృత ఉత్సవాలను పురస్కరించుకొని మహతి పునర్ముద్రణ (2022) కావడం ఈ గ్రంథప్రాశస్త్యాన్ని నిరూపిస్తుంది. హాస్యరసం పై యువభారతి నిర్వహించిన సదస్సులో

నేను చేసిన ప్రసంగం – 'ప్రాచీన సాహిత్యంలో హాస్యం' హాస్యలహరిలో (2002) సంకలితమైనది. సంస్థ 33వ వార్షికోత్సవం సందర్భంగా (1997) ఏర్పాటైన సదస్సులో "మధునాపంతుల – ఆంధ్ర పురాణ కవితా సౌందర్యం" పై పత్ర సమర్పణ చేశాను. డాక్టర్ అనంతాచారి అధ్యక్షులుగా ఉన్న తరుణంలో 'నా సాహిత్య ప్రస్థానం' గురించి విశదీకరిస్తూ ఉపన్యసించాను. గత ఏడాది డాక్టర్ ఫణీంద్ర అధ్యక్షతలో జరిగిన స్వాతంత్ర అమృతోత్సవాల సందర్భంలో వెలువడిన 'అమృత భారతి' సంకలనంలో సాహిత్య విమర్శ ప్రక్రియపై నా వ్యాసం ప్రచురితం.

నా సాహిత్య కృషికి యువభారతి ప్రోత్సాహాన్ని అందివ్వడమే కాకుండా మా సొంతజిల్లాలో సాహిత్య సంస్థ స్థాపనకు స్ఫూర్తిదాయకమైంది. యువభారతి నిర్వహిస్తున్న కార్యక్రమాలకు ఆకర్షితుడనై, అది స్థాపితమైన మరుసటి సంవత్సరమే (1965) ఉమ్మడి పాలమూరు జిల్లా సాహిత్య ప్రకాశానికి పూనుకుని వనపర్తి కేంద్రంగా 'జ్యోతిర్మయి' పేరిట (1965) ఒక సాహిత్య సాంస్కృతిక సమితిని నెలకొల్పడం జరిగింది. గడియారం రామకృష్ణ శర్మ, కప్పగంతుల, కేశవపంతుల వంటి విద్వాంసులతో పాటు యువభారతి అధ్యక్షులుగా ఉన్న ఇరివెంటి కృష్ణమూర్తి గారు కూడా జ్యోతిర్మయికి హితవరులుగా ఉన్నారు. పాలమూరు జిల్లాలోని తాలూకా కేంద్రాలలో నేను ఏర్పాటు చేసిన సాహిత్య సభల్లో జి వి సుబ్రహ్మణ్యం గారు ఇరివెంటి గారు అతిథి వక్తలుగా పాల్గొని నాకు ప్రోత్సాహాన్ని అందించారు. మహాకవి దాశరథి మా సంస్థ ప్రతినిధిగా రాష్ట్ర సాహిత్య అకాడమీ సభ్యులుగా ఎన్నిక కావడం మాకు గర్వకారణం. 1972 లో ప్రథమంగా కర్నూలు జిల్లా రచయితల మహాసభలను ఘనంగా నిర్వహించిన జ్యోతిర్మయి కూడా త్వరలోనే షష్టిపూర్తి జరుపుకోనున్నది.

కావ్యమాధుర్యాన్ని సామాన్య పాఠకులకు చవి చూపాలన్న సదుద్దేశంతో యువభారతి సంస్థ విశిష్టమైన ప్రచురణ కార్యక్రమానికి పూనుకోవడం ముదావహం. ప్రాచీన, ఆధునిక కవుల కమనీయ పద్యాలకు సరళమైన రీతిలో సంగ్రహ వ్యాఖ్యానాలు వెలువరించింది. కవిత్రయం వారే కాక నవ్యులైన విశ్వనాథ, వానమామలై మున్నగు ప్రసిద్ధ కవుల పద్యాలకు వ్యాఖ్యలు ఈ కోవలో వెలువడ్డాయి. తెలుగువారి పుణ్యపేటి బమ్మెర పోతన భాగవతంలోని రమణీయ పద్యాలు కొన్నింటికి గురువర్యులు ఆచార్య సి.నారాయణరెడ్డి గారు రచించిన హృద్యమైన 'మందార మకరందాలు' అసంఖ్యాక పాఠకులను ఆకట్టుకుని లక్ష ప్రతుల ముద్రణ సంకల్పానికి పాత్రమైంది. రాష్ట్ర

ముఖ్యమంత్రి శ్రీ కల్వకుంట్ల చంద్రశేఖర రావు వంటి సాహితీ ప్రియుల్లో సాహిత్యాభిరుచిని రేకెత్తించింది అంటే దీని ప్రత్యేకత ద్యోతకమవుతుంది.

తెలుగు సాహిత్య విశిష్టతను తెలుగేతర భాషీయులకు చాటి చెప్పాలన్న ఉద్దేశంతో కొన్ని ప్రముఖ తెలుగు నవలల గురించిన పరిచయాత్మక వ్యాసాలను ఆంగ్ల గ్రంథంగా ప్రచురించిన యువభారతి – "మారుతున్న విలువలు – రచయితల బాధ్యతలు" అన్న విషయంపై గోష్ఠి నిర్వహించి వెలువరించిన 'రచన' (1970) వ్యాస సంపుటిలో విలువలు–బాధ్యతలు–దృక్పథములు అను మూడు కోణాల నుండి అర్వాచీన ప్రక్రియలో సమీక్షింపబడినాయి. సాహిత్యాభ్యుదయంతో పాటు సమాజ సంక్షేమాన్ని కూడా కాంక్షించిన యువభారతి, యువతలో సౌశీల్య, సౌమనస్య భావాలు పాదుకొల్పాలన్న సత్సంకల్పంతో నగర కేంద్ర గ్రంథాలయ వేదికగా వంగపల్లి విశ్వనాథం గారి నేతృత్వంలో వ్యక్తిత్వ వికాసానికి సంబంధించిన శిక్షణా తరగతులు నిర్వహించి సంస్థ నామాన్ని సార్థకం చేసుకుంది.

పలు విషయాలపై మహనీయుల సూక్తులను 'భావన' పేరుతో, మహాత్ముని జయంతి ఉత్సవాలలో 'గాంధీ సూక్తుల'ను సంకలనం చేసి పాఠకులకు ఉపయోగకరంగా పునర్ముద్రించింది. ప్రచురణ పూర్వ విరాళాల సౌకర్యం ఏర్పాటు చేసి పాఠకులకు చౌక ధరలో గ్రంథాలు అందించే ప్రయత్నం కూడా కొనియాడదగినది. యువతలో నైతిక, సామాజిక, సాంస్కృతిక విలువలు లుప్తం అవుతున్న తరుణంలో వాటి సంరక్షణకు నిరంతరం పాటుపడుతున్న యువభారతి సేవా కార్యక్రమాలకు చేయూతని అందించవలసిన బాధ్యత అందరిపై ఉందని మనవి చేస్తున్నాను. లోగడ ప్రచురితమై నేడు అలభ్యంగా ఉన్న అమూల్య గ్రంథాల (ఆవశ్యకతను బట్టి) పునర్ముద్రణకు కూడా సహకరించాలని కోరుతున్నాను. యువభారతి షష్ట్యబ్ది పూర్తి సందర్భంలో ఆ సంస్థ వివిధ రూపాల్లో చేస్తున్న కృషిని ఈ విధంగా సహృదయులకు విశదీకరించే సదవకాశం లభించినందుకు ఆనందిస్తూ సంస్థ కార్యనిర్వాహక వర్గానికి హృదయపూర్వక అభినందనలు అందజేస్తున్నాను.



# అరవై యువభారతికి అభినందన

డా॥ నందిని సిధారెడ్డి
కవి, పూర్వాధ్యక్షులు, తెలంగాణ సాహిత్య అకాడెమి, హైదరాబాద్
94403 81148

తెలుగు సాహిత్య సంస్థల చరిత్రలలో 'యువభారతి' ది గణనీయ స్థానం. కౌమార ప్రాయంలోనే రసజ్ఞుల దృష్టిని ఆకర్షించి విశేష సేవలందించిన సాహిత్య సంస్థ యువభారతి. 1965-75 నడుమ దశాబ్ది కాలం యువభారతి ఉత్సాహంగా బలంగా వినిపించేది, కనిపించేది. పుస్తక ప్రచురణల లోను, సభా నిర్వహణలోనూ, ఉపన్యాస పరంపర లోను, పఠనావశ్యకత ప్రచారంలోనూ యువభారతి కి దీటైన సంస్థ మరొకటి లేదు. సంప్రదాయ సాహిత్య ధారకు, ఆధునిక భావ ప్రవాహానికి, అభ్యుదయ విప్లవ సామాజిక చైతన్యాలకు, అనుభూతి ధోరణులకు, నడుమ వారధి వేసి తనదైన ముద్రతో, పనివిధానంతో సాహిత్య ప్రేమికుల్ని సమీకరించుకుంటూ సాగింది యువభారతి.

పంతొమ్మిది వందల డెబ్భైలో పదోతరగతి విద్యార్థిగా ఉన్నప్పుడు నా గురువు అష్టకాల నరసింహరామశర్మ గారి ద్వారా 'యువభారతి' పరిచయం. పది రూపాయలు కడితే 'సాహితీమిత్ర' పథకం సభ్యత్వం. పుస్తకం ఉచితం. కష్టమైనా సాహసం చేసి సాహితీమిత్రునిగా చేరాను. ఉచితంగా వికాస లహరి పంపారు.

క్రమంగా కొత్త పుస్తకాల సమాచారం వచ్చేది. కొనుక్కునేందుకు డబ్బులు ఉండేవి కావు. కార్యక్రమాల సమాచారం వచ్చేది. వెళ్లేందుకు చార్జీలు ఉండేవి కావు. ఆ కరపత్రాన్ని ఒకటికి రెండు సార్లు చదువుకునేది. ప్రాచీన సాహిత్యంలో ప్రముఖ కవుల మీద ఏడాది పొడుగునా ప్రసంగ పరంపర నిర్వహించి వ్యాసాలను ప్రచురించేవారు. అవే 'లహరి' సిరీస్. వికాస లహరి, చైతన్య లహరి, ప్రతిభా లహరి, కావ్య లహరి, కవితా లహరి - అన్నీ తెలుగు విద్యార్థులకు అధ్యయనానికి ఉపకరించేవి. ఎమ్మే లో అవే చదివాం.

'సిందూరం' వివిధ తెలుగు ప్రముఖ కవుల ఎంపిక చేసిన కవితల సంకలనం. కవిత్వ సాధన తొలిరోజుల్లో నాకు ప్రేరణ అయింది. నా రచనా నైపుణ్యానికి

కారణమైంది. స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా కూర్చిన 'మహతి' వ్యాసాలు ఇప్పటికీ గొప్ప ప్రచురణ. 'రచన' వ్యాసాలు మారుతున్న విలువల మీద వివిధ రచయితల మంచి విశ్లేషణ. అటువంటి సమన్వయ ప్రణాళికలు, సమగ్ర సంకలనాలు, 'యువభారతి' కి మాత్రమే సాధ్యం.

యువభారతి సభా కార్యక్రమాలు బయట అందంగా ఎంతో వైభవంగా జరిగేవి. ఒకటి రెండు సభల్లో పాల్గొన్న అనుభవం. గులాబీ పూలతో ఆహ్వానించటం మొదటిసారి చూశాను. సాహిత్య పరిమళం గుబాళించేది. అలంకరణ, ఆర్భాటం, ఆదరణ, సాహిత్య సభల వైభవానికి నిదర్శనం. సభలను అట్లా నిర్వహించటం అరుదు. ఇరివెంటి కృష్ణమూర్తి, జీవీ సుబ్రహ్మణ్యం, వంగపల్లి విశ్వనాథం ఎటు చూసినా మూడు పేర్లు మారుమోగేవి.

యువభారతి ఒక తీపి జ్ఞాపకం. యువభారతి కి 60 వసంతాలు. షష్టిపూర్తి. జ్ఞాపకాలు ఎప్పుడైనా సృజనాత్మకతను ప్రేరేపిస్తాయి. షష్ట్యబ్ది సందర్భంగా యువభారతికి శుభాకాంక్షలు. ప్రత్యేక సంచికను ప్రచురించడం చరిత్రను గుర్తు చేసుకోవడమే.

అరవై యువభారతికి ఇరవై ఉత్తేజం కలగాలి. ప్రస్తుత అధ్యక్షుడు ఆచార్య ఫణీంద్రకు అభినందనలు.





'స్వీయ కావ్యగానం' చేస్తున్న డా॥ బోయి భీమన్న.
చిత్రంలో డా॥తిరుమల శ్రీనివాసాచార్య, డా॥ ఎస్వీ రామారావు, డా॥ కె.వి. రమణ

# ఒక ఉపన్యాసం జీవితాన్నే మార్చేసింది

డా॥ టి.గౌరీశంకర్
పూర్వ రిజిస్ట్రార్, తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్, 94409 69130

ఒక జాతి చరిత్ర, సంస్కృతులను తెలుసుకోవాలంటే ఆ జాతి సాహిత్యాన్ని అధ్యయనం చేయాలి. ప్రతి నాగరిక జాతికి సాహిత్యం ఉంటుంది. సుమారు మూడు వేల సంవత్సరాల పైచిలుకు చరిత్ర కలిగిన జాతి తెలుగు జాతి. రెండు, రెండున్నర వేల సంవత్సరాల చరిత్ర కలిగినది తెలుగు భాష. ఇంతటి ఘనత వహించిన తెలుగు జాతికి వేయ్యేళ్ళ సాహిత్య చరిత్ర ఉంది. ఈ వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యం తెలుగు జాతికి సంక్రమించిన వారసత్వ సంపద. ఈ సంపదను పదిలపరచుకోవడమే కాదు. తరతరాలకు పంచి పెట్టాలి. ఒక తరం నుంచి మరొక తరానికి అందివచ్చిన ఈ సాహిత్యసంపద జాతి అస్తిత్వంగా, వ్యక్తిత్వంగా, ఆత్మాభిమానంగా, తన చిరునామాగా భావించాలి.

సాహిత్యం సంస్కృతీ సంప్రదాయాలను మత విశ్వాసాలను, ఆచార వ్యవహారాలను, ఆహార విహారాలను, వేషభూషలను, కట్టుబొట్టులను, ఇలా ప్రతి అంశాన్ని ప్రతిఫలింపజేస్తుంది. జాతిలో నైతిక విలువలను పెంపొందింపజేస్తుంది. సంస్కారాన్ని నేర్పిస్తుంది. అందువల్ల సాహిత్యం ఆ జాతి ఆత్మగౌరవ చిహ్నం. ప్రపంచంలోని ఏజాతి లేదా ఏ భాషాసాహిత్యం అయినా మౌలిక సూత్రం ఇదే. ప్రాథమిక లక్షణం కూడా ఇదే. అందుకే నాగరిక జాతులన్నీ తమ సాహిత్యాన్ని ఊపిరిగా శ్వాసిస్తాయి. ప్రాణప్రదంగా ప్రేమిస్తాయి. అయితే ఈ సాహిత్యం కేవలం అక్షరాస్యులకే పరిమితం కాదు. నిరక్షరాస్యులకు సైతం చెందినది. అయితే అది లిఖిత సాహిత్య మౌఖిక సాహిత్యం రూపంలో ఉంటుంది.

ఇంతటి ఉత్కృష్టమైనది, విశిష్టమైనది సాహిత్యం. దాని విలువ తెలిసిన తెలుగు జాతి ప్రాచీన కాలం నుంచి ఆధునిక కాలం వరకు దానిని పదిలంగా కాపాడుకొంటూ

వస్తోంది. ఆనాటి కాలంలో శిలా, తామ్రశాసనాలలో, తాళపత్రాలలో నిక్షిప్తమై ఉన్న సాహిత్యం ఆధునిక కాలంలో ముద్రణాసౌకర్యంతో గ్రంథరూపంలో మన ముందుకు వచ్చింది. ఈనాడు – అందరికీ అందుబాటులో ఉంది. అయితే దీని వెనుక ఎన్నో ఏళ్ళకృషి ఉంది. ఎంతో మంది చరిత్రకారులు, పరిశోధకులు, పరిష్కర్తలు, విమర్శకులు, విశ్లేషకులు, పండితులు, వేధావులు, వ్యాఖ్యానకర్తల శ్రమదాగుంది. వీరందరి సమష్టి కృషిని సాహిత్య సంస్థలు, ప్రచురణ సంస్థలు, పరిశోధనా కేంద్రాలు గ్రంథముద్రణ రూపంలో, ఉపన్యాసరూపంలో అపారమైన సాహిత్యాన్ని ప్రజలకు అందించాయి. సమాజం ముందర ఉంచాయి.

తత్ఫలితంగానే మనం ఈనాడు తెలుగు సాహిత్యాన్ని చదువగలుగుతున్నాం. దానిలోని గుణదోషాలను, మంచీచెడులను గ్రహించగలుగుతున్నాం. కాబట్టి మనం అటువంటి సాహిత్య సంస్థలకు, ప్రచురణ సంస్థలకు ఋణపడి ఉన్నామన్నది కాదనలేని చారిత్రక సత్యం. అటువంటి సంస్థలు నిత్య స్మరణీయాలు, ప్రాతఃస్మరణీయాలు, ఆదర్శప్రాయాలు. ఆనాటి బ్రిటిష్ పాలనాకాలంలో సి.పి.బ్రౌన్ వంటి విదేశీయులు పని కట్టుకొని, అటకెక్కిన తెలుగు సాహిత్యాన్ని, శాసనాల నుంచి, కైఫీయత్తుల నుంచి, తాళపత్ర గ్రంథాల నుంచి సేకరించి, పండిత పరిశోధకుల చేత పరిష్కరింపజేసి, ముద్రణరూపంలో పుస్తకాలుగా వెలుగులోకి తెచ్చారు. ఆ పరంపరలోనే జమీందారీ వ్యవస్థలో సంస్థానాధీశుల పూనికతో పండితలోకం ద్వారా పరిష్కరణలు, ప్రచురణలు, నిఘంటువులు వచ్చాయి. ఆ రకంగా మనకు సాహిత్యం అంది వచ్చింది.

దేశ స్వాతంత్ర్యానంతరం తెలుగు భాష, చరిత్ర, సాహిత్యాల పరివ్యాప్తి కోసం అనేక సంస్థలు ఏర్పడ్డాయి. 1947 లో తెలుగు భాషా సమితి, ఏర్పడగా, అంతకు పూర్వమే 'శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం', 'ఆంధ్ర సారస్వత పరిషత్, ఏర్పడి ఈ దిశగా కృషి చేశాయి. 1950లో 'ఆంధ్రచంద్రికా గ్రంథమండలి', 'ఆర్ష విజ్ఞాన పరిషత్', 'వావిళ్ళశాస్త్రుల వారి సంస్థ', 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం', 'సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి', ఇలా ఎన్నో సంస్థలు ఏర్పడి తెలుగు సారస్వత సేవను కొనసాగించాయి. కేంద్రసాహిత్య అకాడమి మాదిరిగా రాష్ట్రస్థాయిలో ఆనాటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 'ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ' ని నెలకొల్పింది. 1960లో 'విశ్వసాహితి' వంటి అనేక స్వచ్ఛంద సంస్థలు, ఆనాటి తెలుగు పత్రికలు తెలుగు సాహిత్యాన్ని ప్రజల్లోకి తీసుకొని వెళ్ళాయి. అటు ప్రాచీన సాహిత్యం, ఇటు ఆధునిక

సాహిత్యం, కాల్పనికసాహిత్యం విరివిగా అందుబాటులోకి వచ్చింది. ఇందుకు 'వావిళ్ళ' వారి సంస్థ, 'ఏమెస్కో' (ఎం॥ శేషాచలం అండ్ కంపెనీ) సంస్థ, 'ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి', తెలుగు సాహిత్యాన్ని, ముఖ్యంగా ప్రాచీన సాహిత్యాన్ని, కావ్యప్రబంధాలను, లక్షణ గ్రంథాలను ముద్రింపించి సరసమైన ధరలకు అందించాయి. అది ఒక గొప్ప మలుపు.

ఇవన్నీ తొలి తరంలోనివి. ఇవన్నీ ఒక ఎత్తయితే, 1963లో ఆవిర్భవించిన 'యువ భారతి' ఒక ఎత్తు. 70వ దశకంలో 'యువ భారతి' ఒక ఉత్తుంగ తరంగంలా, ఒక ప్రభంజనంలా ఒక సంచలనాన్ని సృష్టించింది. సమాజంలోని విభిన్న రంగాలకు చెందిన వారందరిలో సాహిత్యాభిలాషను చిగురింపజేసింది. సాహిత్యం అంటే ఏమిటో తెలియని వారిలో, సాహిత్యం పట్ల ఏమాత్రం అవగాహనలేని వారిలో సాహిత్యజిజ్ఞాసను పొటమరింప జేసింది. ముఖ్యంగా యువతరంలో ఈ 'యువభారతి' సాహిత్య స్పృహను రగిలించింది, ప్రేరేపించింది, చైతన్యాన్ని కలిగించింది. దాని ప్రభావం చేత ఎందరో సాహిత్యాభిమానులుగా, సాహితీప్రేమికులుగా, సాహితీపిపాసకులుగా, సాహితీ ప్రియం భావుకులుగా, సాహిత్యారాధకులుగా, చివరికి చాలా మంది సాహితీవేత్తలుగా మారారు.

విద్యావంతులు, ఉత్సాహవంతులు అయిన యువకులు 1963లో స్థాపించిన 'యువభారతి' మహిళల విభాగంతో సహా ఆనాటికి 75 మంది సభ్యులతో అడుగులువేసింది. ఈ అరవై యేళ్ళ. ప్రస్థానంలో ఆ అడుగులు వేలు, లక్షలుగా బలపడ్డాయి. డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి అధ్యక్షులుగా, ఎస్.వెంకటేశ్వరరావు కార్యదర్శిగా, వంగపల్లి విశ్వనాథం సమావేశకర్తగా పగ్గాలు చేపట్టి 'యువ భారతి' రథాన్ని ప్రగతి పథంలో నడిపించాడు.

గ్రంథ ప్రచురణలు, గ్రంథ సమీక్షలు, ఉపన్యాసాలు, నాటక ప్రదర్శనలు, స్వీయరచనల పఠనం వంటి కార్యక్రమాలు ఇబ్బడిముబ్బడిగా కొనసాగించింది. " చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది " అనే నినాదంతో పురుడు పోసుకొని నేటి యువతరం నిర్మాణాత్మకంగా ఆలోచించి తన భవిష్యత్తును ఉజ్జ్వలంగా తీర్చిదిద్దుకోవడానికి అనువైన వాతావరణం కల్పించాలనే మహత్వకాంక్షతో 'యువభారతి' పురి విప్పింది. 1963లోనే విజయదశమి పర్వదినంనాడు

సాహితీప్రియులైన కొందరు స్నేహితులు ఒక బృందంగా ఏర్పడి 'యువ భారతి' కి తెర ఎత్తారు. సాహితీ స్నేహమే 'యువభారతి' కి శ్వాస, ధ్యాస అని చెప్పుకొన్న ఈ సంస్థ 1964 లో అధికారికంగా వేళ్ళూనుకొని బలపడింది.

దివాకర్ల వేంకటావధాని, సి.నారాయణరెడ్డి, దాశరథి, పుట్టపర్తి, నారాయణాచార్యులు, మరుపూరు కోదండరామిరెడ్డి, జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ), జి.వి. సుబ్రహ్మణ్యం, ఆరుద్ర, గడియారం రామకృష్ణశర్మ వంటి సాహితీ దిగ్గజాల ఆశీర్వాద బలంతో సాహిత్య సేవను కొనసాగించింది. 'లహరి' ఉపన్యాస పరంపరకు శ్రీకారంచుట్టి దిగ్విజయంగా జరిపించింది. 1970లో 'మారుతున్న విలువలూ – రచయితల బాధ్యతలు' అనే అంశంపై గోష్ఠి జరిపి 37 మంది ప్రముఖ రచయితలతో ప్రామాణిక వ్యాసాలు రాయించి, 'రచన' పేరుతో ఒక గ్రంథాన్ని వెలువరించింది.

ప్రాచీన కవుల జీవనరేఖలను, వారి కావ్యవిశేషాలను గురించి పండిత పరిశోధకుల చేత రచనలు చేయించి లఘుగ్రంథాలుగా అచ్చొత్తించింది. యువతరానికి, విద్యార్థులకు సృజనాత్మక ప్రక్రియలలో సాహిత్యాభిరుచిని కలిగించడానికి పోటీలు నిర్వహించింది. వారిలోని సృజన శక్తిని వెలుగులోకి తేవడానికి ప్రతి నెలా మొదటి, మూడో ఆదివారాలలో సుల్తాన్ బజార్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో మధ్యాహ్నం 2:30 గంటల నుంచి 5:30 గంటల వరకు పక్ష సమావేశాలు ఏర్పాటు చేసింది. ఔత్సాహికుల రచనలను ముద్రింపించడం, ఆవిష్కరింప జేయడం, వాటిపై సమీక్షా కార్యక్రమాలు నిర్వహించడం వంటివి 'యువ భారతి' సంస్థ ప్రత్యేకతలు.

ఇక 'యువభారతి' అనేక సాహితీకార్యక్రమాలలో తలమానికంగా పేర్కొనదగినవి రెండే రెండు. ఒకటి 'లహరి' ఉపన్యాసాలు, రెండు 'మహతి' గ్రంథప్రచురణ. ఈ రెండూ ఈ వ్యాస రచయిత అయిన నన్ను అమితంగా ప్రభావితం చేశాయి. అవి నేను డిగ్రీ చదువుతున్న రోజులు. 1969లోని తెలంగాణ తొలి దశ ఉద్యమం ఫలితంగా నా మూడేళ్ళ డిగ్రీ కాలం అయిదేళ్ళకు ఎగబాకింది. పూర్తికావలసింది 1972లో 1974 లో పూర్తయింది. అప్పుడే 'యువభారతి' సాహిత్య కార్యక్రమాలు నన్ను బాగా ఆకర్షించాయి. స్వతహాగా పాఠశాల విద్యార్థిగా ఉన్నప్పుడే నాకు తెలుగు భాష అన్నా, సాహిత్యం అన్నా ఆసక్తిగా ఉండేది. ఏడు, ఎనిమిది తరగతులు చదువుతున్నప్పుడే స్కూల్లో తెలుగు వ్యాస రచనలు, వక్తృత్వ

పోటీల్లో పాల్గొని బహుమతులు గెలుచుకొనే వాణ్ణి. వారపత్రికలు, కథల పుస్తకాలు, నవలలు చదివేవాణ్ణి. డిగ్రీ వచ్చే నాటికి కవితలు, కథలు రాస్తూ, పత్రికలకు పంపుతూ ఉండేవాణ్ణి. స్కూల్ ఫైనల్ కాగానే పి.యు.సి, బి.ఎ. డిగ్రీలు ఇంగ్లీషు మీడియంలో చదువవలసి వచ్చింది. ఆ రోజుల్లో తెలుగు మీడియం ఉండేది కాదు. ఒక సబ్జెక్టుగా మాత్రమే ఉండేది. అందులో నాకు బాగా మార్కులు వచ్చేవి. డిగ్రీ కాగానే ఉద్యోగావకాశాలు బాగానే వచ్చాయి. నాకు ఉద్యోగంకంటే ఎం.ఏ. తెలుగు చదువాలని బాగా ఉండేది. ఇంట్లో వాళ్ళతో రోజూ గొడవే!

అసలు ఈ ఎం.ఏ. తెలుగు చదువాలనే కోరికను నాలో బలీయంచేసింది 'యువభారతి', 'లహరి' ఉపన్యాస పరంపర. మొదటిసారిగా 1971 జూలై, ఆగస్టు, సెప్టెంబర్ నెలల్లో 'కావ్య లహరి' పేరిట ఉపన్యాస కార్యక్రమాలు ఏర్పాటు చేసింది. 1971 జూలై 18 ఆదివారం శ్రీనాథుని శృంగార నైషధము; 1971 ఆగస్టు 1వ తేదీ ఆదివారం అల్లసాని పెద్దన 'మను చరిత్రము', 1971 ఆగస్టు 15వ తేదీ ఆదివారం ముక్కు తిమ్మన 'పారిజాతాపహరణము' 1971 ఆగస్టు 29వ తేదీ ఆదివారం రామరాజభూషణుని 'వసు చరిత్రము', 1971 సెప్టెంబర్ 12వ తేదీ ఆదివారం చేమకూర వేంకటకవి 'విజయ విలాసము' పై అయిదు ఉపన్యాస కార్యక్రమాలు నా జీవితాన్నే మలుపు తిప్పాయి. వాగీశ్వరుడు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు ఈ అయిదు అంశాలపై ప్రసంగించారు. వారి వాగ్వైభవం, వాక్పటిమ, ఉపన్యాస విన్యాసం, వాగ్ఝరి, భాషావైదుష్యం, వర్ణనా నైపుణ్యం అందరినీ మంత్రముగ్ధుల్ని చేశాయి. ముఖ్యంగా నాలాంటి వాళ్ళను ఆనాటి కావ్యప్రపంచంలోకి తీసుకువెళ్ళి విహరింపజేశాయి. కళ్ళ ముందు ఒక దృశ్యకావ్యం చలన చిత్రంలా చకచకా సాగిపోయినట్లనిపించింది. అలా 1972లో 'ప్రతిభాలహరి', 1976లో 'కవితాలహరి'; 1977లో 'నవోదయలహరి', 1980లో 'ఆలోచనా లహరి' ఇలా పదేళ్ళపాటు ఈ 'లహరి' ఉపన్యాసాలు తెలుగు నాట ఎందరినో తెలుగు ప్రాచీన, ఆధునిక సాహిత్యం పట్ల ఆసక్తిని పెంచుకొనేలా మార్చివేసింది.

సాహిత్యభిమానులంతా ఆదివారం 'లహరి' ఉపన్యాసాల కోసం చకోర పక్షులు వెన్నెల రాత్రుల కోసం ఎదురు చూసినట్లు చూస్తూ ఉండేవారు. బొగ్గులకుంటలోని ఆంధ్రసారస్వత పరిషత్‌లో జరిగే ఈ ఉపన్యాసాలు సాయంత్రం 6 గంటలకు అయితే మధ్యాహ్నం 2, 3 గంటల నుంచే జనం వచ్చి చేరుతూ ఉండేవారు.

అయిదింటికల్లా  ఆ ప్రాంగణం అంతా కిటకిటలాడుతూ ఉండేది. ఇసుక వేస్తే రాలనంత జనం.  అప్పట్లో పరిషత్ హాల్ సభావేదిక భవనానికి వెనుక వేపు  బహిరంగ ప్రదేశంలో ఉండేది. ఆ ప్రదేశమంతా నిండిపోగా, చోటు చాలక చుట్టూరా ప్రహరీ గోడలపై కూడా జనం కూర్చొనే వాళ్ళు. కూర్చొనే చోటు లేక రెండు, మూడు గంటలపాటు కొనసాగే ఉపన్యాసం వినడానికి నిలబడే ఉండేవాళ్ళు. ఆదివారాలలోని ఆ ఉపన్యాసాలకు కేవలం జంటనగరాలలోని స్థానికులే కాక ఇతర ప్రాంతాల నుంచి, బయటి ఊళ్ళ నుంచి కూడా జనం తరలి వచ్చేవారు. ఒక సాహిత్య ఉపన్యాసాలకు జనం  ఇంతగా రావడం అన్నది 'న భూతో న భవిష్యతి' అనిపించింది. అది ఆ వక్తల నైపుణ్యమో, ఆ సాహిత్యం గొప్పదనమో , ఎన్నుకొన్న  ప్రసంగాంశాల ప్రభావమో గానీ తెలుగు నేలను ఉయ్యాలలా ఊపేసింది. సాహిత్యాభిమానులందరిపై మత్తుమందును జల్లేసింది. ఆనాటి ఉపన్యాసాలు విన్న వారికి ఈనాటికీ ఆ మత్తు వదలలేదేమో అనుకొంటున్నాను. అందుకు నేనే ఒక ఉదాహరణ.

1969లో బి.ఏ, ఇంగ్లీషు మీడియం  చదువుతున్న నేను 1974లో ఎం.ఏ, తెలుగు చేయడానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో చేరాను. ఆ తరువాత ఎం.ఫిల్, పిహెచ్.డి, చేశాను. నా జీవితం మారిపోయింది. అనేక మలుపులు తిరిగింది. చివరికి ముప్పయి  ఏళ్ళ సర్వీసులో విశ్వవిద్యాలయం  ప్రొఫెసర్‌గా, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం రిజిస్ట్రార్‌గా ఔద్యోగిక జీవితంలో ఉద్యోగవిరమణ చేయడమయింది. ఆనాడు 'లహరి' ఉపన్యాసాలు అన్నవి లేకపోతే, అవి విని ఉండకపోతే, నేను అప్పుడే డిగ్రీ అయిపోగానే ఏదో ఒక ప్రభుత్వ ఉద్యోగంలోనో, బ్యాంక్ ఉద్యోగిగా రిటైర్ అయిపోయి ఉండేవాణ్ణి. సాహిత్యోపన్యాసాలు ఒక జీవితాన్ని ఇంతగా మార్చేస్తాయన్నది నా విషయంలో  ఋజువైంది.

ఇక 'యువభారతి' మరొక గొప్ప కార్యక్రమం 'మహతి' ప్రత్యేక సంచిక ప్రచురణ. 1972లో భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా 'యువభారతి' తెలుగునాట వివిధ రంగాలలో ప్రముఖులైన వారి చేత సాంఘిక, సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, శాస్త్రసాంకేతిక,  సాహిత్య, చరిత్ర, భాష వంటి పలు అంశాలపై పరిశోధనాత్మక వ్యాసాలు రాయించి 'మహతి' అన్న  పేరుతో ఒక బృహద్గ్రంథాన్ని  ప్రచురించి వెలువరించింది.  ఇది అన్నితరహాల విద్యార్థులకు ఒక ఆకరగ్రంథంలాగా, ఒక భగవద్గీతలాగా పనికి వచ్చింది. ఎంతో అమూల్యమైన,

అపూర్వమైన సమాచారాన్ని అందించిన ఈ పుస్తకం అందరి ఇంట్లో తప్పనిసరిగా ఉండదగినదిగా అనిపించింది.

ఇక 'లహరి' ఉపన్యాస కార్యక్రమాలలో చివర్న వందన సమర్పణ సమయంలో వంగపల్లి విశ్వనాథంగారు 'విన్నపాలు' అంటూ చెప్పే కార్యక్రమ విషయాలు, విశేషాలు ఆకర్షించేవి. పదే పదే అదే వినడంతో మేమంతా అవి 'విన్నపాలు' కావు 'వెన్నపాలు' అని నవ్వుకొనే వాళ్లం. 'యువభారతి' ప్రచురణల విషయంలో ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి స్నేహసహకార హస్తం బాగా ఉండేది. ఆర్.టి.సీ. క్రాస్‌రోడ్ దగ్గర ఉండే కళాజ్యోతి – నాగార్జున ప్రింటింగ్ ప్రెస్‌లో ఇంకా నగరంలోని వివిధ ప్రెస్సులలో జరిగే పుస్తకాల ప్రచురణ కాలంలో జి.వి. సుబ్రహ్మణ్యం గారు దగ్గర ఉండి అన్నీ చూసేవారు. వారు మాకు ఎం.ఏ. లో గురువు కావటం వల్ల, వారితోపాటు మేము కూడా ఈ పుస్తకాల ప్రచురణ పద్ధతులన్నీ దగ్గరుండి చూసే వాళ్లం. నేను ప్రూఫ్‌లు కూడా చూసిన గుర్తు. 'యువభారతి' 'నందిని' అన్న పేరుతో సాహిత్య పత్రికను కూడా తీసుకొని వచ్చింది. ఇలా 'యువభారతి' విశిష్టాత్మకమైన, ప్రతిష్ఠాత్మకమైన సాహిత్య కార్యక్రమాల ద్వారా తెలుగునాట ఒక ప్రత్యేక స్థానాన్ని సుస్థిర పరచుకొని చరిత్రలో నిలిచిపోయింది. అటువంటి 'యువభారతి' ఈనాడు అరవై ఏళ్ళు నిండి పండుగ చేసుకొంటున్న తరుణంలో నా గుండె నిండుగా శుభాభినందనలు తెలియజేసుకొంటున్నాను. 




చైతన్యలహరి కార్యక్రమంలో ప్రసంగిస్తున్న సమావేశకర్త డా॥వంగపల్లి విశ్వనాథం చిత్రంలో సినారె, దాశరథి, ఇరివెంటి తదితరులు

# షష్ట్యబ్ది 'నవ' భారతి

డా॥ రేవూరు అనంతపద్మనాభరావు
విశ్రాంత అదనపు డైరెక్టర్ జనరల్, దూరదర్శన్, హైదరాబాద్
98665 86805

సాహిత్య సంస్థలను దశాబ్దాలుగా నడపడం వ్యయప్రయాసలతో కూడినపని. ఉభయ తెలుగు రాష్ట్రాలలో పలుసాహితీసంస్థలు ఆర్భాటంగా ఆరంభమై ఆదిలో హంసపాదు అన్న రీతిలో ఆగిపోయాయి. దీక్షాదక్షతలు గల సాహితీవేత్తల అవిరళ కృషి ఫలితంగా యువభారతి ఈనాడు షష్ట్యబ్ది జరుపుకొని నవభారతి అయింది. 1970లలో ఉషస్సు అనే పేర ఒక కవితా సంకలనం యువభారతి ప్రచురించింది. నవకవులను, ఉత్తేజపరుస్తూ ఒక్కోపేజీలో ఒక కవిత ప్రచురించారు. అందులో నాకూ భాగస్వామ్యం లభించింది. ఆనాటి నుండి అర్ధశతాబ్దికిపైగా ఈ సంస్థ కార్యకలాపాలు ఉజ్జ్వలంగా సాగడం విశేషం. తొలినాళ్లలో డా. ఇరివెంటి కృష్ణమూర్తి, డా.వంగపల్లి విశ్వనాథం, ఆపైన సుధామ, అయలసోమయాజుల నాగేశ్వరరావు, ప్రభృతుల కృషితో అనేకానేక కార్యక్రమాలు సఫలీకృతమైనాయి. నేడు ఆచార్య ఫణీంద్ర నేతృత్వంలో ముందుకు సాగుతోంది.

'మహతి' గ్రంథం ద్వితీయ ప్రచురణకు నోచుకొని సాహితీ పరిశోధకులకు కరదీపిక అయింది. దివాకర్ల వారి చేత ఉపన్యాస పరంపర ఏర్పాటు చేయడం ఒక ఎత్తు, కావ్యలహరి, వికాసలహరి ఇత్యాది సంపుటులు వెలువరించడం మరొక ఎత్తు. భాగ్యనగరంలో నిలదొక్కుకొని సారస్వత పరిషత్ అండదండలతో విస్తృతంగా సభలు, సమావేశాలు జరిపి సాహితీ ప్రియభావుకుల మన్ననలను యువభారతి అందుకోగలిగింది. ప్రభుత్వ సంస్థలకంటె మిన్నగా సాహితీ కృషిని జరుపుతూ సారస్వత సమారాధన కొనసాగిస్తోంది. పట్టుదల వుంటే సాధించలేనిది లేదని ఈ సంస్థ నిరూపించింది. భవిష్యత్ ప్రణాళికలతో ముందుకు సాగుతోంది.

జయోస్తు ! విజయోస్తు ! నవ యువభారతి !



# నమస్సుమాంజలి

డా॥ ముదిగొండ శివప్రసాద్
సాహితీవేత్త, విశ్రాంత ఆచార్యులు, హైదరాబాద్

**యు**వభారతి వేరు, నేను వేరు కాదు. అందులో ఉన్నటువంటివాళ్ళందరూ కూడా సుధామ కానివ్వండి, ఇరివెంటి కృష్ణమూర్తి గారు, సుబ్రహ్మణ్యం గారు, ఇంకా అందులో పనిచేసినటువంటి వంగపల్లి విశ్వనాథం గారు ఈ మొత్తం team అందరూ కూడా నాకు ఆత్మీయులే.

యువభారతి ఆంధ్ర సారస్వత పరిషత్తులో మీటింగులు నిర్వహించినప్పుడు దివాకర్ల వేంకటావధానిగారు ఇచ్చిన ఉపన్యాసాలు చాలా ప్రాచుర్యం పొందాయి. అక్కడ 'లహరీ' series నిర్వహించేవారు. అక్కడ లహరీ సమావేశాలలో ఒక రోజున పీవీ నరసింహారావు గారు అన్నారు – "జనానికి ఇక్కడ స్థలం సరిపోయేటట్లు లేదు మీరిక వేదిక లాల్ బహదూర్ స్టేడియంకు మార్చాలి" అని. అంతటి ఉల్లాసం, ఉద్వేగం, అత్యున్నతమైన ఉత్సాహం నాడు సమాజంలో కలిగించింది యువభారతి.

తెలుగుభాషను, తెలుగు సాహిత్యాన్ని ప్రాచుర్యంలోకి తీసుకురావడానికి ఒక యూనివర్సిటీ లేక ఒక సాహిత్య అకాడమీ చేసే పని ఒక ప్రైవేట్ సంస్థ చేయడం ఆనాడు అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసింది.

తిరుమల శ్రీనివాసాచార్య వంటి వాళ్ళందరూ నాకు సహచరులే. యువభారతి సంస్థ కు అప్పుడే 60 సంవత్సరాలు నిండాయంటే ఆశ్చర్యం వేస్తోంది. యువభారతి, తెలుగు భారతిని అలంకరించిన పూలదండలో నేను కూడా ఒక చిన్న పుష్పాన్ని సమర్పించుకున్న వాడినే. నేను కూడా ఒక యువభారతి సభ్యుడినే, సాహితీ సేవకుడినే.

శ్రీ విద్య కౌముదికి హృదయపూర్వకమైన వినమ్ర నమస్సుమాంజలిని సమర్పించుకుంటున్నాను.



# సాహిత్యచైతన్యంలో 'యువభారతి'

డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి
కవి, విశ్రాంత ఆచార్యులు, హైదరాబాద్
98669 56250

**పా**లెం ప్రాచ్యకళాశాలలో 1965-67 మధ్యకాలంలో చదువుకొంటున్నప్పుడు మా గురువుల వల్ల యువభారతి గురించి తెలిసింది. అప్పుడు వారు నిర్వహిస్తున్న సాహిత్య సమావేశాల్లో మా కళాశాల ఆచార్యులూ పాల్గొనేవారు.

ఆ తర్వాత నేను 1967 నుండి 1973 మధ్యకాలం పాలమూరు జిల్లాలోని మాడ్గులలో తెలుగు అధ్యాపకునిగా పనిచేశాను. ఆ మధ్యకాలంలో అయిదారు పర్యాయాలు హైదరాబాదులోని యువభారతి సాహిత్యోపన్యాసాల సదస్సులలో పాల్గొన్నాను. ప్రజాసూక్తం వంటి ఒకటి రెండు పుస్తకాలు ఆ తర్వాతి సమావేశాల్లో తీసుకొన్నాను.

నేను 1973 నుండి 1985 వరకు కామారెడ్డి డిగ్రీ కళాశాలలో పనిచేశాను. ఈ మధ్యలో అనేక పర్యాయాలు యువభారతి సాహిత్యోపన్యాసాల కార్యక్రమాల్లో శ్రోతగా పాల్గొన్నాను. తెలుగు పొడుపుకథలపై పరిశోధన చేసేప్పుడు యువభారతి ప్రచురించిన ఆర్వీయస్ సుందరంగారి జానపద సాహిత్యం నాకు బాగా ఉపయోగ పడుతుందని నా పరిశోధన పర్యవేక్షకులైన ఆచార్య సి.నారాయణరెడ్డిగారు ఆ పుస్తకాన్ని నాకు పంపారు. నా ప్రణాళికకు ఈ చిన్న పుస్తకం మార్గదర్శనం చేసింది.

సారస్వత పరిషత్ సమావేశాల భవనం వెనుకవైపున ఉన్న స్థలంలో జరుగుతున్న ఓ సాహిత్య సమావేశానికి నేను శ్రోతగా వెళ్ళాను. చాలామంది వినడానికి వచ్చారు. నాకు ప్రాచ్య కళాశాలలో పాఠాలు చెప్పిన గురువుగారూ ఉన్నారు. వారికి నమస్కరించి వారి ముందున్న కుర్చీలో నేను కూచున్నాను. ఉపన్యాసాలు ప్రారంభమైనాయి.

'ఏం రెడ్డీ కవచం వేసుకొని వచ్చావా' నవ్వుతూ అడిగారు గురువుగారు.

'కవచమెందుకు సర్!' అన్నాను నేను వెనక్కు తిరిగి. 'ఉపన్యాస భీముడు వస్తున్నాడు మరి' మళ్ళీ నవ్వుతూ అన్నారు గురువుగారు. నేను వేదిక దిక్కు చూస్తున్నాను. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు వేదికమీదికి వచ్చి కూచున్నారు.

అవును! అప్పుడు ప్రధానప్రసంగం వారిదే! వారినే గురువుగారు ఉపన్యాస భీముడు అంటున్నారు. వారి ప్రసంగం రామాయణ, భారత, భాగవత, పురాణ, కావ్య, ప్రబంధాలు దేనిపైన ఉన్నా సాహిత్యవిద్యార్థులకు మృష్టాన్న భోజనంలా ఉంటుంది. ఉపన్యాసంలో వారి వాక్యవిన్యాసం, భావ గాంభీర్యంతో కూడుకొన్న ప్రౌఢ సమాస గ్రథనం, సాహిత్య ప్రియులనలరించే సుందర పదబంధం, నాదమయమైన శబ్దబ్రహ్మలోకి శ్రోతల్ని లాక్కొని పోయేశక్తి వారి ఉపన్యాస కళలోకి లాక్కోబడి తన్మయులైపోతారు. ఒక్కోసారి వారి శబ్ద ప్రయోగం మృదంగ ధ్వనిలా ప్రవహించి శ్రోతలను చుట్టుకొంటుంది.

కేవలం ఉపన్యాసాల ప్రభావానికి లోనయ్యేవారేగాక ఆచార్య సుబ్రహ్మణ్యం గారి సాహిత్య గ్రంథాలు అందరిలో సాహిత్యాభిరుచిని పెంపొందిస్తాయి. యువభారతి ప్రచురించిన వారి గ్రంథాలలో 'అభినవలోచనం'లోని రాయప్రోలు, విశ్వనాథ, మధునాపంతుల తదితరుల సాహిత్య సౌందర్యాన్ని మనస్సులో చిత్రిస్తాయి. ఆధునిక కవితాధ్యయనానికి లోతైన అవగాహనకు అవకాశం కల్పించే ఈ వ్యాసాలు మాబోంట్ల కెంతో ఉపయోగపడ్డాయి.

యువభారతి సాహిత్య సమావేశాలలో ఆప్యాయంగా పలుకరించే ప్రొఫెసర్ వంగపల్లి విశ్వనాథం గారికి నమస్కరించి కూచునేవాళ్ళం. డా॥ఇరివెంటి కృష్ణమూర్తి గారిని చూడ్డంతోనే ఓ పూజ్యభావం ఏర్పడేది. పదిపైసలకే ఇచ్చిన 16పుటల 'అడుగుజాడలు' అనే పుస్తిక వారిదే. పుస్తకం చిన్నది, కాని అది అందించిన సందేశం జీవితాంతం నిలిచేది. అందులోని నైతిక విలువల అంశాల్ని అనేక సందర్భాల్లో మాబోంట్లం ఉపయోగించుకొన్నాం.

యువభారతి ప్రచురించిన మహతి సాహిత్య వ్యాసాల సంపుటి బృహద్గ్రంథమే. అందులోని వివిధ సాహిత్య ప్రక్రియలపై ఎన్నో వ్యాసాలు ప్రచురించారు. సాహిత్య విద్యార్థులకు సాహిత్య బోధకులకు శ్రీమద్భగవద్గీత లాంటిది మహతి గ్రంథం. ఈ విధంగా ఎన్నో గ్రంథాలు ప్రచురించి, విద్వాంసులచేత అనేక ఉపన్యాసా లిప్పించిన యువభారతి కార్యక్రమాలనెవరూ మరచిపోలేదు. హృదయంలో పదిలంగా నిలిచే ఉదాహరణలెన్నో ఉన్నాయి. అందరి స్పందనలిట్లు వ్రాస్తే యువభారతి సాహితీ హృదయ భారతిగా సాక్షాత్కరిస్తుంది.

చివరగా ఒక చిన్న సంఘటన చెబుతాను. నేను ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ఉపన్యాసకునిగా చేరినతర్వాత అప్పుడప్పుడు యువభారతి సాహిత్య సమావేశాల్లో వక్తగా పాల్గొన్నాను. ఒక సాహిత్య సభ సారస్వత పరిషత్ భవనం

వెనుక ఆరుబయట జరుగుచున్నది. నేను జానపద సాహిత్యంలోని చిన్న అంశం మీద మాటాడాల్సి ఉంది. వేదికపై ఆచార్య సి.నారాయణరెడ్డిగారు, ప్రజాకవి కాళోజీ ఉన్నారు. కాళోజీ అనుకోకుండా వచ్చారు. వారిని గౌరవంగా వేదికపైకి ఆహ్వానించారు. ముఖ్య అతిథిగా నాటి రాష్ట్రమంత్రి కీ.శే.శ్రీమాధవరెడ్డిగారు ఆలస్యంగా వచ్చారు. అప్పటికే సగం సభ అయిపోయింది.

వచ్చిన శ్రీమాధవరెడ్డిగారిని వేదికమీదికి తీసుకొని వస్తున్నారు. ఎవడు మంత్రి వస్తుండా అని అడిగాడు పక్కనే ఉన్న నన్ను. అవును! అన్నాను నేను. మంత్రి వస్తే నేనుండ అని లేవబోయారు కాళోజీ. సర్ సర్ మర్యాద కాదు లేవద్దు కూచోండి! అని నేను ఆయన తొడమీద చేతులేసి లేవకుండా చేశాను. ఎవడ్రా! నువ్వు అని కసురుకొన్నాడు నన్ను. నేను ఆయన లేచిపోకుండా పట్టుకొన్నాను. ఈలోగా మాధవరెడ్డిగారు ఒకరిద్దరికి సన్మానం చేసి, మీరు సభ కొనసాగించండి అని వెళ్ళిపోయారు.

మంత్రులు వేదిక మీదికి వస్తే కాళోజి వేదిక మీద ఉంటాడా అని కొందరు గుసగుసలు పోతున్నారు. 'ఆయన వెళ్ళిపోయిండు... ఇక కూచోండి...!' అన్నాను మెల్లగా కాళోజీ చెవిలో. నేనాయన్ని అప్పుడు వదలిపెట్టాను. 'నువ్వెవడ్రా! నన్నిట్ల వట్టుకున్నవ్' అన్నారు కాళోజీ. నా పేరు చెప్పి, నేను తెలుగు లెక్చరర్ని అన్నాను వారి చెవిలోనే.

'లెక్చరరేంది. లెక్చరర్. తెలుగు పంతుల్ని అను'... అన్నారు నిరసనగా... 'ఇప్పట్నుంచి అలాగే అంటా!' అన్నా బుద్ధిమంతుని లాగా. సభ పూర్తయ్యేవరకు అలా నేను కాళన్న పక్కనే ఉన్నాను. కాళన్నను పట్టుకొని ఆపడం ఎవరితరం! మంత్రిగారు వెళ్ళిపోయారంటే ఆగారు గాని లేకుంటే నేను పట్టుకొంటే ఆగుతారా! పైగా కాళోజీ గారు వేదికమీద ఉన్నారని మంత్రిగారితో చెబితే, వారు మహానుభావులు వారు ఉండనీ, నాకు వేరే పని ఉన్నది అని వెళ్ళిపోవడం అనేది మామూలు విషయం కాదు. ఆయన గొప్ప మర్యాద పాటించారు.

అరవై యేళ్ళ క్రితం ప్రారంభమైన యువభారతి జ్ఞానవృద్ధ (జ్ఞానముచేత వృద్ధి పొందిన) భారతి! జ్ఞానాన్ని వృద్ధి పొందించే నవభారతి ఈ యువభారతిని అనుసరిద్దాం! మనమూ జ్ఞానవృద్ధులమవుదాం! జై భారత్ !



# యువభారతి నవభారతి

డా॥ మసన చెన్నప్ప
విశ్రాంత ఆచార్యులు, హైదరాబాద్
98856 54381

ఎన్నో సాహిత్యసంస్థలు ఆవిర్భవించి, ఆ తర్వాత అచిరకాలంలోనే కనుమరుగైన సందర్భాలు కోకొల్లలు. కాని 'యువభారతి' సాహిత్య సంస్థ అందుకు భిన్నమైంది. అరవై సంవత్సరాలైనా 'యువ భారతి' మంచి యౌవనంలో ఉండడం అభినందనీయం!

నిబద్ధత, నిజాయితి, నిస్వార్థం, పరమార్థం పునాదులమీద ఆవిర్భవించిన సంస్థ 'యువభారతి'. యువభారతి పుట్టినప్పుడు నాకు ఎనిమిదేళ్లు. నా 16వ ఏటినుంచి 'యువభారతి' ని చూసే అదృష్టం కల్గింది. 'ఆంధ్ర సారస్వతపరిషత్తు' నా కళాశాల విద్యకు అండగా నిలబడ్డది. 'యువ భారతి' కార్యాలయం సారస్వతపరిషత్తు భవనంలోనే ఉండేది. యువభారతి సాహిత్య కార్యక్రమాలన్నీ పరిషత్తు ప్రాంగణంలో జరిగేవి.

నా అదృష్టం ఏమంటే 1971 నుంచి 'యువభారతి' ప్రచురణలను చదువుతున్నాను. 'యువభారతి' ఏర్పాటు చేసిన సభలల్లో ఒక ప్రేక్షకునిగా పొల్గొంటున్నాను. యువభారతి ఆధ్వర్యంలో జరిగిన ఉపన్యాసకార్యక్రమాల్లో శ్రోతగా పాల్గొని, ఎంతో ప్రేరణపొందినాను. మహామహులైన, సాహితీ దిగ్గజాలు 'యువభారతి' వేదిక మీద ప్రత్యక్షమయ్యేవారు.

'యువభారతి' ని ఒకదీపంగా వెలిగించి తెలుగునాట గల అజ్ఞానాంధకారాన్ని తొలగించిన గౌరవం మా గురువుగారైన ఇరివెంటి కృష్ణమూర్తిగారికి దక్కుతుంది. అప్పటికీ ఇప్పటికీ యువభారతి సమావేశకర్తగా సుప్రసిద్ధులు, ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారుండడం విశేషం. ఎంత ఆలోచన ఉండాలో, ఎక్కడ ఆవేశం ఉండాలో తెలిసిన వ్యక్తిత్వ వికాసనిపుణులు, వాణిజ్యశాస్త్రాచార్యులు వంగపల్లి వారు గురుతుల్యులు. యువభారతిని తన పాండిత్య ప్రభలతో వెలుగొందజేసిన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారత్యంతాత్మీయతాభావాన్ని నాపట్ల చూపడం మరచిపోలేనిది.

దివాకర్ల వారు యువభారతి పక్షాన చేసిన ఉపన్యాసాలను విడువకుండా విన్నవాణ్ణి నేను. దివాకర్ల వేంకటావధాని యువభారతికి మేనమామ అనిపించారు.

దివాకర్లవారు కావ్యలహరి ఉపన్యాసాల్లో భాగంగా మనుచరిత్ర మీద ప్రసంగిస్తున్న వేళ అది. అప్పటికే సాయంత్రం 6 గంటలైంది. పరిషత్ ప్రాంగణం నిండి పోయింది. దివాకర్ల ఉపన్యాసం గంగాప్రవాహంలా సాగుతూంది. నేను కొంచెం ఆలస్యం చేశాను. అందుకే నాకు కూర్చోవడానికి కుర్చీ దొరకలేదు. నిలబడే వింటున్నాను.

ఇంతలో ఎవరో వెనుక నుంచి కుర్చీతెచ్చి నా వెనుక వేశారు. నాకు కుర్చీస్పర్శ తెలిసింది. నేను హాయిగా కూర్చొని ఆగంటసేపు తన్మయుడనై దివాకర్ల ఉపన్యాసం విన్నాను. ప్రవరునితోపాటు హిమాలయానికి వెళ్ళినట్లుంది! నాకా కుర్చీ ఎవరు వేశారో తెలుసుకో లేకపోయాను. ఒక గంట తర్వాత, ఒక్కసారి నన్ను నేను వశంలోకి తెచ్చుకొని వెనక్కిచూశాను. అక్కడ డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు నిలబడి ఉన్నారు. నాకా కుర్చీ వేసినవారు తిరుమలవారేనని నాకు తెలిసిపోయింది. కృతజ్ఞతలు తెలిపాను. "నేను యువభారతి కార్యకర్తను నావిధి నేను నిర్వహించాను" అని మిన్న కున్నారు. నేను మనస్సులోనే వారికి కృతజ్ఞతలర్పించాను.

యువభారతి సంస్థ 60 ఏండ్లుగా ఇంకా సజీవంగా ఉండడానికి కారణం ఆసంస్థలోని ఇలాంటి సభ్యులే. వారంతా ప్రాచీన, ఆధునిక సాహిత్యాలతో విశేషమైన అనుబంధం కల్గినవారు.

పరిషత్తులోని ఓరియంటల్ కళాశాలలో నాకు సీనియర్ విద్యార్థి సుధామగారు, 'ప్రగతిమహా విద్యాలయంలో' నాకు సీనియర్ ఉపన్యాసకుడు ఎం.అనంతా చార్యులు 'యువభారతి' సేవలో పునీతులయ్యారు. ఇప్పుడు అధ్యక్షులుగానున్న డా.ఫణీంద్ర నాకత్యంత స్నేహపాత్రుడు. 'యువభారతి' స్మృతిలో మెదిలినప్పుడు ఎన్నో సంఘటనలు గుర్తుకు వస్తాయి. యువభారతి పక్షాన 'శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం'లో' ఉపనిషత్ సుధాలహరి కార్యక్రమం ఏర్పాటు చేశారు. నేను 'బృహదారణ్యకోపనిషత్తు' గురించి ప్రసంగించాను. గంటన్నర దాకా నా ఉపన్యాసం సాగింది. పద్మభూషణ్ వరప్రసాద్‌రెడ్డిగారు ఆత్మీయ అతిథిగా వచ్చారు. వారు నా ఉపన్యాసం విని మెచ్చుకున్నప్పుడు నాకు కల్గిన ఆనందం వర్ణనాతీతం.

యువభారతి పక్షాన జరిగిన ఉపన్యాస లహరి కార్యక్రమాల్లో మా గురువుగారు నారాయణరెడ్డి గారు పాల్గొనేవారు. వారు గంటకు తక్కువకాకుండా ఆధునిక సాహిత్యం మీద ప్రసంగించేవారు. ఈ వేదిక మీదనే ఆచార్య రవ్వా శ్రీహరిగారిని, ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారిని, ఆచార్య బిరుదురాజు రామరాజుగారిని చూశాను.

తెలుగునాట ప్రసిద్ధి గాంచిన కవులు, పండితులు, విశ్వవిద్యాలయాల ఆచార్యులు పాల్గొనకుండా యువభారతి సాహిత్య సభలుండేవికావు.

ఒకసారి 'యువత' పేరుతో 'ప్రగతి మహావిద్యాలయం'లో మూడు రోజుల సదస్సు యువభారతి ఆధ్వర్యంలో జరిగింది. అప్పుడు నేను ఆ కళాశాలలో ఉపన్యాసకునిగా ఉన్నాను. యువభారతి సాహిత్య సేవను కొద్ది సమయంలోనే వినిపించాను. ఆచార్య వంగపల్లి వారు నా దగ్గరికి వచ్చి నన్ను అభినందించడం మరచిపోని సంఘటన.

ఇరివెంటి వారు నాడు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బోధగురువు. నేనంటే వారికి ఎంతో ప్రేమ. ఎవరైనావారికి కొత్త పుస్తకాలను కాంప్లిమెంటరీగా ఇస్తే రెండివ్వమనేవారు. ఎందుకంటే ఆ రెండింటిలో ఒకటి వారికి, మరొకటి నాకు. అట్లా కృష్ణమూర్తి గారి శుభాకాంక్షలతో నేనెన్నో పుస్తకాలను అయాచితంగా పొందినాను.

యువభారతికిది వజ్రోత్సవ సంవత్సరం. ఒక సంస్థ 60 ఏళ్ళు సుదీర్ఘకాలం జీవించి ఉందంటే మామూలు విషయం కాదు. ఇప్పటికీ ఏదో ఒక కార్యక్రమాన్ని నిర్వహిస్తూనే ఉంటుంది. యువభారతి ప్రచురణలను గూర్చి ఒక మాట చెప్పాలి. యువభారతి వారి 'మహతి' నూరు వ్యాస తంత్రుల మహద్వీణ. 1972లో నేను ప్రచురణ పూర్వ విరాళం ఏడురూపాయలిచ్చి మహతిని సంపాదించాను. అది ఇప్పటికీ మా ఇంట్లో మోగుతూనే ఉంటుంది. ఒక 'మహతి' మాత్రమే కాదు యువభారతి ప్రచురణలన్నీ ఇంచుమించుగా నా దగ్గర ఉన్నాయి. అవి సంస్కృత సాహిత్యానికి సంబంధించినవి (ప్రతిభాలహరి మొదలైనవి)కావచ్చు, అధునిక సాహిత్యానికి సంబంధించినవి కావచ్చు అన్నీ భారతీయ సాంస్కృతిక మూల్యాలను పుణికి పుచ్చుకొన్నవే. సంస్థ అంటే, 'యువభారతి', ప్రచురణ అంటే 'యువభారతి' ఇప్పటికీ ఎప్పటికీ గుర్తుండిపోయే మధురానుభవాలు!

యావద్దేశంలోనేకాదు, తెలుగు ప్రాంతాల్లోనూ సాహిత్యాన్ని సామాన్యులకు కూడా చేరే విధంగా చేసిన సంస్థ 'యువభారతి'. యువభారతి నా దృష్టిలో 'నవభారతి' సాక్షాత్తు 'భారతి'.

చివరగా ఒకమాట 2016లో 'యువభారతి' ఫౌండేషన్ ఆధ్వర్యంలో నాకు డా॥ తిరుమల శ్రీనివాసాచార్య, శ్రీమతి స్వరాజ్యలక్ష్మి ధర్మనిధి సాహిత్య పురస్కారం లభించడం అదృష్టంగా బావిస్తున్నాను. 'యువభారతి' నూరేళ్ళు అంతకంటే మించి సాహిత్యసేవలో నిలవాలని మనసారా కోరుకుంటున్నాను.



# నాటి యువభారతి నేటి ప్రౌఢభారతి

డా॥ వెలుదండ నిత్యానందరావు
విమర్శకుడు, విశ్రాంత ఆచార్యులు, హైదరాబాద్
94416 66881

వ్యక్తులకు కానీ, సంస్థలకు కానీ ఒకానొక పుట్టుక, ఒకానొక సముజ్జ్వల దశ, కాలక్రమంలో నిస్తేజదశ ఉండడం సహజం. నిస్తేజదశ అంటే అదేదో దూష్యమని భావం కాదు. సముజ్జ్వల దశకు మరో పరిణత సహజ రూపం. అంతే! యువభారతి 1982లో ఇతిహాసలహరి 2,200 ప్రతులు వేశారు ( ఇతిహాసలహరి ఇప్పుడు నా ఎదురుగా ఉండడం వల్ల ఉదాహరిస్తున్నాను. మిగితా ప్రచురణలు కూడా ఆ కాలంలో అదే సంఖ్యకు కాస్త అటూ ఇటూ ఉండవచ్చు). మరి ఈనాడో మనం 500 ప్రతులు వేయడానికి దిక్కులు లెక్క పెట్టాల్సివస్తుంది. అంతేగాదు. 1982 నాటికి యువభారతి వారి సాహితీమిత్రపథకం కింద 7,800మంది, భారతీమిత్రులుగా775మంది, భారతీభూషణలుగా100 మంది చేరారు. ఒక సంస్థ సభ్యులుగా ఇంతమందిని కూడగట్టుకోగలిగిందంటే, ఇంతమందిని ఆకట్టుకోగలిగిందంటే అంతకన్నా విజయానికి మరో నిదర్శనమేం కావాలి? యువభారతి నిర్వహించిన కావ్యలహరి దివాకర్ల ప్రసంగాలతీరును, విరగబడి వచ్చిన జనసందోహాన్ని దాదాపు అరవై ఏళ్ళతర్వాత ఆశ్చర్యానందాలతో కూడిన ఒక మధురస్మృతిగా చెప్పుకోగలుగుతున్నారంటే ఇంతకన్నా విజయానికి మరో నిదర్శనమేం కావాలి ?

యువభారతి కరెక్టుగా ఏ రోజున పుట్టింది? ఏఏ కార్యక్రమాలను ఏయే తీరులుగా ఎప్పుడెప్పుడు చేపట్టింది? అనే పరిశోధనాత్మక వ్యాసం కాదిది. అలా రాస్తే ఇంకో తీరుగా వస్తుంది. ప్రియమిత్రులు నేటి యువభారతి అధ్యక్షులు డాక్టర్ ఆచార్య ఫణీంద్ర గారు యువభారతి సంస్థతో నాకున్న పరిచయాన్ని అనుభూతి ప్రధానంగా రాయమని ఆదేశించారు. ఇది వజ్రోత్సవ సంచికకోసం రాస్తున్నది. “తనదైన అనుభూతి తనది గాన” అన్నట్లు అనుభూతులను, ఆత్మీయతలను, గత స్మృతులసుగంధాలను పంచుకునే వాహికగా నా ఈ చిన్నివ్యాసం రూపు దాలుస్తుంది.

యువభారతికి వంగపల్లి విశ్వనాథం గారి మార్దవపూర్వకమైన క్రమశిక్షణ, దృక్పథం ఆలంబనం. ఇరివెంటి కృష్ణమూర్తి గారి ఆలోచనలు, జి.వి.సుబ్రహ్మణ్యం గారి ఆలోచనాత్మక శ్రమైక జీవనం, మూలస్తంభాలు. కె.బిలక్ష్మి, కామేశ్వరరావు, సుధామ, తాళ్లపల్లి మురళీధరగౌడ్ , జీడిగుంట వెంకట్రావు, అయలసోమయాజుల నాగేశ్వరరావు, ఇంకా నాకు తెలియని వారెందరెందరో చురుకైన మెరికల్లాంటి ఆనాటి యువకులు (నేటి ప్రౌఢభారతి సభ్యులు) సాహితీపిపాసను, క్రమశిక్షణను అలవర్చుకొని తదనంతర జీవితంలో రచయితలుగా, మేధావులుగా పరిణతి చెందారు. స్వాగతం రెండు నిమిషాలు. పరిచయం మూడు నిమిషాలు, ఉపన్యాసం గంట బహుశా. ఇలా స్పష్టమైన కాల నిర్దేశం ప్రకటించి, సకాలానికి ఒక్క నిమిషం కూడా అటు ఇటు జరగకుండా ప్రారంభించడం, ముగించడం యువభారతి గొప్పతనం అని తెలుసుకుంటే ఆశ్చర్యపోకమానం...

నేను 1983లో హైదరాబాదుకు వచ్చాను...అప్పటికే దివాకర్ల కావ్యలహరి ప్రసంగాలు, వికాసలహరి, చైతన్యలహరి ఉపన్యాసాల సముజ్జ్వల ఘట్టం స్మృతుల్లోకి వెళ్లిపోయింది. నేను డిగ్రీలో ఉండగా "ఇతిహాస లహరి" తెప్పించుకున్నాను. "27-1-1983న రిజిస్టర్ పోస్టులో విడిపించుకొన్నది" అని రాసి దానికింద సంతకం చేశాను. అది కనిపించినపుడల్లా ఎంతో ఆనందం కలుగుతుంది.

దేశభక్తి, జాతీయభావాలప్రభావంలో ఉన్నవాడిని. గడియారం వారి శివభారతం, ముదిగొండ వీరభద్రమూర్తి వందేమాతరం కావ్యాలను అప్పటికే చదివినవాడిని. కనుక ఇతిహాసలహరి ప్రసంగవ్యాసాలు నన్ను ఆకట్టుకోవడంలో ఆశ్చర్యంలేదు. రాజశేఖర శతావధాని రాణా ప్రతాప సింహ చరిత్ర గురించి డాక్టర్ ముదిగొండ శివప్రసాద్; గడియారం వేంకట శేషశాస్త్రి శివభారతం గురించి డాక్టర్ ప్రసాదరాయకులపతి, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి ఆంధ్ర పురాణం గురించి డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం; వానమామలై వరదాచార్యుల పోతన చరిత్ర గురించి దివాకర్ల వేంకటావధాని, విశ్వనాథ సత్యనారాయణగారి ఝాన్సీరాణి గురించి తుమ్మపూడి కోటేశ్వరరావు, ముదిగొండ వీరభద్ర మూర్తి గారి వందేమాతరం గురించి అక్కిరాజు రామాపతిరావుగారలు రాసిన లోతైన వ్యాసాలను డిగ్రీలో చదువుకొని ఉత్తేజితుడనయ్యాను. యువభారతి లహరులన్నీ తెప్పించుకుని చదువుకున్నాను. రజతోత్సవసంచిక మహతి చదివాను.

యువభారతి మూలస్తంభాల్లో ఒకరైన ఇరివెంటి కృష్ణమూర్తి గారు మా స్వగ్రామమైన మంగనూరు (నాగర్ కర్నూల్ జిల్లా)లోఉన్న వారి బంధువుల పెళ్ళికి వచ్చారు. మానాన్నగారు వెలుదండ రామేశ్వరరావుగారు పరిచితులు కావడంతో, మా ఇంటికి వచ్చారు. ఆవిధంగా, మా ఊళ్లోనే మా ఇంట్లోనే దర్శించుకున్నాను. సాహిత్య అకాడమీ ద్వారా వారు చేసిన సేవ అపారం. ఎం.ఎ. విద్యాభ్యాసకాలంలో (1983-85) వారికి బాగా చేరువయ్యాను. వారు ఆకస్మికంగా స్వర్గస్థులైనప్పుడు వారి పార్థివ దేహాన్ని పై అంతస్థు నుంచి కిందికి మోసిన వారిలో నేనొకడిని. వారి "కవిసమయములు" పై విపుల సమీక్ష రాసే అవకాశం కలిగింది. వారి కూతురు అనురాధ నేను 1985లో టీచర్ ట్రైనింగ్ కలిసి చేశాం. ఇంకో కూతురు శ్రీమతి నివేదిత ఉస్మానియా విశ్వవిద్యాలయంలోనే డిప్యూటీ రిజిస్ట్రార్‌గా పనిచేస్తున్నారు. యువభారతి వారు నాకు ఇరివెంటి కృష్ణమూర్తి గారి స్మారక పురస్కారం ఇచ్చి నన్ను కృతజ్ఞతాపాత్రుని చేశారు...

ఆచార్య జి.వి సుబ్రహ్మణ్యం గారితో ఆత్మీయమైన స్నేహం, వారి వాత్సల్యం చివరిదాకా కొనసాగింది. మహతి, లహరులు ప్రచురించేకాలంలో వారు ప్రూఫ్ దిద్దే విధానం, సైకిల్ మీద ప్రెస్సుకు వెళ్లడం, అవసరమైతే తెల్లవార్లు కూర్చుని పని చేయడం, వారి శ్రమ జీవితాన్ని గురించి మిత్రులు గొప్పగా చెప్పగా అబ్బుర పడి విన్నాను. తిరుమల తిరుపతి దేవస్థానం మహాభారతం వ్యాఖ్యానరచన, అచ్చుతప్పుల సవరణ తీరు నేను స్వయంగా చూశాను. సభారణ్యపర్వాల అచ్చుతప్పుల సవరణల్లో నేనూ పాల్గొన్నాను. ఆ విషయాన్ని భారతం సంపుటాల్లో వారు నమోదు చేశారు కూడా.

1995లో యువభారతి పక్షాన విశ్వనాథశతజయంతి ఉత్సవాలు జి.వి సుబ్రహ్మణ్యం గారు ప్రధాన సూత్రధారిగా ఏడాది పాటు వైభవంగా జరిగాయి. ప్రతినెలా జరిగే సభలో ఒక పెద్దాయన, ఒక యువకుడు నిర్దిష్టాంశం పై తయారయి సీరియస్ గా ప్రసంగించాలి. ఒకరిద్దరు కవిత్వం చదువాలి. ఇది జీవి సుబ్రహ్మణ్యం గారు వేసిన ప్రణాళిక. నన్ను ఏదైనా మంచి అంశం చూసుకొని తయారుకమ్మన్నారు. ఒక్క క్షణం ఆలోచించాను. విశ్వనాథ సంప్రదాయం, జీవన వేదన అంటే తుమ్మపూడి కోటేశ్వరరావు లాంటి పెద్దలు పోటీకి వస్తారు. ఛందస్సు అంటే కోవెల సంపత్ కుమార సిద్ధమంటారు. జీవుని వేదన అంటే కోవెల సుప్రసన్నాచార్య, జాతీయాభిమానం

అంటే ఏలూరిపాటి అనంతరామయ్య, వివిఎల్ నరసింహారావు లాంటి దిగ్గంతులు పోటీకి వస్తారు. ఈ పెద్దల పోటీ నుండి నేను తప్పుకోవాలంటే ఎవరికీ తోచని విలక్షణ విషయం తీసుకోవాలి అని "హాస్య చతురుడు విశ్వనాథ" అని మాట్లాడుతానని చెప్పాను.

జి.వి.సుబ్రహ్మణ్యం గారు సంతోషంగా అంగీకరించారు. 15 నిమిషాల ప్రసంగానికి ఓ ఐదారు పుటల సమాచారం దొరికితే చాలనుకొన్నాను. కానీ మొదట అది కూడా దొరకడం కష్టమైంది. ఒకరిద్దరు బుజ్జగించారు. రెచ్చగొట్టారు. జూలు దులిపాను. విశ్వనాథ హాస్యం రాయడం మొదలు పెడితే దాదాపు 13 అధ్యాయాలతో 60 పేజీల ముద్రిత వ్యాసం అయి కూర్చుంది.

నా వ్యాసం ప్రభావంతో ఉస్మానియా తెలుగుశాఖలో ఒకరు పిహెచ్.డి కూడా చేశారు. యువభారతి ఆ శతజయంతి ప్రసంగపత్రాలను, కవితలను కలిపి "విశ్వనాథ సాహితీసమాలోచనం" పేరుతోమంచి రిఫరెన్స్ గ్రంథాన్ని ముద్రించింది. వివేచన, జాగృతి, తెలుగు అకాడమీ వారి తెలుగుపత్రికల్లో కొన్ని కొన్ని భాగాలుగా వచ్చింది. కృష్ణాజిల్లా రచయితల సంఘం వారి "విశ్వనాథ విశ్వరూపం"లో నా "హాస్యచతరుడు విశ్వనాథ" వ్యాసం సమగ్రంగా వచ్చింది. కొన్నిసభల్లో మాట్లాడే అవకాశం కూడా వచ్చింది. యువభారతి ఇచ్చిన అవకాశం, అందించిన ప్రోత్సాహంతో ఎవరూ తాకని విశ్వనాథ హాస్యచతురత అనే అంశంపై సుదీర్ఘ వ్యాసం రాసే అవకాశం నాకు లభించింది అని ఎప్పుడు సంతోషిస్తాను. పైగా అది అందరి మన్నన లందుకుంది. వెలిచాల కొండలరావు గారు సంతోషించి ప్రముఖ రచయిత ఎలనాగ గారితో ఆంగ్లంలోకి అనువదింపజేసి ప్రచురించారు.

నేను హైదరాబాద్ వచ్చాక యువభారతి వారి పెద్ద మీటింగ్ చూసింది ఒకటే డా.సి.నారాయణరెడ్డి గారు తెలుగు కవిత్వం: లయాత్మకత ప్రసంగాలు. "తెలుగు కవిత్వం: లయాత్మకత" పుస్తకాన్ని యవభారతి వారు ప్రచురించారు. ఫణిహారం వల్లభాచారి, బూదరాజు రాధాకృష్ణ వ్యతిరేకాత్మక సమీక్షలు రాశారు. జివి సుబ్రహ్మణ్యం గారు సమర్థిస్తూ రాసిన వ్యాసంలో బూదరాజు రాధాకృష్ణగారిని బూ.రా అని సంబోధించారు. వెంటనే వచ్చిన బూదరాజువారి ప్రతి విమర్శ వ్యాసంలో జి.వి. సుబ్రహ్మణ్యం గారిని "గూ.సు" (గూడా సుబ్రహ్మణ్యం) అని సంబోధించడం గుర్తుకొస్తుంది. ఇవన్నీ ఒక సంస్థ చారిత్రక గమనంలోని మైలు రాళ్ళే. తీపి గురుతులే.

తిరుమల శ్రీనివాసాచార్యులు యువభారతి అధ్యక్షులు అయ్యారు. వారు నిలువెల్లా సౌజన్యం మూర్తీభవించినవారు. వారొక "సాహితీసుధానిధి". గుండె లోతుల్నుంచి "ఏం నాన్నా!"అని పిలిస్తే ఒళ్ళంతా ఒక ఇక్షు సముద్రమవుతుంది. వారి 60,70, 80 జన్మదినోత్సవాలకు వ్యాసప్రసూనాలను కానుకగా ఇచ్చి సంతోషపరిచాను. యువభారతి122వ ప్రచురణగా 1988లో వెలువడినవారి సిద్ధాంతగ్రంథం "తెలుగులో గేయనాటికలు" పై వ్యాసం రాశాను.... యువభారతి 38 వ వార్షికోత్సవాల సందర్భంగా "హాస్యలహరి" ప్రసంగాలు ఏర్పాటు చేశారు. పోలాప్రగడ సత్యనారాయణమూర్తి గారిని పానుగంటి లక్ష్మీనరసింహారావు సాక్షి మీద మాట్లాడమని అడిగారు. కానీ అకస్మాత్తుగా వారు అస్తమించారు. ఎవరో ప్రత్యామ్నాయంగా నా పేరు సూచించారు.

యువభారతిలో చురుకైన సభ్యులైన కామేశ్వరరావు గారు నన్నడిగారు. అదే మొదటిపరిచయం. కె.బి.లక్ష్మి, కామేశ్వరరావు దంపతులతో అలా పరిచయమైంది. ఈరోజు ఆ దంపతులు లేరు. కామేశ్వరరావు గారి తెల్లగడ్డం, తెల్లని చిరునవ్వు ఇప్పటికీ మనసులో మెదులుతుంది. కె.బి లక్ష్మి నన్ను ఎంతో ఆప్యాయంగా "తమ్మీ" అని పిలిచేది. వారి జంట యువభారతి ప్రారంభసభల్లో ఎంత ఉత్సాహంగా పాల్గొనేదో, ఎంత బాగుండేదో ఆత్మీయంగా కథలు, కథలుగా చెప్పేవారు. అలా పానుగంటిమీద వ్యాసం రాసి ప్రసంగించే అవకాశం నాకు కలిగింది. 8-12-2002న తిరుమల శ్రీనివాసాచార్యులు సభాధ్యక్షులుగా, పొత్తూరు వెంకటేశ్వరరావు ముఖ్యఅతిథిగా ఉన్న సభలో నేను పానుగంటి వారిని గురించి మాట్లాడాను. యువభారతి ఒకప్పటి కార్యదర్శి అయలసోమయాజుల నాగేశ్వరరావు గారి "మరోజంఘాలశాస్త్రి" పునర్ముద్రణ ఆవిష్కరణ సభలో ప్రంగించాను. ఇలా యువభారతితో నా సంబంధ బాంధవ్యాలు, నా జ్ఞాపకాలు స్వల్పమే అయినా సుధామ, ఫణీంద్ర, అనంతా ఆచార్యులు, జీడిగుంట వెంకట్రావు, తాళ్ళపల్లిమురళీధరగౌడ్ మొదలైన వారు (వీరందరిలో నేను కనిష్ఠుడిని) కలిసినప్పుడు యువభారతి ప్రసంగాల ప్రస్తావన, ఆనాటి ముచ్చట్లు "ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమసమూహములు" అన్నట్లు ఎప్పుడూ వస్తూనే ఉంటాయి. మనస్సు ప్రఫుల్లమవుతూనే ఉంటుంది. వజ్రోత్సవానికి సమాయత్తమవుతున్న యువభారతికి నా కైమోడ్పులు! శుభం భూయాత్ !!



# "యువభారతి" కి వందనాలు

శ్రీ టి. ఉదయవర్లు
కార్యదర్శి, శ్రీకృష్ణదేవరాయ తెలుగు భాషా నిలయం
పత్రికారచయిత, హైదరాబాద్, 98856 86415

సుమారు ఐదున్నర దశాబ్దాల క్రితం హైదరాబాద్ నగరంలోని సారస్వత పరిషత్తు ప్రాంగణమంతా అచ్చమైన తెలుగుదనంతో కళ్యాణ మంటపంలా కళకళలాడగా, సాహిత్యోపన్యాస కార్యక్రమాలను కనీ వినీ ఎరుగని రీతిలో 'యువభారతి' సాహితీ సాంస్కృతిక సంస్థ నిర్వహించగా, తెలుగు 'వాణి' కాళ్ళకు పారాణి అద్దుకుని అలవోకగా అడుగులు వేసి, సుమారు పాతికవేల మంది సాహితీప్రియుల హృదయ పథాలపై చెరగని ముద్ర వేసింది.

ఇప్పుడు ఇలా చెబితే ఈనాటి యువకులకు అతిశయోక్తిగా ఉంటుంది కానీ, ఇది పచ్చి నిజం. నేను ప్రత్యక్ష సాక్షిని. పైగా ఆరోజుల్లోనే జర్నలిజంలో అడుగిడిన నన్ను తెలుగు సాహిత్యం వైపు మళ్ళించింది కూడా 'యువభారతి' అని భావిస్తాను.

సాధారణంగా జర్నలిజం రంగంలో కొత్తగా ప్రవేశించినవారికి, తొలుత crime reporting కి అప్పగిస్తారు. ఆ తర్వాత సామాజిక సమావేశాలకు, రాజకీయ నాయకుల బహిరంగ సభలకు, తదితరాలకు పంపిస్తారు. కానీ అదేమి అదృష్టమో గాని, నేను 'ఆంధ్రజ్యోతి' దినపత్రికలో చేరీ చేరగానే 'యువభారతి' సాహిత్యోపన్యాస కార్యక్రమాలు cover చేసే బాధ్యతను అప్పగించారు.

దానితో నేను తొలిరోజుల్లో సాహిత్య సంబంధమైన కార్యక్రమాలు సాంస్కృతిక కార్యక్రమాలు cover చేయడానికి కవులు, రచయితలూ, వివిధ రంగాలకు చెందిన కళాకారులను ప్రత్యేక ఇంటర్వ్యూ లు చేయడానికి పరిమితం చేశాను. ఇలా నా వృత్తి, ప్రవృత్తి ఒకటై పోయాయి.

నిజం చెప్పాలంటే, నాకే కాదు, ఒక తరానికి సాహిత్యాభిరుచిని కలిగించిన, ఆకర్షణీయమైన కార్యాచరణ – "యువభారతి" ది. చదువని వారికి వినే భాగ్యాన్ని,

వినని వారికి చదివే అవకాశాన్ని సైతం కల్పిస్తూ ఆ రోజులలో ఒక వినూత్న సాహిత్యోద్యమానికి "యువభారతి" ప్రాణం పోసింది. హైదరాబాద్-సికిందరాబాద్ జంటనగరాలలోని సాహితీ ప్రియులలో సరికొత్త పఠన చైతన్యాన్ని రేకెత్తించింది.

ఇలా 'యువభారతి' ఆరోజుల్లో లహరీ కార్యక్రమాల శీర్షికన ప్రచురించిన కావ్యలహరి, చైతన్య లహరి, వికాసలహరి, ప్రతిభాలహరి, వేద విజ్ఞాన లహరి, ఇతిహాస లహరి, ఉపనిషత్ సుధా లహరి, సంస్కృత సాహితీలహరి, జగద్గురు సాహితీలహరి, రామాయణ సుధా లహరి, ఆలోచనా లహరి, నవోదయ లహరి, కవితాలహరి వంటి ప్రసంగాలను వినడానికి, ఆ ప్రసంగ పాఠాల గ్రంథాలను కొనడానికి, సాహితీప్రియులందరూ పోటాపోటీలు పడ్డారు.

పైగా ఉత్తమ సాహిత్యాన్ని వీలైనంత తక్కువ ధరకు అందించడం 'యువభారతి' లక్ష్యం ఈ లక్ష్య సాధనకే అది ఎంతగానో కృషి చేసింది.

ఆ రోజుల్లో శ్రీ దివాకర్ల వేంకటావధాని గారు 'కావ్యలహరి' ఉపన్యాస పరంపరకు శ్రీకారం చుట్టగానే యువకులు విశేషంగా ఆకర్షితులయ్యారు. దివాకర్ల వారి ప్రసంగ గుచ్ఛం 'కావ్య లహరి' ప్రథమ ముద్రణ పదకొండువేల ఐదువందల ప్రతులు వేయగా, శ్రీ వానమామలై వరదాచార్యులు గారు ఆ గ్రంథాన్ని ఆవిష్కరించిన రోజునే సుమారు ఆరువేల ప్రతుల దాకా సాహితీ ప్రియులు కొని స్వంతం చేసుకోవడం తెలుగు నేలపై గొప్ప విశేషమే!

ఆ తర్వాతి లహరులలో విశ్వనాథ సత్యనారాయణ, శ్రీశ్రీ, దాశరథి, సి.నారాయణరెడ్డి, ఆరుద్ర, పుట్టపర్తి నారాయణాచార్యులు, వానమామలై వరదాచార్యులు, గుంటూరు శేషేంద్రశర్మ, జి వి సుబ్రహ్మణ్యం, తిరుమల శ్రీనివాసాచార్యులు తదితరుల ప్రసంగాలు ఒకవైపు ఆకర్షించగా వారి ప్రసంగ పాఠాల గ్రంథాలు అత్యధిక స్థాయి అమ్మకాలతో మరోవైపు రికార్డు సృష్టించాయి.

ఆ రోజుల్లో పోతన భాగవతం నుంచి ఏభై రెండు ముత్యాల్లాంటి పద్యాలను తీసుకుని డా. సి నారాయణ రెడ్డి గారు చేసిన మధురమైన వ్యాఖ్యాన గ్రంథం 'మందార మకరందాలు' కేవలం ఐదు వారాల్లో ఇరవై ఐదు వేల ప్రతులు అమ్ముడయ్యాయంటే – గ్రంథ ప్రచురణ, విక్రయాల్లో అదొక మేలి మలుపే. ఆ గ్రంథానికి యువభారతి నిర్ణయించిన మూల్యం కేవలం ఒక రూపాయి.! ఆ తర్వాత ఈ సాహితీ వాహిని పథకంలో రెండో ప్రచురణగా – వేమన్న పద్యాలకు ఆరుద్ర

వ్యాఖ్యానం – 'వేమన్న వేదం' వెలువడింది. దీన్ని కూడా పుస్తక ప్రియులు విరగబడి కొన్నారు.

ఇంకా 'శ్రీనాథుని కవితా వైభవం' , 'తిక్కన కవితా వైభవం', 'పాల్కురికి కవితా వైభవం','నన్నయ కవితా వైభవం', 'ధూర్జటి కవితా వైభవం', 'నన్నెచోడుని కవితా వైభవం','కాళిదాసు కవితా వైభవం', 'పింగళి సూరన కవితా వైభవం', 'అయ్యలరాజు కవితావైభవం','తులసీదాసు కవితా వైభవం','తిరుపతి వేంకటకవుల కవితా వైభవం','పెద్దన కవితావైభవం','కంకంటి కవితావైభవం' మాత్రమే కాకుండా, ఆధునిక కవులు శ్రీశ్రీ, దాశరథి, కుందుర్తి కవితా వైభవాలతో పాటు 'నారాయణ రెడ్డి సాహితీమూర్తి' వంటి మహాకవుల సాహిత్య విశేషాలను వెల్లడించే అనేక గ్రంథాలను ప్రచురించింది.

ఇంతే కాకుండా 'పాతికేళ్ళ పత్రికా రచన', 'గోరా శాస్త్రీయం', 'ఆధునిక సాహిత్యం దళిత స్పృహ', 'స్త్రీవాద ధోరణులు' వంటి అంశాలపై సదస్సులను నిర్వహించి, ఆయా సదస్సులలో సమర్పించిన పత్రాలను పుస్తకరూపంలో ప్రచురించి, 'యువభారతి' ఒక కొత్త ఒరవడిని సృష్టించింది.

ఆ రోజుల్లో ఏడువందల పేజీలకు పైగా విస్తరించిన ఉద్గ్రంథం 'మహతి' ని కేవలం ఏడు రూపాయలకే యువభారతి అందజేయడం ఒక సాహసం. ఇది భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భం గా స్వాతంత్ర్య యుగోదయంలో తెలుగు సాహిత్యం ప్రతి శాఖ లోని రూపరేఖలను తెలిపే వందమంది ప్రముఖుల వ్యాసాల సంకలనం. ఇది సాహిత్య రచనకు ఒక 'reference book' గా ఉపయోగపడుతుందనే లక్ష్యంతో ఈ ప్రచురణను చేపట్టారు. ఈ ప్రతిష్ఠాత్మకమైన ప్రచురణను పునర్ముద్రించి సాహితీ ప్రియులకు 'యువభారతి' మరోసారి అందించింది.

అప్పట్లోనే 'మారుతున్న విలువలు రచయితల బాధ్యతలు' అనే శీర్షికన చర్చా సమావేశాలు ఏర్పాటు చేయడం, సుమారు నలభై ఉపన్యాసాలను 'రచన' వ్యాస సంకలనంగా వెలువరించడం చెప్పుకోదగిందే.

అంతే కాకుండా స్వాతంత్ర్య భారతి తన పాతిక సంవత్సరాల వయస్సులో రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా సాధించిన ప్రగతిని సమీక్షిస్తూ, ఆయా రంగాలలో బాగా అనుభవం ఉన్న ముప్పై నలుగురు ప్రముఖులతో ఇంగ్లీషులో వ్యాసాలు వ్రాయించి ప్రచురించిన గ్రంథం "Free India Forges Ahead" కూడా ఒక reference గ్రంథమే.

ఇలా చెబుతూ పోతే – ఇటీవల 'యువభారతి' ప్రచురించిన 'మహాభారతో పన్యాసలహరి' తో వారి ప్రచురణల సంఖ్య రెండు వందలు దాటింది. వాటిలో ఎంపిక చేసిన కొన్ని గ్రంథాల గురించి సోదాహరణంగా వ్రాయాలన్నా, ఈ వేదిక సముచితమైంది కాదని భావిస్తాను. వీరు ప్రచురించిన అన్ని గ్రంథాలూ – దేనికదే సాటి.

వీరు ప్రచురించిన ఏ ప్రచురణ అయినా పాఠకుల ఆదరణ పొందడానికి కారణం – అది అందంగా, అచ్చు తప్పులు లేకుండా, అపురూపంగా, ఆకర్షణీయంగా ముద్రించడం. అంతకన్నా ముఖ్యంగా, ఆయా గ్రంథాలకు తగు ప్రచారమివ్వడం, సాధ్యమైనంత సరసమైన ధర పెట్టడం. 'యువభారతి' ప్రచురించిన అత్యధిక గ్రంథాలకు ప్రముఖ చిత్రకారుడు శ్రీ శీలా వీర్రాజు గారు ఆకర్షణీయమైన, అర్థవంతమైన ముఖచిత్రాల రూపకల్పన చేయడం. అయితే తెలుగులో పాఠకులపాలిట పెన్నిధులుగా – అణా గ్రంథమాల, విజ్ఞాన చంద్రికా గ్రంథ మాల, దేశోద్ధారక గ్రంథమాల వంటి సంస్థలెన్నో సమకాలీన అంశాలను తీసుకుని, ప్రముఖ రచయితలతో రచనలు చేయించి సరసమైన ధరలకు అందించక పోలేదు.

ఇది ఇలా ఉండగా, మరో వంక తెలుగు భారతికి అత్యంత సేవను చేసిన పుస్తక ప్రచురణ సంస్థ గా వావిళ్ళ వారినే ప్రస్తావించాలి. శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రి "ఆది సరస్వతీ నిలయ ముద్రాక్షర శాల" అనే సంస్థను స్థాపించి, తన సహాయ శక్తులా కృషి చేశారు. తర్వాత ఆయన కుమారుడు వావిళ్ళ వెంకటేశ్వరుల కాలం నాటికి అది వావిళ్ళ ముద్రణాలయంగా రూపు దిద్దుకుని, వావిళ్ళ రామశాస్త్రి అండ్ సన్స్ అనే వారిదే మరో సంస్థ చేయూతలో గుమ్మడి పాదులా తెలుగు నేలంతా వ్యాపించింది. అయితే బర్గర్లు, పిజ్జాలకు అలవాటుపడిన ఈనాటి యువతీయువకులకు గుమ్మడి కాయలు కన్నులకు ఆనక ఆ సంస్థ కనుమరుగైపోయింది.

అటు తర్వాత ప్రస్తావించదగినది– ఒక వంక పుస్తకాలను ప్రచురిస్తూ, మరోవంక 'ఇంటింటా గ్రంథాలయం' లాంటి ఉత్తమ పథకాలతో తెలుగువారిలో కొత్త ఆశలు రేకెత్తించి, పుస్తకాలు కొనడం చదువడం నేర్పించిన యం శేషాచలం & కంపెనీ (ఎమెస్కో). ఇలా ఇంకా ఎందఱో మహానుభావులు ఈ తెలుగు నేలపై లేకపోలేదు, ఐతే ఈ మధ్య అందరూ కూడా 'మూడు అంకెల' ధరలను చిన్న చిన్న పుస్తకాలకే నిర్ణయించడంలో ఎంతో పోటీ పడుతున్నారు.

ఈ పోటీల జోలికి పోకుండా, సామాజికోపయుక్తమైన అనేక సత్సాహిత్య

కార్యక్రమాలను నిర్వహించి సాహితీ లోకంలో చైతన్యం కలిగించాలనే సదాశయంతో 1963 వ సంవత్సరం, విజయదశమి రోజున హైదరాబాద్ నగరంలో 'యువభారతి' సాహితీ సాంస్కృతిక సంస్థ ఆవిర్భవించింది. డా. ఇరివెంటి కృష్ణమూర్తి, డా. జి వి సుబ్రహ్మణ్యం, శ్రీ వంగపల్లి విశ్వనాథం గార్లు తెరవెనుక సూత్రధారులుగా చక్కని కార్యనిర్వహణాదక్షత ప్రదర్శించారు. తెలుగువారికి కావలసిన అనేక అంశాలపై, ఆసక్తిదాయకమైన, అపురూపమైన అనేక గ్రంథాలను ప్రచురించి, అనూహ్యమైన తక్కువ ధరలకు అందించారు.

పాతతరం వారిలో విశ్వనాథం గారు వయోభారాన్ని కూడా లక్ష్యపెట్టకుండా, సంస్థ లక్ష్య సాధన దిశగా ఈనాటికీ పాటు పడుతున్నా, నానాటికీ పెరిగిపోయిన సాంకేతిక సౌకర్యాల కారణంగా యువతీ యువకులలో పఠనాభిలాష అడుగంటిపోయింది. అయినా ఈ 2023 విజయదశమి నాటికి 200 కు పైగా ప్రచురణలతో 60 సంవత్సరాలు పూర్తి చేసుకుంటున్న సందర్భంగా "యువభారతి" కి, దాని కార్యనిర్వాహక వర్గానికి హృదయపూర్వక శుభాకాంక్షలు, వందనాలు తెలుపుకుంటున్నాను.





యువభారతి మహిళా సభ్యులు ఆకాశవాణిలో సాహిత్య కార్యక్రమం సమర్పించిన సందర్భం. చిత్రంలో– కొమరగిరి కృష్ణకుమారి, పి.వి.శారద, కె.పూర్ణచంద్రావతి, ఆచంట అంజలి, సంబరాజు రమాదేవి, డి.నాగలక్ష్మి.

# యువభారతితో నా అనుబంధం

డా॥ ముక్తేవి భారతి
విశ్రాంత ఉపన్యాసకురాలు, రచయిత్రి, హైదరాబాద్
99576 40324

యువభారతి వజ్రోత్సవం అనగానే నా మనసు పరవశించింది. ఆ సంస్థకి ప్రాణం పోసిన కార్యదీక్షా దక్షులు, నిత్యచైతన్య శీలురు, నాకు సాక్షాత్కరించారు. ఈ సంస్థలో ఉన్న శాశ్వతసభ్యులు, గౌరవ సభ్యులలో నా గురువర్యులు దివాకర్ల వేంకటావధాని గారు, సినారె గారు, లక్ష్మీరంజనం గారు, సుబ్రహ్మణ్యంగారు మొదలైనవారే కాక, వంగపల్లి విశ్వనాథంగారు, తిరుమల శ్రీనివాసాచార్యుల వారు, రమణాచారి గారు, రవ్వా శ్రీహరి గారు మొదలైన సాహితీమిత్రులు ఆ సంస్థలో ఉండడం, ఆ సంస్థను కీర్తి కిరీటాలతో నిలబెట్టిందనేది అక్షరసత్యం.

యువభారతి ప్రత్యేకత – ఉపన్యాస లహరీ కార్యక్రమాలను నిర్వహించడం. ఉపన్యాస పరంపరను విని, ఆనందలహరిలో ఓలలాడడం మాతరం వారి మహద్భాగ్యంగా భావిస్తాను. యువభారతి సంస్థలోని సభ్యులందరూ వయసుతో సంబంధం లేకుండా ఎప్పటికీ యువ భారతీయులే. వారు నిత్య సంతోష శీలురు, సాహితీవేత్తలు కావడం యువభారతి చేసుకున్న పుణ్యాల ఫలం. ఈనాటికీ దివాకర్ల వారు మనుచరిత్ర, వసుచరిత్రలలో పద్యాలు ధారాప్రవాహంగా చదివినవి నా చెవుల్లో మారుమ్రోగుతున్నాయంటే అతిశయోక్తి కాదు. ఆ కార్యక్రమాలు నిర్వహించిన ప్రతి ఒక్కరికీ కృతజ్ఞతాభివందనాలు సమర్పిస్తున్నాను.

యువభారతి ప్రచురణలు చాలా ప్రత్యేకమైనవి. పుస్తకం ప్రచురించటం కాదు ముఖ్యం. ఆ పుస్తకం ఎవరికోసం ప్రచురిస్తున్నాము, ఎందరికి ఉపయోగపడుతుంది అన్నది ముఖ్యం. 200 కు పైగా పుస్తకాలు ప్రచురించబడడం గొప్ప విషయం. యువభారతి ప్రచురణల్లో శిఖరాయమానమైంది – 'మహతి'. 50 సంవత్సరాల క్రితం భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా ముద్రితమై, ఎందరికో స్ఫూర్తిదాయకమే కాక, రెండవ ముద్రణ భాగ్యాన్ని పొందింది. మహతి 1947 –

– 1972 వరకు మహనీయుల సమీక్షా వ్యాసాలతో, ఒక విధంగా తెలుగు సాహిత్యపు తీరు తెన్నులపై వెలువడిన విజ్ఞాన సర్వస్వం అంటే అతిశయోక్తి కాదేమో!

'మహతి' చేసుకున్న మహాభాగ్యం ఒకటి చెప్తాను. ఇప్పుడు యువభారతికి అధ్యక్షులుగా ఉన్న ఆచార్య ఫణీంద్ర సాహితీవేత్త. కార్యనిర్వహణాదక్షుడు. నిత్య చైతన్య యువభారతీయుడు. అతడు 'మహతి' లాంటి వ్యాస సమీక్షా సంకలనం మరొకటి రావాలని తెలుగు సాహిత్య, సామాజిక పరిణామాలపై వ్యాస సంకలనాన్ని (1972–2022) జయరాములు సంపాదకత్వంలో వెలువరించారు. ఇది భారత స్వాతంత్ర్య అమృతోత్సవ ప్రచురణగా వెలుగు చూసి, యువతరానికి తెలుగు సాహితీ ప్రక్రియలను అన్నింటినీ పరిచయం చేసింది.  మాతరం యువభారతి నుంచి ఆదరాభిమానాలను, సాహితీసంపదను, పంచుకున్నది. ఈ అవకాశం ఫణీంద్ర సారథ్యంలో నేటి యువతరానికి అందుతుందని ఆశిస్తూ ఫణీంద్రకు అభినందనలు, ఆశీస్సులు అందజేస్తున్నాను. అమృతభారతి వ్యాససంకలనంలో '50 సంవత్సరాల తెలుగు కథ' అనే వ్యాసం రాయించి నన్ను గౌరవించాడు  ఫణీంద్ర.

యువభారతితో నాకున్న అనుబంధం మరువలేనిది. నేను, నా భర్త ముక్తేవి లక్ష్మణరావు గారు కలిసి రాసిన 'భారతంలో ప్రేమకథలు' ఆంధ్ర ప్రభ వారపత్రికలో ధారావాహికంగా వచ్చాయి. వాటిని హిందీలో శాంత సుందరి గారు అనువదించి హిందీ "వార్త" దినపత్రికలో ధారావాహికంగా ప్రచురించారు. తరువాత అవి ఢిల్లీ ప్రచురణకర్త చేత పుస్తకంగా ప్రచురించబడింది. అయితే జి వి సుబ్రహ్మణ్యంగారు తెలుగులోని మూలకథలను యువభారతి ప్రచురణగా వెలువరించారు. యువభారతి ప్రచురించడంతో ఆ కథలకు చాలా పేరు వచ్చింది.

ఇదే కాక, యువభారతి 32 వ వార్షికోత్సవం విశ్వనాథ శతజయంతి ఉత్సవ సందర్భంగా వెలువరించిన సాహితీ వ్యాస లహరిలో 'విశ్వనాథ చిన్న కథలు' అన్న వ్యాసం యువభారతి నాచేత రాయించింది. విశ్వనాథ చిన్న కథలు రాశారా? అని ఆశ్చర్యపోయిన వారున్నారు. నేను ఆ పుస్తకాన్ని విశ్వనాథ పావని శాస్త్రి గారి నుంచి సంపాదించి వ్యాసం రాసాను.  విశ్వనాథ ఎంత సంప్రదాయవాది అని అనుకున్నా, ఇందులోని కథలు ఆధునిక దృక్పథంతో రాసినవి. వాటిని చదువడం, వాటిపై వ్యాసం రాయడం నాకు గొప్ప అనుభూతి.

ఇరివెంటి కృష్ణమూర్తి గారు నాచేత 'చిలకమర్తి కవితావైభవం' అన్న చిన్న పుస్తకం రాయించి, యువభారతి ప్రచురణగా తీసుకొచ్చారు. చిలకమర్తి సాహిత్య సేవపై పరిశోధన చేసిన నాకు, యువభారతి ప్రచురణగా ఈ పుస్తకం వెలుగుచూడడం నాకెంతో ఆనందాన్నిచ్చింది.

ఎన్నో యువభారతి ప్రచురణలు పునర్ముద్రణకు నోచుకున్నాయి. కొన్ని రెండు మూడు ముద్రణలు అయ్యాయి. కొన్ని 5 ముద్రణలు కూడా అయ్యాయి. 'వాగ్భూషణం భూషణం' అనే ఇరివెంటి వారి పుస్తకం నేటి యువతరానికి చాలా అవసరం. వక్తృత్వం ఒక కళ. ఆ విషయంపై రామాయణంలో ఆంజనేయుల వారి వక్తృత్వాన్ని అభినందించాడు శ్రీ రాముడు. ఈ పుస్తకంలో కృష్ణమూర్తిగారు యువతకు మంచి సందేశాన్నిచ్చారు. "ఎక్కువ చదువుకోలేదని సభలో ఒక మూల నక్కి కూర్చోకండి. మీకూ ఒక వచనశైలి ఉందని, మీకూ ఒక ఆలోచనా పద్ధతి ఉందని మరవకండి. మీ దృక్పథాన్ని అందరిముందూ పెట్టే అధికారం మీకుందని తెలుసుకోండి. సరళమైన భాషలో మీ భావాలను ప్రకటించడానికి ప్రయత్నించండి." యువతరం దీన్ని అర్థం చేసుకుంటే ప్రతి వ్యక్తీ గొప్ప వక్త అవుతాడు కదా !

'ప్రజాసూక్తం' 1973 లో సుబ్రహ్మణ్యం గారి నేతృత్వంలో ప్రచురింపబడి, నాలుగు ముద్రణలు పొంది, 15,000 ప్రతులు అమ్ముడుపోయిందంటే యువతకు ఈ ప్రచురణలు ఎంత దగ్గరవుతున్నాయో తెలుస్తుంది. 5 వ ముద్రణ 2012 లో వెలువడింది. అవి 2000 ప్రతులు అమ్ముడు బోయాయంటే ఆశ్చర్యమే.

"భావన" నూరు అంశాలపై 500 సుభాషితాల సంకలనం. మొదటి ముద్రణలో 3200 ప్రతులు, రెండవ ముద్రణ లో 2,000, మూడవ ముద్రణలో 1,000, నాల్గవ ముద్రణలో 1,000 ప్రతులు అమ్ముడయ్యాయంటే ఇది యువభారతి పేరులోని విశిష్టతే!! 'గాంధీ మహాత్ముని సూక్తులు' గాంధీ 150 వ జయంతి సందర్భంగా 150 సూక్తులతో యువభారతి ప్రచురణగా 2019 లో 4000 ప్రతులతో అనేకులను చదివించింది.

యువభారతిలో ముఖ్య కార్యకర్త వంగపల్లి విశ్వనాథం గారు నేటి యువత కోసం వ్యక్తిత్వ వికాస తరగతులు ఎన్నో సంవత్సరాలుగా నిర్వహించారు. యువభారతి లక్ష్యాలలో ముఖ్యమైనది యువతకు మార్గదర్శకత్వంగా నిలచే విభిన్నమైన సూక్తి ముక్తావళులు అందించి వారిని ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దడమన్నది.

యువభారతి సంస్థ ఇప్పుడు ఆచార్య ఫణీంద్ర సారథ్యంలో పెద్దల, అనుభవజ్ఞుల సలహా సంప్రదింపులతో దిన దిన ప్రవర్ధమానమై చిరంజీవిగా వర్ధిల్లాలని ఆశిస్తూ సంస్థ లో కృషి చేస్తున్న ప్రతి ఒక్కరికీ నా అభినందనలు.



# అఖండ సాహితీ జ్యోతి 'యువభారతి'

డా॥ కె.వి. కృష్ణకుమారి
రచయిత్రి, వైద్యురాలు, హైదరాబాద్
79959 19809

ఎన్నో, సాంస్కృతిక, సాహితీ, వైజ్ఞాన సంస్థలు ఆవిర్భవిస్తాయి, ఆవిర్భవిస్తూనే వున్నాయి. దశాబ్దాలుగా – హర్షణీయంగ – అభినందనలను అందుకుంటూనే వున్నాయి. ఐతే కాలక్రమంగా – క్రమక్రమంగా, నైతిక విలువలు అన్నిరంగాలలోనూ , క్షీణదశకు చేరుకుంటున్న – ప్రస్తుత సమయంలో ఆరోగ్యకరమైన వ్యవస్థకోసం, సాహితీపరమైన, మనోవికాసాన్నీ , మానసిక పరిపక్వతనీ, సంస్కృతీ, సహకారాలనూ, శక్తికి మించి అందించాలన్న తపనతో, మాననీయ సంస్కృతులనూ, విశ్వప్రేమ తత్త్వాన్నీ, నిర్మల, నిస్వార్థ, అంతరంగ సౌరభాలనూ. ప్రేమా, దయా, త్యాగం, క్షమా, సౌశీల్యం మొదలైన సౌహార్ద్ర; సత్శీల సంపదలను, యువత హృదయాలలో సుస్థిర పరచాలనీ, స్వార్థం, ఈర్ష్యా ద్వేషం, అసూయా తులయత విద్వేషాలనూ పారదోలి, యువ మస్తిష్కాలను, పునీతం చేయాలనీ, వారివారి అంతరంగాలలో అంతర్యామిని, ఆవిర్భవింప జేయాలని తద్వారా, మరింతగా దేశప్రగతికి స్ఫూర్తిదాయకం కావాలనీ ఆరాటంతో పవిత్రసంకల్పంతో, మాననీయ, మహోన్నతుల, సంకల్ప ఫలంగానే ఫలితంగానే 1963 సం॥లో సెప్టెంబర్ 28వ తేదీన విజయదశమి రోజున 'యువభారతి' ఆవిర్భవించింది. సత్సంకల్పం సఫలీకృతమైంది.

పూజ్యశ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారు అధ్యక్షులుకాగా – కన్వీనర్‌గా యువభారతిని భుజస్కంధాల పైన వేసుకుని 60 సంవత్సరాలుగా ప్రగతి పథం వైపుకు పయనిస్తున్న మరొక ముఖ్య వ్యక్తి పూజనీయులు ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు.

యువభారతి అరుదైన, సాహితీ సాంస్కృతిక సంస్థ, ఎన్నో సాహితీ ప్రసంగాలు. సాహితీ స్రష్టల, అరుదైన, అర్థవంతమైన, ఆచరణ యోగ్యమైన, అమూల్యమైన, విశ్లేషణాత్మకమైన, వినూత్నమైన, ఆధ్యాత్మిక పరమైన, ప్రయోగాత్మకమైన, ప్రసంగాలూ, ప్రవచనాలూ, వింటున్నవారిని పులకాంకితులను జేసేవి. మనసులను, వివేచనలకూ

అంతర్మథనాలకూ, తావిచ్చేలాచేసి, ప్రక్షాళనదిశగా పయనింపజేస్తూ, హృదయ నైర్మల్యాన్ని పెంపు జేసేవి. వారు ఉచ్చరించిన – ఉచ్చరిస్తున్న అక్షర సత్యాలు అక్షయాలై అక్షర రూపాలై అందాల రూపాలలో వెలువడి – అసంఖ్యాకులకు మార్గదర్శకులై, తెలుగు భాషలో పయనింపచేస్తున్నాయి.

వక్తృత్వం, రచనాపాటవం సద్గ్రంథ పఠనం, యువభారతి సభ్యులలో, వారివారి ఆత్మీయ ఆత్మబంధువులలో నిత్యకృత్యాలలో, అత్యంత ప్రాముఖ్యత వహించేలా, నిర్విరామంగా కృషిచేయటం " యువ భారతి ", ప్రధాన ఆశయం. ఈ నేపథ్యంలోనే, అర్థవంతమైన, అత్యున్నత విలువలు గల సాహిత్యం, ప్రాచీన సాహిత్యం, వెలుగులోకి వచ్చాయి. ఆవిర్భవించబడ్డాయి. అన్నీ విలువ కట్టలేనివే. భావాలకూ, భాష్యాలకూ అందనిదే. ఉదాహరణకు 'ఉపనిషత్సుధ'ను శ్రీ ఇలపావులూరి పాండురంగారావుగారు రచించారు. ఉపనిషత్తులలోని రహస్య సారాంశాలనూ – ఆత్మాపరమాత్మా తత్త్వాలతో ఏర్చి కూర్చి అందజేశారు. శ్రీవిశ్వనాథ సత్యనారాయణ, శ్రీశ్రీ, జి.వి.సుబ్రహ్మణ్యంగారు మొదలైనవారితో, నూరుగురు ప్రసిద్ధాంధ్ర రచయితల రచనలతో, వెలువడిన 'మహతి' 'వ్యాససంహిత' స్వాతంత్ర్య రజతోత్సవ ప్రచురణగా ఉద్భవించి యువభారతినే కాదు– సర్వులనూ ఉత్తేజభరితులను చేసింది, అత్యంత ఆసక్తిదాయకంగా, నిబద్ధత గల ప్రేరణలతో, విలువైన పుస్తకాలను, ఆవిష్కరించగలగటం– ఒక్క 'యువభారతి'కే సాధ్యమని ఆచార్య సి.నారాయణరెడ్డి గారు తరచుగా ప్రశంసించేవారు.

న్యాయశాస్త్రకోవిదులు, జస్టిస్ ఎ.రామలింగేశ్వరరావు గారికి యువభారతితో వున్న అనుబంధం దృష్ట్యా, సాహితీపరమైన, సమాజపరమైన, 'యువభారతి' సేవలను గురించి నాతో ఆత్మీయ స్పందనలను పంచుకునేవారు.

అన్ని సంస్థలకు భిన్నంగా, అతిథులను భాగస్వాములను చేయటం వేదికపైన మాట్లాడించటం, అరుదైన కుటుంబ వ్యవస్థగా, యువభారతిని తీర్చిదిద్దటం – 'నభూతోనభవిష్యతి' అంటూ ఆర్ద్రంగా, మనసు విప్పి చెప్పుకునేవారు సుధామగారు.

ఇక ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారి గురించి – 'యువభారతి' పరంగా ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. ఆయన ఊపిరే యువభారతి. 60సం౹౹ వయస్సు గల 'యువభారతి' ఇప్పటికీ, ఎప్పటికీ, యౌవనపటుత్వాన్నీ, అర్థవంతమైన అంతరంగపు ఆలోచనలనీ, దేశభక్తి పూరితమైన హృదయనైర్మల్యాన్నీ, పట్టువిడవని, నిరంతర సాహితీ సమాలోచనలనీ, నిర్విరామ సద్గ్రంథ పఠనా ప్రాభవాన్నీ, సమాజ పరమైన ఉత్తమాదర్శ, పథకాల నిర్వహణా శైలినీ, మరింతగా మరింతగా వయసుతో బాటే, ఉత్తేజపూరితం చేస్తూ, మానసిక ఔన్నత్యాన్ని, వయసును మించి, అత్యున్నతంగా,

ద్విగుణీకృతం చేస్తూ, ఈనాడు అసంఖ్యాకుల హృదయ నీరాజనాలను అందుకుంటోంది.

నేను కింగ్‌కోఠీ జనరల్ హాస్పిటల్‌లో 1980లో ఆసిస్టెంట్ సివిల్ సర్జన్‌గా, ఉద్యోగ బాధ్యతలు స్వీకరించకముందు నుంచే, తెనాలి, గుంటూరు, కాకినాడలలో వైద్యవృత్తిని కొనసాగిస్తూనే, సాహితీపథంలో పయనిస్తున్న సమయంలోనే, 'యువభారతి'ని గురించి వింటూ ఉత్తేజభరితురాలనయే దానిని.

వృత్తిపరంగా హైదరాబాద్ వచ్చాక 'యువభారతి' కార్యక్రమాలలో పాల్గొనాలనే నా ఆకాంక్షను, వృత్తి ప్రవృత్తి పరమైన బాధ్యతలు, సమయాన్ని కేటాయించలేక పోయాయి. యువభారతిలో సభ్యురాలు, శాఖాయుత బాంధవి నన్నెంతగానో అభిమానించే ప్రముఖ రచయిత్రి కె.బి.లక్ష్మి, ఒక సందర్భంలో, "కృష్ణక్కా! యువభారతి కార్యక్రమం వుంది. వీలు చూసుకుని నువ్వు తప్పకుండా రావాలి. ఆ సంస్థకు వెన్నెముక లాంటి వ్యక్తి ప్రొఫెసర్ వంగపల్లి విశ్వనాథం గారికి, నువ్వు వస్తావని చెప్పాను. నిన్ను అడక్కుండానే" అన్న లక్ష్మి మాటలకు నా కళ్ళు చెమర్చాయి. వెంటనే బయలుదేరాను. ఆ సభావేదిక ఎంతో పవిత్రంగా కన్పించింది. సభికులూ, సాహితీ, సాంస్కృతిక మూర్తులతో, వారి నిర్మల హృదయ స్పందనలూ, అంతరంగ వీచికలూ – ఆంతర్యామిని స్పందింపజేశాయి.

విశ్వనాథంగారు నన్ను వేదిక మీదకు ఆహ్వానించారు. ఉద్వేగభరితంగా ప్రసంగించాను. ఎప్పటినుంచో, యువభారతి సభ్యత్వాన్ని, గుప్తంగా గుండెల్లో దాచుకున్న నేను – అప్పట్నుంచీ ఆ సాహితీ వేద భారతిలో, శాశ్వత కుటుంబసభ్యురాలి నయ్యాను. ఆ పుణ్యం, నా ప్రియసోదరి కె.బి.లక్ష్మికే చెందుతుంది. సాహితీమూర్తులు, దాశరథిగారు, సుధామగారూ, ఇరివెంటి కృష్ణమూర్తిగారూ, ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారూ, డాక్టరు కె.వి.రమణాచారిగారూ, మొదలైన వారి ప్రసంగాలను హృద్యంగా వినేదానిని. సాహితీ స్రష్టలు, ఎందరో – ఎందరో ఆవిష్కరింపజేసిన ఆరాధ్యనీయ సంస్థ యువభారతి ఈ రోజున 60 వసంతాలు పూర్తి చేసుకుంటోంది. అంటే ఈ అమూల్య సమయంలో ఎన్ని లక్షలమంది, సాహితీ, వైద్య, సామాజిక, ఆధ్యాత్మిక రంగాలలో నిష్ణాతులయ్యారో, అభ్యుదయ, అభ్యున్నతితో, ముందంజ వేసి ఉంటారో – అనూహ్యం. వ్యక్తిగతంగా – దైవపరమైన నా అనుభవాన్ని ఈ సందర్భంలో చెప్పాలనిపిస్తోంది. "భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయి, నన్ను ఆదేశించి, ప్రేరేపించి, 'భద్రాకళ్యాణం' అనే ఆధ్యాత్మిక గ్రంథాన్ని నా చేత లిఖింపజేసారు. దుర్గాష్టమి రోజున కలం పట్టుకున్నాను. ఎదురుగా స్వామి చిత్రపటంలో, విచిత్రమైన వెలుగులో

ద్వాపరయుగంలోని దృశ్యాలు కన్పిస్తుండగా, నా రచన శరవేగంగా సాగిపోయింది. భద్రాదేవి శ్రీకృష్ణుని ఏడవ భార్య. ఆత్మపరమాత్మా సంయోగానికి, వారి అనుబంధం నిజమైన నిదర్శనం.

ఏరోజుకారోజు వ్రాస్తున్నా నాలో ఏవో సందేహాలు కలిగేవి. చిత్రం !!! దైవసంకల్పానుసారం 'యువభారతి' సారథి శ్రీవంగపల్లి విశ్వనాథంగారు, నాముందు సాక్షాత్కరించారు. ఏం వ్రాస్తున్నానో తెల్సుకుని, నా సందేహాలు తీర్చే బాధ్యతను స్వీకరించారు. ఈ నేపథ్యంలోనే యూనివర్శిటీలో పని ముగించుకుని – మా ఇంటికి వచ్చి ఏరోజు వ్రాసినవి ఆ రోజు విని అద్భుతమైన, విశ్లేషణాత్మకమైన సలహాలను అందించేవారు. విశ్వనాథంగారి వాక్కులో, నేను స్వామివాక్కునే విన్నాను. స్వామి తేజస్సునే చూడగలిగాను. దాదాపు నెలరోజులలో 360 పేజీలు పూర్తయ్యాయి.

పుట్టపర్తిలో స్వామి నా దగ్గరకు వచ్చి "చాలా బాగా వ్రాశావు బంగారూ... అది సరే. ఈ గ్రంథం నువ్వు వ్రాశావా? నేనే వ్రాశానా?" అని ప్రశ్నించారు ఆహ్లాద భరితంగా – అప్పటినుండీ, విశ్వనాథం గారు నాకు పరమాత్మీయ, పరమాత్మ బంధువులయ్యారు. 'భద్రాకళ్యాణం' ఇప్పుడు 40వ ముద్రణలోకి వచ్చింది. ఈ అరుదైన అదృష్టంలో, మేమిద్దరం భాగస్వాములమే.





సుధామ, నాగినేని భాస్కరరావు 'మేం' కవితా సంకలనం ఆవిష్కరణ సభ

# స్పందన

డా॥ శ్రీరంగాచార్య
పండితులు, విశ్రాంత ప్రాచార్యులు
హైదరాబాద్, 92994 51266

'చుట్టూరా ఆవరించుకొని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది' అనే సూక్తిని అక్షరాలా విశ్వసించి - మన తెలుగు జాతికొక సాహిత్య 'జ్యోతు'లను వెలిగించి, చరితార్థమైన 'యువభారతి' ని గురించి వ్రాసుకుంటే అదే ఒక సంగ్రహ సాహిత్య చరిత్ర కాగలదు.

'యువభారతి' సంస్థ 1964లో రిజిస్టరయింది. అప్పుడు, నేను నల్లకుంటలోని ఆంధ్ర ప్రాచ్యకళాశాల విద్యార్థిని, ఐనా మా.వే.నరసింహారెడ్డి అనే మిత్రుని వల్ల ఈ సంస్థను గూర్చి తెలుసుకున్నాను. సికింద్రాబాద్ కింగ్స్‌వే అడ్రసులో ఆరంభమైన-'యువ భారతి' ప్రౌఢభారతిగా తిలక్‌రోడ్‌లోని ఆంధ్ర సారస్వత పరిషత్‌లో సాహిత్యకాంతులను వెదజల్లుతున్న సమయాల్లో - నావంటివారు సన్నిహితులైనారు. ఆనాడు యువభారతిలో సభ్యత్వం కల్గియుండటం ఒక గొప్ప గౌరవంగా భావింపబడేది. ప్రారంభ దశలో ఈ విధమైన గౌరవాన్ని పొందిన వ్యక్తుల్లో నేనొకణ్ణి అయినందుకు ఎంత ఆనందించేవాణ్ణో చెప్పలేను.

అప్పట్లో 'యువభారతి'కి శ్రీయుతులు - ఇరివెంటి కృష్ణమూర్తిగారు, డా॥ జి.వి.సుబ్రహ్మణ్యంగారు, దివాకర్ల - సి.నా.రె, దేవులపల్లి-ప్రభృతులు మూలస్తంభాలైనారు. ఇక మన వంగపల్లి విశ్వనాథంగారు-సరే సరి.

అప్పట్లో కార్యకర్తలుగా వున్న - సుధామ (అల్లంరాజు వెంకటరావు) పరిషత్ ప్రాచ్య కళాశాల విద్యార్థి. అట్లే తాళ్ళపల్లి మురళీధరగౌడు బి. కాం - విద్యార్థి. ఇట్లే ఇంకా ఎందరో! ఈనాడు అప్పటి కార్యకర్తలను చూస్తుంటే - భవభూతి చెప్పిన 'పురాయత్ర స్రోతః పులిన.... ' శ్లోకం గుర్తుకు వస్తుంటుంది. పరిమిత కార్యకర్తలతో 'చిన్నదీపాన్ని వెలిగించి వెలుగునింపే ' యత్నం చేస్తున్న మన యువభారతి ...వారి పట్టుదల- నాటిరోజుల్లో అభినందనీయమే గదా!

నేను 1996 నుండి - పాలెం ప్రాచ్యకళాశాలలో పనిచేస్తున్నందున - సంస్థ కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొన లేదు. ఐనా- ఇరివెంటివారు, వంగపల్లివారు ఇంకా ఎందరో మిత్రుల వల్ల - 'యువభారతి' విశేషాలు తెలుస్తుండేవి. వీరు

నిర్వహించిన-పుస్తక చర్చ, క్లుప్త గోష్ఠి, వక్తృత్వం, నా ఊహాపథంలో, స్వీయ రచనల పఠనం; పుస్తకపఠనం; అనే ఈ శీర్షికలు - మన యువత యందు, అందులో గ్రామీణ ప్రాంతాల నుండి వచ్చి నగరంలో వుంటున్న వారిని - ఎంత చైతన్య పరచిందో? చెప్పలేము. ఇదంతా భగీరథ ప్రయత్నమే గదా! వీటితో పాటు 'యువభారతి' పత్రికా నిర్వహణ' ఇట్లా 'అసిధారావలేహన' కార్యక్రమనిర్వహణ - స్వార్థరహిత - సమాజహిత - సాహితీహిత - మనస్కులకే చెల్లుతుందని వీరిని గమనిస్తే తెలుస్తుంది.

అప్పుడున్న ధనం విలువను బట్టి తక్కువ ధరకే సాహిత్య గ్రంథాల నందించటం వీరు ముద్రణలో తెచ్చిన గొప్పమార్పు - లేకుంటే అనుముల కృష్ణమూర్తిగారి 'సరస్వతీ సాక్షాత్కారం', కాళోజీ తెనిగించిన ఖలీల్‌జిబ్రాన్ 'జీవనగీత' కేవలం రెండు రూపాయిలంటే ఎంత ఆశ్చర్యం? తరువాత వచ్చే ప్రతి వార్షికోత్సవంలోను విశేషరచనలను వేసి ఆందించటం- ఆట్లా 'వీచికలు', 'రచన' మొదలైన గ్రంథాలు నేటికీ నిరంతర అధ్యయన కోశాలే! అయితే వీటన్నిటినీ మించి ఈ 'యువభారతి' వారు చేసిన గొప్ప ధైర్యయుత సాహితీయజనాల్లో కావ్యలహరి (1971), చైతన్యలహరి (1972) అనే ప్రసంగ వ్యాస గ్రంథాలు.

ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాంగణం - వెనుక వైపు. ఇప్పటి భవనాలేవీలేని ఖాళీస్థలం- అక్కడ-కావ్యలహరి ప్రసంగాలు - 1971 - జులైలో ఆరంభమై సెప్టెంబర్ 12న పూర్తయినాయి. సుప్రసిద్ధులైన-శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు - శృంగారనైషథం, మనుచరిత్ర, పారిజాతాపహరణ, వసుచరిత్ర, విజయవిలాసం - అనే రసవత్ ప్రబంధాల గూర్చిన ప్రసంగాలకు విచ్చేసిన సాహిత్య వ్యక్తులతో ఆ సభాస్థలి నుండి ప్రక్కలవెంట నిలబడేవారంటే-అవధానిగారి సూక్తివైచిత్రితో పాటు 'యువభారతి' వారి ప్రయత్నం అందరి అభిమానాన్ని పొందగలిగింది. నేనయితే ప్రతి ఆదివారం - ఈ ప్రసంగంకొరకు పాలెం నుండి వచ్చి ప్రసంగానంతరం రాత్రి బస్సులో వాపసు పోయేవాణ్ణి. ఇట్లా నేనేకాదు-సుదూర ప్రాంతాల నుండి ఎందరెందరోవచ్చి - సాహిత్యాత్మసంవర్ధిత అవధాని వాఙ్మయ యజనస్నాత పవిత్రీకృత పురోడాశ స్వీకృత మనస్కులుగావటం-ఒకసుకృతం-దీంట్లో మరో విశేషం ఏమంటే - ఈ 'కావ్యలహరి' చివరి ప్రసంగంనాడు (12-9-71) ఆవిష్కరింపబడటం. దాదాపు 250 పుటల అందమైన ముద్రణగల ఈ గ్రంథం వెల కేవలం రు. 5=00. ప్రచురణ పూర్వవిరాళం రూ. 2=00 యిచ్చిన వారికి ఉచితంగా ఈయటం. ఇట్లా ఈ ప్రణాళిక నిర్వహణకు ఎంతశక్తి యుక్తులవసరమో! సహృదయులకే విదితం. అవధానిగారి వల్ల యువభారతి, యువభారతివల్ల మన అవధానిగారు ఎంత కీర్తిని పొందినారోగాని

తెలుగువారికి తెలుగు ప్రబంధ పరిచయాన్ని ఇంతకన్నా సులువుగా చేయటం అసంభవమనే ప్రచారానికి అర్హులైనవారు శాశ్వత అక్షరయశస్సంప్రాప్త చిరంజీవులేగదా!

ఇదే పద్ధతి – 'చైతన్యలహరి' (1972లో) వచ్చింది, తరువాత కొద్దికాలంలోనే 'మహతి' (ఒకవీణపేరు) 100 వ్యాసాలు (100 తంత్రులుగా) విభిన్న విషయసముపేతాలై – నేటికీ ఎందరికో రిఫరెన్సు గ్రంథంగానిల్చింది. దీన్ని స్వాతంత్ర్యరజతోత్సవ(1947 –1972) ప్రచురణగా వెలయించటం మరొకవిశేషం, ఇదియువభారతివారి 9వ. ప్రచురణ, సుమారు 700 పుటలు – కేవలం ఇరవై రూపాయిలఖరీదు. ప్రచురణపూర్వవిరాళం 7=00 చెల్లించినవారికి. గ్రంథం ఉచితంగా యిచ్చినారు. ఈ శతతంత్రీయుక్త విపంచిని (మహతి) అప్పటి మన ముఖ్యమంత్రివర్యులు పి.వి.నరసింహారావు గారు ఆవిష్కరించటం – ఇక భాగ్యం. దాదాపు 12000 ప్రతులను ప్రచురించి తెలుగునాట ప్రతి గ్రామానికి చేరేయత్నంచేసిన యువభారతివారి కృషికి ప్రచురణపూర్వవిరాళాలు సేకరించి 'తమ' కార్యంగాభావించిన సాహితీమిత్రులపట్టుదల – కేవలం ఈ'మహతి' కేగాదు 'ప్రచురణపూర్వవిరాళపద్ధతి' గల ప్రతి గ్రంథానికి వర్తించటం, అవి వేలకొద్ది ఖర్చుగావటం తెలుగు నేలమీద ఒక గమనార్హ విషయం.

ఇట్లా 'యువభారతి' కృషి త్రికాలాబాధితంగా నిలుస్తుంది. ప్రబంధకవిత గూర్చిన ప్రసంగాలనేగాక – ఆయా కవుల 'కవితావైభవం' పేరున సుమారు 50 పుటల పరిమితిగల గ్రంథాలు కూడా బాగా వ్యాప్తి చెందినాయి. ఆ పరంపరలో నేను (1981లో ) 'పింగళిసూరన కవితా వైభవం' వ్రాసిస్తే చాలా ప్రశంసలనందింది. నాశక్తిమేర 'యువభారతి' సాహిత్యానికి ప్రచురణ పూర్వవిరాళాలను సేకరించి–కొన్ని వందల పుస్తకాలను మా పాలెం కళాశాల విద్యార్థులకందిస్తే వారిప్పటికీ ఆ కృతులను – గుర్తుచేసుకుని సంతృప్తి చెందుతూ – 'మహతి'ని – వివిధ విషయోపబృంహణ రచనగా – రిఫెరెన్సు గ్రంథంగా వుంచుకున్నారు. ఇది వారి సాహిత్యం పట్టుదల. శ్రీ ప్రతాపరెడ్డిగారు తెలుగు అకాడమీ డైరెక్టర్‌గా వున్నప్పుడు 'మహతి' ని కొద్దిమార్పులతో పునర్ముద్రించి తమ సహృదయతను చాటుకున్నారు.

2022 సం॥లో 'ద్విశత భారతి' పేర అకారాదిక్రమంలో సుమారు 200 పుస్తకాల సంక్షిప్త పరిచయం సచిత్రంగా చేసి, శ్రీ పత్రి అశ్వనీకుమార్ గొప్ప సేవ చేసినారు. ఇది మన 'యువభారతి'కి ఒక కరదీపిక. మనయిప్పటి 'యువభారతి' ఇకముందు కూడా 'యువభారతి' గానే వర్ధిల్లుతూ సాహిత్యకృషి చేయవలెనని నాటి కృతులను కొన్నిటినైనా ముద్రించి–పునః వ్యాప్తి కలిగించగలదని ఆశిస్తాను.



# యువభారతి-తెలుగువారి సాహిత్య చైతన్యదీప్తి

**శ్రీ విహారి**
సాహితీవేత్త, హైదరాబాద్
98480 25600

తెలుగువారి సాహిత్య, సామాజిక, సాంస్కృతిక చైతన్యాన్ని అద్రిప్రోన్నతం చేయాలనే సంకల్పంతో గత 60 ఏళ్లుగా అవిరళంగా కృషిచేస్తున్న సంస్థ యువభారతి.

మహా పండితులు, సారస్వతవేత్తలైన ఆచార్య దివాకర్ల వారి నుండి ఎందరెందరో మహనీయుల భాగస్వామ్యంతో ఎన్నెన్నో విశేష కార్యక్రమాలు చేపట్టి, ప్రణాళికాబద్ధంగా నిర్వహించి, అశేష ప్రజానీకం మన్ననల్ని పొందింది యువభారతి. లహరి ఉపన్యాస పరంపర-ఆనాటి తొలి కావ్యలహరి నుండి నిన్నటి మహాభారతోపన్యాసలహరి వరకూ జయప్రదంగా పూర్తి చేసింది.

మాన్యశ్రీ దివాకర్ల వారి ఉపన్యాసాలకు బందరు నుండి వచ్చి, వినిన వాడిని నేను. ఎందరో సాహితీప్రియులు నావంటి వారు ఉన్నారు. 'ఇసుక వేస్తే రాలనంత మంది'ని ఒక సాహిత్య సభలో చూడటం-అదొక అపూర్వ సన్నివేశం, అదృష్టం. 'మందామకరందాలు' ఒక అద్భుత కార్యక్రమం. డా॥సినారె అందించిన లలిత పదవ్యాఖ్యానం, లక్ష కాపీల పంపిణీ! 'ప్రచురణ పూర్వ విరాళం' అనే వినూత్న అమ్మకం విధానాన్ని తొలిసారి మొదలెట్టి చరిత్ర సృష్టించింది యువభారతి.

ఈనాడు ప్రచురణల సంఖ్య రెండు వందలకు మించింది! వాటిలో ఒకటి నా 'నాటక పద్యాలు' వ్యాఖ్యాన గ్రంథం కావటం నాకు ఆత్మీయమైన అనుభవం. 'రచన', 'మహతి' వంటివి ఎన్నో ఆకర గ్రంథాలు – యువభారతి విజయపతాకలు! బందరులో స్పందన సాహితీసమాఖ్య –గుత్తికొండ సుబ్బారావు, విహారి శాలివాహన, బూదరాజు, పువ్వాడ తిక్కన సోమయాజి, జి.వి.పూర్ణచంద్ మొదలైన మిత్రులతో ఆరంభమైనప్పుడు

– (1972) తొలిసారి ప్రచురించిన 3 పుస్తకాలకు మేము యువభారతి స్ఫూర్తితోనే ప్రచురణ పూర్వ విరాళ పద్ధతినే, ఆ ప్రచురణల్ని జయప్రదంగా వెలువరించాము. 'పక్కా ప్రణాళిక, చిత్తశుద్ధితో దాని నిర్వహణ, ఆదర్శవంతమైన లక్ష్యం, కార్యకర్తల నిబద్ధత – యువభారతికి పెట్టనికోటలు. మహామహులైన సాహితీదిగ్గంతుల సహకారం ఆ సంస్థకు కూకటి బలం!

నంబర్ 5, కింగ్స్ వే లోని నాటి యువభారతి నుండి ఈనాటి తెలంగాణ సారస్వత పరిషత్‌లోని యువభారతి వరకూ నేను చూస్తున్న సంస్థ – ఈనాడు 'షష్టిపూర్తి' జరుపుకోవటం ఎంతో ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నది.

యువభారతి నిత్యచైతన్యంతో, నిండు నూరేళ్ళు తన ప్రస్థానాన్ని సాగించాలని మనస్ఫూర్తిగా ఆకాంక్షిస్తున్నాను. ఇదే, ఉత్తమ తెలుగు సారస్వత ప్రియుల శుభాకాంక్ష కూడా!

'శ్రద్ధయా విన్దతేవసు'! స్వస్తి!!






నృత్యకళాకారిణి రత్నపాప ప్రదర్శన అనంతరం 'యువభారతి' సభ్యులతో శ్రీ రావూరు, శ్రీ మండలి వెంకటకృష్ణారావు (1974)

# సాహిత్య సంజీవనికి శుభాకాంక్షలు!

డా॥ పుట్టపర్తి నాగపద్మిని
విశ్రాంత అసిస్టెంట్ డైరెక్టర్, దూరదర్శన్, హైదరాబాద్
78939 76644

యువభారతికి వజ్రోత్సవ శుభాకాంక్షలు. మా అయ్యగారి సాహితీ త్రివిక్రమ విశ్వరూపాన్ని దర్శించుకునే భాగ్యాన్ని నాకు ప్రసాదించిన యువభారతికి వేనవేల వందనాలు. మా అయ్య నన్ను తన సాహిత్య యాత్రలలో వెంట తీసుకుని వెళ్ళేవారు. అది నా కేవల అదృష్టమే కదా! 'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది' అన్న నినాదంతో 1963 లో ఆవిర్భవించిన యువభారతి, ఆ నినాదాన్ని సార్థకపరుస్తూ ఏర్పాటు చేసిన ప్రసంగ మాలికల ద్వారా, వాటి యథాతథ ప్రచురణలద్వారా లాభపడ్డ వేనవేల యువభారతీయుల్లో నేనూ ఒకదాన్నని గర్వంగా చెప్పుకోగలను.

సాహిత్య అకాడమీ సభల్లో రవీంద్రభారతి ప్రాంగణంలో ఉన్న అకాడమీ కార్యాలయ సమావేశ మందిరంలో సర్వశ్రీ దేవులపల్లి రామానుజరావు, విశ్వనాథ, వానమామలై, మా అయ్య, గుంటూరు శేషేన్, దాశరథి, ఆచార్య నారాయణ రెడ్డి, ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం వంటి ఇంకా ఎందరో సాహితీ విరాణ్మూర్తుల సమీప దర్శనభాగ్యంతో పాటు, వారి ధీరగంభీర గళాలద్వారా వారివారి కవితా వచో విలాసాలను, చమత్కృత సంభాషణా విన్యాసాలను,పాండితీమంత వ్యాఖ్యలనూ ఆశ్చర్య చకితురాలినై వీక్షిస్తూ నిలిచిపోయిన జ్ఞాపకాలు ఇంకా తడిగానే ఉన్నాయి నా మనసులో!

ఇక యువభారతి ఆవిర్భావం తరువాత, యువభారతి ఎంతో నిబద్ధతతో ఏర్పాటు చేసే ప్రసంగమాలికల సమాచారం తెలియగానే కడపలో మా ఇంట్లో మా అయ్య, ఆయా ప్రసంగ పాఠాల వ్రాత ప్రతులను కూడా సిద్ధం చేసుకునే వారు. యువభారతి నియమానుసారం, మళ్ళీ ఆ ప్రసంగ పాఠాలను పుస్తకాలుగా ప్రచురిస్తుంది కదా మరి! ఈ క్రమంలో ప్రసంగపాఠాన్ని వారు డిక్టేట్ చేస్తూ ఉంటే నేను లిపికారిణిగా అయ్య ముందు బుద్ధిగా కూర్చుని వ్రాసే స్మృతులు, ఇప్పటికీ, మళ్ళీ మళ్ళీ నన్ను చైతన్యవంతం చేసే సంజీవనీ దివ్యౌషధాలు. వాటి మేలు ప్రతి మా అమ్మ కనకమ్మగారు తయారు చేసేవారు.

నాకు గుర్తున్నంతవరకు, ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాంగణంలోనే విశాల వేదికపై యువభారతి ప్రసంగ మాలికల సభలూ ఏర్పాటయ్యేవి. కావ్యలహరి, చైతన్యలహరి, ప్రతిభాలహరి ఇత్యాది శీర్షికలతో ఏర్పాటైన సాహిత్యోపన్యాస క్రమంలో మనుచరిత్ర, వసుచరిత్ర, శ్రీకృష్ణదేవరాయలు, శ్రీనాథమహాకవి – ఇలా మా అయ్యగారి పలు ప్రసంగాలు నిజంగా రసానందఝరులే! రాయలసీమ మాండలికంలో సాగే ప్రసంగంలో తాను తీసుకున్న సందర్భాన్ని బట్టి వారి భావ వ్యక్తీకరణ అద్భుతంగా ఆవిష్కృతమవుతూ ఉండేది.

యువతను ఆకర్షించేందుకు హాస్య గుళికలు కూడా చేర్చేవారు. గౌళగాత్రంలో పద్యాలు వారు పాడుతుంటే, ఆ శ్రవణానందమే వేరు. ఈ సభలలో, సారస్వత పరిషత్తు వేదికవద్ద ఖాళీ లేకపోవటంతో, పిట్ట గోడల మీద కూడా కూర్చుని విద్యార్థులు పెద్దల ప్రసంగాలను ఆస్వాదించటం, ఇప్పటికీ నన్నాశ్చర్యపరచే అంశం.

కేవలం అయ్య ప్రసంగాలే కాదు. రెండు రోజులు అయ్యతో పాటే వెళ్ళి, తక్కిన పెద్దల ప్రసంగాలనూ దీక్షగా వినేదాన్ని. ఆ తరువాత, యువభారతి ప్రచురణలన్నీ మా ఇంటికి పోస్ట్ లో వచ్చేవి. ఇంక అప్పుడు నాకు పండుగే పండుగ! జీవనగీత ('68) ద్వారా ఖలీల్ జిబ్రాన్ పరిచయమయ్యాడు. మేం ('74) ద్వారా మా సుధామ కవిత్వంలోని పస తెలిసింది. తిమ్మన కవితా వైభవం ('75), కవితా లత ('76), కాళిదాసు కవితా వైభవం ('76) , కన్నడ సాహిత్య సౌరభం ('81) , తమిళ సాహిత్యం భారతి కవిత('82), వాగ్భూషణం భూషణం ('83), బాబా ఫరీద్ సూక్తులు('86)– ఇలాంటి గ్రంథాలెన్నెన్నో నా భావ విస్తృతికి ఎంతో దోహద పడ్డాయి.

నన్ను యువభారతికి ఋణగ్రస్థురాలిని చేశాయి. ఏ విస్ఫారిత నేత్రాలతో, ఉద్విగ్న హృదయంతో యువభారతి ప్రచురణలను చదివేదాన్నో, ఆ ప్రచురణల్లో ఒకటిగా నేను మా అయ్యగారి గురించి వ్రాసిన 'పుంభావ సరస్వతి– పుట్టపర్తి ' (2019) ప్రచురింపబడటం నా పురాకృత సుకృతమే!

నాటినుండీ నేటివరకూ కూడా ఎంతో అంకితభావంతో తెలుగు సాహిత్య సేవకే అంకితమై, 206 ప్రశస్త గ్రంథాలను సాహిత్యాభిమానులకు అందించటమే కాక, ఇటీవల మేలిమి రచనలను అంతర్జాల ప్రతులుగా అందిస్తున్న యువభారతి యాజమాన్యానికి శతధా మనసారా జేజేలు పలుకటం, అవసరమైతే వదాన్యతతో యువభారతి నాణ్యతను పదిలపరచుకోవటం తెలుగువారిగా మనందరి విధి. ఈ సంస్థ ద్విగుణీకృతోత్సాహంతో ముందుకు సాగాలనీ, రాబోయే తరానికి కొండంత దీపంగా దారి చూపాలనీ ఆశిస్తున్నాను.



# వర్ధతాం యువభారతీ

డా॥ కడిమిళ్ళ వరప్రసాద్
గురుసహస్రావధాని, నరసాపురం
92478 79606

'యువభారతి' ఆ పేరే చాలు. ఒక అందమైన అనుభూతి. అందమైన అర్థం. యువతీ చ సా భారతీ యువభారతీ, అంటే పడుచు సరస్వతి. ఈ సంస్థద్వారా ప్రచురించే పుస్తకాలన్నీ జ్ఞానస్వరూపాలే. అంటే సరస్వతీ రూపాలే. ఆ సరస్వతి నిర్జర. ఎప్పుడూ మిసమిసలాడుతూనే ఉంటుంది. యువజనంకోసమైన భారతి. నిజంగా వీరు ప్రచురించేవన్నీ యువజనులు చదివి తీరాల్సినవి. అందుకనే నావిస్తరంగా ఉంటాయి. కాకమ్మ కథలు వంటివి వేయరు. అందుకనే బాలభారతి కాదు. 'గ్రహణధారణ పటుర్నాలు' అన్న సందర్భం వేరు.

భారతీయ సంస్కృతీ సంప్రదాయాలు నిలబెట్టవలసినది యువజనమే. ఆ సంస్కృతీ సంప్రదాయాలు తెలియాలంటే మహాకవులు వ్రాసిన ఉత్తమ కావ్యాలు, ప్రబంధాలు చదువాల్సిందే. అయితే అతి విస్తృతి కలిగిన కావ్యప్రబంధాలను చదివే ఓపిక కాని, సమయం కాని నేటి యువతరానికి లేదు. ఏదో అందరూ అంటుంటారు నేటి యువతరం అని. కాని ఏనాటి యువతరానికైనా ఉండవు ఓపిక సమయము. ఎందుకంటే కూటికోసం కోటి విద్యలు. ఆ విద్యలు నేర్చుకోవడానికే సమయం సరిపోని యువత రసానందంకోసం మహాకావ్యాలు చదవాలంటే ఏ కాలంలోనైనా కష్టమే.

కొంతమంది ప్రత్యేకంగా సంస్కృతాంధ్రాలే ప్రధానవిద్యగా తీసికొని చదివి ఆ మార్గంలోనే జీవనోపాధిని కల్పించుకోవాలనుకొనేవారు తప్ప మిగిలిన యువతకు సమయం చిక్కదు కదా! కాని రసహృదయం ఉంటుంది. తల్లిదండ్రులు ఇచ్చిన సంస్కారమో, పెరిగిన వాతావరణమో, రసానందాన్ని ఇచ్చే సాహిత్యాన్ని చదవాలనే కోరిక బయలుదేరుతుంది కొంతమందికి. వారు ఎంచుకొన్న చదువులు

చదువుకొంటూనే నడుము నడుము ఆటవిడుపుగా సాహిత్యాన్ని కూడ చదివి, రసానందంతోబాటు సంస్కారాన్ని కూడ పెంచుకొంటారు.

అయితే సమయాభావంవల్ల మొత్తం కావ్యం చదవలేకపోయినా ఆ కావ్యానికి సంబంధించిన ప్రధానవిషయాన్ని తెలిసికోవడానికి ఎక్కువ ఇష్టపడుతుంది యువత, సూక్ష్మంలో మోక్షం కావాలి. అటువంటి వారికోసం నడుము బిగించింది 'సాహితీవాహిని' పేర సుప్రసిద్ధ కవుల, కావ్యాల పరిచయాలను చిన్న చిన్న పుస్తకాలుగా ప్రచురించి యువతకు అందించింది యువభారతి. చిన్నపుస్తకాల ప్రచురణ అనేది ఒక ఉద్యమంలాగ ప్రారంభించింది యువభారతి. సంస్కృత కళాశాలలలో విశ్వవిద్యాలయాలలో చదువుకొనే విద్యార్థులు సాహిత్యో పన్యాసాల పోటీలలో పాల్గొనేందుకు ఈ పుస్తకాలు చాల గొప్పగా ఉపయోగ పడుతుండేవి. ఉపయోగపడుతుంటాయి.

తాత్కాలిక ప్రయోజనం నెరవేరేందుకు చిన్న చిన్న పుస్తకాలు చదివిన యువతకు ఆ వ్యాసముల ద్వారా కావ్యాలు లేదా ప్రబంధాలలోని విశేషాలు తెలిసికొని ఎప్పటికైనా మొత్తం చదువాలన్న ఆకాంక్ష బయలుదేరుతుంది. అన్ని పుస్తకాలూ సాకల్యంగా చదువలేకపోయినా వాటన్నిటికి సంబంధించిన ప్రాథమిక సమాచారాన్ని సంపాదించుకొని విజ్ఞానవంతులౌతారు యువజనాలు.

నిన్నటికి మొన్న మహాభారతంమీద యువభారతి దృష్టి పడింది. భారతంపై అనేకానేక గ్రంథాలు రానే వచ్చాయి. కాని ఇంతవరకూ ఎవరూ దృష్టిపెట్టని అంశంపై యువభారతి దృష్టిని సారించింది. నన్నయ తన భారతంలో 'ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని' అని భారతాన్ని ఏడు కోణాలలో చూపించాడు. ఎందుకనో ఎవరూ ఆ కోణాలలో పరిశీలించుట, ప్రచురించుట, ప్రసంగించుట అనేది జరుగలేదు. మామూలుగా ప్రసంగంలో భాగంగానో లేదా వ్యాసంలో భాగంగానో ఆ పద్యాన్ని ఉదాహరించి, నామమాత్రంగా విశ్లేషించడం తప్ప. అలా కాకుండా ఆ ఏడు కోణాలూ ఏడు ప్రసంగవ్యాసాలు అయితే ఎంత బాగుంటుంది, యువతకు ఎంత ఉపకరిస్తుంది అని ఆలోచించింది యువభారతి.

ఆలోచన పుట్టడమే తరువాయి ఏడుగురిని ఆ పనిలో నియోగించింది. భాగ్యనగరం మోతీనగర్ లోని శంకరమఠంలో రోజునకొక్కరు చొప్పున ఆయా అంశాలపై ప్రసంగించారు. వారు చేయబోయే ప్రసంగాన్ని వ్యాసరూపంలో ముందుగానే వారినుండి స్వీకరించారు. ఏడు ప్రసంగాలు అయిపోయిన మరునాడే 'మహాభారతోపన్యాసలహరి' అనే పేరుతో ముద్రించిన ఆ గ్రంథాన్ని ఆవిష్కరించేసారు కూడ. ఎంత వేగం ఎంత

నిబద్ధత! ఆ యజ్ఞంలో నన్నుకూడ భాగస్వామిని చేసింది యువభారతి. 'సర్వలక్ష్యసంగ్రహము' అనే అంశంపై నాచేత ప్రసంగింపజేసి ఆ వ్యాసాన్ని ఈ గ్రంథలో చేర్చింది. మన్యేహం ధన్యమాత్మానమ్.

నేను తూ.గో.జిల్లా పొడగట్లపల్లి సంస్కృత కళాశాలలో భాషాప్రవీణ చదువుకొనే రోజులలో యువభారతి పుస్తకం కనబడితేచాలు కొనేసేవాడిని. చదివేసేవాడిని. వాటి సాయంతో ఉపన్యాసపు పోటీలలో పాల్గొనేవాడిని. తరచుగా నేనే ప్రథమస్థానంలో నిలబడేవాడిని. ఆరకంగా నా సాహితీకృషిలో బలం పెరిగింది. క్రమంగా అష్టావధాని నయ్యాను, శతావధానినయ్యాను, సహస్రావధానినయ్యాను. దేశవిదేశాలలో వేల సంఖ్యలో సాహిత్యోపన్యాసాలు ఇవ్వగలిగానంటే దానికి ప్రధానమైన ఆధారం యువభారతియే అన్నది స్తవము కాదు వాస్తవము.

ఈ సంస్థ అజరామరంగా నిలవాలి. భారతీయసంస్కృతిని నిలబెట్టాలి. తెలుగుభాషకు పునర్వైభవాన్ని తీసుకురావాలి. తెలుగుభాష కొంతకాలానికి అదృశ్యమైపోతుంది అని కొందరు కంగారుపడుతున్నారు. కాని యువభారతి ఉన్నంతకాలం తెలుగు భాషకు తిరుగులేదు, తరుగు లేదు.






మరపురాని 'మనీషి' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న అభినవ పోతన డా॥వానమామలై వరదాచార్యులు. చిత్రంలో డా॥ఇరివెంటి, తాళ్ళపల్లి, నాగేశ్వరరావు

# చారిత్రాత్మక సంస్థ యువభారతి

డా॥ జె. చెన్నయ్య
కార్యదర్శి, తెలంగాణ సారస్వత పరిషత్, హైదరాబాద్
94400 49323

తెలుగు భాష, సాహిత్యంపై ప్రజల్లో అభిమానం, అభిరుచి కలిగించడానికి నడిచిన ఉద్యమం యువభారతి. చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే చిన్న దీపం వెలిగించాలన్న సమున్నత ఆదర్శం యువభారతి గమనానికి స్ఫూర్తినిచ్చింది.

నాటి ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణం భాషాభిమానులతో పొంగిపొరలే ప్రఖ్యాత కవి పండితుల అద్భుత ప్రసంగాలతో మారుమోగిన రోజుల్ని చూసిన వాళ్లలో, విన్న వాళ్లలో నేను ఒకడిని. యువభారతి ప్రచురించిన చిన్న, పెద్ద గ్రంథాలు తెలుగు సాహిత్య వికాసానికి చేసిన దోహదం అపారమైనది. సాహిత్యాంశాలపై పరిశోధన చేసే వారికి ఆకర సామగ్రిగా ఉపకరించాయి. అవి చదివి తమ అవగాహన పెంచుకొని కళాశాల, విశ్వవిద్యాలయ తరగతి గదుల్లో అద్భుతంగా పాఠాలు బోధించిన అధ్యాపకులు ఎందరో!

భాషా సాహిత్య గ్రంథాలను చదువుకోవాలనుకునే పాఠకులకు పుష్కలంగా పుస్తకాలను ముద్రించి అందించిన ఘనత కూడా యువభారతిదే. యువ భారతిని ఉజ్జ్వలంగా నడిపిన పెద్దలు యువరచయితలు, రచయిత్రులు, అప్పటి విశ్వవిద్యాలయ తెలుగు శాఖ విద్యార్థుల పేర్లు రాయడానికి స్థలం చాలదు. కానీ వాళ్లంతా యువభారతి కార్యక్రమాల్లో మనసుపెట్టి పాల్గొన్నారు. అత్యంత ఉత్సాహంతో కార్యకర్తృత్వం నెరపారు. నాడు ఔత్సాహికులుగా ఉన్నవారు యువభారతి ఇచ్చిన ప్రోత్సాహంతో తర్వాతి కాలంలో ప్రముఖ కవి రచయితలుగా పేరు తెచ్చుకున్నారు. సాహిత్యానికి, భాషకు సేవ చేశారు.

ప్రభుత్వాల అండదండలు లేకపోయినా భాషాభిమానుల ఆదరణతో చరిత్రలో నిలిచిపోయే మంచి పనులు చేసిన యువభారతి అభినందనీయ సంస్థ. యువత,

విద్యార్థుల అభిరుచిలో మార్పు వచ్చిన విషయాన్ని గుర్తించి వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలను విస్తృతంగా నిర్వహించి ఆ విధంగా కూడా సేవ చేసిన సంస్థ యువభారతి. ఇంకా చక్కని గ్రంథాలు ప్రచురిస్తూ మహాభారత, భాగవతాది పురాణేతిహాసాలపై ప్రఖ్యాత పండితుల ప్రసంగాలు ఏర్పాటు చేస్తూ తన సేవల్ని అవిరళంగా కొనసాగిస్తున్నది. యువభారతి వజ్రోత్సవం సందర్భంగా అభినందనలు తెలియజేస్తున్నాను.






'తెలుగు కవిత – లయాత్మకత' కార్యక్రమంలో ప్రసంగిస్తున్న కార్యదర్శి
శ్రీ కె.వి.కామేశ్వరరావు

# సరస్వతీ అమ్మవారిని సాక్షాత్కరింపజేసిన యువభారతి

డా॥ వంశీ రామరాజు
వ్యవస్థాపకులు, వంశీ ఆర్ట్ థియేటర్స్, హైదరాబాద్
98490 23852

1963లో సరస్వతీమాత ప్రతిరూపంగా విజయదశమి రోజున వెలసిన మహోజ్జ్వల సాహితీసంస్థ 'యువభారతి'. అప్పుడు నా వయసు 14 సంవత్సరాలు. ఎంతోమంది ప్రతిభామూర్తుల ఉపన్యాసాల పరంపరను వినడానికి ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణాన్ని అరనిక్కరు వేసుకుని వెళ్ళిన రోజులు నాకు బాగా గుర్తు. ఒక పుస్తకం కొని చదవాలంటే అంత స్తోమత లేని నాలాంటి విద్యార్థులకు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం ఒక నెలవుగా ఉండేది. యువభారతి సాహితీ కార్యక్రమాలు మొదలుపెట్టిన రోజుల్లో ఆయా గ్రంథాలు ప్రచురించేముందు కొనదలచుకున్నవారికి తక్కువ ధరతో అందించే సంప్రదాయం మొదలుపెట్టిన తరవాత నాలాంటివారు సునాయాసంగా యువభారతి ప్రచురించిన అన్ని గ్రంథాలను నేరుగా పొందగలగడం అనే అదృష్టం కలిగింది.

లబ్ధప్రతిష్ఠులైన సాహితీవేత్తలు ఆచార్య దివాకర్ల వేంకటావధాని, వానమామలై వరదాచార్యులు, ప్రజాకవి కాళోజీ, డా॥ దాశరథి, డా॥ సి. నారాయణరెడ్డి, గుంటూరు శేషేంద్రశర్మ వంటి అనేకమందిని ఆ సభల్లో దర్శించుకోవడం, ఎక్కువ సినిమా ప్రభావంగల నావంటి యువతకు సాహిత్యంపట్ల ఆసక్తిని పెంపొందింపచేయడంలో యువభారతి మార్గదర్శనంగా మారిందన్నది అక్షరసత్యం. ఎప్పటికైనా నేనూ ఒక సంస్థను ప్రారంభించి యవభారతిలాగా గ్రంథాలు ప్రచురించాలన్న ఆలోచనకు అంకురార్పణ జరిగింది. బహుశా యువభారతి కార్యక్రమాల ప్రభావం నామీద

అమితంగా ఉండేది. అందువల్లనే నేను సినిమా కళాకారుల అభిమానినైనప్పటికీ మహారచయిత్రి తెన్నేటి లత 'మోహనవంశి' నవలతో ప్రభావితుణ్ణయి 1972లో 'వంశీ ఆర్ట్ థియేటర్స్' అనే సంస్థను స్థాపించాను. సినిమా కళాకారులకు అవార్డ్స్ ఇచ్చే సంస్థగా పేరుగాంచిన 'వంశీ' సాహితీ కార్యక్రమాలు ఇప్పటికీ అనేకం చేస్తూనే ఉన్నామంటే అది పూర్తిగా యువభారతి ప్రభావం.

60 సంవత్సరాలుగా సాహిత్యానికి సేవ చేస్తున్న సంస్థ ప్రపంచవ్యాప్తంగా 'యువభారతి' ఒకటే. వజ్రోత్సవాల సందర్భంగా సాహితీమూర్తులకు వంశీ సంస్థ అభినందనలు తెలియజేస్తున్నది.





'మలక్‌పేట ముఠా'గా పేరుపొందిన కొంతమంది యువభారతీయులతో
సమావేశకర్త డా॥ వంగపల్లి విశ్వనాథం

# వజ్రోత్సవ భారతి

శ్రీ మద్దాళి రఘురాం
కార్యదర్శి, కిన్నెర ఆర్ట్ థియేటర్స్, హైదరాబాదు
98660 57777

ప్రముఖ సాహితీ సంస్థ 'యువభారతి' 60 వసంతాల పండుగ జరుపుకోడం అభినందనీయం. 1963లో స్థాపించి, ఈ 60 ఏళ్ళలో, ఎన్నో సాహితీ కార్యక్రమాలు, ఉపన్యాసాలు ఏర్పాటు చేయడం 200 పైగా గ్రంథాలు సాహితీ ప్రియులకి కానుకగా అందించడం, సామాన్యమైన విషయం కాదు. ఈ రోజుల్లో సంస్థలు ప్రారంభించి మరుసటిరోజే మూతపడుతున్నవి ఎన్నో ఉన్నవి. అప్పటి నుండి నేటివరకు సంస్థ కార్యవర్గ సభ్యులు, భాషమీద ప్రేమతో, అంకిత భావంతో శ్రమించి, యువభారతి అంటే 'సాహితీ భారతి' అని పేరు తీసుకొని వచ్చారు. వారందరికి శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను. గతంలో యువభారతి రజతోత్సవ సంవత్సరం వేళ 'యువభారతి' కార్యక్రమాలపై ఒక డాక్యుమెంటరీని దూరదర్శన్ కోసం తీసే అదృష్టం, డా॥ కె.వి.రమణాచారి, (ఐ.ఎ.ఎస్) గారి ద్వారా మాకు లభించింది.

యువభారతి వ్యవస్థాపకులు శ్రీ విశ్వనాథంగారి ఆధ్వర్యంలో నామిత్రుడు శ్రీ పి.వి.చలంగారి దర్శకత్వంలో డాక్యుమెంటరీ రూపొందించి, అప్పటి డైరక్టర్ దూరదర్శన్ గారిని సంప్రదించాను. 'శాంక్షన్ లెటర్' ఇస్తానని, కొన్ని నెలలైనా అప్రూవ్డ్ లెటర్ ఇవ్వలేదు. అప్పుడు డా॥కె.వి.రమణాచారి గారు చేసిన ప్రయత్నంవల్ల దూరదర్శన్‌లో ప్రసారం చేయగలిగాము. ఎందరో సాహిత్యాభిమానుల ప్రశంసలందుకున్నాము.

మూడు సంవత్సరాల క్రిందట బాలానందం పూర్ణ (శ్రీ పూర్ణచంద్రరావు) గారు తీవ్ర ప్రయత్నం చేసి 'ఒరిజినల్ క్యాసెట్' సంపాదించి దాన్ని సి.డి. క్రింద కన్వెర్ట్ చేసి డాక్యుమెంటరీని యువభారతి కార్యవర్గానికి అందించి, చాలా సంతోషించారు. ఆయన కృషి మరువలేము. అందరికి మంచి మిత్రుడు.

ఒక భాషాభిమానిగా, కిన్నెర కార్యకర్తగా యువభారతి 60 ఏళ్ళ పండుగే కాదు, శతవసంతాల వేడుకలు జరుపుకోవాలని ఆశిస్తూ ఆకాంక్షిస్తున్నాను.



# 'యువభారతి'కి వందనం

డా॥ రాపోలు సుదర్శన్
ప్రధాన కార్యదర్శి, తెలంగాణ 'అరసం', హైదరాబాద్
94417 79688

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్ని యినా వెలిగించడం మంచిది" అనే ఆర్యోక్తియే లక్ష్యంగా పనిచేయడానికి పూనుకొని 1963 దసరా పర్వదినాన స్థాపితమైన సాహిత్య సంస్థ 'యువభారతి'.

ప్రాచీనం నుంచి ఆధునిక కావ్యాల ముద్రణ, వాటిపై సద్విమర్శ, పలు అంశాలపై గోష్ఠులు, స్త్రీల కొరకు వినూత్న, విశేషమైన కార్యక్రమాలు, వివిధ అంశాల సాహిత్య పుస్తకాలపై చర్చ, అప్పటికప్పుడే ఇచ్చిన అంశంపై సుమారు రెండు నిమిషాలు ప్రసంగించే 'క్లుప్తగోష్ఠి' పేరుతో ప్రసంగాల కార్యక్రమం, రసధుని, నాగురించి, నాకు నచ్చింది– నేను మెచ్చింది, స్వీయ కవితా పఠనం. నా ఊహాపథంలో వంటి ఎన్నో వినూత్నమైన శీర్షికలతో కార్యక్రమాలను రూపొందించి నిర్వహించారు. ఇంకా గ్రంథ ముద్రణతో పలు విలువైన గ్రంథాలను ముద్రించింది యువభారతి. ఇలా హైదరాబాదులో సాహిత్య అభివృద్ధికి, సాహిత్యాభిలాషుల్లో – ఆసక్తిని రగిలించి, పెంచి పోషించింది.

అనుముల కృష్ణమూర్తిగారు రాసిన కావ్యం 'సరస్వతీ సాక్షాత్కారం' వీరు ముద్రించిన తొలి గ్రంథం. అప్పటి నుంచి నేటి వరకు 200కు పైగా సాహిత్య పుస్తకాలను యువభారతి ముద్రించింది. దివాకర్ల వేంకటావధాని, సినారె, డా. జి.వి. సుబ్రహ్మణ్యం ఇత్యాది పండితులతో ఉపన్యాసాలను ఏర్పాటుచేసి, ఆ ప్రసంగాలను 'చైతన్యలహరి' 'కావ్య లహరి' వంటి పేర్లతో ముద్రించి తక్కువ ధరకే అమ్మినారు. మహాకవి పోతన భాగవతంలోని ప్రసిద్ధ, తప్పక పాఠకులు చదువాల్సిన పద్యాలతో సినారెగారి చేత 'మందార మకరందాలు' గ్రోలింపజేసిన యువభారతి సేవల్ని తెలుగు వారు మరువలేరు. వివిధ విషయాలపై నూరు వ్యాసాలతో 'మహతి' పేరున ముద్రితమైంది. వీటిల్లో తెలుగులోని మహాకవులు విశ్వనాథ, శ్రీశ్రీల

ఇంటర్వ్యూలు ముద్రించారు. ఇందులోనే శ్రీశ్రీ '1930ల దాక తెలుగు సాహిత్యం తనను నడిపిస్తే, 1930ల నుంచి దాన్ని నేను నడిపిస్తున్నాను' అనే అభిప్రాయాన్ని వ్యక్తపరిచారు. ఈ మధ్య వ్యక్తిత్వ వికాసంపై ప్రసంగాల్ని ఏర్పాటుచేయడం, 'వ్యక్తిత్వ వికాసం సూత్రాలు–సూక్తులు' అనే పుస్తకం వెలువరించడంతో యువభారతి యువతకు మరింత చేరువైంది.

యువభారతి తన రజతోత్సవ సందర్భాన్ని పురస్కరించుకొని 1990 ఫిబ్రవరి 4న ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం (1980–1990) అనే శీర్షికతో సదస్సును నిర్వహించింది. ఈ ప్రసంగ వ్యాసాలు పుస్తక రూపాన్ని ధరించినై. తెలుగు భాషా సాహిత్యాల్లో తొలిసారిగా జ్ఞానపీఠ పురస్కారం అందుకున్న మహాకవి బహుగ్రంథ రచయిత శ్రీ విశ్వనాథ సత్యనారాయణ శత జయంతి సందర్భంగా సంవత్సర కాలంపాటు ప్రతీ నెల ఒక ప్రసంగాన్ని విశ్వనాథ సాహిత్యంపై యువభారతి ఏర్పాటుచేసింది. ఈ ప్రసంగ వ్యాసాలన్నింటిని 'విశ్వనా థ సాహితీ సమాలోచనం' పేరుతో గ్రంథంగా వెలువరించింది.

1947 నుంచి 1972ల మధ్య తెలుగులో వెలువడిన సాహిత్యం, యువత, మాధ్యమాలు ఇత్యాది అంశాలపై మన దేశం స్వాతంత్ర్య రజతోత్సవ వేళను పురస్కరించుకొని 'మహతి'ని వెలువరించినట్టుగానే, దీని అనంతరకాలమైన 1972 నుంచి 2022 వరకు తెలుగులో వెలువడిన సాహిత్యంలోని కవిత్వం, కథానిక, నవల మొదలైన పలు ప్రక్రియల్లో పదకొండు అంశాలతో అమృతోత్సవం సందర్భంగా 'అమృత భారతి' పేరున అత్యద్భుతమైన పుస్తకాన్ని ముద్రించారు. భారతస్వాతంత్ర్య స్వర్ణోత్సవం వేళ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ యువజన సేవలశాఖ వారు నిర్వహించిన కవిసమ్మేళనంలోని కవితలతో సంకలన ప్రచురణ బాధ్యతను యువభారతికి అప్పజెప్పడంతో ఎంతో సమర్థవంతంగా నిర్వహించి యాభై మంది కవుల కవితలతో 'స్వతంత్ర స్వర్ణ  భారతి' శీర్షికతో సంకలనాన్ని తీసుకొచ్చారు. ఇంకా స్వర్ణోత్సవ ప్రచురణగా ప్రభావం' వెలువరించారు. ఇటీవల తెలుగు మహాభారత సహస్రాబ్దిని పురస్కరించి 'మహాభారతోపన్యాస లహరి'గా 2022 సంవత్సరాంత వారంలో ప్రసంగాల్ని ఏర్పాటుచేసి, ఆ ప్రసంగ వ్యాసాల్ని గ్రంథ రూపంగా యువభారతి నిక్షిప్తంచేసింది.

యువభారతి వజ్రోత్సవ ప్రచురణగా గత అరవై ఏళ్ళుగా తమ సంస్థ ముద్రించిన వాటిల్లో ముఖ్యమైన రెండు వందల గ్రంథాల సంక్షిప్త పరిచయ సమాచారంతోనే

గాకుండా, వీటిని డౌన్లోడ్ చేసుకొని ఉచితంగా చదువుకోడానికి క్యూఆర్ కోడ్ని పొందుపరిచారు. ఇది తెలుగు పుస్తక ప్రపంచంలో అపూర్వం అద్వితీయం. దాని పేరు 'ద్విశత భారతి'.

యువభారతి కార్యక్రమాలు అత్యధికంగా తెలంగాణ (ఆంధ్ర) సారస్వత పరిషత్తు ప్రాంగణంలో, కొన్ని శ్రీకృష్ణదేవరాయాంధ్ర (తెలుగు) భాషానిలయంలో నిర్వహింపబడేవి. ఈ సభలకు ఎనిమిదవ తరగతి చదువుతున్న విద్యార్థి స్థాయి నుంచి నేను, నా సహధ్యాయి సేతుపతి (ప్రస్తుతం వీరు విశ్రాంత హిందీ పండితులు) కలిసి హాజరయ్యాం. సభానంతరం నింబోలిఅడ్డలోని మా ఇండ్లకు వెళ్ళుతూ, దారిపొడుగునా సభలోని అంశాల్ని నెమరేసుకుంటూ వెళ్లేవాళ్ళం. పద్యాన్ని హృద్యంగా చదివి, దానిలోని విశేషాల్ని అరటి పండు ఒలిచి తినిపించినంత సాఫీగా, హృదయానికి హత్తుకునేంత అద్భుతంగా, నొప్పికాకుండా ఇంజక్షన్ ఇచ్చేంత నేర్పరి వైద్యుల్లా దివాకర్ల వేంకటావధానిగారి ప్రసంగం సాగేది. అందుకే కాబోలు ఇప్పటికీ మా చెవుల్లో వారి ప్రసంగం మారుమోగుతున్నది. ఇలాగే సినారెగారి ప్రసంగంలో పద్య పఠనా మాధుర్యం, భాషా చమత్కారాలు, విషయ పోహళింపుల వంటి వీనుల విందు కమ్మదనాలు మా బాల్యం నుంచే వినే భాగ్యం కలిగింది. ఇలా ఎవరు, ఏ విషయంపై ప్రసంగించినా ఇంటికి దూరమైనా ఎంతో ఆసక్తితో యువభారతి సభలకు మిత్రుడు సేతుపతితో కలిసి హాజరయ్యేవాడిని.

లాభాపేక్ష లేక యువభారతి నాటి నుంచి నేటి దాక సాహిత్య సేవచేస్తూనే ఉన్నది. ఈ సంస్థ ప్రస్తుత అధ్య క్షులు డా. ఆచార్య ఫణీంద్ర, కార్యదర్శి జీడిగుంట వెంకట్రావు, కోశాధికారి ఆమాతి రవీంద్రగారలు. చదువరులే లేని, అందునా సాహిత్యాన్ని వరించేవారు అసలే లేని నా వంటి కుటుంబ నేపథ్యం ఉన్నవారి నెందరినో యువభారతి ఆహ్వానించింది, అక్కున చేర్చుకుంది, ఆసక్తిని కలిగించింది. వ్యక్తిత్వాన్ని రూపొందించింది. కాబట్టి అమ్మలాగ ఆదరించిన 'యువభారతి' సేవలకు నా వంటి పాఠకులేగాక సాహిత్యాభిలాష ఉన్న ప్రతీ ఒక్కరు ఋణపడి ఉన్నారు.



# యువభారతికి వజ్రశోభ

శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా॥ జి. వి. పూర్ణచందు
కృష్ణాజిల్లా రచయితల సంఘం, విజయవాడ
94401 72642

"నిరాశ్రయా నశోభన్తే పండితా వనితా లతాః" అన్నారు. బంగారు పళ్ళేనికైనా గోడచేర్పు కావాలనేది నిజం. రచనలు వెలుగులోకి వచ్చేలా కవులకు తోడ్పడటమే రాజాశ్రయం పరమార్థం. సంస్థానాధీశులు, జమీందార్లు, ఉన్నతాధికార్లూ అంకితాలమీద ఎక్కువ శ్రద్ధ చూపించారన్నదే చరిత్ర. భాషా సంస్కృతుల్ని చాటేలా భారతాన్ని తెలుగులో వ్రాయుమని రాజరాజ నరేంద్రుడు నన్నయని కోరాడు. భాషా సంస్కృతుల్ని చాటుతూ ప్రబంధాలు వ్రాయుమని శ్రీ కృష్ణదేవరాయలు పెద్దన, నందితిమ్మనల్ని కోరాడు. తాను స్వయంగా ఆముక్తమాల్యద వ్రాశాడు. ఆరోజులే వేరు. కాలం మారింది. ఇప్పుడు సాహితీ పోషకులు అరుదైపోయారు.

సాహితీమూర్తుల్ని, కళాకారుల్ని, మేధావుల్ని గుర్తించి గౌరవించలేని వ్యవస్థని రత్నాలు కళ్లముందున్నా కనలేని జాత్యంధులతో పోల్చాడు భర్తృహరి. రత్నాలు ఇప్పటికీ ఉన్నాయి. జాత్యంధులే ఎక్కువగా ఉన్నారు. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, ఆంధ్రసాహిత్యపరిషత్తు, నవ్యసాహిత్యపరిషత్తు, బరంపురం ఆంధ్రభాషాభివర్ధినీ సమాజం, అభ్యుదయ రచయితల సంఘం, ఫ్రీవర్స్ ఫ్రంట్ లాంటి కొన్ని సంస్థలు వాటివాటి బాధ్యతలు నెరవేర్చి సాహిత్యపోషణ చేశాయి. కొన్ని ఇంకా చేస్తున్నాయి. అనేక ఉద్యమాల అవతరణకు ఈ సంస్థలు నేతృత్వం వహించాయి కూడా!

"చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అనే సూక్తిని ఆచరణలోకి తెస్తూ, '1963లో ఒక తటిల్లతలాగా వచ్చిన 'యువభారతి' సంస్థ సార్థక నామధేయిగా నిలిచింది. సుధామ, కె.బి లక్ష్మి లాంటి యువకవులకు ఆ రోజుల్లో యువభారతి నిజంగా గోడచేర్పే! దాని కార్యక్షేత్రం హైదరాబాదుకే పరిమితం కాకుండా తెలుగు నేల నలుచెరగులా విస్తరించింది.

1975లో మచిలీపట్టణంలో స్పందనసాహితీ సమాఖ్య చాలా విస్తృతంగా సాహితీ కార్యక్రమాలను నిర్వహించటానికి ప్రధానమైన ప్రేరణ యువభారతే నని మేము సగర్వంగా చెప్పుకునే వాళ్లం. నెల నెలా ప్రముఖుల ప్రసంగాలు, వాటికి పుస్తకరూపం ఇవ్వటం, యువకవుల్ని సమీకరించటం, వారి రచనలతో కథా, కవితా సంపుటాలు వెలువరించటంతో పాటు యువభారతి 'నందిని' పత్రికని నిర్వహించిన పద్ధతిలోనే మేమూ 'స్పందనవాణి' మాసపత్రికను కొంతకాలంపాటు ఘనంగా నడిపాము. కృష్ణాజిల్లా రచయితల మహాసభలను నిర్వహిస్తూ కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని కూడా సంస్థాగతమైన పద్ధతిలో నిర్వహిస్తూ వచ్చాం. 2004లో కృష్ణాజిల్లా రచయితల సంఘం కొత్త పుంతలు తొక్కే అవకాశాలు కలిసొచ్చాయి. యువభారతి బాటలోనే సంస్థను నడిపించాము.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాలను చిరస్మరణీయం చేస్తూ, 1972లో స్వాతంత్ర్య యుగోదయంలో (1947- 72) తెలుగు తీరుతెన్నులు గురించి 'మహతి' అనే వ్యాస సంపుటిని యువభారతి ప్రచురించింది. కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆంధ్రప్రదేశ్ అవతరణ స్వర్ణోత్సవాలను పురస్కరించుకుని 2006లో జాతీయ తెలుగు రచయితల మహాసభలు నిర్వహించింది. ఈ మహాసభల జ్ఞాపికగా 'తెలుగుపసిడి' గ్రంథాన్ని ప్రచురిస్తూ, అందులో, ఆంధ్రప్రదేశ్ రజతోత్సవాలనాటి మహతిని గుర్తుకు తెచ్చుకున్నాం. యువభారతి అనగానే ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు మాకు ఎక్కువ ప్రేరకులుగా గుర్తుకొస్తారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రతీ ఏడాదీ అందించే సాహితీసేవా పురస్కారాన్ని ఆయనకు అందించి తద్వారా యువభారతిని గౌరవించుకున్నాం.

2008లో తెలుగు భాషకు ప్రాచీనతాప్రతిపత్తి వచ్చిన సందర్భంగా యువభారతివారు మా ఇద్దరినీ ఆహ్వానించి సత్కరించిన గొప్ప అనుభూతి మాకు తీపి జ్ఞాపకమే! భాషా సంస్కృతుల్ని కావడిపట్టి మోసి, కావలి కాసి, చేవబారిన సంస్థ యువభారతి. ఒక సంస్థ 60 యేళ్లుగా నిరాటంకంగా నిలదొక్కుకుందంటే క్రమశిక్షణ దాని పునాదిగా ఉన్నప్పుడే సాధ్యం అవుతుంది. సమయపాలన, నిబద్ధత, అంకితభావం, అన్ని సాహితీ ప్రక్రియలపట్లా సమదృష్టి, ప్రాచీన సాహిత్యాన్ని పదిల పరచాలనే తపన, తెలుగు భాషని పరిరక్షించాలనే దీక్ష, మన సంస్కృతి ఔన్నత్యాన్ని మనతరానికి తెలియచెప్పాలనే పట్టుదల... యువభారతి విజయాలకు కారణాలుగా భావిస్తాము. ఆచరణలో అవి అగుపించటమే యువభారతిని కీర్తిమంతం చేశాయి. యువభారతికి వజ్రశోభను తెచ్చాయి. వజ్రోత్సవాల సందర్భంగా యువభారతికి మా కైమోద్పులు.



# యువభారతి

డా॥ అక్కిరాజు సుందర రామకృష్ణ
కవి, నట, గాయకుడు, హైదరాబాద్
98850 20205

**భా**గ్యనగరంతో ఒక 30,40 సం॥ల అనుబంధం ఉన్నవాళ్ళకు తప్పక కొన్ని మధుర స్మృతులు యువభారతి సంస్థతో తప్పక ఉండే ఉంటాయి. కారణం అప్పటి తెలుగు ప్రజానీకానికి భాషపైన, ప్రాచీన కావ్యాలపైన, మహాపండితులైనవారి ఉపన్యాసాల పట్ల ఉన్న అభిమానమే! 'యువభారతి' వాళ్ళ ఉపన్యాసం అంటే – కేవలం భాగ్యనగరానికి చుట్టుపక్కల ఉన్న గ్రామంలోని వాళ్ళు మాత్రమే గాదు – కరీంనగర్, వరంగల్, మహబూబ్‌నగర్ నుండి రావడం, ఉపన్యాసం కాగానే మళ్ళీ వెంటనే బస్సు ఎక్కి వాళ్ళ ఊళ్ళకు పోవడం నే నెరుగుదును.

ఈ జంటనగరాలలో అలాటి భాషాభిమానాన్ని పెంచిన కొందరు వ్యక్తుల్ని ఈ సందర్భంగా స్మరించుకుంటే పుణ్యం గూడా వస్తుంది. కీ.శే. దివాకర్ల వేంకటావధానిగారూ, దేవులపల్లి రామానుజరావుగారూ, ఆచార్య బిరుదురాజు రామరాజు గారూ, ఇత్యాదులు ఎందరో ఉన్నారు. ఇక నాకు ప్రత్యక్ష గురువులైన కీ.శే. జీ.వి. సుబ్రహ్మణ్యంగారు, కీ.శే. రవ్వా శ్రీహరి గారూ, కీ.శే. పాటిబండ మాధవ శర్మగారూ, ఇత్యాదుల కృషి, ఆ సంస్థకు వారిచ్చిన ప్రోత్సాహం చాలా గొప్పది. అప్పుడు మంచి యువకులై ఉన్నవాళ్ళూ, నడివయస్సులో ఉన్న ఆచార్య తిరుమల, తిరుమల శ్రీనివాసాచార్యులు, వంగపల్లి విశ్వనాథం గారూ, నిడమర్తి నిర్మలగారూ – ఇంకా నాకు కొన్ని పేర్లు చప్పున గుర్తుకు రావడం లేదు, వారందరూ అభినందనీయులే!

వీళ్ళందరు ఎందరున్నా – నా పిహెచ్.డి. కి మార్గదర్శకులైన, నా ఎడల విపరీతమైన ప్రేమాభిమానాలు కనబరచి, నా అభ్యుదయాన్ని అహర్నిశలూ కాంక్షించిన స్వర్గీయ ఇరివెంటి కృష్ణమూర్తిగారి పాత్ర ఈ 'యువభారతి' సంస్థకు వెన్నెముక లాంటిది. గొప్పగొప్ప విద్యాధికులను, ఉపన్యాసకులను ఆంధ్రా, రాయలసీమ ప్రాంతాల

నుంచి గూడా ఆహ్వానించి గొప్ప గొప్ప ఉపన్యాసాలను యిప్పించిన ఘనత 'యువభారతి' సంస్థవారిదే! అసలు 'యువభారతి'లో ఉపన్యాసం యివ్వడమంటే – ఉపన్యాసకులు అదొక గొప్ప ఘనతగా భావించేవారు. మహాకవులైన కీ.శే. దాశరథి, శేషేంద్ర, సినారె లాంటి కవుల ఉపన్యాసాలు వినడానికి వేలం వెర్రిగా జనాలు వచ్చేవాళ్ళు. కారణం అప్పటి రోజుల్లో ఎటువంటి తదితర దృశ్యమాధ్యమాలు లేవు. వినడమే ప్రధానం. 'దివాకర్ల' వారి ఉపన్యాసం అంటే చెవికోసుకునేవాళ్ళు. యూనివర్సిటీ విద్యార్థులు విధిగా వచ్చే వాళ్ళు. 1, డిసెంబర్, 1974, సం॥లో ప్రథమ ముద్రణగా వెలుగుచూచిన 'ప్రతిభాలహరి' వ్యాస సంపుటి తెలుగు విద్యార్థుల పాలిటి ఒక వరం. ఆ సంపుటిలో శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు, పానుగంటి, విశ్వనాథ, శ్రీశ్రీ – ల "సాహిత్య వ్యక్తిత్వాల దర్పణం" అనే శీర్షికలతో వచ్చిన 'ప్రతిభాలహరి'లో పుట్టపర్తి, దాశరథి, మధునాపంతుల, దివాకర్ల, జీ.వీ.సుబ్రహ్మణ్యం గార్ల వ్యాసాలు ఈనాటికీ తెలుగు పీ.జీ. విద్యార్థులకు ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. అటు భాషాశాస్త్ర పరంగా గూడా గొప్ప గొప్ప ఉపన్యాసాలు చేకూరి రామారావుగారు, నాయని కృష్ణకుమారి, యశోదారెడ్డి, రంగనాథాచార్యులవారు ఇత్యాది మహోదయుల చేత యువభారతి యిప్పించడం జగమెరిగిన విషయం. 'యువభారతి' సాహితీ సాంస్కృతిక సంస్థ – 5, కింగ్స్ వే, సికింద్రాబాద్ – 3 అనే చిరునామాలో నేనే ఎన్నో పుస్తకాలు కొనుక్కున్నాను. దానికి తగ్గట్టు – అప్రస్తుతం కాదు గానీ, ఆ పక్కనే శేషాచలం అండ్ కంపెనీ వారి పుస్తక విక్రయశాల గూడా ఉండేది.

'యువభారతి' అనే నామకరణం ఎవరు చేశారో గానీ, నిజంగానే సాహిత్య విద్యాభ్యాసం చేయగోరే విద్యార్థులకు అది ఒక 'కల్పతరువే!' ముఖచిత్రాలు ఇటీవలనే స్వర్గస్థుడైన 'శీలావీర్రాజు' గారే వేస్తుండేవారు. ముద్రణలు రకరకాల ప్రెస్సులలో అవుతూ ఉండేవి. అక్టోబర్ 5, 1984 సం॥లో ప్రథమ ముద్రణగా వచ్చిన 'కృష్ణశాస్త్రి కవితా వైభవం" అనే పుస్తకాన్ని నేను ఎన్నటికీ మరచిపోలేను. రచయిత కె. రామమోహనరాయ్‌గారు. నేను వీరిని తర్వాత తర్వాత అనేక ఊళ్ళలో కలిశా గూడా! వేదికలమీద చాలా చమత్కారంగా ఆయనను గూర్చి 'బంగారు కడియం వేస్తే మీలాంటి వాళ్ళకే వేయాల'ని గూడా చెప్పాను. "రెండు చేతులకు రెండు కడియాలు కాళ్ళకు రెండు కడియాలు వేసినా తక్కువే' అంటూ ఉండేవాణ్ణి! ఈ పుస్తకానికి 'మామాట' అనే పేరుతో నా గురువుగారైన కీ॥శే॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారే వ్రాశారు. ఆనాడు 'యువభారతి' సంస్థకు 8,500 మంది సహృదయులు సభ్యులుగా, అభిమానులుగా,

పోషకులుగా, పోనీ– చదువరులుగా ఉన్నారంటే ఎవడికైనా యొడలు పులకించకుండా ఉంటుందా? నాకు బాగా గుర్తు – నా గైడ్ (పి.హెచ్.డి) ఇరివెంటివారు "యువభారతీ భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 1100 మంది, భారతీ భూషణులుగా 125 మంది చేరారు" – అని వ్రాశారు.

'యువభారతి' సంస్థలో కీ.శే. సినారె పాత్ర గూడా తక్కువదేమీ గాదు. నిజానికి ఆయన 'జ్ఞానపీఠానికి' పునాదులు లాంటివి ఇక్కడే పడ్డాయి అంటే – కొంతమంది ఉలిక్కిపడతారేమో గానీ, యిది వాస్తవం. 01.12.1974 లోనే ప్రథమ ముద్రణగా 3,200 కాపీలు 'బాపూ గారి చిత్రాలంకరణతో వచ్చిన 'శిఖరాలూ – లోయలూ' ఈ సంస్థనుంచి వచ్చినదే! అప్పటి ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు శ్రీ. ఓ. చిన్నపరెడ్డిగారు ఈ కవితా సంపుటికి విలువైన పీఠికను గూర్చడం విశేషం. "మాటలతో బొమ్మగీచింది నేను, రేఖలతో జీవంపోసింది బాపు" – అని కృతజ్ఞతలు చెప్పుకున్నారు ఈ చిన్ని పుస్తకంలో సినారె.

నేను గాయకుణ్ణిగావడం మూలాన – 'యువభారతి' ఉపన్యాసాలు జరుగుతున్న తరుణంలో దైవ ప్రార్థన చేసే అవకాశం కొన్ని కొన్ని సందర్భాలలో నాకు కలుగుతూ ఉండేది. నాకూ పరమానందంగా ఉండేది. కీ.శే. ఇరివెంటి కృష్ణమూర్తి గారే వేదికలమీద "రమాపతిరావు మంచి వ్రాతగాడు అతడి తమ్ముడు సుందర రామకృష్ణ గొప్ప కూతగాడు" – అని చమత్కరిస్తూ ఉండేవారు. ఇక్కడ మరో విషయం చెప్పాలి. ఇరివెంటివారికి 'ఉర్దూ' సాహిత్యం మీద గూడా మంచి పట్టు ఉండేది – వారు నాకు పిహెచ్.డి 'గైడ్' అని పైన చెప్పాను గదా! ఆయన నిజాం కళాశాల (సాయంకాలం) లో పనిచేసేవారు. నేను గూడా సాయం కళాశాల విద్యార్థినే కావడంమూలాన, నేను గూడా విద్యానగర్ ప్రాంతంలోనే ఉండడం మూలాన, బషీర్‌బాగ్‌లో ఇద్దరం 136 నంబరు బస్సు ఎక్కేవాళ్ళం. ఒక్కొక్కసారి బస్సు ఎంత సేపటికీ రాకపోతే 'ఆటో' ఎక్కేవాళ్ళం. ఎన్నో, ఎన్నెన్నో విచిత్రమైన విషయాలు హైద్రాబాదు, ఆ నాటి నిజాం పరిపాలనా, దాశరథిగారూ తురకలదౌష్ట్యాలూ కళ్ళకు కట్టినట్లు చెబుతూ ఉండేవారు. నేను పిహెచ్.డి చేస్తున్న రోజులలో 1986–87 సం.లు సరిగ్గా కృష్ణమూర్తిగారింటికి రాత్రి 9. గం. లకు ఆయన 'గైడెన్స్' కోసం వెళుతూ ఉండేవాణ్ణి. ఆయనగారు ఒకవేళ ఇంట్లో లేకపోతే, రావడం కొంచెం ఆలస్యమైనప్పుడు కీ.శే. కులశేఖర రావుగారి యింట్లో (ఎదురెదురే) నిరీక్షిస్తుండేవాణ్ణి.

ఆయన వచ్చినట్లు తలుపు చప్పుడు కాగానే "కృష్ణమూర్తి"గారి దగ్గరకు వెళ్ళి నా అంశం గూర్చి (వేంకటపార్వతీశ్వర కవులు) నోట్సు చెప్పించుకునేవాణ్ణి. నేను చెబుతున్నది అతిశయం ఏమాత్రం గాదు – దాదాపు రోజూ ఖచ్చితంగా సి.నా.రె – "ఇదిగో కృష్ణమూర్తీ! ఈ సందేహం తీర్చు, అనుమానంగా ఉంది" అంటూ ఏవో 'ఫోన్'లో (అప్పటికి సెల్ఫోన్లు లేవు), ఏవేవో 'ఉర్దూ' కవితలు, వాటి ఔచిత్యానౌచిత్యాలూ ముచ్చటించుకునేవాళ్ళు. ఒక 10 నిమిషాలు మాట్లాడుకునేవారు. 'కృష్ణమూర్తి'గారు సి.నా.రె. గారి సందేహాలు తీర్చేవారు. అంతటి 'మైత్రి' వారిద్దరి మధ్యా ఉండేది. 'కృష్ణమూర్తి' గారి మరణం రోజున చిన్నపిల్లాడిలా వెక్కివెక్కి సి.నా.రె. ఏడ్వడం చాలామందికి తెలియకపోవచ్చు. వాళ్ళ మైత్రి అదొక విచిత్రమైన అనుబంధం. 60 సం॥లు గూడా నిండకుండా లోకాన్ని వీడిపోయిన నా గురువు గారు ఇరివెంటివారు గుర్తుకు వచ్చినప్పుడల్లా నాకు ఈనాటికీ కళ్ళు చెమ్మగిల్లుతాయి.

"యువభారతి" ఎన్నో పుస్తకాలు ప్రచురించిన, ఉపన్యాసాలు వెలుగులోనికి తెచ్చిన సంస్థ. అయినప్పటికీ "స్వాతంత్ర్య యుగోదయం (1947–1972)లో తెలుగు తీరుతెన్నులు" అంటూ ఒక సమీక్షా వ్యాస సంకలనం (భారతస్వాతంత్ర్య రజతోత్సవ ప్రచురణ, 'మహతి" ప్రచురణ అపూర్వ ఘట్టం. నారదుని "మహతి"కి ఎంత ప్రాచుర్యం ఉందో ఈ ఉద్గ్రంథానికి గూడా అంత ప్రాముఖ్యత ఉంది. దీంట్లో మీకు అన్ని మషాలాలు దొరుకుతాయి. చదివే ఓపికా, శ్రద్ధా ఉండాలే గానీ ఇదొక అపురూపమైన సంకలనం. డా. జి.వి. సుబ్రహ్మణ్యం, ఇరివెంటి కృష్ణమూర్తిగారూ, వంగపల్లి విశ్వనాథంగారూ ఈ ముగ్గురి కృషిఫలితమే "మహతి". ముఖచిత్రం శీలా వీర్రాజుగారే! 'అక్షరాలంకరణ' చేసినవాడు మంచి కవిమిత్రుడు చిరకాలం ఆకాశవాణి, హైద్రాబాద్, తదితర ప్రాంతాలలో పనిచేసి, ఈనాటికీ అలుపెరుగకుండా "ఒక్కసారి చూడండి" – అంటూ కవిసోదరులను పలుకరిస్తూ వాట్సప్ లో సాహిత్య సేవ చేస్తున్న శ్రీ 'సుధామ' గారు – సమావేశకర్త శ్రీ వంగపల్లి విశ్వనాథం గారి ముందుమాట చాలా ఆకర్షణీయంగా ఉంటుంది. వీరి "రచయితలకు మాలేఖ" అప్పుడు చదువకపోతే ఇప్పుడైనా చదువండి!

ఇక చివరగా ఒకమాట చెప్పాలి. ఆ రోజుల్లో కేవలం సాహిత్యాభిలాషులే గాకుండా, అన్యరంగాలలో ప్రవేశం ఉన్నవాళ్ళు నిష్ణాతులైన వాళ్ళు విధిగా ఉపన్యాసాలకు వచ్చి, ఆకర్షితులై సభ్యత్వం తీసుకునేవారు. మా శ్రీకృష్ణుడు కీ.శే. అయ్యదేవర పురుషోత్తమరావు అలా ప్రవేశించినవాడే! ఇంకా ఎందరో ఉన్నారు.

పేర్లు గుర్తుకు రావడం లేదు. నేను సభ్యుణ్ణి గాకపోయినా "యువభారతి"తో నా అనుబంధం తక్కువేమీ గాదు. కాకపోతే నాకు మొదటి నుంచి మొగానికి రంగు పూసుకోవడం అలవాటు గాబట్టి, కొన్ని కార్యక్రమాలకు పోలేకపోయేవాణ్ణి. ఏది ఏమైనా వికాస లహరి, ప్రతిభా లహరి, కావ్య లహరి (ఇవన్నీ యువభారతి ప్రచురణలే) లేని యిల్లు ఆ రోజులలో ఉండేది కాదు.

తెలుగు సాహిత్యం పట్ల మళ్ళీ మక్కువ పెరుగుతున్నదనే మాట వాస్తవం. మళ్ళీ ఈనాడు మిత్రుడు, మంచి కవి, సహృదయ శేఖరుడు, ఉన్నతోద్యోగి గా, ఎన్.ఎఫ్.సి. లో రిటైర్ అయిన 'ఆచార్య ఫణీంద్ర ఈ యువభారతి భారాన్ని తన భుజస్కంధాలమీదకు ఎత్తుకుని పూర్వ వైభవం తేవటానికి ప్రయత్నిస్తూ ఉండడం హర్షణీయం. ఇంకా ఎందరో ఎందరెందరో వృద్ధులై యుండి గూడా "వంగపల్లి" వారివంటి భాషా సేవకులూ, విద్యాధికులూ, దీని వెనుక ఉన్నారు – వారందరికీ ఈ "అక్కిరాజు" శుభాభినందనలు తెలియజేసుకుంటున్నాడు – అమ్మా! యువభారతీ!!

సీ॥ కవికులంబున చూడ – యువభారతీ నీవు
నిత్య పూజిత వమ్మ నిజము నిజము
'యువ భారతీ' యను చవని పల్కుటెగాని
'ప్రౌఢ భారతి' వీవు పచ్చి నిజము
నీ ఠీవి నీలావు – నీ శేవ నీ చేవ
సాకల్యముగ మ(ది)రి నాకు తెలుసు
నీ యంద చందాలు – నీవైన భావాలు
వాణి రాయంచకు బాగ తెలుసు

గీ॥ ఇన్ని మాటల వేల నా చిన్ని కన్న?
శ్రద్ధతో నిన్ను చక్కగ చదువకుండ
తలప – 'తిలకురో' డ్డేమిటో తెలియకుండ
బ్రదికి బట్టను గట్టిన పంతులేడి?



# యువభారతి వెలిగించిన గండదీపం

డా॥ వి.వి.రామారావు
రచయిత, విశ్రాంత ఆకాశవాణి వ్యాఖ్యాత, వరంగల్
98492 37663

యువభారతి..అసంఖ్యాక సాహిత్య అభిమానులకు అమ్మవంటి అపురూప సంస్థ.. ఉభయ తెలుగు రాష్ట్రాలలో తెలుగు భాషా సాహిత్యాలకు సంబంధించి యువ భారతి పేరులో ఉన్నట్లే నిత్య యౌవని. నాకు ఊహ తెలిసినప్పటి నుండి యువ భారతి ని అనుసరిస్తూనే వస్తున్నాను. ఒక విధంగా నాలో సాహిత్యాభిరుచిని మరింత అధికం చేసింది యువభారతి.

నేను ఎస్.ఆర్. ఆర్.డిగ్రీ కళాశాల కరీంనగర్‌లో బి.ఎస్.సి ప్రథమ సంవత్సరంలో ఉన్నపుడు మాకు తెలుగు ను ఉపద్రష్ట కామేశ్వరరావు గారు బోధిస్తూ యువ భారతి కార్యకలాపాల గురించి ,ప్రచురణల గురించి చెబుతూ సాహిత్యం పట్ల కాస్త ఆసక్తి కలిగించారు.

మా ప్రిన్సిపల్, శ్రీ కె.వై.ఎల్ నరసింహారావు గారు ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారిని మా కళాశాలకు ఆహ్వానించి విశ్వనాథ సత్యనారాయణ గారి ఏకవీర,నవల గురించి ఉపన్యాసం ఏర్పాటుచేశారు. వారి ఉపన్యాసం విన్నాక మాకు సైన్సు నుండి సాహిత్యం వైపు దృష్టి మరలింది.

తరువాత కొన్నాళ్ళకి మేము హైదరాబాద్ వచ్చి దివాకర్ల వారిని కలిశాము.వారు యువభారతి ప్రచురించిన పుస్తకాలు కొన్ని ప్రేమతో ఇచ్చి ఆశీర్వదించారు. యువభారతి ప్రచురించిన కావ్యలహరి, సంస్కృత సాహితీలహరి, విశ్వనాథ సాహితీ సమాలోచనం, మొదలైనవి బాగా ఆకట్టుకొన్నాయి. ఆ తరువాత, డా.సి.నారాయణరెడ్డి గారి మందార మకరందాలు, జి.వి.ఎస్ గారి వ్యాససంపుటి మాకు నిత్య పారాయణ గ్రంథాలైనాయి. అన్నిటినిమించి, యువభారతి ప్రచురించిన బృహత్ గ్రంథం ''మహతి'' ఎం.ఏ.విద్యార్థులు మొదలు పరిశోధన చేసే వారికి, పోటీ పరీక్షలు రాసే వారందరికి

కరదీపిక గా వెలుగు చూపించడం విశేషం.అసలు 'మహతి' పైనే ఒక ఎం ఫిల్ చేయవచ్చు.

" యువభారతి" ని అభిమానించే నాకు ఓ ఆనందకరమైన ఆహ్వానం అందింది..బహుశః 2022 జూన్ నెల అనుకొంటా..సుధామ గారు ఫోన్ చేసి "యువభారతి వారు మిమ్మల్ని సంప్రదిస్తారని" క్లుప్తంగా చెప్పారు. నిజంగానే యువభారతి కార్యదర్శి శ్రీ జీడిగుంట వెంకటరావు గారు ఫోన్ చేసి "75 వ భారత స్వాతంత్ర్య అమృతోత్సవాల సందర్భంగా, అమృత భారతి శీర్షికన ఒక వ్యాససంకలన గ్రంథం ప్రచురించబోతున్నాము, తెలుగు సినీ గీత ప్రస్థానం గురించి ఒక వ్యాసం రాయండి" – అని కోరడం నాకు అమితానందాన్నిచ్చింది. నిజానికి యువభారతి కార్యవర్గం నాకు తెలుసు కానీ,నేను వారికి అంతగా పరిచయం లేను..

నేను నిర్ణీత గడువులో వ్యాసం రాసి పంపించాను. 'అమృతభారతి' ఆవిష్కరణ సభను యువభారతి వారు ఎంతో ఘనంగా సన్మానించారు. వ్యాసరచయితలతో ప్రసంగాలను ఇప్పించి,సముచితంగా సత్కరించారు .అపుడే తొలి సారిగా శ్రీ వంగపల్లి విశ్వనాథం గారిని చూడటం జరిగింది. ఆచార్య ఫణీంద్ర గారు, శ్రీ నాగేశ్వరరావు గారు, మలపాక పూర్ణచందర్‌రావు గారు, రవీంద్ర గారు, డా.బి.జయరాములు గారు మొదలగు పెద్దలను కలిసే అవకాశం కలిగింది.

చివరగా అందరినీ ఆకట్టుకొన్న "యువభారతి' వారి ధ్యేయ వాక్యం "చుట్టూరా ఆవరించుకొని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోకుండా ,ప్రయత్నించి చిన్నదీపాన్నయినా వెలిగించడం మంచిది"– ఇది యువభారతికే కాదు సాహిత్యాన్ని శ్వాసించి, ఉపాసించే వారందరికీ ఊపిరి..!! నిజానికి యువభారతి వెలిగించింది చిరు దీపం కాదు ,కోవెలలో వెలిగించే గండ దీపం!!

కాలం తెచ్చేమార్పులను, సమాజంలో సంభవించే పరిణామాలను, ఉద్యమాలను, చారిత్రక మార్పులను ఎప్పటికప్పుడు పరిశీలిస్తూ ,అందుకు అనుగుణమైన ప్రామాణిక గ్రంథాలను పాఠకుల అభిరుచికి అనువుగా రూపొందిస్తూ ప్రచురిస్తున్న "యువభారతి" మన తెలుగు జన జీవన స్రవంతిలో మిళితమై సాగుతున్న జీవనది. ఈ జీవనది లో నాబోటివారు చిన్న అలలవంటి వారేమో!!



# 'యువభారతి' నా పాలిట తక్షశిల

శ్రీ ఎర్రాప్రగడ రామకృష్ణ
పత్రికారచయిత, ప్రవచనకర్త, రాజమహేంద్రవరం
93979 07344

యువభారతి...!

పేరుకు మాత్రమే ఇది ఐదక్షరాల పదం. సాహిత్యరంగంలో అది మేరు పర్వతం. దాన్ని తలచుకున్నప్పుడల్లా నాకు పంచాక్షరిని జపించినంత ఉత్తేజంగానూ ఉంటుంది. అమ్మానాన్నలు నాచేత అఆలు దిద్దిస్తే యువభారతి నాకు గుణింతాలు నేర్పించింది. మనుగడకు ఎంతో అవసరమైన వ్యాకరణాన్ని బోధించింది. అద్భుతమైన ఆశయాలతో ఆవిర్భవించిన సంస్థ అది. పైగా యువభారతిలో నేను పనిచేసింది– ఆ సంస్థకు " స్వర్ణయుగం " గా చెప్పుకోదగిన డెబ్భైయవ దశకంలో. ఆచార్యులు జి.వి.సుబ్రహ్మణ్యం, ఇరివెంటి కృష్ణమూర్తి, వంగపల్లి విశ్వనాథం... వంటి దిగ్గజాలతో, గిరివృక్షాలతో నిత్యం కలసిమెలసి తిరగడం అంటే– వ్యక్తులతో తిరుగుతున్నట్లు కాదు, విశ్వవిద్యాలయాలతోనూ, సంచార గ్రంథాలయాలతోనూ కలసి నడుస్తున్నట్లు!

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి "కావ్య లహరి", డా. సినారె గారి "మందార మకరందాలు", ఆరుద్ర గారి "వేమన్న వేదం" లాంటి విజయవంతమైన పుస్తకాలు ఆవిర్భవించిన కాలమది. పూర్వాంధ్ర మహాకవుల కవిత్వ వ్యక్తిత్వాలను ఆవాహన చేసుకున్న మహెూన్నత వ్యాఖ్యాతల మధుర మైన ప్రసంగాలకు పుస్తకరూపాలవి. వాటికి అక్షరాకృతి కల్పించే కృషిలో, పుస్తకాలుగా రూపొందించే క్రమంలో నాకు కొంత భాగం ఉంది. ఆ భాగస్వామ్యమే ఇరవైరెండేళ్ల సరైన వయసులో నాకు సాహిత్యంపట్ల అభిరుచులను అలవరిచింది. బలపరిచింది. అందుకే అంటాను– "యువభారతి" నా పాలిట తక్షశిల అని! ఆ తొలివిత్తే నన్ను రచయితను చేసింది. గత నలభైఏళ్లలో నా రచనలు పదివేలకుపైగా అచ్చయ్యాయి. ముఖ్యంగా తెలుగు

రాష్ట్రాల్లోని అగ్రశ్రేణి దినపత్రికలో పదిహేనేళ్లుగా ఆదివారం ప్రత్యేక సాహిత్య సంపాదకీయాలను రచించేస్థాయి దక్కిందంటే యువభారతి ప్రభావం ఎంతటిదో మీరే అర్థం చేసుకోవచ్చు.

నన్ను నేను సమీక్షించుకుంటూ చెబుతున్న నామాట ఇది. జీవితంలో ఒకానొక కీలకమైన మలుపులో యువభారతి వంటి మహోన్నత సాహిత్య సాంస్కృతిక సంస్థతో పరిచయం బలపడితే ఎంతటి అద్భుతాలు జరుగుతాయో యువత గ్రహించడానికే నా "అవుట్ పుట్ " గురించి ప్రస్తావించాను. డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారికి తోడుగా అశోక్‌నగర్ లో నారాయణరెడ్డి గారింటికి, మాతృశ్రీ అపార్టుమెంటులో దాశరథిగారి దగ్గరికి, జ్ఞాన్‌బాగ్ ప్యాలెస్ లో గుంటూరు శేషేంద్రశర్మగారిని కలవడానికి ఎన్నిసార్లు వెళ్లానో! దారిలో డా. ఇరివెంటి– తెలంగాణ యాసతో ముద్దుముద్దుగా చెప్పే గంభీరమైన ఊసులన్నీ ఇంకా నాగుండెల్లో పదిలంగా కువకువలాడుతుండగా ఆ పెద్దల సంభాషణల్లోంచి జాలువారే అద్భుత చమత్కారాలు చెవిలో ఇంకా ప్రతిధ్వనిస్తుండగా ... ఆచార్య దివాకర్ల వారిని ప్రసంగాలకు తోడుకొని వచ్చే నెపంతో బర్కత్పురా నుంచి సైకిల్ పై వారి రిక్షాను అనుసరిస్తూ, బొగ్గులకుంటలోని ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాంగణంలోని యువభారతి సభావేదికకి అన్నిసార్లు వెంబడించిన తర్వాతకూడా – నేను రచయితను కాకుండా ఎలా ఉంటాను?

అందుకే యువభారతి పుణ్యమా అని నేను రచయితను కావలసి వచ్చింది. ఇదంతా 1973–74 కథ. దరిమిలా నాకు స్టేట్ బ్యాంకులో ఉద్యోగంవచ్చి యువభారతికి దూరం అయ్యాను. మళ్లీ ఇటీవల శ్రీ మలపాక పూర్ణచంద్రరావుగారి ప్రమేయంతో, డా. వంగపల్లి విశ్వనాథం గారిపై గురుభక్తితో, యువభారతిపట్ల కృతజ్ఞతతో– 'నేర్పుగా జీవించడం ఎలా?' అనే అంశానికి అంటే వ్యక్తిత్వవికాసానికి సంబంధించిన కొన్ని వ్యాసాలను యువభారతి పక్షాన పుస్తకంగా ప్రచురించే అవకాశం లభించింది. ఇది నిజంగా నాకు చాలా సంతోషకరమైన సందర్భం. గర్వకారణమైన అంశం. నన్నొక వక్తగా, రచయితగా దిద్దితీర్చిన యువభారతి సంస్థ షష్టిపూర్తి జరుపుకుంటున్న సందర్భంలో అభినందన చందనాలు.



# ఏడు రంగుల ఇంద్రధనుస్సు
# కావ్యలహరి

శ్రీ చీకోలు సుందరయ్య
పత్రికా రచయిత, హైదరాబాద్
90300 00696

యువభారతి గురించి, ఆ సంస్థ ప్రచురించిన పుస్తకాల గురించి ఆంధ్రదేశంలో తెలియని వారుండరు. 1963లో ఏర్పడిన యువభారతి తెలుగు భాషాసాహిత్యాలకు చేసిన సేవ నిరుపమానం. ఆ సంస్థ ప్రేరణతో నగరంలో చాలా సంస్థలు పురుడు పోసుకున్నాయి. నేను 35 సంవత్సరాలు వివిధ హోదాల్లో నిర్వహించిన 'రంజని' సంస్థ కూడా అదే సంవత్సరం ప్రారంభమైనా ప్రభుత్వ కార్యాలయంలో ఉన్న సంస్థ కాబట్టి 'కరోనా' కాలం నుంచి ఆ సంస్థ కార్యకలాపాలు బాగా తగ్గుముఖం పట్టాయి. 'రంజని'లో ఉన్నప్పుడు కూడా 'యువభారతి' ప్రేరణతోనే ఎన్నో కార్యక్రమాలు, పుస్తకాల ప్రచురణ చేపట్టాను. అయితే అది ప్రభుత్వ కార్యాలయంలో ఉన్న సంస్థ. ఎన్నో సమస్యలుంటాయి. 'యువభారతి' సహృదయ సాహితీమిత్రులు ప్రారంభించిన సంస్థ. ఎంతోమంది ఆచార్యులు, ఉపన్యాసకులు, సాహిత్య విద్యార్థులు సభ్యులుగా ఉన్న సంస్థ. నా నలభైయేళ్ళకుపైగా వున్న అనుబంధంలో ఓ నాలుగైదు సంవత్సరాలు 'యువభారతి' కొంచెం చురుకు తగ్గినా, నేనుకూడా 'యువభారతి' గురించి పత్రికల్లో వ్యాసాలు రాసినా, తదనంతర కాలంలో మళ్ళీ పూర్వస్థితికి చేరుకోవడం ఆనందదాయకం.

'యువభారతి' ప్రచురించిన 'మందార మకరందాలు' లక్ష ప్రతులను ప్రచురించాలని తలపెట్టిన విశిష్ట గ్రంథం. అది పోతన భాగవతానికి సంక్షిప్త రూపం కాబట్టి అందులో పెద్ద విశేషంలేదనే వారూ ఉన్నారు. 'లహరి' ప్రసంగాలు, పుస్తకాలు మాత్రం ఒక్క 'యువ భారతి'కే సొంతం! నిన్న మొన్న ప్రచురించిన 'మహాభారతోపన్యాసలహరి' కూడా. ఇప్పటికి రెండు వేలకు పైగా పుస్తకాలు అందించిన

యువభారతి తొలి రోజుల్లో ప్రచురించిన "కావ్యలహరి" ఎంతో ఆదరణ పొందింది. నాకు నచ్చిన పుస్తకాల్లో 'కావ్యలహరి' ఒకటి. ఆ కావ్యం గురించి చూద్దాం.

ఆచార్య దివాకర్ల వేంకటావధాని బహుకావ్య మర్మజ్ఞులు. రసదృష్టి పుష్కలంగా ఉన్న విమర్శకులు. ఆచార్య సి. నారాయణరెడ్డి అన్నట్లు – "ధారధారణాశక్తులను గంగా యమునలవలె సంగమింపచేసుకొని అంతఃసూత్రంగా సరస్వతిని గర్భీకరించుకున్న వైదుషీధనులు. వాగ్మిశిరోమణులు..." అటువంటి దివాకర్ల చేత యువభారతి ఏడు ప్రసంగాలిప్పించింది. శృంగార నైషధము, మనుచరిత్రము, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద, పాండురంగ మాహాత్మ్యము, వసుచరిత్రము, విజయవిలాసము – ఈ ఏడు కావ్యాలపై దివాకర్ల ప్రసంగాలను 'కావ్యలహరి'గా ప్రచురించింది. ఇప్పటికి ఎన్నోముద్రణలు పొందిన ఈ గ్రంథం చదివితే ఈ ఏడు కావ్యాలు చదివిన అనుభూతి కలుగుతుంది. అంత పరిజ్ఞానం అబ్బుతుంది అనడంలో సందేహంలేదు. దివాకర్ల వేంకటావధాని సంస్కృత భాషాభిమానులు, వ్యావహారిక భాష కన్నా, గ్రాంథిక భాషకే ప్రాధాన్యమిచ్చినవారు. ఆయన జీవించిన కాలంలో వ్యావహారిక భాష రాజ్యమేలింది కాబట్టి తప్పనిసరి పరిస్థితుల్లో శిష్ట వ్యావహారిక భాషలో రాయకతప్పింది కాదు. అయినా గ్రాంథిక భాషకే ప్రాధాన్యమిచ్చారు. ఆయన కావ్యలహరి వ్యాసాల్లో ప్రధానంగా –

* గ్రంథకర్తల వంశ పరిచయం, వారు జీవించిన కాలంనాటి స్థితిగతులు, రాజవంశాల ప్రోత్సాహం వంటివి ప్రస్తావనకొచ్చాయి.
* గ్రంథ ఇతివృత్తాన్ని గ్రంథకర్త ఎక్కడి నుంచి స్వీకరించారు. ఏవిధమైన స్వతంత్ర పోకడలు పోయారో తెలుస్తుంది.
* ఆయా కవుల శైలి, వారిని ప్రభావితం చేసిన పూర్వ కవులు వంటి అంశాలు ఉన్నాయి.
* ఆయా కావ్యాల్లో ప్రజాదరణ పొందిన ఘట్టాలు, పద్యాలు, వర్ణనలు ఉదాహరించారు.
* కావ్యాలకు సంబంధించిన సంక్షిప్త కథనం కూడా ఇవ్వడం విశేషం.

'శృంగార నైషధము'ను పరిచయం చేసే వ్యాసం – "సకల విద్యాసనాథ కవిసార్వభౌమ శ్రీనాథుని 'శృంగారనైషధము' అనే శీర్షికతో ప్రారంభమవుతుంది.

“తెలుగు సాహిత్యం సంస్కృతానువాదాలతోనే మొదలైనా, ధర్మనీతితత్త్వ ప్రధానములైన పురాణములను కాక, రసవర్ణన ప్రధానములైన సంస్కృత కావ్యములు ఆంధ్రీకరణమునకు శ్రీకారము చుట్టినవాడు శ్రీనాథుడే...” అంటారు దివాకర్ల. అంటే శృంగారానికి పట్టం కట్టినవాడు కూడా శ్రీనాథుడే అని అర్థం కూడా అందులో లేకపోలేదు. ఆ విషయాన్ని కూడా దివాకర్ల మరోచోట స్పష్టం చేశారు.

“తల్లి మదేక పుత్రక, పెద్ద, కన్నులు

గానవిప్పుడు మూడుకాళ్ల ముసలి...” వంటి పద్యాల్లో శ్రీనాథుడు చూపిన ఔన్నత్యాన్ని దివాకర్ల విశదీకరించడం విశేషం. కావ్యం మొత్తంలో శ్రీనాథుడు మూలానికి బద్ధుడైన సన్నివేశాలు, స్వతంత్రించినవీ కూడా దివాకర్ల విశదీకరించారు.

శిరీష కుసుమ పేశల సుధామయోక్తుల పెద్దనార్యుని ‘మనుచరిత్రము’ ఏవిధంగా ఆదర్శప్రాయమైన మహాకావ్యమైందో విశ్లేషించిన తీరు ఎంతో హృద్యంగా సాగుతుంది.

“నిక్కము దాపనేల ధరణీసుర నంద...”,

“ఏలర యీ చలంబుడిగి యేలర బాలరసాల...”,

“తంత్రీ నాకు ననుగ్రహింపగదె వైద్యంబంచు...”,

“శ్రీ వక్షోకురంగనాభమెదపై జెన్నొంద....”

“అంకముజేరి శైలతనయాస్తన దుగ్ధము...”

వంటి అనేక పద్యవిశేషాలు, కథాసంవిధానం తదితరాలను దివాకర్ల ఎంతో వివరంగా పేర్కొనడం గమనార్హం. పెద్దన నిజజీవిత విశేషాలు, రాయలతో అనుబంధం, పూర్వగాథ వంటివి ఆసక్తికరంగా సాగుతాయి.

ప్రబంధాల్లో పరిమాణంలో చిన్నదైనా “రసపరీమళములచే” ఆంధ్ర రసికుల్ని మైమరపించే కావ్యమందారం “పారిజాతాపహరణము”. ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు అది. ఇందులో కథ ఎలా సాగుతుందో వివరిస్తూ పలు విశేషాల్ని దివాకర్ల ఎంతో విశదంగా చర్చించారు. సంస్కృత హరివంశ గాథకు తిమ్మన ఏయే మార్పులు, ఎందుకు చేశారో దివాకర్ల చారిత్రక విశేషాలతోపాటు సోదాహరణంగా వివరించారు.

“ఈసునబుట్టిడెందమున హెచ్చిన శోకదవానలంబు...”

“అలినీలాలక! నీవు నీపతి రహస్య క్రీడ...”

"తూగెం జల్లని గాడ్పులేవీ ఫణిసందోహంబు...."

"బిసరుహపత్రలోచనకు బెల్లగుమోహము..."

"ఓర్వొక యింతలేని వికచోత్పల లోచన..."

వంటి పద్యాలతోపాటు తిమ్మన... ఏయే సందర్భాల్లో దీర్ఘవచనాలు రాశాడో, గర్భకవితలు, చక్రబంధాలు ఎందుకు రాశాడో కూడా దివాకర్ల చర్చించారు.

సాహితీ సమరాంగణ సార్వభౌముడు, శ్రీకృష్ణదేవరాయల "ఆముక్తమాల్యద' కర్తృత్వాన్ని కూడా ప్రస్తావించిన దివాకర్ల ఇది రాయల రచనయే అని నిరూపించడానికి గట్టిగానే ప్రయత్నించారు. విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించడానికి రాయలు ఆముక్తమాల్యద రాశాడంటూ, ప్రధాన కథతోపాటు అందులో ఉపాఖ్యానాలు, వర్ణనలను ప్రత్యేకంగా పరిశీలించాల్సిన అవసరం ఉందంటారు. రాయలకన్న సామాజిక స్పందన, కవితాభినివేశం, పాత్రపోషణలో ప్రదర్శించిన నైపుణ్యం, మత పరిస్థితులు, అన్నీ ఆముక్తమాల్యదను గొప్ప కావ్యంగా తీర్చిన విషయాన్ని దివాకర్ల స్పష్టం చేశారు. రాయల స్వతంత్ర పదప్రయోగాలు, సంధులు మొదలైన భాషాంశాలతోపాటు, కథాకథనం రమణీయంగా ఎలా సాగుతుందో కూడా విశదీకరించారు.

"పాండురంగ మాహాత్మ్యము"ను రామకృష్ణుని మహేంద్రకవితా విద్యాబల ప్రౌఢిగా చిత్రిస్తూ దివాకర్ల ఆ కావ్యంలోని విశేషాల్ని కొనియాడారు. "అతని (అంటే రామకృష్ణుని) భావనాశక్తి అపూర్వము; పదప్రయోగ నైపుణ్య మప్రతిమానము, ధారాశుద్ధి అమోఘము; పాండిత్య మఖండము. రచనలో నతనికున్నంత ఆత్మవిశ్వాసము పూర్వ కవులు యెందరిలోనే కనిపింపదు..." అంటూ రామకృష్ణుని కవితాభినివేశం పట్ల కొంత పక్షపాతం ప్రదర్శించారు దివాకర్ల.

"సాహిత్య రసపోషణ రామరాజభూషణ వసుచరిత్రము..." అనే వ్యాసంలో దివాకర్ల వసుచరిత్రను "అపూర్వ మహాకావ్యరత్నము"గా కొనియాడడం గొప్ప విశేషం. భట్టుమూర్తి పుట్టుపూర్వోత్తరాలు, కులగోత్రాలు, పెద్దనకు శిష్యుడైన విధానం మొదలైన విషయాల్లో లోకంలో చెలామణిలో ఉన్నవాటిని సైతం దివాకర్ల ప్రస్తావించారు. వసుచరిత్ర కృత్రిమ రత్నం కాదని, పుట్టురత్నమని సోదాహరణంగా వివరించారు. శ్లేష, ధ్వని వంటివి వసుచరిత్రలో ఎలా అంతర్భాగమయ్యాయో చర్చించారు. మహాకావ్యాలకు "తలమానికము"గా వసుచరిత్ర ఎలా నిలిచిందో విశ్లేషించారు.

ప్రతి పద్య చమత్కృతి చేమకూర వేంకటకవి "విజయవిలాసము" మనోహర

కావ్యం ఎలా అయ్యిందో దివాకర్ల సంగ్రహంగా వివరించారు... సంస్కృతాంధ్ర భాషల్ని సమంగా వాడినా తెలుగు పదాల కూర్పు ఎంత నైపుణ్యంగా, చమత్కారంగా సాగుతుందో దివాకర్ల వివరిస్తూ – చేమకూర వేంకట కవి – "లలిత మధురములు – సాభిప్రాయములునైన యలతి పదములతోడనే యాతడు గంభీరములైన యర్థముల వివరించుచుండును..." అంటూ కావ్యంలోని అనేక విశేషాల్ని క్రోడీకరించారు దివాకర్ల. ప్రాచీన కావ్యాల పట్ల సదభిప్రాయం ఉండి వాటిల్లో ఏముందో తెలుసుకోవాలనుకొనేవారికి 'కావ్యలహరి' ఎంతో ఉపయుక్తం. "చుట్టూరా ఆవరించుకుని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది..." అనే లక్ష్యంతో 'ఏర్పాటైన 'యువభారతి' కావ్యలహరి వంటి కావ్యాల ద్వారా ఆ లక్ష్యాన్ని నిజం చేసిందనడంలో అతిశయోక్తి కాదు.

ఆచార్య ఇరివెంటి కృష్ణమూర్తి, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, ఆచార్య సి. నారాయణరెడ్డి వంటి ఎందరో విశిష్టుల ఉపన్యాసాలు 'యువభారతి' వేదిక ద్వారా వినడం మరచిపోలేని అనుభవం.

వజ్రోత్సవ 'యువభారతి' అనేక వజ్రోత్సవాలు జరుపుకోవాలని కోరుకుంటున్నాను.



*అష్టమ వార్షికోత్సవాల సందర్భంగా 1971లో ఏర్పాటు చేసిన 'కావ్యలహరి' ఉపన్యాసమంజరిలో కేవలం 5 కావ్యాలను ఎన్నుకొనటం జరిగింది. అవి శ్రీనాథుని 'శృంగార నైషధం', అల్లసాని పెద్దనగారి 'మనుచరిత్ర', నందితిమ్మనగారి 'పారిజాతాపహరణం', భట్టుమూర్తిగారి 'వసుచరిత్ర', చేమకూర వేంకటకవిగారి 'విజయవిలాసము'.*

*18వ వార్షికోత్సవం సందర్భంగా మరి రెండు కావ్యాలు శ్రీకృష్ణదేవరాయలు గారి 'ఆముక్తమాల్యద', తెనాలి రామకృష్ణుని 'పాండురంగ మాహాత్మ్యము'ను చేర్చి ఏడు కావ్యాలతో 'కావ్యలహరి'ని పునర్ముద్రించడం జరిగింది. పాఠకులు గమనింతురు గాక*

*– సంపాదకులు.*

# యువభారతితో నా అనుబంధం

శ్రీమతి శీలా సుభద్రాదేవి
రచయిత్రి, హైదరాబాద్
81068 83099

స్వాతి ప్రారంభసంచికలో గౌరవసంపాదకునిగా శ్రీ శీలా వీర్రాజు గారి పేరు చూసి అభిమానిగా ఆయన రచనలగురించి నేను ఉత్తరం రాస్తే నాకు వారి కవితా సంపుటాలతో పాటు యువభారతి ప్రచురణ అయిన పంచవటి అనే అయిదుగురు కథకుల సంకలనాన్ని పంపించారు. అదే యువభారతితో పరోక్షంగా నా మొదటిపరిచయం.

తర్వాత "చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అనే యువభారతి ఆశయం నన్ను ఆకర్షించింది.

మంచి ఆశయంతో ధ్యేయంతో 1963లో విజయదశమి సెప్టెంబర్ 28 నాడు యువభారతి ఆవిర్భవించిందనే విషయాన్ని వివాహానంతరం ఆయన ద్వారా విన్నాను.

యువతరంలో సమాజహితం, సాహిత్యాభ్యుదయం పెంపొందింప చేయటానికి ప్రతీనెలా మొదటి ఆదివారం, మూడవ ఆదివారం కృషిచేస్తుండేదని వీర్రాజు గారు చెప్తూ ఉండేవారు. సాహిత్యంపట్ల,ఆసక్తి,పఠనాభిలాషని పెంపొందించే విధంగా అనేక సాహిత్య కార్యక్రమాలు నిర్వహించటమే కాకుండా ముఖ్యంగా తెలుగు భాషా విద్యార్థులకు సౌమనస్యం, సౌజన్యం , ఉన్నత భావాలను, నిర్మాణాత్మకమైన రీతిలో వ్యక్తిత్వాన్ని రూపొందించుకునేలా ప్రోత్సహిస్తుండేదనేది విని మరింత పులకించాను.

వీర్రాజు గారు ఉత్తరాల్లో ఎప్పటికప్పుడు యువభారతి కి వేయాల్సిన ముఖచిత్రాల గురించి చెప్తుండేవారు. వేసవి సెలవులకు హైదరాబాద్ వచ్చినరోజుల్లో నాకు చాలా సంతోషం కలిగించేదీ ఎదురుచూసేది ఆదివారం సాయంత్రం. ఎందుకంటే ఆదివారం రోజు ఆంధ్ర సారస్వత పరిషత్తులో యువభారతి నిర్వహించే 'కావ్యలహరి' ఉపన్యాస

పరంపర ఉంటుండేది. ఎప్పుడూ సాహిత్యసభలకు వెళ్ళలేదేమో నాకు ఉత్సాహంగా ఉండేది. 'కావ్యలహరి' పేరిట శృంగార నైషధము, మనుచరిత్ర , పారిజాతాప హరణము, వసుచరిత్రము, విజయవిలాస కావ్యాలపై ఉపన్యాస పరంపరగా ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారితో ఉపన్యాసాలను యువభారతి సారథులు ఇరివెంటి కృష్ణమూర్తి గారు,వంగపల్లి విశ్వనాథం గారూ నిర్వహించేవారు.

ప్రాచీన సాహిత్యం మీదే ఉపన్యాసాలు ఉన్నా గంభీరస్వరంతో ఆయన పద్యాలు చదువుతూ వివరించటం అద్భుతంగా అనిపించేది.మొదట్లో పరిషత్తు హాలులోనే జరిగే సభలకు తర్వాత్తర్వాత అశేషంగా జనం వచ్చి వరండాలోను బయటా నిండిపోవటమేకాక ముందు ఖాళీ ప్రదేశం లోనూ నిలబడి వినేవారు.దాంతో పరిషత్తు వెనుక ఆరుబయట వేదికపై ఏర్పాటు చేయటం మొదలుపెట్టారు.

ఉపన్యాసాలు సరేకానీ వాలంటీర్లుగా ఆ సమావేశం ఆవరణంతా గలగలా సందడిగా ఉత్సాహంగా ఎగిరే సీతాకోక చిలుకల్లా తిరిగే యువతీయువకులను చూస్తుంటే నాకు నా కాలేజీ గుర్తుకువచ్చి గుబులు అయ్యేది.వాళ్ళంతా కూడా సుమారుగా నా వయసు వాళ్ళు కావటం వలన వాళ్లలో నన్ను చూసుకుని మళ్ళా అలా తిరగ్గలనా అనిపించేది.చెవులు ఉపన్యాసం వింటున్నా ,నా చూపులు వారి వెనుకెనకే తిరిగేవి.

తర్వాత్తర్వాత ఆ యువభారతీయులైన సుధామ,నాగినేని భాస్కరావు, కె.బి.లక్ష్మి, కామేశ్వరరావు,రత్నమాల మొదలైన వారంతా మాకు కుటుంబమిత్రులు అయ్యారు.

యువభారతి ప్రచురణలు వందకి పైగానే ముఖచిత్రాలు వీర్రాజే వేసారు.మాపరిచయం అనంతరం మొదలుపెట్టిన వచన కావ్యం వివాహం తర్వాత పూర్తి చేసారు.అదే వీర్రాజుగారు రాసిన తొలి దీర్ఘ కావ్యం "మళ్ళీవెలుగు", నాకే అంకితం చేసారు. యువభారతి ప్రచురించిన మళ్ళీ వెలుగు కావ్యం ఆవిష్కరణ ఉగాది రోజున జరిగింది. ఈ పుస్తకావిష్కరణ సభ కి 1973 లో మూడునెలల పసిపాప పల్లవిని తీసుకొని హాజరయ్యాను.మాదంపతులకు యువభారతి సంస్థతో చిరకాల అనుబంధం నేటికీ కొనసాగుతూనే ఉంది.

1980 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం దూరవిద్య ద్వారా నేను తెలుగు ఎమ్మే చేసినప్పుడు యువభారతి ప్రచురణలే నన్ను ఆదుకున్నాయి.ఎందుకంటే అప్పట్లో మూడేళ్ళ మానసిక వికలాంగుడైన బాబుతో అంతర్ముఖీనమై ఒత్తిడికి గురైన స్థితిలో నేను బయటకు వెళ్ళలేక వీర్రాజు గారు ఇచ్చిన యువభారతి పుస్తకాలు, ఆరుద్ర

సమగ్ర ఆంధ్ర సాహిత్యం మాత్రమే చదివి రెండవ తరగతిలో ఉత్తీర్ణత సాధించానంటే యువభారతి ప్రచురణలు తెలుగు సాహిత్యానికి ఎంతటి సమగ్రమైన గ్రంథాలు అందించాయో అర్థమౌతుంది..

వీర్రాజు గారు యువభారతి ముఖచిత్రాలు వేస్తున్నప్పుడు ఎంతో తపోనిష్ఠతో వేయటం నేను చూసాను. అందులోనూ కావ్యలహరికి శిల్పవిన్యాసంలా అర్ధవలయాకృతిలో వేసిన ముఖచిత్రం మర్చిపోలేనిది.అది నాకెంతో నచ్చిన ముఖచిత్రం.సాహితీవేత్తలకూ, సావనీర్లకూ,ప్రభుత్వసంస్థలకూ చాలానే వేసినా యువభారతి అనే ఒకే ఒక సాహిత్యసంస్థకు వందకి పైగా ముఖచిత్రాలు వేయటం అన్నది ఒక రికార్డుగా చెప్పుకోదగినది.

అటువంటి యువభారతి సంస్థ ఈనాడు షష్ట్యబ్ది ఉత్సవం చేసుకొంటున్న సందర్భంలో ఈసంస్థతో విడదీయరాని బంధం గల శీలా వీర్రాజు గారి స్థానంలో నేను ఈ నాలుగు మాటలు రాస్తున్నందుకు ఒక కంట కన్నీటితో,మరోకంట ఆనందంతో హృదయపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాను. ✷




కథావాహిణి-1, 2 భాగాలను ఆవిష్కరిస్తున్న శ్రీ రావూరు వేంకట సత్యనారాయణరావు
చిత్రంలో-టి.కె.విజయ్‌కుమార్, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

# ఆలోచనలు - అక్షరాలు - ఆచరణలు

డా॥ వంగపల్లి విశ్వనాథం
వ్యవస్థాపక సమావేశకర్త, యువభారతి, హైదరాబాద్
79891 80414

"నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు" గుర్తుకొస్తోంది. నా ఆలోచనలు - దివ్య సుందర నాట్య మయూరాలు.

ఆలోచనలు - ఊపిరి సలపనివ్వవు. ఆలోచించే మనస్సు - ప్రశ్నలను వర్షిస్తుంది. ప్రశ్నించే మనసే ఆలోచనలను కొనసాగిస్తుంది. శ్వాస కొనసాగనిదే బ్రతుకు లేనట్టు - ఆలోచనలు కొనసాగనిదే భవిష్యత్తు లేదు.

నా దేశమంటే ఇష్టం - నా భాష అంటే ఇష్టం - నా సమాజం అంటే ఇష్టం. మానవత్వపు విలువల పరిమళాలు వెదజల్లే మనసులు అంటే ఇష్టం. పది కాలాలు భద్రంగా ఉండాలంటే - చేయవలసిన కృషి అంటే ఇష్టం.

60 ఏళ్ల క్రితం ఆవేశం పాలు ఎక్కువ - అనుభవం పాలు తక్కువ. సమాజాన్ని, సంస్కృతిని, సాహిత్యాన్ని, భాషను, కాపాడుకోవడానికి సాత్విక సాధనం - "స్వచ్ఛంద సంస్థ" అనే అభిప్రాయంతో - మంచి జరుగుతున్న చోట, మేలు జరిగే అవకాశం ఉన్నచోట, తన వంతు కృషిని అందించటం ప్రతి వ్యక్తి ధర్మం అనే భావనతో - పల్లకి మోయటానికి సిద్ధపడే వ్యక్తులలో మొదట నిల్చుందామనే ఆరాటం ప్రబలంగా ఉండేది.

వ్యక్తి మంచివాడైతే సమాజంలో మంచి పెరుగుతుందని - వ్యక్తిని ఉన్నత వ్యక్తిత్వం గల వ్యక్తిగా తీర్చిదిద్దగలిగితే సమాజాన్ని కాపాడుకోవడం సులభతరం అవుతుందనే అభిప్రాయంతో-సాహిత్య పఠనం, సత్సాంగత్యం, సమ్యక్ దృష్టి పునాదులుగా నిర్వహింపబడే కృషి, అందరి మేలును కోరే, అందరి సహకారాన్ని పొందగలిగే, కార్యక్రమంగా రూపుదిద్దుకో గలదన్న ఆకాంక్షతో- ఆనాడు నాకున్న ఆలోచనలు-60 సంవత్సరాల కాలంలో మెరుగులు దిద్దుకున్నవి కొన్ని - మరుగున పడ్డవి కొన్ని-మెరుపులు మెరిపించినవి కొన్ని-మార్చుకోవలసి వచ్చినవి కొన్ని.

– ఇంటింటి కొక పువ్వు ఈశ్వరుడికి ఒక మాల అన్నట్లు.

సొంత లాభం కొంత మానుకొని – సగటున కనబడుతున్న మంచికి ఒక మెట్టు పై మెట్టున ఉండే వ్యక్తిత్వాల నిర్మాణం జరిగితే – బాగుంటుందనిపించింది. చుట్టూరా ఆవరించి ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్ని అయినా వెలిగించటం మంచిది అన్న ఆలోచన పరిచయమైంది.

"అక్షర రూపము దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క లక్ష మెదళ్లకు కదలిక" కాళోజీ అన్న వాక్యం కదిలించగలిగింది. అందుకని, చక్కని వ్యక్తిత్వ నిర్మాణానికి, సమాజ హితానికి, సాహిత్యానికి మించిన సాత్విక సాధనం లేదు, ఉండదు, అనే ఆలోచనతో – ఆశయాల గురించి, ఆలోచనల గురించి, నచ్చచెప్పగలగటం గురించి, విశ్లేషణ సామర్థ్యం అభివృద్ధి పరచుకోవటం గురించి, పుస్తక పఠనం గురించి, కలం పట్టి నైపుణ్యానికి మెరుగులు దిద్దటం గురించి, గళం విప్పి ప్రభావోపేతంగా హృదయాన్ని తాకేలా మాట్లాడటం గురించి, ఆలోచనలను అక్షర రూపంలో అందించటం గురించి, ప్రజాస్వామ్య పద్ధతులను అవలంబించడం గురించి, సంయమనం గురించి, నలుగురిని కలుపుకుపోవటం గురించి –అచ్చు వేయటం మీద దృష్టి సారించిన రోజులవి.

ధరలు ఎక్కువగా ఉంటే కొని చదివే వారు నిరుత్సాహపడతారని, పుస్తకాల ప్రచురణ వ్యాపార ధోరణితో కాక, లాభార్జనాసక్తితో కాక, సమాజ హితానికి దోహదపడేలా ఉండాలంటే – ఒకపక్క కొనేవారికి వీలున్నంత తక్కువ ధరకు, వీలున్నంత ఎక్కువమందికి అందాలని – తమ ఆలోచనలతో ఉత్తేజపరిచే రచయితలకు మరింకింత ఎక్కువ ప్రాచుర్యం దొరికితే – వారు ఆనందిస్తారని, ఆశిస్తూ, ప్రచురణ పూర్వ విరాళాల పద్ధతిని విరివిగా వాడటం జరిగింది

ఆ రోజులు వేరు. కదిలిస్తే, కొందరైనా కదిలేందుకు సిద్ధంగా ఉండే రోజులవి. అందుకే యువభారతి సంస్థలో గాని, సాహితీమిత్ర, భారతీమిత్ర, భారతీభూషణ లాంటి పథకాలలో గాని వేలాదిమంది వెన్నుదన్నుగా నిలిచారు.

ఆ అభిమానం, ఆ ప్రోత్సాహం, రెండు దశాబ్దాల పాటు ఉరకలు వేయించింది. ఆరు దశాబ్దాలు నిలబెట్టింది. ఇచ్చిన మాట నిలబెట్టుకోవాలి అని భావించటం వల్ల, 700 పేజీలు ఉన్న మహతిని ప్రకటించిన ప్రచురణ పూర్వ విరాళం ఏడు రూపాయలకే అందించటం లోని కష్టనష్టాలు ఎన్నో ఇబ్బందులకు గురిచేశాయి. అప్పుల ఊబిలో ఇరుక్కుని బయటపడటానికి పడిన పాట్లు, మరే సాహిత్య సంస్థ అనుభవంలోనూ ఉండి ఉండవు.

క్రమశిక్షణ మీద అభిమానం పెరిగింది. సమయపాలన మీద దృష్టి నిలపాలనే ధ్యాస  పెరిగింది. ఏదో ఒక వ్యక్తికి లేదా వర్గానికి చెందిన జేబు సంస్థగా కాక – విలక్షణ వ్యక్తిత్వంతో వ్యవహరించాలని నిర్ణయం జరిగింది.  కార్యక్రమాలను ఆత్మీయంగా నిర్వహించాలని, పుస్తకాలను అందంగా అచ్చు వేయాలని, పట్టుదలతో వ్యవహరించడం పెరిగింది. సభ్యులందరూ చేసిన త్యాగాలు మరువలేనివి.

పెద్దల ఆశీస్సులు, సహృదయల అభిమానాలతో పాటు "రామదండు" లాంటి ఒక బలగం సమకూరింది. 40  – 50 మంది సభ్యుల బృందం, రోడ్డు పక్కన,  యువభారతి అరుగులపై కూర్చుని చిరునవ్వుతో చక చకా పనులు చేసిన రోజులవి.  అందుకే స్వచ్ఛంద సంస్థలు పూనుకుంటే కాని సమాజం మెరుగుపడదని నమ్మకం కలిగింది.

అవి ఆనాటి రోజులు. కాలం మారింది. సాంకేతికత పుణ్యమా అని అనేక వ్యాపకాలు కొత్తగా ఏర్పడ్డాయి. పుస్తక పఠనం తగ్గింది. డబ్బు మీద యావ ఎక్కువైంది. సంపాదన మీద ఆసక్తి ఇబ్బడి ముబ్బడిగా పెరిగింది. యువతరాన్ని ఆకట్టుకునే విషయాలు వేరుగా ఉన్నాయి. అయినప్పటికీ, వ్యక్తిత్వ వికాస కార్యక్రమాల పేరిట నగర కేంద్ర గ్రంథాలయంలో దాదాపు 20 సంవత్సరాల పైచిలుకు నెలవారీ సమావేశాలను ఏర్పాటు చేసి కొంత కృషి చేయడం జరిగింది. కోవిడ్ దెబ్బకు విలవిలలాడిన విష ప్రభావాలకు తట్టుకొని నిలబడగలిగాము.

ఎన్నో ఎన్నెన్నో గుర్తుకు వస్తున్నాయి. యువభారతి తొలినాళ్ళ గురించి మా వరిష్ఠ సభ్యులు, ఈ వజ్రోత్సవ సంచిక గౌరవ సంపాదకులు అయిన శ్రీ సుధామ గారు సవిస్తరంగా తెలియపరిచారు. అందుకని, ఆ విషయాలను ప్రస్తావించడం లేదు.

డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి గారి సాహచర్యం ఎన్నో విషయాలను నేర్పింది. సంస్థకు ప్రాణం పోసింది. డాక్టర్ జీవీ సుబ్రహ్మణ్యం గారి నాయకత్వ లక్షణాలు యువభారతి కృషి కొనసాగింపునకు దోహదం చేశాయి. తన ఆత్మీయతతో మెరుగులు దిద్ది యువభారతిని కాపాడిన వారు మా తిరుమల శ్రీనివాసాచార్యులు గారు. ఆ తర్వాత మాలో ఒకరిగా ఉంటూనే అధ్యక్ష స్థానానికి ఎదిగిన మా మాడభూషి అనంతాచార్యులు గారు. ఇలాంటి అమృత హృదయాలు ఉసురుపోసిన కార్యక్రమాలను కొనసాగించటానికి, నేడు కవిమిత్రుడు ఆచార్య ఫణీంద్ర గారు – ఇప్పుడు ముందుండి

నడిపిస్తున్నారు. అధ్యక్షుల పేర్లను మాత్రమే ప్రస్తావించి మిగిలిన వారి పేర్లు ప్రస్తావించకపోవడం నేరమే. ఆ నేరం చేయటానికి కారణం గ్రంథ విస్తరణ భీతి.

గ్రామీణ ప్రాంతాలలో ఉత్సవాల సమయాలలో దేవుని రథం కదిలేది. వందలాదిమంది భక్తితో, సమష్టిగా కృషి చేస్తే తప్ప రథం కదిలేది కాదు. అలానే, వందలాదిమంది "యువభారతి" పల్లకి మోసిన మిత్రులందరికీ సవినయ నమోవాకాలు. పదవులు కాదని, పనులు ముఖ్యమని తలచి నిలచిన వారందరికీ – ఏమిచ్చి ఋణం తీర్చుకోగలం?

మరుస్తే గదా గుర్తుకు తెచ్చుకునేది – ఆచార్య దివాకర్ల వారిని, ఆచార్య నారాయణ రెడ్డి గారిని తప్పకుండా తలచుకోవాలి. యువభారతికి గొడుగు పట్టినట్టు నీడనిచ్చి కొండంత అండగా నిలిచిన మాన్యులు శ్రీ దేవులపల్లి రామానుజ రావు గారు. వారి సాహిత్య పరిషత్ ప్రాంగణాన్ని మొత్తం యువభారతి వాడుకునే చనువు ఇచ్చారు. యువభారతిని ఎదగనిచ్చారు.

ఎంత చెప్పినా తక్కువే.

నేనున్నాను అని చెప్పేవారు చాలా చాలా తక్కువ సంఖ్యలో ఉంటారు. తమ వ్యక్తిత్వంతో యువభారతిని కాపాడిన వారు డాక్టర్ కె.వి.రమణాచారి గారు. తమ వదాన్యతతో, వరదహస్తాన్నిఅభయ ముద్రగా మలుచుకున్నవారు డాక్టర్ కె.ఐ వరప్రసాద్ రెడ్డి గారు

తీర్చుకోలేని ఋణమని తెలుసు. ఏనాటి ఋణమో అని ప్రక్కన పెట్టడం లేదు. రానున్న జన్మలలో, స్వామి కృపతో, ఋణం తీర్చుకోవటానికి నిశ్చల మనసుతో ప్రార్థన చేస్తాను.

ఆశలు – ఆశయాలను రూపుదిద్దటంలో పాత్ర వహిస్తాయి. ఆశయాలు – ఆచరణకు స్ఫూర్తినిస్తే – ఆ స్ఫూర్తి పది కాలాల పాటు కొనసాగాలని, ఎదగాలని, ఆశయసిద్ధి పొందాలని,

ఆ దేవదేవుని వేడుకుంటో –

రాయి రాయి కి మధ్య పరాయితనము తగ్గింపగా ఉడుత రాల్చినట్టు ఇసుక మాదిరిగా – సమాజంలో మంచిని నిలబెట్టడంలో యువభారతి చేసిన సాహిత్య కృషి కొంత మేలు చేసిందని భావిస్తున్నాము. మా యువభారతీయుల మంచితనమే మాకు శ్రీరామరక్ష అని విన్నవిస్తూ ...

ఇదంతా నా గొడవగా మనవి చేసినట్లు అనిపించినట్టుంది.

రచన, కావ్యలహరి, మహతి, ప్రచురణల సందర్భంలో రాసిన ప్రేరణ గుర్తుకొస్తోంది. మా సుధామ చెప్పినట్లు – “విశ్వం అన్నయ్య” గా యువభారతి నన్ను ఆదరించింది. సహృదయ మిత్రులందరికీ – గర్వం లేదని, రాలేదని, రాదని, – ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు.

“కారే రాజులు” గుర్తుకువస్తోంది.

భవిష్యత్తు సుసంపన్నంగా, ఉజ్జ్వలంగా ఉండాలని, సమాజ హితాన్ని కోరే సాహితీ సంస్థగా యువభారతి నిలవాలని, మనసారా ప్రార్థిస్తూ, సజల నేత్రాలతో విన్నపాలు.





యువభారతి సభ్యులు (1973)

# యువభారతి సంస్థతో నాకున్న అనుబంధం

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య
గౌరవాధ్యక్షులు, యువభారతి, హైదరాబాద్
99493 65903

నేను 1970లో హైదరాబాద్‌కు వచ్చినాను. నా భార్య శ్రీమతి కిళాంబి స్వరాజ్యలక్ష్మి. ఉస్మానియా పట్టభద్రుల సంఘం వారి అధీనంలో ఉన్న కమలానెహ్రూ మహిళా పాలిటెక్నిక్ కళాశాల (ఎక్సిబిషన్ గ్రౌండ్)లో లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తుండేది. నేను సిద్దిపేట ప్రభుత్వ డిగ్రీ కాలేజీలో తెలుగు లెక్చరర్‌గా పనిచేస్తూ ఉంటిని. నేనూ నా భార్య ఒక్క దగ్గరే ఉండాలనే ఉద్దేశంతో సిద్దిపేట కాలేజీలో రాజీనామా చేసి, సికింద్రాబాదు-పద్మారావ్ నగర్‌లోని సర్దార్‌పటేల్ డిగ్రీ కళాశాలలో చేరి తెలుగు శాఖాధిపతిగా పనిచేస్తూ ఉంటిని.

ఈ సందర్భంలోనే (1970లో) మా కాలేజీలో బి.కాం చదువుతున్న విద్యార్థి చి॥ తాళ్లపల్లి మురళీధర్ ద్వారా నాకు 'యువభారతి' అనే సుప్రసిద్ధ సాహితీ సాంస్కృతిక సంస్థతో అనుబంధం ఏర్పడింది. 'యువభారతి' సంస్థాధ్యక్షులు డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారితో, సంస్థ కార్యదర్శి శ్రీ వేంకటేశ్వరరావుగారితో, సహాయ కార్యదర్శి శ్రీ అయల సోమయాజుల నాగేశ్వరరావు గారితో, కోశాధికారి ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారితో, యువభారతి ప్రచురణల గౌరవ సంపాదకులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారితో, యువభారతి ప్రచురణల ముఖపత్రకారులూ కవీ రచయిత, చిత్రకారులు శ్రీ శీలా వీర్రాజుగారితో అనుబంధమేర్పడింది. యువభారతి వారు నిర్వహించే పక్ష సమావేశాలలో చురుకుగా పాల్గొనడం జరిగింది. ఫలితంగా నన్ను యువభారతి మిత్రులు, సభ్యులుగా చేర్చుకొని, గౌరవించినారు. తరువాత క్రమంగా యువభారతి ఉపాధ్యక్షులుగా, అధ్యక్షులుగా ఎన్నుకొన్నారు. ఈ సంస్థలో శ్రీ సుధామ

(శ్రీ అల్లంరాజు వేంకట్రావు), శ్రీ జయరాములు, శ్రీ రవీంద్ర, శ్రీమతి కె.బి.లక్ష్మి, మున్నగువారు సభ్యులుగా ఉండిరి. వీరందరూ నాకు ఆప్తమిత్రులైనారు. ఇప్పటికీ నన్ను 'యువభారతి' మిత్రులు–శాశ్వత గౌరవాధ్యక్షులుగా ఎన్నుకొని, గౌరవిస్తున్నారు. అందుకు నేనెంతో కృతజ్ఞుణ్ని.

'యువభారతి' సంస్థ వార్షికోత్సవాల సందర్భంగా ఉపన్యాసముల నేర్పాటు చేసింది–వాటిని 'లహరి' ఉపన్యాస కార్యక్రమం' అని సంభావించడం జరిగింది. 'కావ్యలహరి, చైతన్యలహరి, ప్రతిభాలహరి' – ఇలా. ఈ 'లహరీ' కార్యక్రమంలో ఆ ఉస్మానియా విశ్వవిద్యాలయ–ఆంధ్రశాఖాధ్యక్షులూ, ఉభయభాషా సాహిత్య విశారదులూ, మహావక్తలూ ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు పాల్గొని పుస్తకం చూడకుండా శతాధిక పద్యాలను గానంచేసి, ప్రేక్షకులను ఉద్రూతలూగించేవారు. సాహిత్యాభిమానులు వారి మహోపన్యాసాలను వినడానికి ఆంధ్రసారస్వత పరిషత్తు వెనుక భాగంలో ఉన్న స్థలంలో ఏర్పాటు చేసిన మహాసభలకు, అరగంటముందే వచ్చి కూర్చునేవారు– తరువాత ఆలస్యమైతే సీటుదొరకదన్న భావంతో.

“సమయం సాయంకాలం 6 గంటలు కావస్తున్నది. యువభారతి సభ ప్రారంభమవుతున్నది” అని ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు స్వాగతవచనాలను పలికేవారు. తరువాత 'ప్రస్తావన' పేరుతో సభలో ప్రసంగించబోయే వక్తల గూర్చి ప్రశంసాత్మకంగా పరిచయం చేసేవారు– యువభారతి సభ్యులలో ఒకరు. ఉపన్యాసం చివరకు 'వందన సమర్పణం' జరిగేది. ఇలా సభ చక్కని నియమ నిబంధనలతో సాగేది. యువభారతి అధ్యక్షులు డా. ఇరివెంటి కృష్ణమూర్తిగారు, స్వాగత, ప్రస్తావన వందన సమర్పణలను గూర్చి చక్కగా వ్రాయించి, సభ్యుల చేత సభలో ప్రసంగింపజేసేవారు, ఎక్కడా తప్పులు దొరలకుండా, ప్రస్తావనాదులను సభాప్రారంభానికి ముందే చదివిపించేవారు సభ్యుల చేత. అంత జాగ్రత్త పడేవారు సభానిర్వహణలో. సభలకు అధ్యక్షులుగా, ముఖ్యఅతిథులుగా, ప్రసిద్ధ వక్తలు వచ్చేవారు. ఒకసారి – దివాకర్లవారు 'వసుచరిత్ర' గూర్చి మహోపన్యాసం చేస్తుంటే, వర్షం ప్రారంభమైంది. ఒక్కరు కూడా లేవకుండ, గొడుగులు పట్టుకొని కూర్చుని విన్నారు. ఆ సన్నివేశం ఇప్పటికీ మరపురాకుండా ఉన్నది. ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణంలో అన్ని వైపులా వినిపించేటట్లుగా మైకులు ఏర్పాటు చేసేవారు యువభారతీయులు. కరెంటు ఆగిపోతే – జనరేటరును ఏర్పాటు చేసేవారు ఏ సమయంలో విద్యుత్తు

ఆగిపోతుందో ఏమో అని ముందే ఊహించి. తెలుగు ప్రజలకు సాహిత్యంమీద ప్రేమాభిమానాలూ, అభిరుచులూ కలుగడానికి ఎంతో ప్రయత్నం చేసింది 'యువభారతి'. ఆంధ్ర సారస్వత పరిషత్తులో జరిగే ఈ సభలకు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి అధ్యక్షులు గౌరవనీయులు డా. బెజవాడ గోపాలరెడ్డి గారూ, ఆంధ్ర సారస్వత పరిషత్ అధ్యక్షులు శ్రీయుతులు దేవులపల్లి రామానుజరావుగారూ ముఖ్య అతిథులుగా, గౌరవ అతిథులుగా వచ్చేవారు. జరుగుతున్న కార్యక్రమాలను గూర్చి తమ అభిప్రాయాలను వ్యక్తపరచేవారు. మహామహోపాధ్యాయ శ్రీ తల్లావఝల శివశంకరశాస్త్రిగారు, కరుణశ్రీ శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు, మహాకవి, స్వాతంత్ర్య సమరయోధులూ డా॥ దాశరథిగారూ, 'జ్ఞానపీఠ' పురస్కార గ్రహీతలు ఆచార్య సి.నారాయణరెడ్డిగారూ యువభారతి మహాసభలలో వివిధాంశాలను గూర్చి ప్రసంగించేవారు. సభను పులకింపజేసేవారు తమ వాగ్ధాటితో. ఎవరి ఉపన్యాసధోరణి వారిది.

నేను 'యువభారతి' అధ్యక్షునిగా ఉన్నప్పుడు, సమకాలిక కవులను పండితులను ఆహ్వానించి, వారిచే 'స్వీయకావ్యగానం' ఏర్పాటు చేసినాను. ఆ వరుసలో శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య, శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ, శ్రీ బోయి భీమన్న వంటి వారిని ఆహ్వానించి, వారిచే కావ్యగానాన్ని చేయించి, ఆ ఉపన్యాసాలు చిరకాలం ఉండేటట్లు ఆడియో వీడియో రికార్డులు ఏర్పాటుచేసినాను. అయితే అవి చాలా ఖర్చుతో కూడుకున్న కార్యక్రమం అయినందున, కొద్దికాలమే నడిచింది. తరువాత ఆగిపోయింది. ఏమైతేనేం, సహృదయ ప్రేక్షకులకు సాహిత్యాభిరుచి ఏర్పడడానికి చేసిన ప్రయత్న విశేషమది. ఈ కార్యక్రమం నగర కేంద్ర గ్రంథాలయంలో (త్యాగరాయగానసభ సమీపంలో) జరిగినది.

ఏమైతే ఏమి? సభానిర్వహణ ఎలా జరుపాలో నేర్పింది 'యువభారతి' సంస్థ. విశేషించి ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు సభకు వక్తలను ఆహ్వానించి, మళ్లీ వారిని వారి వసతి గృహములో కారులో లేదా ఆటోలో పంపి రావడానికి ఏర్పాట్లు చేసేవారు. తరువాత చిన్న సమావేశం జరిపి, సభలో ఏమైనా లోటుపాట్లు జరిగినాయా అని అందరం కూర్చొని విశ్లేషించడం పరిపాటిగా ఉండింది.

ఏమైతేమి? 'యువభారతి' సంస్థ విశేషించి ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు – సభానిర్వహణ విధానాన్ని నావంటి సభ్యుల కందరికీ నేర్పినారు అనడంలో సందేహం

లేదు. వారి పేరు వంగపల్లి విశ్వనాథం అయితే – 'విన్నపాల విశ్వనాథం' అని సార్థకమైన పేరు ఏర్పడింది అనడం అతిశయోక్తి కాదు, అత్యుక్తి కాదు.

ఇప్పటికీ – నాకు 85 సంవత్సరాల వయస్సున్నా, 'యువభారతి' సంస్థ అంటే పులకించిపోతాను. 'సభానిర్వహణ' విధానాన్ని నేర్పిన ఆ సంస్థ విశేషించి, ఆచార్య శ్రీ వంగపల్లి విశ్వనాథంగారికి జీవితాంతం ఋణపడి ఉంటాను. జీవితాన్ని సాహిత్యానికి ఎలా అంకితం చేసుకోవాలో నేర్పిన 'గురువు' ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు. 'యువభారతి'తో నాకున్న అనుబంధం జీవితాంతం నిలిచిపోతుంది.

'యువభారతి' సంస్థతో నాకున్న 'అనుబంధం' గూర్చి ఈ నాలుగు మాటలూ వ్రాయించిన యువభారతి సంస్థ అధ్యక్షులు ఆచార్య ఫణీంద్రగారికి సర్వదా కృతజ్ఞుణ్ని.





'మహతి' గ్రంథావిష్కరణ సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ పి.వి.నరసింహారావును యువభారతి చిహ్నంతో అలంకరిస్తున్న యువభారతి సభ్యులు శ్రీ మాడభూషి రంగాచార్యులు. వేదికపై డా॥ దాశరథి

# యువభారతితో నేను

శ్రీ సింగంపల్లి వెంకటేశ్వరరావు
పూర్వ కార్యదర్శి, యువభారతి, హైదరాబాద్
95815 48593

1967–68లో యువభారతికి నన్ను పరిచయం చేసినవారు కీ॥శే॥ శ్రీ సి.వి.ఎ.ఎస్. సూర్యనారాయణ గారు, వారు అప్పటి యువభారతి కార్యదర్శి, శ్రీ కృష్ణదేవరాయంధ్ర భాషానిలయంలో జరుగుతున్న పక్ష సమావేశాలలో పాల్గొనటం, అప్పుడప్పుడు 'క్లుప్తగోష్ఠి' నిర్వహించటం, సమావేశాలకు వచ్చిన అతిథులను పరిచయం చేయటం, సభ్యత్వ రుసుము వసూలు చేయటం మొ॥నవి నేను చేసిన పనులు, సికింద్రాబాద్ లోని ఎమ్. శేషాచలం & కంపెనీ నుండి అందరూ చదువదగ్గ కథలు, నవలలు మొ॥ పుస్తకములు తెచ్చి సభ్యుల కిచ్చి మరుసటి సమావేశంలో వాటిపై చర్చించేవాళ్ళం. నాకు బాగా గుర్తు రెండు రూపాయలు పుస్తకం ధర ఉండేది. ఉత్తమ వక్తకి ఒక పుస్తకం బహుమతిగా ఇచ్చేవాళ్లం. ఆ సమావేశాల్లో అధ్యక్షులు కీ॥శే॥ డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారు, సమావేశకర్త ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారు. సాహిత్యోపాసకులు అయిన కొంతమంది చేసిన ప్రసంగాలు ఎంతో ఉత్తేజంగా, ఆసక్తిదాయకంగా ఉండేవి.

తెలుగు నాట పుస్తక పఠనం పెంపొందాలని 'పుస్తక పథకం'ని నిర్వహించి రూ. 5/– కట్టిన వారికి వారు కోరుకున్న రెండు పుస్తకాలను పంపేవాళ్ళం. తెలుగు రాష్ట్రాలలోని వారే కాక, ఇతర రాష్ట్రాలలోని వారు ఆ పథకంలో చేరారు. నెమ్మది, నెమ్మదిగ ప్రవేశపెట్ట వద్ద సాహితీమిత్ర, భారతీమిత్ర, భారతీభూషణ, పథకాల కింద ఎక్కువ మంది చేరి సంస్థ ఆర్థికంగా నిలబడేటట్లు చేశారు.

1967–68 ప్రాంతంలో సంస్థ విషయాలు చర్చించుకోవటానికి సాయంకాల వేళ, సెలవు దినాల్లో మిత్రులం కొంతమంది 5, కింగ్స్ వే లోని శ్రీ విశ్వనాథం గారింటికి వెళ్ళేవాళ్ళం, పనిమధ్యలో కొంత విరామం తీసుకొని శ్రీ విశ్వనాథం గారు

ఆనంద భవన్ లాంటి హెూటళ్ళలో మాకు ఫలహారం పెట్టించేవారు. మిత్రులం వారి చేత అకౌంట్స్ సబ్జెక్ట్ చెప్పించుకోవటం కూడ జరిగింది.

శ్రీ విశ్వనాథం గారింటికి వెళ్తున్నప్పుడు కీ॥శే॥ శ్రీ కాళోజి నారాయణరావు గారి దర్శనం కూడా మాకు లభించింది. శ్రీ కాళోజి గారి 'జీవన గీత' ఆవిష్కరణ సభ కోఠి లోని వుమెన్స్ కాలేజిలో జరిగింది. మొదట్లో సంస్థ లిఖిత మాసపత్రికను నడిపింది. శ్రీ సుధామ' రచనలు, కార్టూన్లు ఆ పత్రికకు వన్నె తెచ్చాయి.

యువభారతికి ఎంతో ప్రాచుర్యం కల్గించినవి 'లహరి' ఉపన్యాస కార్యక్రమాలు, ఉపన్యాసాలను పుస్తకంగా వెలువరించి అతి చౌకగా పుస్తక ప్రియులకు అందజేయటం జరిగింది. 1971లో మొదటగ ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారిచే "కావ్యలహరి' ఉపన్యాసాలను ఏర్పాటు చేసింది సంస్థ. వారు ఎంతో సహృదయతతో 7 కావ్యాలపై తాము ఒక్కరే ఉపన్యసించటానికి ఒప్పుకున్నారు. వారి ప్రసంగ నైపుణ్యాన్ని ఇప్పటికీ సాహితీ ప్రియులు గుర్తు తెచ్చుకుంటుంటారు.

5 రూపాయలకు పుస్తకంతో పాటు, పేరొందిన సినిమా బెనిఫిట్ షో వేసి ఉచిత ప్రవేశం కల్పించాము. దివాకర్ల వారి ఉపన్యాసాలను శ్రోతలు వానలో గొడుగులు వేసుకుని విన్నారు. అలాగే, కూర్చొనటానికి వీలుగ పక్కనున్న ఓరియంటల్ కాలేజీలో మైకులు ఏర్పాటు చేస్తే ఇబ్బంది పడకుండా విన్నారు. కావ్యలహరి పుస్తకం మూడవ ముద్రణకి నోచుకుని, ఇప్పటి వరకు 15,000 కాపీలు అచ్చువేయటం జరిగింది. శ్రీ విశ్వనాథంగారి "విన్నపాలు" వినవలెనని శ్రోతలు చాలామంది అంటుండేవారు.

'కావ్యలహరి' కార్యక్రమానికి అటు ఇటుగా జరిగిన 'రచన' (1970), యువత (1985) సదస్సులు రచయితలను, యువతను సంస్థతో అనుబంధం పెంచుకునేలా చేశాయి. ఆ సదస్సుల సమయంలో ఏర్పాటు చేసిన భోజనం ఏర్పాట్లు ఆహూతులకు ఏంతో తృప్తినిచ్చాయి.

1985 ఫిబ్రవరిలో 'యువత' సదస్సు నిర్వహించబడింది. ముఖ్యఅతిథిగా స్థానిక రామకృష్ణమఠం అధిపతి శ్రీ స్వామి రంగనాథానంద విచ్చేసారు. సదస్సు 1985లో నిర్వహించబడినప్పటికి, యువత వ్యాస సంకలనం 1991 మార్చిలోగాని తీసుకురాలేక పోయాము.

సంస్థ చేపట్టిన మరో ముఖ్య కార్యక్రమం 'సాహితీవాహిని' పుస్తకాల ప్రచురణ. ప్రాచీన కవుల మీద, ప్రాచీన గ్రంథాలపై పేరొందిన సాహితీవేత్తలచే సామాన్యులకు అర్థమయ్యేలా ఎన్నో రచనలు చేయించి చౌకధరకి అందించటం. ఈ వరుసలో మొదట వచ్చిన ప్రచురణ మందార మకరందాలు. ఎంతో మంచి మనసుతో డా. సి. నారాయణరెడ్డి గారు పోతన భాగవతంలోని 52 పద్యాలకు సుమధురమైన వ్యాఖ్యానం చేసిన మంచి పుస్తకం, మందార మకరందాలు. ఈ పద్యాలను ఎన్నో పాఠశాలల్లో విద్యార్థులచే కంఠస్థం చేయించి తెలుగుభాషపై ఉన్న సదభిప్రాయాన్ని చాటారు, ఎంతోమంది ఉపాధ్యాయులు. ఇప్పటికి ఈ పుస్తకం లక్ష మంది అభిమానుల గృహాలకు చేరుకుంది. తెలంగాణ ప్రభుత్వం ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించినప్పుడు తెలంగాణా సాహిత్య అకాడమీ ఈ పుస్తకాన్ని 10,000 కాపీలు ముద్రించి సభలలో ఉచితంగా పంచింది.

**'మహతి' ప్రచురణ :** స్వాతంత్ర్య యుగోదయం (1947-72) లో తెలుగు తీరుతెన్నులపై 100 ప్రముఖుల వ్యాసాలు 'మహతి'లో చోటుచేసుకున్నాయి. 'ప్రతిభ' విభాగంలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు మరియు శ్రీశ్రీ గారు అందించిన వారి వ్యాసాలు ఉన్నాయి. వాటి కొరకు సంపాదకవర్గం ఎంత కష్టపడ్డదీ నేను ఎరుగుదును. ఈ గ్రంథాన్ని కొన్ని విశ్వవిద్యాలయాలు పరామర్శ గ్రంథం (రిఫరెన్స్ బుక్) గా విద్యార్థులకు సూచించాయి. 700 పేజీలు గల ఈ పుస్తకాన్ని ఏడు రూపాయలు ప్రచురణ పూర్వ విరాళం అందించిన సహృదయ పాఠకలోకానికి ఉచితంగా సంస్థ అందించింది. 12,000 ప్రతులు ముద్రించబడ్డాయి.

ఆగష్టు 2022లో వెలువడిన ద్వితీయ ముద్రణకు శ్రీ కూర రఘువీర్ గారు (ఐ.ఐ.ఎమ్.సి. ప్రిన్సిపాల్) వారి సేవా సంస్థ రంగయ్య నీలావతి ఫౌండేషన్ ద్వారా పూర్తి ఆర్థిక సహాయాన్ని అందజేశారు. వారికి యువభారతి సభ్యులు కృతజ్ఞతతో ఉన్నారు. కానీ, 2008లో అప్పటి తెలుగు అకాడమి ఈ గ్రంథంలోని 60 వ్యాసాలను మాత్రమే ఎన్నుకొని 'మహతి' పేరిట ముద్రించుకోవటం కొంచెం బాధ కలిగించింది.

1972లో 'మహతి' పుస్తక ముద్రణలో సంస్థ ఎంతో కష్టపడ్డది, నష్టపడ్డని, వ్యాసాలు సకాలంలో రాక, పుస్తక ఆవిష్కరణ దగ్గర పడుతుండటంతో మూడు, నాలుగు ప్రెస్సుల్లో వ్యాసాలను ముద్రింపచేయటం, సకాలానికి బైండింగ్ అయి పుస్తకాలు చేతికి అందకపోవటంతో ప్రచురణ పూర్వ విరాళాలు అందించిన వారికి

పుస్తకాలను సకాలంలో అందించకపోవటం జరిగింది. ఆర్థిక ఇబ్బందులను తట్టుకోవటానికి శ్రీ విశ్వనాథం గారు, శ్రీకృష్ణమూర్తిగారు సంస్థకోసం కొన్ని అప్పులు కూడ చేయటం జరిగింది. ఈ గ్రంథ ప్రచురణ వల్ల సంస్థ మంచిపేరు సంపాదించుకున్నా ఆర్థికంగా బాగా దెబ్బతిన్నది.

యువభారతి రజతోత్సవాలు 1991-92లో జరిగాయి. అధ్యక్షులు కీ॥శే॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారు ఎందరో సాహితీవేత్తలను కూడగట్టుకొని పలు కార్యక్రమాలను జరిపారు. రజతోత్సవసంఘ అధ్యక్షులుగా ప్రముఖ వాస్తుశిల్పి శ్రీ బి.ఎన్.రెడ్డి గారు, కార్యనిర్వాహక అధ్యక్షులుగ 'సహజకవి' శ్రీ మల్లెమాల వ్యవహరించారు. రజతోత్సవ సంచికలో ఎందరో ప్రముఖులు వివిధ సందర్భాలలో చేసిన ప్రసంగపాఠాలు మొదలగునవి ప్రచురించిబడ్డాయి. రజతోత్సవ సంచిక 'వెండివెలుగులు' లోని వ్యాసాలు, 'మహతి', 'యువత' గ్రంథాలలోని వ్యాసాలు లాగా చదవదగ్గవి. 'సమాలోచనం' పేరిట నెలనెలా సమావేశాలు ఏర్పాటు చేసి ఆధునిక కవులకు సముచితమైన ప్రాముఖ్యాన్ని శ్రీ సుబ్రహ్మణ్యంగారు కలిగించారు. ఆ సమావేశాల్లో కొన్ని గ్రంథాలను కూడ వెలువరించారు వారు. సంపాదక మండలి తరపున రజతోత్సవ ప్రచురణలను సమీక్షించి సకాలంలో ఆవిష్కరింపచేశారు.

మొదట్లో ఆంధ్ర సారస్వతపరిషత్ అప్పటి అధ్యక్షులు కీ॥శే॥ డా. దేవులపల్లి రామానుజరావు గారు వారి కార్యాలయాన్ని యువభారతి కార్యక్రమాల పనులు చేసుకోవటానికి వినియోగించుకోమనేవారు. తర్వాత పరిషత్ ఆవరణలోని షాపులలో ఒక దానిని యువభారతి ఆఫీసులో వాడుకోవటానికి అనుమతిచ్చారు. యువభారతి సంస్థ మీద వారికి కలిగిన సదభిప్రాయానికి, సహాయానికి సంస్థ సభ్యులు ఎప్పుడూ కృతజ్ఞతతో ఉంటారు. అలాగే కీ॥శే॥ శ్రీహరికిషన్ రావు గారు (పరిషత్ మేనేజర్) అందచేసిన సహాయ సహకారాలు మరుపరానివి. కాలక్రమంలో పరిషత్‌వారు యువభారతి షాపుకు ఎక్కువ అద్దె చెల్లించాలని తరచుగా హెచ్చరించడంతో యువభారతి కష్టాలు మొదలయ్యాయి. ఒకచోట ఆఫీసులేక, సభ్యులు కలియటానికి అనువైన స్థలంలేక సరియైన కార్యక్రమాలను చేపట్టలేకపోయారు. నాటి కార్యవర్గం ఎంతో అవస్థపడ్డది, షాపును నిలుపుకోవటానికి మిత్రులు, అప్పటి కార్యదర్శి, కీ॥శే॥ కె.వి. కామేశ్వరరావు గారు చేసిన విశ్వప్రయత్నం ఫలించలేదు.

నా తర్వాత శ్రీ ఎ. నాగేశ్వరరావు, శ్రీ ఎ. రామలింగేశ్వరరావు, శ్రీ వై.వి. వివేకానందం, శ్రీ ఎస్.వి. ప్రభాకరరావు, కీ॥శే॥ శ్రీ రెడ్డి రాఘవయ్య, శ్రీ. ఎ. రవీంద్ర, డా. బి.జయరాములు, శ్రీ॥ శే॥ శ్రీ కె.వి. కామేశ్వరరావు, శ్రీ కృష్ణస్వామి, కీ॥శే॥ శ్రీ మలపాక పూర్ణచంద్రరావు కార్యదర్శులుగా పనిచేసి యువభారతి సాహిత్యోద్యమానికి వన్నె తెచ్చారు. వీరే కాక, కీ॥ శే॥ శ్రీయుతులు రఘురామ్‌కుమార్, టి.వి.సుబ్రహ్మణ్యశాస్త్రి (ఇ.సి.ఐ.ఎల్), ఎస్.ఎస్. ప్రసాద్, శ్రీమతి కె.బి. లక్ష్మి, కుమారస్వామి నాయుడు, డా॥ నాగినేని భాస్కరరావు, మాడభూషి రంగాచార్య, ఎమ్.వి. రామస్వామి (ఎస్.బి.ఐ.), తల్లాప్రగడ రాజారాం (ఎస్.బి.ఐ.), సంస్థ కొరకై ఎంతో పాటుబడ్డారు.

ప్రస్తుతం సీనియర్ సభ్యులుగా ఉన్న శ్రీయుతులు చేగొండి రామజోగయ్య, శ్రీ మాడభూషి అనంతాచార్య. మురళీధర్ గౌడ్, రాజన్న, ఎఱ్ఱాప్రగడ రామకృష్ణ, ఎమ్.ఎస్.ఆర్. ఆంజనేయశర్మ, డి.ఎల్.ఎస్. ప్రసాద్, టి.కె. విజయ్ కుమార్, దినవహి హనుమంతరావు, జి. నారాయణమూర్తి, టి. శేఖర్‌రెడ్డి సభలప్పుడూ, పుస్తకాలకు ప్రచురణ పూర్వ విరాళాలు సేకరించడంలో ఆత్మీయ సహకారం అందించారు.

కార్యాలయ నిర్వహణలో కీ॥శే॥ మహమ్మద్ జహంగీర్, శ్రీరామమూర్తి, శ్రీ కృష్ణమూర్తి చక్కటి సేవలందించి సంస్థను ఆదుకున్నారు.

యువభారతి తన ప్రచురణలను విక్రయించుకోవటానికి ప్రతియేటా నాంపల్లిలో జరిగే పారిశ్రామిక ప్రదర్శనలో స్టాలును ఏర్పాటుచేసుకునేది. దాని నిర్వహణ బాధ్యతను శ్రీ జహంగీర్ తీసుకునే వాడు. దాని గురించి రాత్రింబవళ్ళు కష్టపడేవాడు. సభ్యులు సాయంకాలం వెళ్ళి సహాయపడేవారు. అలాగే విజయవాడ, గుంటూరులో జరిగే పుస్తక ప్రదర్శనశాలలలో పెట్టిన స్టాల్సు నిర్వహణ బాధ్యతను శ్రీ జహంగీర్ తీసుకునేవాడు. భద్రాచలంలో శ్రీరామనవమి ఉత్సవాల్లో స్టాలుని పెట్టి యువభారతి ప్రచురణలను చాలామంది భక్తులకు సంస్థ పరిచయం చేసింది.

యువభారతి సభలకు ప్రముఖులను ఆహ్వానించటంలో, ఉపన్యాసాలకు సాహితీవేత్తలను నిర్ణయించుకోవటంలో, పుస్తకాలను ముద్రింపచేయటంలో డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు, ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు ఎంత కష్టపడేవారో నాకు తెలుసు.

యువభారతి నిర్వహించిన 'నందిని' మాసపత్రిక, త్రైమాసిక పత్రిక సంస్థ విషయాలేకాక, 'పఠనీయం', 'ప్రభావం', 'కవిత' శీర్షికలను పాఠకులు ఎంతో ఆసక్తిగా చదివేవారు. యువభారతి నిర్వహించిన కవితా, కథల పోటీల్లోనే కాకుండా కవి సమ్మేళనాలలో ఎంతోమంది యువకులు పాల్గొని తమ ప్రతిభను చాటుకున్నారు. సంస్థ సభ్యుల గ్రంథాలను ఎన్నింటినో ప్రచురించి వారిలోని రచనాశక్తి పెరుగుదలకు తోడ్పడింది.

డా. తిరుమల శ్రీనివాసాచార్య గారు శ్రీ ఇరివెంటి వారికి చేదోడు వాదోడుగా ఉండేవారు, వారు తమ గ్రంథాల ఆవిష్కరణ సభల నిర్వహణలో ఎంతో నిష్ఠగ, ఉత్సాహంగ, యువభారతి స్థాయికి తగ్గట్టు, ఖర్చుకి వెనుకాడక వ్యవహరించేవారు. ఈ విషయంలో వారికి ఉన్న శ్రద్ధ నాకు చాలా ఆశ్చర్యాన్ని కలుగజేసేది. వారు అధ్యక్షులుగా ఉన్నప్పటి నుండి కీ॥శే॥ దివాకర్ల వేంకటావధాని మరియు ఇరివెంటి కృష్ణమూర్తి గార్ల సంస్కరణ సభలను ప్రతియేటా నిర్వహిస్తూ సాహితీమూర్తులను సన్మానించుకోవటం జరుగుతున్నది.

నేను యువభారతికి రెండుసార్లు కార్యదర్శిగా ఉండటం జరిగింది. నాకు సాహిత్యం పట్ల అభిమానమే కాని, నేను రచయితను కాదు. మిత్రుల ప్రేమాభిమానాలు నాకు తోడుగా ఉండేవి. యువభారతి పనులమీద నేను మిత్రులు శ్రీ విశ్వనాథం గారు, అధ్యక్షులు కీ॥శే॥ కృష్ణమూర్తిగారు, ఆచార్య కీ॥శే॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు, శ్రీ తిరుమల శ్రీనివాసాచార్య గారు, ప్రముఖ చిత్రకారులు కీ॥శే॥ శీలా వీర్రాజు గార్ల ఇండ్లకు వెళ్తుండేవాడిని. వారు తగు సలహాలనిచ్చి సహకరించేవారు. యువభారతి కార్యాలయము నుండి ఇండ్లకు వెళ్ళేటప్పుడు రాత్రిపూట నేను, శ్రీ కృష్ణమూర్తిగారు బస్సుల్లో, రిక్షాల్లో వెళ్ళేవాళ్ళం. అప్పుడప్పుడు శ్రీ శ్రీనివాసాచార్య గారు వారి స్కూటర్ మీద నన్ను మా ఇంటివద్ద దించి వెళ్ళేవారు.

యువభారతి సభలకు ఎక్కువ సంఖ్యలో సాహిత్యాభిమానులు తరలివచ్చేవారు. యువభారతి సభ్యులు, మిత్రులు చిన్న, పెద్ద అనే తేడా లేకుండా పనులు చేసుకునే వాళ్ళు. సభలకి వచ్చేవారికి గులాబీలతో స్వాగతం పలుకటమే కాక, అవసరమైన వారికి చిల్లర అందించటానికి మిత్రులు సిద్ధంగా ఉండేవారు. ఉపన్యాసాలు, సదస్సులు పెద్ద ఎత్తున జరిగేవి. కార్యకర్తలు సాయంకాలం సభలకి ఉదయం 10/11 గంటల ప్రాంతంలో సభా ప్రాంగణానికి చేరి పనులు మొదలుపెట్టేవారు. వారికి మధ్యాహ్నం అల్పాహారం డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారి ఇంటి నుండి వచ్చేది.

ఆ రోజుల్లో నేను స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా లోకల్ హెడ్ ఆఫీసులో పనిచేస్తుండే వాడిని. ఆఫీసు పని అయిన తర్వాత సాయంకాలం యువభారతి కార్యాలయానికి రావటం నాకొక దినచర్యగా ఉండేది. మిత్రులందరం ఆలోచనలను కలపోసుకొని పనులు చేసేవాళ్ళం. కరపత్రాలను మడత పెట్టడం దగ్గరనుండి పుస్తకాలు పార్సిల్ కట్టడం, పోస్టాఫీసుకి పంపే ఏర్పాట్లు చేయటం, కరపత్రాలను వివిధ ప్రాంతాలలో రోడ్లమీద నిలబడి పంచడం, చేతనైన వాళ్ళు ప్రూఫులు దిద్దడం, ఇత్యాది పనులు చేసేవాళ్ళం. ఎంతోమంది దూరప్రాంతాల వారు యువభారతి కార్యక్రమాలకు సహాయపడేవారు. అలాంటివారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపటం, కార్యాలయానికి వచ్చే వారికి కావలసిన పనులు చేయటం, జరుగుతున్న కార్యక్రమాల గూర్చి వివరించి వారిని సభ్యులుగా చేర్పించటం మొదలగు పనులను ఆసక్తిగా చేస్తుండేవాళ్ళం.

యువభారతి కార్యక్రమాలను సంస్థ సభ్యులందరి ఆమోదంతో నిర్వహించుకోవటం ఆనవాయితి. సాహితీరంగంలో నిష్ణాతులైన పెద్దల సూచనలను, చేపట్టతగ్గ వాటిని డా. ఇరివెంటి కృష్ణమూర్తి, ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు కార్యవర్గంలో చర్చించి తర్వాత సర్వసభ్య సమావేశాల్లో ప్రవేశపెట్టి సభ్యుల ఆమోదం తీసుకునేవారు. ఈ విషయంలో అప్పుడప్పుడు వాడి వేడిగా, నిర్మొహమాటంగా సభ్యులు తమ అభిప్రాయాలను తెలిపేవారు, అలాంటప్పుడు శ్రీ కృష్ణమూర్తి గారు సమయోచిత ఉపన్యాసం చేసి అందరిని ఏకతాటికి తీసుకువచ్చేవారు. ఆలోచనాపరులైన కొందరు సభ్యులు కార్యవర్గం నిర్ణయాలతో ఏకీభవించకపోయినా, సర్వసభ్య సమావేశాల్లో తీసుకున్న నిర్ణయాలకు కట్టుబడి కార్యక్రమాలు విజయవంతం కావటానికి కష్టపడి పనిచేసేవారు.

గతంలో కష్టపడి పనిచేసి కీర్తిశేషులైన సభ్యులను, వారు అందించిన సహాయ సహకారాలను ఎన్నడూ మరువలేను ఆనాడు. ఎంతో ఉత్సాహంతో పనిచేసిన సభ్యులు, నేడు దూర ప్రాంతాలలో ఉన్నప్పటికీ, వీలయినప్పుడు నేటి కార్యవర్గం నిర్వహిస్తున్న సభలకు వస్తూ, ప్రచురణలకు తగు ప్రచారం కల్పిస్తూ, ఆర్థికంగా వారికి చేతనైన సహాయం చేస్తున్నారు.

మరొక విషయం, యువతీయువకులు యువభారతిలో చేరి, బాగుగా ఉద్యోగాలు, వ్యాపారాలు చేస్తూ, జీవితంలో నిలదొక్కుకుని ఉన్నారు. ఈ విధంగా యువతని తీర్చిదిద్దడంలో, చాలా సంవత్సరాల నుండి ఆచార్య విశ్వనాథంగారు యువభారతి సాహితీ కార్యక్రమాలను పర్యవేక్షించటమే కాక, వ్యక్తిత్వ వికాసపు

ఉపన్యాలనిచ్చి ఎంతోమందికి మార్గదర్శనం చేస్తున్నారు. యువభారతి సంస్థ తరఫునే కాక, వివిధ కాలేజీల్లో, సంస్థలలో ఉపన్యాసాలనిచ్చి ఎందరినో చైతన్యపరుస్తున్నారు. వ్యక్తిగతంగా వారు నాకు ఫ్రెండ్, ఫిలాసఫర్ మరియు గైడ్.

యువభారతి కార్యక్రమాలకు అప్పుడూ, ఇప్పుడూ వెన్నుతట్టి యువభారతి సాహిత్యోద్యమానికి అన్ని వేళలా సలహాలు ఇస్తూ, అన్ని విధాలుగా సహాయపడుతున్న నేటి తెలంగాణ ప్రభుత్వ సలహాదారు, గౌరవనీయులు డా॥ కె.వి. రమణ, ఐ.ఎ.ఎస్. గారిని ఎన్నడూ మరువలేం. వారికి నా హృదయ పూర్వక నమస్సులు. నేటి కార్యవర్గం స్వాతంత్ర్య అమృతోత్సవ వేళ 'అమృత భారతి', 'మహతి" ప్రచురణలను అతి తక్కువ సమయంలో వెలువరించగలిగింది. యువభారతి వజ్రోత్సవాల వేళ 'మహాభారతో పన్యాలహరి' రామాయణంపై ఉపన్యాసాలను ఏర్పాటు చేయటమే కాక వాటిని గ్రంథాలుగా వెలువరించింది. వజ్రోత్సవ సభను నిర్వహించి వజ్రోత్సవ సంచికను కూడా వెలువరిస్తున్నది.

నేటి కాలంలో టి.వి. మరియు సెల్ఫోన్ల ప్రభావం వల్ల సాహిత్య సభలమీద చాలామంది విద్యావంతులకు ఆసక్తి తగ్గినది. ఈ సంగతిని లెక్కచేయక నేటి కార్యవర్గం సభలను ఎంతోదీక్షతో నిర్వహించటం, సకాలంలో పుస్తకాలను వెలువరించటం చేస్తున్నది. ఈ విషయం గతంలో సంస్థతోపనిచేసిన వారందరికి తెలుసు, కార్యవర్గ సభ్యులకు, యువభారతికి అన్నివిధాలా తోడ్పడుతున్న పెద్దలకు మనఃపూర్వకమైన అభివందనాలు తెలియజేసుకుంటున్నాను. కార్యక్రమాలకు రాలేని సభ్యులు, అభిమానుల కొరకు సభలను ప్రత్యక్ష ప్రసారం చేసి "యూట్యూబ్ లో చూడడానికి వీలుగా లింకులను అందజేస్తున్న నిర్వాహకులు అభినందనీయులు.

యువభారతి ఆదర్శం "చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని..." మరియు సంస్థ ప్రార్థనాశ్లోకం "మాణిక్యవీణా ముపలాలయంతీం" నాలో యువభారతీయు లందరిలో మెదలుతూనే ఉంటాయి.



# మనసు పొరల్లోంచి...

శ్రీ డి.ఎల్.ఎన్.ప్రసాద్
విశ్రాంత ఆడిట్ & అకౌంట్స్ అధికారి, హైదరాబాద్
94906 81345

శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ లో మొదలైన పరిచయం, 5, కింగ్స్ వే, సికింద్రాబాద్ - 3 లో కుదురుకుంది. శ్రీ వెంకటేశ్వరరావు గారి మస్తిష్కంలో పురుడు పోసుకున్న ఆలోచన పెద్దల నిర్ణయంతో "కావ్యలహరి" గా ప్రణాళిక రూపొందింది.... నా అనుబంధం చైతన్యవంతమైంది. నాతోపాటు ఎంతమందికో ఏమాత్రం మొహమాటం లేకుండా నిత్యకృత్యం లో భాగమైపోయింది.

ఇప్పుడు నెమరేసుకుంటే ఎన్నో అపురూపమైన జ్ఞాపకాలు ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. శ్రీ శీలావీర్రాజు గారి (అప్పటి) నివాస ప్రాంగణంలో ఉన్న దీక్షా ప్రెస్ లో అచ్చైన రెండు రూపాయల ప్రచురణ పూర్వ విరాళ కూపన్లలో, మొట్టమొదటి కూపన్ శ్రీ విశ్వనాథం గారు భాషానిలయం లో శ్రీ తాతాచారి గారికి అందించి శుభాశీస్సులు పొందడం ఇప్పటికీ గుర్తే .

అదే కాదు... అచ్చైన కూపన్లు వరుస సంఖ్య ప్రకారం బుక్స్‌గా చేసేపని, రామ్ కోఠీ సమీపంలో వున్న బస్తీలో జీ.ఎల్.నరసింహారావు గారి ఇంటిముందు నాపరాళ్ళ మీద బైఠాయించి చేశాం. మాకోసమే అన్నట్టు ఆ స్పాట్లో ఓ స్ట్రీట్ లైట్ కూడా వుండేది. నేను, ఇంకొంతమంది సభ్యులు కలిసి పది పది ,ఇరవై ఇరవై కూపన్లకి రేపరు వేసాక విశ్వనాథం గారు స్టేప్లర్ కొట్టేటప్పుడు " జై పుండరీకాక్షయ్య" (పుండరీకాక్షయ్య గారు దీక్షా ప్రెస్ మేనేజర్. ఆరడుగుల ఎత్తు, దబ్బపండు ఛాయ, ప్రసన్న వదనం) అంటూ ఆడుతూ పాడుతూ పనిజేసేవాళ్ళం. వర్షం వచ్చినప్పుడు కొంచెం ఇబ్బందిగా వుండేది. అంచేత, తరువాత మజిలీ, ప్రభాత్ టాకీసు వెనుక వీధిలో, యువభారతి అప్పటి ఉపాధ్యక్షులు, సూర్య నారాయణ గారి ఇంటి ముందు గది.

కార్యక్రమాల తేదీలు దగ్గర పడుతుండటంతో, దేవులపల్లి రామానుజరావు

గారి వాత్సల్యం, మేనేజర్ హరికిషన్ రావు గారి చలవతో వారి ఆఫీసు లో ఓ చివర కూర్చుని పని చేసుకునే వాళ్ళం. ఏడు దాటాక ఆఫీసంతా మాదే. కొన్నాళ్ళకి అక్కడే వారగా వున్న చిన్న గది కేటాయించారు.

ఆ తరువాత రోజుల్లో, రోడ్ మీదున్న రెండు మళ్గీలు అద్దెకు తీసుకున్నాం. సాయంత్రమైతే ఎంతో సందడిగా బిజీ బిజీగా వుండేది. అక్కడ అరుగుల మీద కొవ్వొత్తుల కాంతిలో పనిజేసేవాళ్ళం. పని బాగా పెరిగాక, సభ్యులందరం సుమారు 8.గం.ల.వరకూ పనిజేసేవాళ్ళం. నేనూ, విజయకుమార్ (ఒక్కొక్కప్పుడు బుచ్చిబాబు, జహంగీర్ కూడా) డాల్మోటా, మిర్చి బజ్జీ, అరటిపళ్ళూ వగైరా తిని, పరిషత్ ఆఫీసులో అర్ధరాత్రి వరకు పనిచూసుకుని, అక్కడే బల్లల మీద బరకాలు కప్పుకుని నిద్రపోయేవాళ్ళం. తెల్లారి ఇళ్ళకెళ్ళి, సాయంత్రానికల్లా మళ్ళీ తిరిగొచ్చేవాళ్ళం. సమావేశాల దినాల్లో, సభ్యులందరూ దాదాపు 11 గం.లకు పరిషత్ కు చేరుకుని ఏర్పాట్లలో నిమగ్నమయ్యేవారు.

శ్రీ సుధామ, ఒక్కొక్కరి పేరు కళాత్మకంగా లిఖించి పంచిపెట్టిన మెటల్ బ్యాడ్జీలు తగిలించుకుని కలయదిరుగుతుంటే ప్రాంగణం ఘలంఘలించిపోయేది.

ఇంటిదగ్గర ఉదయమే టిఫిన్ తిని వచ్చిన సభ్యులకు, మధ్యాహ్నం ఆప్యాయంగా విస్తళ్ళనిండా వడ్డించే పులిహోర దద్ధోజనం ఘుమఘుమలతో హోరెత్తిపోయేది. పరిషత్ సిబ్బంది, ప్రభుత్వ సిబ్బంది – అంటే అప్పటి సమాచార పౌర సంబంధాల శాఖామాత్యులు శ్రీ అక్కిరాజు వాసుదేవరావు గారు తమ శాఖద్వారా ఔదార్యంతో సమకూర్చిన కుర్చీలు, జనరేటర్ వగైరాలతో వచ్చినవారూ, బందోబస్తు కోసం వచ్చిన పోలీసులు కూడా ఆనందంగా ఆస్వాదించేవారు. ఇక సభలైతే అంగరంగ వైభవమే!

. యువభారతి సమయపాలన జగద్విదితం. సభాప్రారంభసమయానికి చాలా ముందుగానే సభాస్థలి కిక్కిరిసిపోయేది. అలా యువభారతి సంకల్పం, యువభారతీయుల కృషి జంటనగరాల తెలుగువారి సాహితీ క్షుద్బాధ తీర్చింది, తీరుస్తోంది. ఇది నిస్సందేహంగా యువభారతీయులందరికీ విశిష్ట గర్వకారణం. ఇప్పుడు నా దృష్టిలో కొన్ని ముఖ్యమైన విశేషాలు:

యువభారతి హితైషి , విశ్వనాథం గారి సహోద్యోగి ప్రొ.నాగరాజు గారు కొన్ని వాణిజ్య ప్రకటనల కొరకు ప్రయత్నిస్తాననీ, తనతో ఎవర్నైనా పంపమనీ ప్రతిపాదించారు. నన్ను పంపించారు. నాలుగు/ఐదు సంస్థల్ని సంప్రదించాం. కొన్ని

క్లిక్కయ్యాయి. తరువాత కొకోకోలా కంపెనీకి వెళ్ళాం. వాళ్ళు అంతా విని, "ప్రకటనేమీ ఇవ్వం, కానీ, 500 ల కూల్ డ్రింక్ సీసాలు ఇస్తాం, మీ సభల్లో వాటిని అమ్ముకుని ఆ డబ్బు మీరే తీసుకోండి" అన్నారు. నాగరాజు గారు ఒప్పుకుందామన్నారు. నేను, సాహిత్య కలాపాల్లో ఈరకం ఏర్పాటు ఇమడదన్నాను. ఆయన అహం (?) కొంచెం గాయపడింది. అంతే వెంటనే తిరుగు ప్రయాణం చేపట్టారు. నేను నిస్సహాయంగా మౌనంగా అనుసరించాల్సివచ్చింది. వాతావరణం గంభీరంగా మారింది. పరిషత్తుకి చేరిన వెంటనే కృష్ణమూర్తి గారికీ, విశ్వనాథం గారికీ "మీ వాడు గొప్ప ఆఫర్ చెడగొట్టాడ" ని చెప్పి నిష్క్రమించారు. నావల్ల నష్టం జరిగిందని భావిస్తే, ఆ నష్టం నేను భర్తీచేస్తానని అన్నాను. "లేదు లేదు. నీది ముమ్మాటికీ సరైన నిర్ణయం" అని కృష్ణమూర్తి గారు విశ్వనాథం గారు నా చెరో భుజం తట్టారు. ఆనందం తో నా కళ్ళు చెమ్మగిల్లాయి.

Tryst with Destiny is a very Famous expression by Pandit Nehru. We, from Yuvabharathi, had a Midnight Tryst with Lord Nataraja.

"చైతన్య భారతి" పుస్తకం అట్ట మీద వున్న నటరాజ స్వామి చిత్రం అబిడ్స్ లో వున్న రామకృష్ణ 70 MM టాకీస్ లాంజ్ లో వున్న నిలువెత్తు విగ్రహం ఫొటో. ఆ ఫొటో తీసుకోవడానికి టాకీస్ యాజమాన్యం వారు అనుమతించారు. అయితే, రాత్రి రెండో ఆట ముగిసి జనసందోహం తగ్గిన తర్వాతే ఫొటో తీసుకోవడానికి బాగుంటుందన్నారు. సరే అని, ఫలానా రాత్రి వస్తామని తెలియజేసాం.

ఆ రోజుల్లో సినిమాల నిడివి చాలా ఎక్కువ. అందువల్ల సుమారు ఉదయం 2.30 తర్వాతే ఫొటో సాధ్యం.

ఆ ఫలానా రాత్రి, విశ్వనాథం గారు, వీర్రాజు గారు, మన ఆస్థాన ఫొటోగ్రాఫర్ గణేశన్ గారు,విజయ కుమార్, బుచ్చిబాబు మరియు నేను సుమారు ఒకటిన్నర కే అక్కడికి చేరుకున్నాం. ప్రేక్షకులందరూ క్లియర్ అయ్యేదాకా వేచి ఉన్నాం. ఆపిమ్మట యాజమాన్యం వారు లాంజ్ లో వున్న కరెంట్ దీపాలన్నీ వేయించారు. నటరాజ విగ్రహం దేదీప్యమానంగా శోభిల్లింది. వివిధ కోణాల్లో ఫొటోలు తీయడం జరిగింది. సంతృప్త భావంతో టీ తాగి, రోడ్ మీదకి వచ్చేసరికి తూర్పున వెలుగు రేఖలు కొంచెం కొంచెం గా పరుచుకుంటున్నాయ్.

పుస్తక ప్రచురణలకు అవసరమైన కాగితం పేపర్ మిల్స్ నించి తెప్పించే వాళ్ళం. ఒకసారి, అలా వచ్చిన పేపర్, డబ్బులు వెంటనే సర్దుబాటు కాకపోవడంతో, ట్రాన్స్పోర్ట్ కంపెనీ గిడ్డంగి లోనే ఉంచాల్సొచ్చింది. డబ్బులు సర్దుబాటయిన సమయానికి డెమరేజి తడిసి మోపెడైంది. ట్రాన్స్పోర్ట్ కంపెనీ వాళ్ళని డెమరేజి తగ్గించమన్నాం. ఆ పవర్స్ వాళ్ళకి లేవన్నారు. కావాలంటే, విజయవాడలో వున్న వాళ్ళ హెడ్డాఫీసులో మేనేజింగ్ డైరెక్టర్ ని కలవమన్నారు. ఆ పనికి మనవాళ్ళు నన్ను పంపించారు.

విజయవాడ వెళ్ళి ఎమ్.డి. గారిని కలిసి, మన సంస్థ గురించి వివరించి, సహాయం చెయ్యమని విన్నవించి, కొన్ని మన ప్రచురణలు అందజేశాను. ఆయన ఉత్తర భారతీయుడు. తనకి తెలుగు చదువడం రాదన్నాడు. అయితే మీ తెలుగు మిత్రులకు ఇవ్వమన్నాను. సంతోషించాడు. టీ తాగించాడు. డెమరేజి పూర్తిగా తగ్గించలేనన్నాడు. తర్జనభర్జనల తర్వాత 80% వరకూ తగ్గించినట్లు గుర్తు. కొంతమేరకు పనిజరిగిందనే సంతృప్తి తో తిరిగి పయనమయ్యాను.

ఓసారి, ప్రభుత్వ గ్రాంట్ కోసం, ఇరివెంటి కృష్ణమూర్తి గారు, విశ్వనాథం గారు, మరియు నేను అప్పటి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారిని కలిశాం. విజ్ఞాపన పత్రం తో పాటు మన ప్రచురణలు కూడా అందజేశాం. వివరాలు సావధానంగా ఆలకించి, సానుకూలంగా స్పందించారు. ఈ భేటీ విషయంలో సహాయం చేసిన ప్రధాన భద్రతాధికారి గారికి కూడా కొన్ని పుస్తకాలందజేశాం.

సుమారు ఒక నెల తరువాత, ముఖ్యమంత్రి గారి బర్త్ డే రోజు, విశ్వనాథం గారు నేను ఒక కేజీ పుల్లారెడ్డి స్వీట్స్ ఒక పూల బొకే తీసుకుని వెళ్ళి అభినందనలు తెలిపాం.

మన ఫైలు గురించి పేషీ లో వాకబు చేస్తే, ఆర్థిక మంత్రి గారి దగ్గర వుందని తెలిసింది. మర్నాడు ఉదయం విశ్వనాథం గారు నేను మంత్రి గారిని కలవడానికి అసెంబ్లీకి వెళ్ళాం. మంత్రి గారు బడ్జెట్ తయారీలో బిజీగా ఉన్నారు. కానీ, విశ్వనాథం గారి విజిటింగ్ కార్డ్ చూసి, బడ్జెట్ విషయంలో ఏవైనా సలహాలు తీసుకోవచ్చనుకున్నారో ఏమో వెంటనే రమ్మన్నారు. అనుకున్నంతా అయింది.

ఓ మహత్వపూర్ణ దృశ్యం ఆవిష్కృతమైంది. మంత్రి గారు, అసెంబ్లీలో ప్రవేశపెట్టేవరకూ అత్యంత గోప్యంగా ఉంచవలసిన బడ్జెట్ ని విశ్వనాథం గారికి చూపెట్టి సలహాలు సూచనలు కావాలన్నారు. అప్పుడు విశ్వనాథం గారు ఆసాంతం

పరిశీలించి కొన్ని మార్పులు చేర్పులు ప్రతిపాదించి, వాటి సానుకూల ప్రయోజనాలు తార్కికంగా వివరించేసరికి మంత్రిగారు మురిసిపోయి, సెక్రటరీని పిలిచి విశ్వనాథం గారు సూచించిన విధంగా బడ్జెట్ లో మార్పులు చెయ్యమని పురమాయించారు. విశ్వనాథం గారికి అదో కలికితురాయి.

మంత్రి గారు మన గ్రాంట్ ఫైలు వెంటనే క్లియర్ చేస్తానని హామీ ఇచ్చారు. ఓ పదిరోజుల తరువాత, బ్రహ్మానందరెడ్డి గారు రాజీనామా చేస్తున్నారన్న వార్త గుప్పుమంది. వెంటనే, విశ్వనాథం గారు నేను ముఖ్యమంత్రి గారి నివాసానికి చేరుకున్నాం. ప్రాంగణమంతా మంత్రులు, ఎమ్మెల్యేలు, ఎమ్ పీ లు, కాంగ్రెస్ నాయకులతో కిట కిట లాడిపోతోంది. ఎవ్వరినీ లోపలికి పంపద్దని ముఖ్యమంత్రి గారి ఆర్డర్ అనీ పది నిమిషాల్లో గవర్నర్ గారిని కలవడానికి వెళతారనీ ప్రధాన భద్రతాధికారి చెప్పారు. అయితే, తలుపు తీసిన వెంటనే ముఖ్యమంత్రి గారి దృష్టి మామీద పడేటట్లు ద్వారం దగ్గర వారగా మమ్మల్ని నిలబెట్టారు. ఊహించినట్టుగానే, తలుపు తీసిన వెంటనే ముఖ్యమంత్రి గారు మమ్మల్ని చూశారు. ఎవరు మీరు అని అడిగారు. యువభారతి పేరు వినగానే "అయ్యో మీ సంగతి మర్చిపోయాను , లోపలికి రండి" అని వెనుదిరిగి, (ప్రాంగణంలో ఉన్న అతిరథమహారథులు, ఎవరు వీళ్ళు , ఇంద్ర ఉపేంద్రులా…? అని ఆశ్చర్యపడ్డారు) యువభారతి ఫైలు తెప్పించారు. మమ్మల్ని కూర్చోమన్నారు. ఆయన తన కుర్చీలో కూర్చుంటూ, రాజీనామా చేస్తున్నానని అంటూ, జేబులోంచి రాజీనామా పత్రాన్ని తీసి టేబుల్ మీద పెట్టారు.

మన ఫైలు తెరచి, "టేబుల్ మీదున్న ఆధికారిక పెన్ తో రాజీనామా సంతకం చేశాను. ఇప్పుడు ఆ పెన్ వాడడం సబబుకాదం" అంటూ మా పెన్ అడిగారు. విశ్వనాథం గారు చటుక్కున తన పెన్ ఇచ్చారు. ఐదువేలు (అప్పట్లో చాలా పెద్ద మొత్తం) శాంక్షన్ చేస్తున్నానని చెప్పి సంతకం చేశారు. వెరసి – విశ్వనాథం గారి పెన్ యువభారతి కి ఐదువేలు సమకూర్చింది. ఇప్పుడు ఆ పెన్ ఆయనదగ్గరే వుందో, మరేమైందో… ???

ఇప్పుడు చివరగా ఒక సున్నితమైన అంశం :

పరిషత్ లో మన రెండు మడ్గీలకీ కలిపి నెల అద్దె రూ. 500/– ( 250+250).

యువభారతి కి స్వయానా మేనమామ నని ప్రకటించుకున్న శ్రీ సి.నారాయణరెడ్డి గారు పరిషత్ అధ్యక్షులైన తర్వాత యాజమాన్యం వారు ఒకో మడ్గీకి రూ. 1500/–

వసూలు చేయాలని నిర్ణయించారు. అంటే ఆరురెట్లు జంప్ చేసి రూ.3000/- అవుతుంది. అప్పటికే అప్పుల్లో వున్న యువభారతి కి ఈ పెంపు, మూలిగే నక్క మీద తాటిపండు పడినట్టే.

అయినా కూడా , యువభారతి పెద్దలు అంగీకారం తెలుపుతూ నారాయణరెడ్డి గారికి లేఖ రాశారని తెలిసింది. ఇది సంస్థ మనుగడకు పెను సవాల్. కీ.శే.కామేశ్వర్రావూ, నేనూ ఉపాధ్యక్షులం . కానీ, ఏది దారి ? ఇక, సంస్థ ప్రయోజనాల కోసం మేమిద్దరం తెగించాం. లేఖాగారడీ/ లేఖాదౌత్యం జరపాలని నిర్ణయించాం.

ముందుగా, పెద్దలు రాసిన లేఖ నారాయణరెడ్డి గారికి చేరకుండా జాగ్రత్త తీసుకున్నాం. తదుపరి, సంస్థ పరిస్థితిని వివరిస్తూ, మేనమామ హోదాని వినమ్రంగా గుర్తుచేస్తూ, అద్దె పెంచవద్దని వేడుకుంటూ, ఉపాధ్యక్షులు గా సంతకం చేసిన మా సంయుక్త లేఖ నారాయణరెడ్డి గారికి చేరవేశాం. ఫలితంగా, అద్దె పెంపు ప్రతిపాదన ఫ్రీజర్ లోకి చేరిపోయింది. అయితే, కొన్ని సంవత్సరాల తర్వాత, పరిషత్ భవనాల రూపు రేఖలు వాణిజ్య దృష్టితో మార్పు చేయాలని నిర్ణయించడంతో మళ్లీలు ఖాళీ చేయాల్సొచ్చింది. కానీ, శ్రీ దేవులపల్లి రామానుజరావు మందిరం పై అంతస్తు మెట్లగది రూపంలో, పరిషత్తు తో మన పేగు బంధం కొనసాగుతోంది.

ఇలా...యువభారతి లో నా అలనాటి అనుభవాలు మీ అందరితో పంచుకోవడం చాలా ఆనందంగా ఉంది. ఈ అవకాశం కలగజేసిన మిత్రులకు నా హృదయపూర్వక ధన్యవాదాలు.



# యువభారతి

శ్రీ ఎం.ఎస్.ఆర్.ఆంజనేయశర్మ
(శ్రీముళ్ళపూడి సీతారామాంజనేయశర్మ)
విశ్రాంత రైల్వే విజిలెన్స్ అధికారి, హైదరాబాద్
98484 26340

మాది దుగ్గిరాల మండలంలోని పెదకొండూరు గ్రామం.

నేను దక్షిణమధ్య రైల్వే సికింద్రాబాద్‌లో పనిచేస్తుండేవాడిని. మా విభాగం సెక్షన్ ఇంచార్జిగ పనిచేస్తున్న వారి కుమారుడు శ్రీ ఎస్.శ్రీనివాస్. వీరు తండ్రి వద్దకు వచ్చినప్పుడు వారు తమ కుమారునికి నన్ను పరిచయం చేస్తూ నాకున్న సాహిత్యాభిలాషను వివరించారు. శ్రీ శ్రీనివాస్ యువభారతి సమావేశకర్త ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారికి మిత్రులు. తర్వాత, 1968 ఆగష్టులో ఒకరోజు నా స్నేహితుడు, శ్రీ పి.ఎస్.ఎన్.శర్మ శ్రీ విశ్వనాథం గారిని నా వద్దకు తీసుకురాగా, శ్రీ విశ్వనాథంగారు యువభారతి సంస్థ ఆశయాలను, అప్పుడు సంస్థ నడుపుతున్న పుస్తక పథకం గూర్చి వివరించి, సంస్థ కార్యక్రమాల్లో పాలు పంచుకోమని చెప్పారు. ఈ పథకం కింద సభ్యులను చేర్పిస్తూ వారికి ఇవ్వవలసిన పుస్తకాలను శ్రీ విశ్వనాథంగారి వద్ద తీసుకొని సభ్యులకు అందజేసేవాడిని. ఈ పనిమీద సికింద్రాబాద్‌లోని (5, కింగ్స్ వే) శ్రీ విశ్వనాథం గారింటికి తరచు వెళ్ళివస్తూండేవాడిని.

కీ.శే. శ్రీ కాళోజి నారాయణరావుగారి 'జీవనగీత' గ్రంథావిష్కరణ కోఠిలోని వుమెన్స్ కాలేజీ దర్బారు హాలులో జరిగినప్పుడు నేను వెళ్ళటం జరిగింది. సభకి ముఖ్యఅతిథి రావటం ఆలస్యం అవుతున్న కారణంగ, నాకు సభ్యులు ఎవరూ పరిచయం లేనందువల్ల, కార్యక్రమం చూడలేక నేను ఇంటికి తిరిగి వెళ్ళాను. 'హందోనోఁ' సినిమా టికెట్‌ను నాలుగు రూపాయలకు ఇస్తూ, జీవన గీత పుస్తకాన్ని ఉచితంగా త్వరలో అందజేస్తామని చెప్పేవారు. ఆ పుస్తకాన్ని నాకు శ్రీ శ్రీనివాస్ తెచ్చి ఇచ్చారు.

1969లో 'రచన' సదస్సులో నేను పాల్గొంటిని. కాని అప్పటికే నాకు సభ్యులతో సరియైన పరిచయం లేదు. సదస్సులో చర్చించదగ్గ అంశాలను విభజించి, సాహితీ మిత్రులను కొన్ని గ్రూప్‌లుగా ఏర్పరచి వారిచే చర్చింపచేశారు. నేను 10వ విభాగంలో

పాల్గొన్నట్లు నాకు గుర్తు. ఆ విభాగానికి సికింద్రాబాద్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల ప్రిన్సిపల్, శ్రీ పి.ఎల్.ఎన్.శర్మగారు అధ్యక్షత వహించారు.

ఆ రోజుల్లో మా నాన్నగారి ఆరోగ్యం, మా కుటుంబ పరిస్థితులు నన్ను ఎక్కువ ఆందోళనకు గురిచేశాయి.

నేను శ్రీయుతులు పి.ఎస్.ఎన్.శర్మ, ఈమని వాసుదేవశర్మ మంచి స్నేహితులం. 1971లో 'కావ్యలహరి' కార్యక్రమాలకు ప్రచారం నిమిత్తం కరపత్రాలను రైల్వే డిపార్ట్‌మెంట్స్‌లోనే కాక, హెూటళ్ళ వద్ద మరియు రద్దీ ప్రదేశాలలో పంచేవాళ్ళం. ప్రచురణ పూర్వ విరాళాలను సేకరిస్తున్నప్పుడు ఎంతో కలిసిమెలిసి పనిచేశాం. కావ్యలహరి పుస్తకం రైల్ నిలయంలో, ఇతర రైల్వే ఆఫీసుల్లో ఉన్న వందలాది సాహిత్యాభిమానులకు అందిందని చెప్పటానికి నేను ఎంతో సంతోషిస్తున్నాను. సంస్థ ప్రచురించిన మొదటి 'సాహితీవాహిని' 'మందార మకరందాలు'ను ఒక్క రూపాయికే అందరికీ అందించటం జరిగింది. భద్రాచలంలో జరిగే శ్రీరామనవమి ఉత్సవాలలో భక్తులు చాలామంది యువభారతి పుస్తక ప్రదర్శన శాలకి వచ్చి దానిని కొనుక్కున్నారు. ఖమ్మంలో జరిగిన ఉపాధ్యాయుల సమ్మేళనానికి మిత్రుడు శ్రీ వై.వి. వివేకానందతో వెళ్ళి 'మందార మకరందాలు', మరికొన్ని ఇతర ప్రచురణలను విక్రయించటం జరిగింది. ఆ పనికి ఖమ్మంలో ఉన్న సహృదయులు, గౌరవనీయులు శ్రీ కొలిపాక కిషన్‌రావుగారు మాకు ఉచిత వసతి, భోజన సదుపాయాలు కల్పించినారు. వారు నాకు ఇప్పటికీ గుర్తుకొస్తూనే ఉంటారు. వారికి నా కృతజ్ఞతలు.

తర్వాతి కాలంలో మిత్రులు శ్రీ ఎన్.వి.భాగారావు యువభారతికి ఎంతో ఆర్థికంగా సహాయపడ్డారు. శ్రీ ఈమని వాసుదేవశర్మగారి మేనల్లుడు శ్రీ పోలేపెద్ది శ్రీరామశాస్త్రి బొంబాయిలో ఒక ప్రముఖ కంపెనీలో పనిచేశారు. వీరందరూ యువభారతి ప్రచురణలకు ప్రముఖ పారిశ్రామికవేత్తల నుండి ప్రకటనలను సేకరించి సంస్థకు ఆర్థికంగా తోడ్పడినారు.

శ్రీ పి.ఎస్.శాస్త్రిగారు సంస్థ ప్రచురించిన ప్రతిభాలహరి, ఆంగ్ల పుస్తకాలు Free India Forges Ahead మరియు Telugu Novel గ్రంథాలకు ఎక్కువ శ్రమించి ప్రకటనలను సేకరించి ఆర్థికంగ సహాయపడ్డారు. అప్పుడు వారు సంస్థ కార్యక్రమాలపై చూపిన శ్రద్ధ, ఆసక్తి ఎంతో శ్లాఘనీయం. ఆ పుస్తకాలను పరిశీలిస్తే

వారు చేసిన సహాయం ఎంత గొప్పదో సభ్యులకు తెలుస్తుంది. వారికి యువభారతీయులం కృతజ్ఞతాభావంతో ఉండాలి.

యువభారతి ప్రచురణలనే కాక, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడెమి గ్రంథాలను చాలా వాటిని ఎక్కువ మంది సాహిత్యాభిమానులకు అందజేసిన తృప్తి నాలో ఉన్నది.

నా వివాహం 1975లో జరిగినది. ఆ సంవత్సరంలోనే శ్రీ పి.ఎస్.ఎన్. శర్మ విజయవాడకు బదిలీ అయినాడు.

1976లో యువభారతి 'రామాయణ సుధాలహరి' కార్యక్రమాన్ని నిర్వహించింది. సభ్యునిగ నేను ఆ కార్యక్రమానికి, ఆ పుస్తక ప్రచురణకు చేతనైనంత వరకు తోడ్పడ్డాను.

1994-95 సంవత్సరంలో జరిగిన 'విశ్వనాథ సాహితీ సమాలోచనం' పేరిట ప్రతి నెలా జరిగిన సమావేశాలకు వదాన్యులు తోడ్పడ్డారు. 7 సమావేశాలకు నేను కూడ కొంతమంది స్పాన్సర్లను ఏర్పాటు చేయగలిగాను. తద్వారా సంస్థకు ప్రతినెలా ఆర్థిక సహాయం చేయటం జరిగింది. అంతేకాక, ప్రముఖ కాంట్రాక్టర్ల నుండి ప్రకటనలు సేకరించి ఇచ్చాను. ఈ విషయంలో సంస్థ అధ్యక్షులు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు నాపై ప్రశంసలు కురిపించారు. ఈ గ్రంథం 1995లో ప్రచురించటం జరిగింది.

1996 లో అనివార్యకారణాల వల్ల నా కుటుంబాన్ని విజయవాడకు మార్చి, నేను హైద్రాబాద్‌లో ఒంటరిగ ఉన్నాను. ప్రతివారం విజయవాడకి పోయి వస్తూండేవాడిని. 2002లో నాకు విజయవాడకి బదిలీ అయినది.

1994, 1995 సంవత్సరాల్లో 'విశ్వనాథ సాహితీ సమాలోచనం' కార్యక్రమం మరియు ఆ కాలంలో వెలువడిన మరికొన్ని పుస్తకాల ప్రచురణవల్ల సంస్థపై ఎంతో ఆర్థిక భారం పడ్డది. ఆ విషయం చర్చకి వచ్చినపుడు, దానిని తట్టుకోవడానికి సంస్థకు రూ.59000/- విరాళాలు సేకరించి అందజేయటం జరిగింది. దీనిని సంస్థ బ్యాంక్‌లో డిపాజిట్ చేసింది.

జీవితంలో ఎన్నో ఆటుపోట్లని  ఎదుర్కొంటూ, యువభారతికి సహాయ పడగలిగాను. అది నాకు ఎంతో సంతృప్తినిచ్చింది.



# అనంతం

శ్రీ మాడభూషి అనంతాచార్యులు
యువభారతి పూర్వాధ్యక్షులు, హైదరాబాద్
92907 02328

అది 1969 సంవత్సరం మే నెల మొదటి ఆదివారం అనుకుంటా మధ్యాహ్నం రెండు గంటలకు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం లో యువభారతి సాహితీసాంస్కృతిక సంస్థ పక్ష సమావేశం నిర్వహిస్తుందని సహృదయులందరూ ఆహ్వానితులే అని పత్రికలలో 'నగరంలో నేడు' కాలంలో ప్రకటన చూసాము బుచ్చిబాబు గోపాలకృష్ణ నేను మధ్యాహ్నం రేడియోలో వచ్చే సంక్షిప్తశబ్దచిత్రాన్ని కూడా వదలుకొని శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషనిలయాన్ని చేరుకున్నాం. (అప్పటి రోజుల్లో మమ్మల్ని ముక్కవులు అని కొందరు అంటుండేవారు) అక్కడ మాలాంటి యువ మిత్రులు మొదటి అంతస్థులో సమావేశానికి సిద్ధంగా ఉన్నారు. మమ్మల్ని చూసి లోపలికి రమ్మని ఆహ్వానించారు – మాచేతికి కొన్ని కాగితాలు ఇచ్చి నింపుమన్నారు. అవి  యువభారతి పరిచయ పత్రాలు. అంతా అయోమయంగా ఉంది. వానిని నింపి ఇచ్చాం.

సమావేశానికి మొదట అందరూ లేచి నిలబడి 'మాణిక్యవీణా' అనే ప్రార్థనాగీతాన్ని ఆలపించారు. తరువాత, ఆరోజు కొత్తగా వచ్చినవారి పరిచయం చేశారు. ఆనాటి అధ్యక్షులవారి మాటలతరువాత క్లుప్తగోష్ఠి నిర్వహణా బాధ్యత సుధామది అనుకుంటా (అప్పటికే ఆయన లిఖితమాసపత్రిక నడుపుతుండేవారు). ఒక అందమైన చెక్కడబ్బాలో కొన్ని కాగితాలపై కొన్ని సమస్యలు రాసి ఉంచేవారు. ఆ డబ్బాను ఎవరిముందుంచితే వారు అందులోని ఒక కాగితం తీసుకొని దానిని చదివి ఆ సమస్యపై రెండు నిమిషాలపాటు ప్రసంగించాలి. మూడోవానిగానో నాలుగోవానిగానో ఆ డబ్బాను నాముందుంచారు శ్రీ సుధామగారు. ఒక కాగితం తీసి దానిని గురించి మాట్లాడడం ప్రారంభించాను. ఆ సమస్య ఇప్పుడు గుర్తులేదు.

1.45ని, తరువాత హెచ్చరిక మోత. మరో 15 సెకండ్లలో ఆ ప్రసంగాన్ని ముగించాలన్న మాట, అట్లా ఓ పదిమంది మాట్లాడిన తర్వాత కొన్ని చీటీలు ఇచ్చారు. దానిపై మీకు ఉత్తమంగా మాట్లాడినట్లు అనిపించినవారి పేరు రాయమన్నారు. ఆ తరువాత ఎవ్వరైనా ఒకరు ఆ వచ్చిన సమస్యలపైనా దానిని మాట్లాడిన విధానంపైనా క్లుప్తప్రసంగం చేస్తారు. అది శ్రీ వంగపల్లి విశ్వనాథం గారు చేసినట్లు గుర్తు. తరువాత ఉత్తమవక్త ప్రకటన, ఎక్కువమంది నాపేరు రాసినట్లున్నారు. ఒకపుస్తకంపై ఉత్తమవక్త పేరు రాసి యువభారతి అధ్యక్షులు, క్లుప్తగోష్ఠి నిర్వాహకులు సంతకాలు చేసి ఉత్తమవక్తకు ఇచ్చేవారు. ఆరోజు శ్రీ శీలా వీర్రాజు గారి కవితాసంకలనం "కొడిగట్టిన సూర్యుడు' ఇరివెంటి కృష్ణమూర్తి గారు నాకు బహూకరించారు. ఆపుస్తకాన్ని చాలాకాలంవరకు అపురూపంగా దాచుకున్నాను. కాని అనేకసార్లు అద్దెయిల్లు మారడంవలన తరువాత అది కనబడకుండా పోయింది. ఆనాటి సమావేశాల్లో మీకు నచ్చినపుస్తకం, క్లుప్తప్రసంగం (ఏదైనా ముందే ఇచ్చిన సమస్యపై), ఒక నవలపై తమ అభిప్రాయాలు తెలియజెయ్యడం, స్వీయరచనాపఠనం మొదలైన కార్యక్రమాలుండేవి. కార్యక్రమాలన్నీ ఉత్తేజకరంగా జరిగేవి..

ఆనాటి యువభారతి సభ్యత్వ రుసుం 2 రూ.ల ఎమెస్కో వారి నవలను ఉచితంగా ఆనాటి యువభారతి సభ్యత్వానికి ఇచ్చేవారు. కార్యదర్శి శ్రీ వెంకటేశ్వరరావు గారు ఆ బాధ్యత తీసుకునేవారు. ఆ నవలపైనే తదుపరి పక్షసమావేశంలో చర్చ జరిగేది. ఆరోజుల్లో ఎన్నుకొనబడినవారు కాకుండా 5 రూ సభ్యత్వ రుసుము కడితే కార్యవర్గ సభ్యులుగా పరిగణింపబడేవారు. నేనెప్పుడూ సాధారణ సభ్యుడనే. బుచ్చిబాబు, గోపాలకృష్ణ మాత్రం కార్యవర్గసభ్యులు. ఆరోజుల్లో ప్రతినెలా మొదటి మూడవ ఆదివారాల్లో జరిగే పక్షసమావేశాల్లో పైన చెప్పినవారు కాకుండా శ్రీ జి ఎల్. నరసింహారావు, సి.వి.ఏ.ఎస్.సూర్యనారాయణ, నాగినేని భాస్కరరావు, జీడిగుంట కామేశ్వరరావు, తాళ్లపల్లి మురళీధర గౌడ్, మొదలగు వారు పాల్గొనేవారు. వానివలన విషయం మీద అవగాహన, మాట్లాడేనేర్పు, పుస్తకపఠనం, రచనా సామర్థ్యం, సామాజిక చైతన్యం, సాహిత్యంపై మక్కువ ఏర్పడేవి. యువభారతికి పక్షసమావేశాలే వెన్నెముకలాంటిదని నా అభిప్రాయం. శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయానికి 50సం పైగా ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన, యువభారతి పక్ష సమావేశాలకు ఉచితంగా భాషానిలయాన్నిచ్చిన శ్రీ ఎం ఎల్ నరసింహారావు గారిని యువభారతి ఎప్పుడూ

మరచిపోదు. యువభారతి పక్షసమావేశాలు నిరంతరాయంగా జరుగుతూనే ఉండేవి. సభ్యులు ఉత్సాహంతో పాల్గొంటూ ఉండేవారు. లహరి కార్యక్రమాలకు ముందు యువభారతి కొన్ని పుస్తకాలను ప్రచురించింది. అవి అనుముల కృష్ణమూర్తి గారి సరస్వతీ సాక్షాత్కారము, కాళోజీ గారి జీవనగీత, వీచికలు (కవితా సంకలనం), పంచవటి(కథాసంకలనం).

తరువాత కొద్దికాలానికి 'రచన' చర్చాగోష్ఠి కార్యక్రమం జరిగింది. కార్యస్థలం ఆంధ్రసారస్వత పరిషత్తు, అంశం 'మారుతున్న విలువలు-రచయితల బాధ్యతలు'. ఆనాటి కార్యక్రమాల ఏర్పాట్లకు 5 కింగ్స్ వే, సికిందరాబాద్ శ్రీ విశ్వనాథంగారి ఇల్లో, శ్రీ సి.వి.ఏ.ఎస్. సూర్యనారాయణ ఇల్లో వేదికగా ఉండేది. 'రచన' సమావేశంలో పాల్గొనడానికి రుసుం 5 రూ॥ మాత్రమే. ఆ -సమావేశంలో పాల్గొన్నవారికి 5 రూ॥ రచన పుస్తకం ఉచితంగా ఇవ్వబడింది. ఆనాటి ప్రసిద్ధ రచయితల వ్యాసాలు అందులో వున్నాయి. ఆనాటి సమావేశానికి వచ్చిన వారికి తేనీరు భోజనాలు ఏర్పాట్లు చేయబడ్డాయి. కార్యక్రమాల ఏర్పాట్లలో యువభారతీయులు ఉత్సాహంగా పాల్గొన్నారు. ఆనాటి ఆంధ్రభూమి దినపత్రికల్లో 'రచన' లోని గోరాశాస్త్రి గారి వ్యాసం వచ్చింది. ఆ పుస్తకంలో వ్యాసాలు రాసిన ప్రసిద్ధ రచయితలను చూసే భాగ్యం, వారితో ప్రసంగించే అదృష్టం యువభారతీయులకు కలిగింది. ఎంతో ఉత్సాహంగా జరిగిన భోజనాలలో గోరాశాస్త్రి గారు నెయ్యి అని అరవడం నాకింకా గుర్తుంది. సుధామలాంటి యువభారతీయులు తమ గురువులైన కె.కె.రంగనాథాచార్యుల వారి పక్కన కూర్చొని భోజనం చేయడం ఇప్పటికీ మరువలేని విషయం.

ఉదయం ప్రారంభసమావేశానికి అధ్యక్షులు దేవులపల్లి రామానుజరావు గారు. వారు యువభారతికి ప్రాతఃస్మరణీయులు. వారు యువభారతికి తమ ప్రాంగణాన్ని ఉచితంగా ఇవ్వడమే కాకుండా యువభారతీయులను ప్రోత్సహిస్తూ వారిలో ఉత్సాహాన్ని నింపేవారు. ఆ సమావేశంలో పాల్గొన్నవారు- డా.సి.నారాయణరెడ్డి, డా.జి.వి. సుబ్రహ్మణ్యం తదితరులు ప్రారంభ సమావేశం తరువాత చర్చలు వాడిగా వేడిగా జరిగాయి. సాయంత్రం జరిగిన ముగింపు సమావేశం కూడా ఎప్పటికీ మరచిపోలేనిది. చివరకు మారుతున్న విలువలను బట్టి రచయితలందరూ బాధ్యతతో రచనలు చేయాలని సమాజాభ్యున్నతికి పాటుపడాలని నిర్ణయించినట్లు గుర్తు. ఆనాటి సమావేశాలు ముగిసిన తరువాత యువభారతీయుల సమీక్షా సమావేశం. కుర్చీలు

వేయడం, తీయడంతో సహా ఆనాటి ఏర్పాట్లలో యువభారతీయులు పాల్గొన్న సంఘటన ఎప్పటికి మరచిపోలేనిది.

మరికొంత కాలానికి కార్యదర్శి శ్రీ వెంకటేశ్వరరావు గారి సలహాపైన ఇరివెంటి కృష్ణమూర్తి, శ్రీ వంగపల్లి విశ్వనాథం గారల ప్రోత్సాహంతో తెలుగు పంచకావ్యాలపై ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారిచే ప్రసంగాలు ఇప్పించాలని, ఆ ప్రసంగవ్యాసాలను ఒక పుస్తకరూపంలో తీసుకువచ్చి దానిని సాధ్యమైనంత తక్కువ వెలలో పాఠకులకు అందజేయాలని నిర్ణయం జరిగింది. ప్రచురణ పూర్వ విరాళంగా దానిని 2 రూ. లకే ఇవ్వాలని నిర్ణయించారు కూడా. ఆ సాహిత్యసమావేశాలకు ఎంతమంది వస్తారో తెలియదు. సారస్వతపరిషత్ హాలు నిండుతుందా అని అనుమానం. కాని ఊహకుమించి ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులతోసహా సభ కిటకిటలాడి పోయింది. తరువాత సమావేశానికి సభావేదిక పరిషత్ భవనం వెనుక ఖాళీస్థలంలోకి మార్చబడింది.

అదే పరంపరలో వసుచరిత్రపై అవధానిగారు ప్రసంగిస్తున్నప్పుడు పెద్దవాన కురిసింది. అయినా ప్రేక్షకులు కదలలేదు. సమావేశం హాలులోకి మార్చబడింది. బయట నిలబడినవారు కుర్చీలనే గొడుగులుగా చేసుకొని ఆనాటి ప్రసంగాన్ని వినడం యువభారతి చరిత్రలో మరచిపోలేని సంఘటన. ఆ రోజుల్లోనే కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు తన శిష్యుడు వేంకటావధాని చేసిన ప్రసంగాలను ప్రశంసించారు కూడా. ఐదు సమావేశాలు దిగ్విజయంగా ముగిసాయి. కావ్యలహరికే అనుకుంటా చివరిరోజు ఆవిష్కరింపబడే పుస్తకాలు కొంచెం ఆలస్యంగా వచ్చాయి. కానీ అవధానిగారు సమయాన్ని పూరిస్తూ ఎక్కువ సమయం ప్రసంగించడం మరచిపోలేని విషయం. అందరికీ వివిధకౌంటర్లలో పుస్తకాలు అందజేయబడ్డాయి. త్వరలోనే కావ్యలహరి రెండవ ముద్రణ కూడా పొందింది.

సభ పూర్తైన తరువాత సుమారు నలభైమంది ఒక వృత్తాకారంలో కూర్చుని ఉంటే శ్రీ విశ్వనాథం గారు అందరికీ కృతజ్ఞతలు తెలుపుతూ అందరికీ కావ్యలహరి పుస్తకాలు అందజేశారు. అప్పుడు సమీక్షాసమావేశం సుమారు 50ని. ల పాటు జరిగింది. తరువాత మేం సీతారాంబాగ్ చేరుకున్నాం. అప్పటికి అర్ధరాత్రి దాటిపోయింది. తేదీ మారిపోయింది. ఆ సమావేశాల గూర్చి శ్రీ పి .ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి గారు ఆంధ్ర జనత దినపత్రికలో విపులంగా వ్యాసాలు రాసేవారు. ఆకాశవాణిలో సంక్షిప్త ప్రసంగపాఠం వచ్చేది. మిగిలిన పత్రికలు కూడా యువభారతి సమావేశాలను ప్రశంసిస్తూ రాసేవి.

తరువాతి కార్యక్రమం చైతన్యలహరి, దానికి ఫోటోగ్రాఫర్ శ్రీ గణేశన్ గారు ఆరోజుల్లో శ్రీ ఎన్.టి. రామారావు కొత్తగా నిర్మించిన రామకృష్ణ 70 ఎంఎం థియేటర్‌లో ఉండే నటరాజస్వామి విగ్రహాన్ని వివిధ భంగిమల్లో ఫోటోలు తీసి దానిని ఒక పద్ధతిలో అమర్చి చైతన్యలహరికి ముఖచిత్రంగా చేకూర్చారు. ఆరోజుల్లో యువభారతి పుస్తకాలకన్నిటికీ ముఖపత్రం అందించినవారు శ్రీ శీలా వీర్రాజు గారు. ఆయన ఎక్కువ మాట్లాడేవారు కాదు. కానీ ఆత్మీయంగా ఉండేవారు. ఆయన కవి, రచయిత, చిత్రకారుడు కూడా. అన్నింటినీ మించి గొప్ప మనీషి. శ్రీ శీలా వీర్రాజు గారు యువభారతికి చేసిన సేవలు ఎన్నటికీ మరచిపోలేనివి. అప్పటికే డా.సి. నారాయణరెడ్డి గారి మందారమకరందాలు పోతన భాగవత పద్యాలకు వ్యాఖ్యానం వెలువడింది. దాని ఖరీదు ఒక్క రూపాయి మాత్రమే. లక్ష ప్రతులు అమ్మాలని యువభారతి ప్రయత్నం. ఆనాటికి చిన్నపిల్లలుగా ఉన్న జె.వెంకట్రావు, జి విద్యానాథ్‌లు పుస్తకాలు చేతుల్లో పట్టుకొని తిరుగుతూ అమ్మడం నాకింకా గుర్తు.

చైతన్యలహరిలో వేమనపై ప్రసంగించడానికి మద్రాసు నుండి వచ్చినవారు శ్రీ ఆరుద్రగారు. వారు యువభారతీయుల కృషిని మెచ్చుకున్నారు. 10రూ. చెల్లించి సాహితీమిత్ర సభ్యత్వం తీసుకున్నట్లు గుర్తు. వారు యువభారతికి వేమన్న వేదం (సాహితీవాహిని) రాసిచ్చారు కూడా. ఆ రోజుల్లో సాహితీమిత్ర, భారతీమిత్ర, భారతీభూషణ పథకాలు ఉండేవి. ఆ పథకాలు యువభారతి సభ్యత్వం కంటే భిన్నమైనవి. కొందరు తమ లెటర్ హెడ్‌లపై వానిని ప్రకటించుకున్నారు కూడా. యువభారతి కార్యక్రమాలన్నీ మిక్కిలి ఉత్సాహంతో సమయపాలనతో జరిగేవి. ఆరోజుల్లో యువభారతి కార్యక్రమాల్లో శ్రీ విశ్వనాథం గారికి కుడిభుజంగా వ్యవహరించిన వ్యక్తులు శ్రీ డి ఎల్ ఎన్ ప్రసాద్, శ్రీ టి కె విజయకుమార్ యువభారతికి చేసిన సేవలు ఎప్పటికీ గుర్తుండి పోతాయి శ్రీ జహంగీర్ చేసిన సేవలు గుర్తుంచుకో దగ్గవే. ఆరోజుల్లో యువభారతి మహిళా విభాగం ఏర్పాటు చేయబడింది. అందులో కుమారి వి.బి.లక్ష్మి చురుకుగా పాల్గొనేవారు. యువభారతిని అభిమానిస్తూ నిరుపమానమైన సేవలు చేసిన శ్రీ కె.వి. కామేశ్వరరావు గారు ఆమెను అర్ధాంగి (శ్రీమతి కె బి లక్ష్మి) గా స్వీకరించింది కూడా ఆరోజుల్లోనే. ఆరోజుల్లో యువభారతికి తమ సహాయసహకారాలు అందించినవారు ఎందరో, శ్రీ టి.వి.ఎస్ శాస్త్రి, శ్రీపతి రఘురామ్ కుమార్, రామజోగయ్య, ఎం. ఎస్ ఆర్ ఆంజనేయ శర్మ, విశ్వసూర్య, రాజన్న, మురళీధరగౌడ్, ఎస్. నారాయణరెడ్డి, కుమారస్వామినాయుడు, కృష్ణప్రసాద్

మొదలగువారూ ఉన్నారు (కొన్ని పేర్లు నేను మరచిపోయి ఉండవచ్చు. క్షమించాలి). ఆ రోజుల్లో కొందరు యువభారతీయులకు కొంతకాలం గౌరవ వేతనం కూడా ఇవ్వబడింది.

1972లో భారత స్వాతంత్ర్య రజతోత్సవాలు జరిగాయి. యువభారతి తరపున ఒక గొప్ప పుస్తకం (మహతి) తీసుకురావాలని శ్రీ కృష్ణమూర్తి, విశ్వనాథం, జి.వి. సుబ్రహ్మణ్యం నిర్ణయించారు. దానికి వారే సంపాదకులు కూడా. 100 వ్యాసాలతో కూడిన 700 పేజీల పుస్తకం అది. కేవలం 7రూ.లకే ప్రచురణ పూర్వ విరాళంగా దానిని అందించింది యువభారతి. అది అనేక సంకలనగ్రంథాలకు మార్గదర్శిగా నిలబడింది. అనేక విశ్వవిద్యాలయాల్లో ఆకరగ్రంథంగా నిర్ణయింపబడింది. డా. అడపా రామకృష్ణారావు గారి సంపాదకత్వంలో ఒక ఇంగ్లీష్ పుస్తకం (ఫ్రీ ఇండియా ఫోర్టైస్ ఎహెడ్) కూడా వెలువడింది. వాటిని ఆవిష్కరించడానికి ఆనాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి.వి.నరసింహారావు విచ్చేసారు. దాని ఏర్పాటుకు తమ పూర్తి సహకారాన్ని అందించిన వారు శ్రీ అక్కిరాజు వాసుదేవరావు గారు. వారు యువభారతి కార్యక్రమాలను అభిమానించేవారు. వారు యువభారతి గౌరవసభ్యులు. ఆనాటి ప్రభుత్వ మంత్రివర్గంలో సాంస్కృతిక శాఖామంత్రి కూడా.

ముఖ్యమంత్రి గారు పని ఒత్తిడి వలన యువభారతి సమావేశానికి ఆలస్యంగా వచ్చారు. కాని సమయపాలన పాటించే యువభారతి సమావేశం ప్రారంభమైంది. వారు వచ్చిన తరువాత యువభారతిని మెచ్చుకున్నారు. వారు తమ ప్రసంగంలో ఆంధ్రప్రదేశ్ సర్కార్ మేం కుచ్ దేర్ హెూ సక్తా హై లేకిన్ వోహ్ అంధేరా నహీం అని పేర్కొన్నారు. సభాప్రాంగణం కిక్కిరిసి ఉండడం చూసి యువభారతి తమ కార్యక్రమాలను లాల్ బహదూర్ స్టేడియంలో నిర్వహించాలని సూచించారు. ఆనాటి సమావేశంలో శ్రీ జివి సుబ్రహ్మణ్యం గారు శ్రీశ్రీ మహతిలో పేర్కొన్న "1930 వరకు తెలుగు సాహిత్యం నన్ను నడిపించింది. ఇప్పుడు దానిని నేను నడిపిస్తున్నాను" అని ఉటంకించినపుడు కొందరు వామపక్షీయాభిమానులు కొట్టిన చప్పట్ల చప్పుడు ఇప్పటికి వినిపిస్తూనే ఉంటుంది. కొంతకాలం అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనలో సాహిత్య అంగడిని ప్రదర్శించింది యువభారతి. చాలాకాలంపాటు నగర కేంద్ర గ్రంథాలయం వారి సహకారంతో ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారి ఆధ్వర్యంలో యువకులకు వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలు నడిపింది. తలచుకొంటే ఎన్నో జ్ఞాపకాలు. రాయాలంటే చాలా అవుతుంది.

యువభారతి పూర్వాధ్యక్షులు ఆచార్య జి వి సుబ్రహ్మణ్యం గారి ఆధ్వర్యంలో జరిగిన యువభారతి రజతోత్సవాలు ఎన్నటికీ మరువలేనివి. డా.తిరుమల శ్రీనివాసాచార్యుల వారి ఆధ్వర్యంలో జరిగిన హాస్యలహరి మొదలైన కార్యక్రమాలు ఎప్పటికీ గుర్తు ఉంటాయి యువభారతి కార్యదర్శులుగా శ్రీ ఎస్ వెంకటేశ్వరరావు, ఏ. నాగేశ్వరరావు, రామలింగేశ్వరరావు, వివేకానంద, డా. జయరాములు, విద్యానాథ్, ఏ.రవీంద్ర,బాలసాహితీవేత్త శ్రీరెడ్డి రాఘవయ్య, కార్యనిర్వహణాదక్షుడు మలపాక పూర్ణచంద్రరావుగారల సేవలు ఎప్పటికీ గుర్తుండి పోతాయి.

ఇప్పుడు ఆచార్య వంగపల్లి విశ్వనాదం గారి పర్యవేక్షణలో అధ్యక్షులుగా డా. ఆచార్య ఫణీంద్ర, ఉపాధ్యక్షులుగా శ్రీ ఏ.నాగేశ్వరరావు, డా.జి ఎల్.కె.దుర్గ, కార్యదర్శిగా శ్రీ జీడిగుంట వెంకట్రావు, సహకార్యదర్శులుగా శ్రీ మారుతీ కిరణ్, శ్రీ నవీన్‌గౌడ్, కోశాధికారిగా శ్రీ ఏ.రవీంద్ర, సమావేశకర్తగా శ్రీ అశ్వనీకుమార్ మెచ్చుకోదగ్గ కార్యక్రమాలు చేస్తున్నారు. ఇంకా చాలా కార్యక్రమాలు చేయాలనీ ఆశిస్తున్నాను. యువభారతి కార్యకర్తలందరూ మహానుభావులే. అందరికీ వందనాలు.






యువభారతి ప్రచురణలను ఆవిష్కరిస్తున్న శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య
పక్కన యువభారతి సభ్యులు డా॥ నాగినేని భాస్కరరావు

# యువభారతితో నా అనుబంధం

శ్రీ సుధామ (అల్లంరాజు వెంకట్రావు)
కవి, చిత్రకారుడు, హైదరాబాద్
98492 97958

'మత్ పురాకృత శుభాధిక్యంబు తానెట్టిదో ....' అని భాగవత ఆంధ్రీకరణం గురించి పోతన గారి పొంగు వంటిదే యువభారతి సంస్థతో నాకు ఏర్పడిన అనుబంధపు ఆనందం. సంస్థకు నాలుగేళ్ల ప్రాయంలో పదహారేళ్ళ ప్రాయపు నాకు పరిచయమైంది. అదే నన్ను ఒక సాహిత్యవ్యక్తిత్వపు ఎదుగుదలను పెంచి పోషించింది. చదివింది ప్రాచ్యకళాశాలలోనే అయినా ఒక అభ్యుదయ పథగామిగా మలచింది నాటి కళాశాల ప్రిన్సిపాల్ కీ.శే. కె.కె.రంగనాథాచార్యులు గారయితే, యువభారతి తో నన్ను మమేకంచేసి ఒక సమ్యక్ దృష్టిని సంతరింపచేసింది వంగపల్లి విశ్వనాథం గారు.

సంస్థ అధ్యక్షులుగా వుండిన కీ.శే. ఇరివెంటి కృష్ణమూర్తి గారితో, ఆపై కీ.శే.జి.వి.సుబ్రహ్మణ్యం గారితో, శ్రీ తిరుమల శ్రీనివాసాచార్య గారితో పెనవేసుకున్న గురుశిష్య బంధం అక్షరాలకందని అనుభూతి.

1967 లో ఓ ఆదివారం డెక్కన్ క్రానికల్ లో సిటీడైరీలో యువభారతి పక్షసమావేశం వార్త చూసి శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయం సమావేశ మందిరానికి వెళ్లిన యువకుడు ఈనాడు అంతోయింతో ఒక సాహితేవేత్తగా ,ఆకాశవాణి లో సమర్థ తెలుగువిభాగం కార్యక్రమ నిర్వహణాధికారిగా రాణించడానికి వెనుక తాలింఖానా యువభారతి సంస్థాగతమే ! నా వల్ల సంస్థకు చేరువైనవారు వుండడం ,సంస్థలో వుంటూ అలా మేము ఎంతో మిత్రసంపదను పోగేసుకున్న అదృష్టం ,ఎందరో సాహితీ దిగ్గంతుల పరిచయాలు ,ఆశీస్సులు బడసిన భాగ్యం యువభారతి వల్లనే.

యువభారతి తొలినాళ్ళ లిఖితపత్రికను రూపొందించడం , ద్వితీయ ప్రచురణ కాళోజీ గారి జీవనగీత ప్రెస్ కాపీ రాయడం,ఆ తరువాత సంస్థ సభ్యుల తొట్టతొలి కవితాసంకలనంగా ప్రచురించిన వీచికలు నలుగురు కవులలో ఒకడిని కావడం ,

మిత్రుడు కీ.శే.నాగినేని భాస్కరరావు తో కలసి 'మేం' కవితాసంపుటి సంస్థ ప్రచురణగా వెలువరించడం ,రచన సెమినార్ , కావ్యలహరి ఉపన్యాసాల దివాకర్లవారి సన్మానపత్రం, మహతి లోపలపేజీల అక్షరాలంకరణ చేయడం, మహతిలో కార్టూన్లు జోకులపై వ్యాసం రాయడం, లహరి ఉపన్యాసాలకు ఓ వందనసమర్పణకు కూడా కరతాళధ్వనులు అందుకోవడం, తదనంతరకాలంలో లహరి పరంపరలో హాస్యలహరిలో మునిమాణిక్యంపై వక్తగా నేనూ ప్రసంగించి వ్యాసం రాయడం , సంస్థ ప్రచురణలకు కొన్నింటికి నేనూ ఓ చిత్రకారునిగానూ ముఖచిత్రాలు వేయడం ,అనంతరం ఇటీవల 2019 లో ఒక కాలమిస్టుగా నేను రాసిన 'వసుధా(స)మయం'వ్యాస సంకలనం సంస్థకే అంకితం చేయడం,యువతకై నేను రాసిన 'తెలుగుసొగసులు'గ్రంథాన్ని సంస్థ ప్రచురించడం, కొంతకాలం వరకు యువభారతి ప్రచురణల ప్రధాన సంపాదకునిగా గుర్తింపునొందడం...ఇలా తలుచుకున్నకొద్దీ ముప్పిరిగొనే మధురఘట్టాలూ , జ్ఞాపకాలు కొల్లలు గా వున్నాయి. ఈ జీవితానికి అవి చాలు.

సంస్థకు నేనిచ్చింది ఏమిటో తెలియదుగానీ సంస్థవల్ల పొందింది అపారం.'నేను –మా యువభారతి 'అని ఒక ఉద్గ్రంథం రాయదగినంత విషయాలున్నప్పుడు ఇంతటితో సరిపెట్టుకోవడం కూడా సంస్థ నేర్పిన తృప్తికర జీవన సంవిధానమే ! నేడు 60ఏళ్ల యువభారతికి 72 ఏళ్ళు నడుస్తున్న మీ సుధామ సదా అధమర్ణుడు.

తెలుగు సాహిత్యాభిమానుల హృదయాలలో తప్ప ఇన్నాళ్లయినా యువభారతి సంస్థకు ఒక స్థలం అంటూ లేదుగనుక అవశాంతాన మా సజీవ సమాధి కూడా అక్కడే కావాలనే ఆకాంక్షతో... సెలవు .



# నేనూ (నా) యువభారతి

శ్రీ అల్లంరాజు రాధాకుమార్
విశ్రాంత బ్యాంక్ అధికారి, హైదరాబాద్
94903 70248

అవి నేను కాలేజీ లో చదువుతున్న రోజులు . 1968 లో డిగ్రీ రెండవ సంవత్సరంలో ఉన్నాను. కాలేజి అయ్యాక తరచుగా సుల్తాన్ బజార్ లోని శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయం అనే గ్రంథాలయానికి వెళ్లి సాయంత్రం పూట ఒక గంట సేపు దిన, వార పత్రికలూ తిరగేసి అక్కడ పెట్టే శని, ఆది వారాలలో జరిగే సమావేశాల వివరాలు చదివి నోట్ చేసుకొని ఇంటికి వెళ్ళడం జరిగేది.

సాధారణంగా ఆదివారాలు సాహితీ సమావేశాలు సాయంత్రంపూట జరుగుతూ ఉండేవి. అలా ఒకసారి "ఈ నెల మొదటి ఆదివారం మధ్యాహ్నం 2.30 ని,లకు. యువభారతి పక్ష సమావేశం మేడ మీద సమావేశ మందిరం లో జరుగును.సాహితీ మిత్రులందరూ విచ్చేసి పాల్గొనగలరు " అన్న నల్ల బల్ల మీద వ్రాసిన వార్త చదివి, ఆదివారం నాడు వెళ్లి చూడాలనుకొన్నాను . అప్పటికే నా తమ్ముడు వెంకట్రావు ఆ సమావేశాలకి వెళ్లి అందులో పాల్గొన్నట్లు ,తనతో ఈ విషయం చెప్పినపుడు నాతో చెప్పాడు. సరే, నేనూ నీతో వస్తాను,ఇద్దరం కలిసి వెళ్దాము, అంటే అల్లాగే అని ఆ నెల మొదటి ఆదివారం నాడు మొదటి సారిగా మధ్యాహ్నం 2.30 గం.లకు ఇద్దరం కలిసి భాషా నిలయానికి వెళ్లి నేను కూడా ఆ సమావేశంలో ఒక ప్రేక్షకుడిగా పాల్గొనడం జరిగింది.

ఆ రోజు సమావేశం లో సంస్థ అధ్యక్షులు కీ.శే. ఇరివెంటి కృష్ణమూర్తి గారు ,కార్యదర్శి ,సమావేసకర్త శ్రీ వంగపల్లి విశ్వనాథం గారి కార్యక్రమ నిర్వాహణ పద్ధతి, ప్రసంగాలు నన్ను బాగా ఆకట్టుకున్నాయి . తెలుగు భాషాభిమాని,మాతృభాష తెలుగు కావడం చేత మూడు గంటలసేపు కార్యక్రమం చాలా ఆసక్తికరంగా సాగింది. ప్రార్థనతో ప్రారంభమై క్లుప్తగోష్ఠి, పుస్తక పరిచయం, ఆంగ్ల పదాలు వాడకుండా

తెలుగులో ప్రసంగించే పద్ధతి ,రాబోయే పక్ష సమావేశానికి ఒక అంశం ఇచ్చి దానిపైన వ్రాసి సమావేశంలో చదవడం- ఇలా అనేక రకాలైన కార్యక్రమాలు జరగడం నన్ను బాగా ఆకర్షించి నాలో సాహిత్యాభిమానాన్ని పెంపొందించి నేను ఏదైనా వ్రాయాలి, సమావేశంలో చదివి వినిపించాలి అన్న ఆసక్తిని కలిగించింది. ఆనాటి నుంచి దాదాపు దశాబ్దం పాటు యువభారతి తలపెట్టిన అన్ని సమావేశాలలోను, పుస్తక ప్రచురణలలోను ఒక కార్యకర్తగా, సేవకుడిగా పనిచేయడంచేత, యువభారతి నాది అన్న భావన ఏర్పడింది. నాలోని రచనా శక్తిని పెంపొందించు కొనే అవకాశాన్ని యువభారతి కలగచేసి, “అక్షరాలు ”, “స్వరాలు ” అనే సంకలనాల్లో నా కవితలకి స్థానం కల్పించింది.

యువభారతి ప్రచురణల సమయంలో ముద్రణాలయానికి వెళ్లి అక్కడ పనిలో సేవ చేసి అందులోని కష్టసుఖాలు చవి చూడడం జరిగింది. సాయంత్రాల పూట యువభారతి కి వెళ్లి పుస్తకాలు కట్టలు కట్టిన రోజులు నేటికి మరువలేని మధురమైన జ్ఞాపకాలు.

యువ భారతి కార్యకర్తగా నాకు ఎంతో మంది తెలుగు పండితులను, కవులను, రచయితలని చూసి పరిచయం చేసుకొనే అవకాసం లభించింది. అనేక మంది సాహితీ మిత్రులను పొందడం నా అదృష్టం,చిరకాలం నిలిచే జ్ఞాపకాలు.

ఆలోచిస్తే అప్పుడే అరవై ఏళ్ళు నిండి వజ్రోత్సవాలు జరుపుకొంటున్నామా అన్న ఆలోచన ఆనందాన్ని కలిగిస్తోంది.

ఇంకా ఎందఱో మహానుభావులు , సాహితీ మిత్రులు అందరి పేర్లు పేర్కొనాలని ఉన్నా చోటు చాలదని మనసులోనే తలచుకొని ఆనందించి ,యువభారతి వజ్రోత్సవాలు దిగ్విజయంగా జరగాలని కోరుకొంటున్నాను. నాకు ఈ అవకాసం కలిగించిన నిర్వాహకులకు మనస్ఫూర్తిగా ధన్యవాదాలు.



# ఐదున్నర దశాబ్దాల సుదీర్ఘ పరిచయం

శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడు
కవి, రచయిత, పుస్తకశిల్పి, హైదరాబాద్
93931 76552

యువభారతి సంస్థలో పరిచయమే ఒక వరమనుకుంటే దానితో సుదీర్ఘమైన అనుబంధం ఒక గొప్ప అనుభవం. యువభారతిని ఒక సంస్థ అనడం కన్న ఒక సమష్టి కుటుంబం అనడం సబబు. అలాంటి గొప్ప సంస్థతో ఐదున్నర దశాబ్దాల పాటు అనుబంధం కొనసాగడం ఇప్పుడు ఆలోచిస్తే నాకే ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. యువభారతితో పరిచయమే కాకుంటే ఈ జీవితం ఏ మార్గంలో నడచేదో చెప్పలేను. కొన్ని పరిచయాలు జీవన గమనాన్నే మార్చివేస్తాయన్నది నిజం.

అది 1968 సంవత్సరమనుకుంటాను. గ్రామీణ ప్రాంతమైన ఆదిలాబాదు జిల్లాలోని చెన్నూరులో ఉన్నత పాఠశాల చదువు ముగించి నగరానికి వచ్చి ఎన్.బి. కళాశాలలో పి.యు.సి. చదువుతున్నరోజులు. ఉస్మానియా విశ్వవిద్యాలయం స్వర్ణోత్సవాలు టాగోర్ ఆడిటోరియంలో జరుగుతున్నాయని పత్రికల్లో చదివి వెళ్ళాను. అక్కడ ఎవరో కొన్ని కరపత్రాల వంటివి పంచుతున్నారు. 'యువభారతి పంచమ వార్షికోత్సవ సంచిక' అనే పేరుతో కరదీపిక లాంటిది నా చేతికి అందింది. ఆసక్తిగా, ఆసాంతం చదివాను. సంస్థ కార్యక్రమాల గురించి, ఆశయాల గురించి తెలుసుకొని ఆకర్షితుడనయ్యాను. ప్రతి నెలా మొదటి మూడవ ఆదివారాల్లో మధ్యాహ్నం రెండున్నర గంటలకు సుల్తాన్‌బజారులోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో 'క్లుప్తగోష్ఠి' పక్ష సమావేశం జరుగుతుందని, అందరూ ఆహ్వానితులే అన్న ప్రకటన చదివి ఒక ఆదివారం పూట వెళ్ళాను. ఆ సమావేశంలో 'క్లుప్తగోష్ఠి'లో పాల్గొని ఉత్తమవక్తగా ఒక పుస్తకం బహుమతిగా అందుకున్న విషయం ఇప్పటికీ నా స్మృతిపథంలో మెదలుతూ ఉంటుంది.

ఆ తర్వాతి రోజుల్లో ఈ పక్షసమావేశాల్లో నిర్వహింపబడే స్వీయకవితా పఠనం, నాకు నచ్చిన పుస్తకం వంటి వివిధ అంశాలలోనూ పాల్గొనడమే కాకుండా కార్యక్రమాలను నిర్వహించే స్థాయికి చేరుకున్నాను. కొంత అనుభవం సంపాదించాక ఈ సమావేశాల వివరాలు వార్తలుగా రాసి దినపత్రికలకు పంపే బాధ్యతను కూడా నిర్వాహకులు నాకు అప్పగించారు. అలా యువభారతి అనధికార పి.ఆర్.ఓ.గా (అంటే ప్రెస్‌రిలేషన్స్ ఆఫీసరుగా) వ్యవహరింపబడినాను.

తొలి పక్షసమావేశాల్లోనే పరిచయమైన యువభారతి ప్రముఖులు ఇరివెంటి కృష్ణమూర్తి, వంగపల్లి విశ్వనాథం, ఎస్.వెంకటేశ్వరరావు, సుధామ, నాగినేని భాస్కరరావు, విశ్వనాథ సూర్యనారాయణ, సి.వి.ఎ.యస్. సూర్యనారాయణ, జి.ఎల్.నరసింహారావు, కె.వి. కామేశ్వరరావు, ఎస్.పాండురంగారెడ్డి, ఎస్.ఎస్.ప్రసాద్ మొదలైనవారు.

నేను మౌలికంగా గేయకవినే. చెన్నూరు ఉన్నతపాఠశాలలో చదువుకుంటున్న రోజుల్లోనే మాత్రాచ్ఛందస్సులో రాసిన గేయాలను విని మెచ్చుకొని తప్పులు సరిచేసిన మహాకవి, అభినవ పోతన శ్రీవానమామలై వరదాచార్యులుగారి ప్రోత్సాహంతో హైదరాబాదు వచ్చిన కొత్తలో 'మౌక్తికాలు' పేరిట కొన్ని గేయ సూక్తులు రాశాను. వాటిని స్వీయ కవితాపఠనంలో వినిపించడం, వాటిని విన్న అప్పటికే కవిగా, చిత్రకారుడుగా, వక్తగా ప్రసిద్ధుడైన సుధామగారు మెచ్చుకొని తాను వెలువరిస్తున్న 'యువమిత్ర' లిఖిత మాసపత్రికలో వరుసగా పొందుపరచడం, ప్రోత్సహించడం ఇప్పటికీ తాజాగా గుర్తున్న విషయం. ఆయన పట్టుదలతోనే ఇటీవల 'గేయమౌక్తికాలు' పేరిట నా గేయ సంపుటిని ప్రచురించాను. నేనెప్పుడు సుధామగారికి అధమర్ణుడను.

తర్వాతి కాలంలో జి.వి.సుబ్రహ్మణ్యంగారు, రామజోగయ్య, టి.వి.సుబ్రహ్మణ్య శాస్త్రి, శ్రీపతి రఘురాం కుమార్, సుభాష్‌బాబు, భార్గవ, విజయ్‌కుమార్, కె.బి.లక్ష్మి, రాజన్న, జహంగీర్, నాగేశ్వరరావు, అనంతాచార్య, రవీంద్ర, కె.వి.కామేశ్వరరావు, రెడ్డి రాఘవయ్య, ఎస్.నారాయణరెడ్డి మొదలైన వారితో కలిసి పనిచేయడం మరచిపోలేని గొప్ప అనుభవం.

యువభారతి ఎంతోమందిని రచయితలుగా, కవులుగా, వక్తలుగా, ఉత్తమ వ్యక్తులుగా, దిద్దితీర్చింది. అది ఒక వ్యక్తిత్వ వికాసకేంద్రమంటే అతిశయోక్తి కాదు. యువభారతి అష్టమ వార్షికోత్సవాల సందర్భంగా ఏర్పాటైన దివాకర్లవారి ఉపన్యాస

లహరి కార్యక్రమాలతో సంస్థ కార్యకలాపాలు పెరిగాయి. వాటిని గ్రంథస్థం చేయటం కోసం ప్రెస్సుల చుట్టూ తిరగడం, అర్ధరాత్రి వరకూ ప్రెస్సులో ప్రూఫులు దిద్ది అక్కడే, నిద్రపోవడం – మధురమైన జ్ఞాపకాలే.

ఎంతోమందికి యువభారతి పుస్తకాలు అందించి వారిని సంస్థకు పరిచయం చేసే అవకాశం లభించడం నా అదృష్టమే. సర్దార్‌పటేల్ కళాశాలలో బి.కాం. చదువుకునే రోజుల్లో మాకు తెలుగు బోధించే నేటి ప్రముఖ కవి, రుబాయీ కవిసమ్రాట్ డా॥తిరుమల శ్రీనివాసాచార్యులు గారికి యువభారతిని పరిచయంచేసి, సంస్థకు ఆహ్వానించాను. “నా శిష్యమిత్రుడు మురళీధర్ యువభారతితో నాకు పరిచయభాగ్యం కలిగించాడని” ఆచార్యులవారు తమ ఉపన్యాసంలో పేర్కొనడం నాకెంతో గర్వకారణం. ఆ తర్వాతి కాలంలో వారు సంస్థ అధ్యక్షుడుగా ఎన్నిక కావడం, వారి ఆధ్వర్యంలో అనేక సాహితీ కార్యక్రమాలు జరగడం అందరూ ఎరిగినదే.

యువభారతి కార్యక్రమాల్లో చురుగ్గా పాలుపంచుకోవడం వల్ల ఎంతోమంది ఉద్ధండులను దగ్గరనుంచి చూసే అదృష్టం కలిగింది. ఎందరో ప్రముఖులతో పరిచయాలు ఏర్పడ్డాయి. ఎవరిని కలువడానికి వెళ్ళినా ‘యువభారతి సభ్యుడు’ అంటే ఎంతో గౌరవ మర్యాదలు లభించడం ఎంతో ఆశ్చర్యంగా ఉండేది. ఎంతో థ్రిల్లింగ్‌గాను ఉండేది. ఇక్కడ ఒక విషయం తప్పక చెప్పాలి. నేను ఉద్యోగరీత్యా 1996 నుంచి ఆరేళ్లపాటు మనదేశరాజధాని న్యూఢిల్లీ లో నివసించినప్పుడు, నేను బదిలీపై హైదరాబాదు నుంచి ఢిల్లీ వచ్చిన విషయం తెలుసుకొని ప్రతిష్ఠాత్మక సంస్థ నేషనల్ బుక్ ట్రస్టు ఇండియా ప్రచురణల తెలుగు విభాగంలో పనిచేస్తున్న ఒక అధికారి నన్ను వెతుక్కుంటూ వచ్చి “మీరు యువభారతి సంస్థలో మంచి అనుభవం ఉన్నవారని విన్నాం. దయచేసి మా సంస్థ ప్రచురించే తెలుగు పుస్తకాల ప్రూఫ్‌రీడింగ్, ఎడిటింగ్ లాంటి పనులు చేసిపెట్టండి, తగిన పారితోషికం కూడా ఇస్తాం” అని కోరడం నాకు ఆనందాన్ని కలిగించింది.

అట్లాగే ఈ మధ్య (28.03.2023) తెలుగు విశ్వవిద్యాలయం వారు నాకు కీర్తి పురస్కారాన్ని ప్రదానం చేసిన సందర్భంలో వైస్‌చాన్సలర్ డా॥తంగెడ కిషన్‌రావు నన్ను సభకు పరిచయం చేస్తూ ‘మీ రచనా వ్యాసంగానికే కాకుండా యువభారతి సంస్థలో క్రియాశీల సభ్యులుగా చేసిన సాహిత్య కృషికి గుర్తింపుగా ఈ పురస్కారం ఇస్తున్నాం’ అని పేర్కొనడం నాకెంతో గర్వకారణం.

క్రమశిక్షణకు, సమయపాలనకు, ఔచిత్యానికి మారుపేరు యువభారతి. వ్యక్తిగత ప్రచారానికి తావులేదు. ఫోటోల కోసం పత్రికల్లో పేరు చూసుకోవడం కోసం ఎన్నడూ పాకులాడే వాళ్ళం కాదు. అంత నిస్వార్థంగా, నిర్మోహంగా పనిచేసేవాళ్లం. సాధారణ సభ్యుడు మొదలుకొని అధ్యక్షుని వరకు కలిసి పనిచేసే సత్సంప్రదాయం ఒక్క యువభారతిలోనే ఉండేది. అంతటా పదవుల కోసం పోటీపడే రోజుల్లో మేము పనికోసం పోటీపడేవాళ్ళం.

ఇలాంటి సంస్థకు కేంద్రబిందువు, అందరినీ ఒక్క తాటిపై నడిపించిన అరుదైన విశిష్టవ్యక్తి వంగపల్లి విశ్వనాథం గారు. ఆయన వాణిజ్యశాస్త్ర ఉపన్యాసకుడే అయినా తెలుగు భాషకు చేసిన సేవ అనితర సాధ్యం, అనన్య సామాన్యం అంటే ఏ మాత్రం అతిశయోక్తి కాదు. ఆయన యువభారతి ద్వారా చేస్తున్న సేవలను ఏ పురస్కారంతోనూ సరితూచలేం. ఆయనంటే అందరికీ హడలే. మన దురదృష్టం కొద్దీ ఆయన ప్రతిభాపాటవాలు కేవలం ఒక సంస్థకే పరిమితం కావడం. ఒక వ్యక్తి జీవితంలో అరవైయేళ్లు ఎంత ముఖ్యమైనవో ఒక సంస్థ విషయంలోనూ అంతే ప్రాధాన్యతను సంతరించుకుంటుంది. యువభారతి అరవైయేళ్లుగా సజీవంగా నిలబడేలా కృషిచేసిన వ్యక్తులందరికీ అభినందనలు. వజ్రభారతికి నా నమస్సులు.





'కావ్యలహరి' ఉపన్యాస కార్యక్రమానికి హాజరైన అశేష జనవాహిని

# పరిచయం - అనుబంధం-ధన్యవాదం

శ్రీ టి.కె. విజయ్‌కుమార్
నటుడు, విశ్రాంత ఉపాధ్యాయుడు, హైదరాబాద్
94904 69391

కొబ్బరి తోటల్లో, పొలాల్లో, చెరువుల్లో, పంటకాలువల్లో గోదావరి నదిలో, కాకినాడ సముద్రపు బీచిలో ఈతలూ, రహదారి పడవలూ, లాంచీల్లోనూ ప్రయాణాలూ, గోదావరి నదిలో పున్నమివెన్నెల విహారాలూ, మా ఊరు కొత్తలంక నుంచి 3 కిలోమీటర్లు దాదాపు వందమందితో కలిసి ముమ్మడివరం హైస్కూలుకి కాలినడకన వెళ్ళి చదువుతూ, ఆతర్వాత మా అమ్మగారి ఊరు కాకినాడ మునిసిపల్ హైస్కూల్‌లో చదువూ నా బాల్యమొక స్వప్నలోకం.

ఇంటి నిండా పనిమనుషులు, పశువులు మేపడానికి చిన్న పాలేరూ, ఎద్దులుకట్టి బండి నడపడానికీ, అరకదున్నడానికీ, వాటి సంరక్షణకూ పెద్దపాలేరు ఇంటి పనికి వేరే మనుషులు అలా గడుస్తున్న బాల్యంలో పెద్దకుదుపు మా నాన్నగారు నా పసివయసులో 1957 లో స్వర్గస్థులవడం వల్ల కొబ్బరితోటలూ, వరిపొలాలూ, కాకినాడ జగన్నాథపురం విష్ణాలయం వీధిలో 3 ఇళ్లూ వరుసగా ఉన్నా దక్షత లేని ఇల్లయిపోయింది. అప్పటికింకా మా ఇద్దరన్నయ్యలూ చదువులోనే ఉన్నారు. నలుగురు చెల్లెళ్లు అంతా చిన్నవాళ్ళే. మా అక్కయ్యకే అప్పటికి పెళ్లయింది. వాళ్లది రాజమండ్రి. జమీందారులు. పెద్ద దివాణం వాళ్లది.

1970లో మా పెద్దచెల్లి చి॥ రాజ్యలక్ష్మి పెళ్లయింది. అప్పుడు నేను మా పెద్దన్నయ్య తోడల్లుడు వరదరాజులు గారితో కలిసి భాగ్యనగరానికి వచ్చాను. మల్లేపల్లి చౌరస్తాలోని "ఆటపాటలు" మాసపత్రిక ప్రింటింగ్ ప్రెస్‌లో వరదరాజులుగారు మేనేజర్. ఆయన మద్రాసులో డిటెక్టివ్ నవలలు వ్రాసేవారు. ప్రూఫ్‌రీడర్‌గా పెట్టుకున్నారు. అది నాకు యువభారతిలో తర్వాత పుస్తక ప్రచురణలో బాగా ఉపయోగపడింది. 1974 వరకూ కుటుంబ పోషణకు ఆస్తులూ, ఇళ్లూ అమ్ముకుంటూ

గడిపేవారు. నేను ఇక్కడ్నించి ఆస్తులమ్మేటప్పుడల్లా వెళ్లి సంతకాలు పెట్టి వచ్చే వాడిని. ఆడబ్బులో ఒక్కపైసా కూడా ముట్టేవాడిని కాను. కుటుంబం మంచి చెడ్డలు వాళ్లే చూసుకున్నారు. పాఠశాల వార్షికోత్సవాల్లో నాటకాల్లో నటించేవాడిని. ముమ్మిడివరం స్కూల్లోనూ, కాకినాడలోనూ అలా నా జీవితంలో నటన ప్రవేశించి, ఆవహించింది. అక్కడ సినిమాల ప్రభావం ఎక్కువ. 1970లోనే ప్రముఖ కవి జ్వాలాముఖి తమ్ముడు రామాచారి రచన, దర్శకత్వంలో 'బలి' అనే నాటకంలో రెండు చిన్నపాత్రల్లో రవీంద్రభారతి ఆడిటోరియంలో మొదటిసారి నటించి నా నటజీవితానికి నాంది పలికాను. ఇది మా కుటుంబ మిత్రుడూ మా చిన్నన్నయ్య సహాధ్యాయీ శ్రీ మాడభూషి అనంతాచార్యులు ప్రోత్సాహంతో జరిగింది.

అతగాడే నన్ను 'యువభారతి'కి 1971 సం॥లో పరిచయం చేశాడు. అప్పటికే నాకు ప్రూఫ్‌రీడింగ్‌లో అనుభవం, ప్రింటింగ్ వ్యవహారాలూ తెలియడంతో యువభారతిలో నా ప్రస్థానం మొదలయింది. కావ్యలహరి, మహతి, లహరి పుస్తకాల పరంపర మొదదలయింది. శ్రీ అనంతాచార్యుల ద్వారానే నాకు బుచ్చిబాబు, గోపాలకృష్ణలు మిత్రులయ్యారు. అది మొదలు 1977 సం॥ నేను నృపతుంగ హైస్కూలులో తెలుగు ఉపాధ్యాయునిగా చేరేవరకూ రాత్రీపగలూ అనక ప్రింటింగ్ వ్యవహారాలల్లోనూ, ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణంలోని, బయట షాపుల్లో ఉన్న యువభారతి సంస్థ పనుల్లోనూ తీరిక లేకుండా, యువభారతీయులందరితో కలిసి పనిచేయడం, ఒక్క స్నానాదికాలకు తప్పించి గదికి వెళ్లేవాడిని కాదు. ప్రిలిమినరీ ప్రూఫ్స్ నేను చూసి ఫైనల్ ప్రూఫ్స్ శ్రీ జి.వి.ఎస్‌గారు, అప్పుడప్పుడు ఇరివెంటివారికి చూపించి ప్రింటింగ్ ఆర్డర్స్ ఇచ్చే వాళ్లు. ఎలాగూ శ్రీవంగపల్లి విశ్వంగారి సూపర్ విజన్, జరుగుతున్నపని గురించిన రిపోర్ట్ వారికి చెప్పడం రోజూ జరుగుతూనే ఉండేది.

ఆ సమయంలో ఏదో ట్రాన్స్‌లో ఉండి పనిచేస్తున్నట్లుండేది. ప్రతిరోజూ ఎలా గడిచేదో తెలిసేది కాదు. అది 1974 సం॥ రత్న పాపగారి నృత్య కార్యక్రమం రవీంద్రభారతిలో ఏర్పాటు చేయడం దానికి ఫండ్ కలెక్షన్స్ అందుకోడం, ఆల్ ఇండియా ఎన్‌జి.ఓస్ లీడర్ శ్రీ ఎ.శ్రీరాములు గారు వారి ప్రెస్‌లో యువభారతి ప్రింటింగ్ పనులు జరుగుతూ ఉండేవి. యువభారతి పెద్దలందరూ శ్రీ శ్రీరాములు గారిని సహాయం చేయమని అడిగితే నాకు అప్పటి ముఖ్యమంత్రి శ్రీ జలగం

వెంగళరావు గారి దగ్గరకు తీసికెళ్ళారు. ఆరోజు శ్రీ వంగపల్లి వారు వచ్చినట్లు గుర్తు. ముఖ్యమంత్రిగారు శ్రీరాములుగారికి వెంటనే అపాయింట్‌మెంట్ ఇచ్చి మాట్లాడారు. నేనూ వారితోనే ఉన్నాను. ఆయన అప్పటి రవాణా శాఖామంత్రి శ్రీ జె. చొక్కారావు గారికి, ట్రాన్స్‌పోర్ట్ డిపార్ట్‌మెంట్ కమిషనర్ గారికి చెప్పి వారిని కలవమన్నారు. తర్వాత మిత్రులు శ్రీ డి.ఎల్.ఎన్.ప్రసాద్ గారితో కలిసి వెళ్లడం దాదాపు ఆరోజుల్లో రూ. 40,000/-లు పోగుచేసిచ్చారు. అలాగే ఒక ట్రాన్స్‌పోర్ట్ కంపెనీ నుంచి కూడా ఫుల్‌పేజ్ యాడ్ కలెక్ట్ చేసిచ్చాము. ఆరోజు పూర్తిసమయం యువభారతికే పనిచేసే వాడిని కనుక నాకు రూ. 60/-లు నెలకు గౌరవవేతనం ఇచ్చేవారు. స్నేహితులతో కలిసి గదిలో ఉండేవాడిని. యువభారతి సాహిత్య కార్యక్రమాలు రూపొందిస్తున్న పెద్దలు శ్రీ ఇరివెంటివారు, వి.విశ్వనాథంగారు జి.వి.ఎస్. గారు ఎస్.వి.రావుగారూ, డి.ఎల్.ఎన్.గారు, ఎ.నాగేశ్వరరావుగారు, నా సమవయస్కులైన సుధామ, విశ్వసూర్య, జీడిగుంట కామేశ్వరరావు, గో.కు.నాయుడూ, తాము గౌడు, తర్వాత హైకోర్టు జడ్జిగా పనిచేసిన రామలింగేశ్వరరావు, శ్రీనివాసాచార్యగారూ, పాండురంగారెడ్డి, నాగినేని భాస్కర్‌రావు, కె.వి.కామేశ్వర్రావు దంపతులూ, రాధాకుమార్, నా మిత్రుడు అనంతా, బుచ్చిబాబూ, గోపాలకృష్ణ, చిత్రకారులూ, నవలా రచయిత, కవులూ, శ్రీ శీలావీర్రాజు గారు ఇలా ఎంతమంది పేర్లని చెప్పను.

వాళ్ల పరిచయ భాగ్యం నాకు కలిగింది యువభారతిలోనేగా. నాగినేని భాస్కరరావు ఎం.బి.బి.ఎస్. చదువుతూ అప్పుడప్పుడూ నా గదికి వచ్చి బట్టలుతుక్కునేవాడు. ఇద్దరం కలిసి వండుకొని తిన్నరోజులని ఎలా మరచిపోను? నా సహచరుడు జహంగీర్‌ను ఎలా మరచిపోను? ఖైరతాబాద్‌లో ఉన్నప్పుడు ప్రతిరోజూ ఉదయాన్నే వచ్చి నన్ను హుస్సేన్‌సాగర్‌కి తీసికెళ్లి ఈతకొట్టించేమిత్రుడు ఆనాటి పరిచయం మా ఊరినీ చిన్నతనాన్నీ గుర్తుచేయడం మరచిపోగలనా! యువభారతి పనులమీద సినారె లాంటి ఎంతోమంది సాహితీవేత్తలను, రాజకీయ నాయకులను, ప్రభుత్వ ఆఫీసుల్లోని డైరెక్టర్లను కలవడం అదోముచ్చట. ఇదేదో నేను కూడా కష్టపడ్డానని చెప్పడంకాదు. నాకు దక్కిన భాగ్యంగా భావిస్తున్నాను. యువభారతీయులందరూ ఆఫీసుల్లోనూ, కాలేజీల్లోనూ, కొందరు చదువుకొంటూనూ, సాయంత్రం వచ్చి పొద్దుపోయేదాకా సాహితీసేవచేసేవారు. ఈరోజు వరకూ అదే అనుబంధాన్నీ, ఆత్మీయతనూ పంచుకొంటూ నడిచినవారి సేవతో యువభారతిని శాశ్వతంగా నిలపడానికి వారే కదా ముఖ్యం.

ఇంతగా 'యువభారతి'తో మమేకమైన నేను యువభారతి కార్యకలాపాలకు దూరంగా ఉండడానికి కారణం చెప్పడం నా బాధ్యతగా భావిస్తున్నాను. లేకపోతే స్వార్థపరుడి నవుతాను.

'యువభారతి' సాహితీ సాంస్కృతిక సంస్థ కదా! సాహిత్యంతోపాటు సాంస్కృతిక కార్యక్రమాలూ, అంటే నాటక ప్రదర్శనలూ వగైరా ఉంటాయనుకున్నాం, నేనూ బుచ్చిబాబూ వగైరా. దానికి సమన్వయకర్త శ్రీ వంగపల్లి విశ్వనాథం గారు నాటిక ప్రదర్శన జరిగినప్పుడు మాత్రమే చప్పట్లూ, ప్రశంసలూ, నాటక ప్రదర్శన కాగానే మరచిపోతారు. అదే పుస్తక ప్రచురణ అయితే శాశ్వతంగా నిలుస్తుంది. చదివింపచేస్తుంది, ఆహ్లాదపరుస్తుంది అన్నారు. నటన నా ఊపిరిగా తలచిన వాడిని. అందుకే నాటకరంగంవైపు జరిగి, నటునిగా ఎదిగి కథానాయకునిగా రంగస్థలంమీద గుర్తింపు తెచ్చుకున్నాను. ఎ.ఆర్.కృష్ణ, దేవదాసు కనకాల, రాళ్లపల్లి, తైలం లక్ష్మీనారాయణ, కోట శ్రీనివాసరావు, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, తనికెళ్ల భరణి, తల్లావఝుల సుందరం, నా మిత్రుడు విద్యాసాగర్, ఎర్రంనేని చంద్రమౌళి గార్లతో కలిసి రంగస్థలాన్ని పంచుకున్నాను. నేను నటించిన అన్నింటిలోనూ కథానాయకునిగానే నటించాను. అనంతరం దూరదర్శన్‌కెళ్ళి అనౌన్సర్‌గా, నటునిగా, ఈటివి టెలీస్కూల్‌లో కొన్ని వందల కార్యక్రమాల్లో నటించాను. ప్రముఖ చిత్రకారులూ, చిత్రదర్శకుడూ శ్రీయుత బాపూ, ముళ్లపూడి వెంకటరమణ, వారి సినిమాలకు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్‌గా పనిచేసి, బంగారు మురుగూ, మిథునం కథా రచయితలూ, జర్నలిస్టూ అయిన శ్రీ రమణగారి పరిచయం, బాపూగారి దగ్గర సోలో ఆర్టిస్ట్‌గా పనిచేసే భాగ్యం కలిగింది.

20 రోజులపాటు మండల్ ఎం.జి.ఆర్ గారి సత్యా స్టూడియోలో థర్డ్ క్లాస్ వీడియో లెసన్ ప్రెజెంటర్‌గా (టీచర్) పనిచేసే అదృష్టం కలిగింది. అలాగే తెలుగు డబ్బింగ్ యూనియన్ ఫౌండర్ మెంబర్‌గా యూనియన్ స్థాపించడంలో నాపాత్ర ఉంది. దాదాపు 150 సినిమాలకుపైగా డబ్బింగ్ చెప్పాను. ఇప్పటికీ చెప్తున్నాను. శ్రీనాథకవిసార్వభౌమ సినిమాలో ఎన్.టి.ఆర్.తో నటించే భాగ్యం కలిగింది. కొన్ని సినిమాలలో నటించాను. ఎఫ్.డి.సి. తెలుగు ఫీచర్ ఫిల్మ్‌లో హీరోగా నటించాను. అలాగే ఎన్.టి.ఆర్ టైమ్‌లో ఎఫ్.డి.సి ఆడిషనల్ ఫిల్మ్‌కి ఆర్టిస్ట్‌గా నూ, అసోసియేట్ డైరెక్టర్‌గానూ వ్యవహరించాను. ప్రముఖ సినీ దర్శకులు మిత్రులు ఎన్.గోపాలకృష్ణ

గారితో కలిసి శ్రీకృష్ణదేవరాయలూ, ప్రతాపరుద్రుడూ, దశరథుడూ, మాదన్న మొదలైన పౌరాణిక, చారిత్రక పాత్రలలోనూ నటించాను. నా ఆల్‌టైమ్ ఫేవరెట్ ''ఉమర్ ఖయ్యాం" గా రవీంద్రభారతిలో రూపకం ప్రదర్శించినప్పుడు శ్రీయుతులు ఇరివెంటి కృష్ణమూర్తిగారూ, శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యులుగారూ వీక్షించడం మరుపురాని అనుభూతి.

ఎన్నో టి.వి.నాటకాలకూ, సింగిల్ ఎపిసోడ్స్‌కీ రచయితగా రచనలూ చేశాను. తెలుగు కథని భుజాల కెత్తుకొని జీవితాంతం మోసిన ఎన్నోపుస్తకాల రచయితా ప్రయోక్తా, టి.వి. చిత్రాల దర్శకుడూ అయిన శ్రీ వేదగిరి రాంబాబు నా మిత్రుడవడం, అతని అన్ని టి.వి. చిత్రాలలోనూ ప్రముఖ నటునిగా నటించి అప్పుడప్పుడు రచనలో పాలుపంచుకోవడం, కొన్ని సీన్స్ డైరెక్ట్ చేయడం నాకు దక్కినవరం. అందులో కొన్ని చిత్రాలకు నంది పురస్కారాలు కూడా వచ్చాయి.

ఇది నా 'యువభారతి' పరిచయం-తో అనుబంధం. చోటిచ్చినందుకు ధన్యవాదాలు.






'తెలుగు కవిత – లయాత్మకత' అనే అంశంపై ఉపన్యసిస్తున్న సినారె

# అనుభవాలు - అనుబంధాలు

శ్రీ ఎల్.ఎస్.భార్గవ
(లక్కాప్రగడ సుభాస్ చంద్ర భార్గవ), హైదరాబాద్
93935 65122

**యు**వభారతి సాహితీ సంస్థ మాత్రమే కాదు. ఒక గురుకుల విశ్వవిద్యాలయం. ఆధ్యాత్మిక, సాహిత్య భాండాగారం, సమయ పాలనకు, క్రమశిక్షణకు, సమైక్యతకు, సాహిత్య సేవకు, సనాతన ధర్మానికి మరియు వ్యక్తిత్వ వికాసానికి నిలయం. నా రెండవ విద్యాభ్యాసం ఇక్కడే మొదలైంది.

భారతదేశ సంస్కృతి భిన్నత్వంలో ఏకత్వం ఏకత్వంలో భిన్నత్వం. అదే యువభారతి సంస్కృతి. నేను దాదాపుగా 50సంవత్సరముల క్రితం యువభారతి ప్రాంగణంలో ప్రవేశించినపుడు నన్ను ఆకర్షించినవి రెండు విషయాలు. మొదటిది యువభారతి చిహ్నంలో ఉన్న సరస్వతీదేవి నా ఇష్ట దైవం, రెండవది శ్రీ శ్యామలాదేవి స్తోత్రంలో ఉన్న యువభారతి ప్రార్థనాగీతం నా బాల్యంలో ఉన్న ఊరిలో నెలకొన్న శ్రీ శ్యామలాదేవి ఆలయం గుర్తుకు రావడం.

నా అనుభవాలు-అనుబంధాలు సంస్థతోను, సంస్థ సభ్యులతోను ముడిపడి ఉన్నవి. కనీసం ముగ్గురు విశిష్ట వ్యక్తుల గురించి ప్రస్తావించడంల నా ధర్మంగా భావిస్తున్నాను.

మొదటగా పూజ్య గురువులు కీ॥శే॥ డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారు యువ భారతికి కులపతివంటి వారు. 60 సంవత్సరాలు సంస్థ మనుగడకు, అభివృద్ధికి, ఐక్యతకు కారకులు. వారు యువభారతీయులందరికి ఆరాధ్యులు, చిరస్మరణీయులు. వారు కారణజన్ములు. రెండవ వారు శ్రీ యస్. వెంకటేశ్వరరావుగారు నన్ను యువభారతి కి పరిచయం చేసినవారు. వారు మృదుభాషి, అజాత శత్రువు, సహనశీలి, నిరాడంబరుడు, నిస్వార్థ కార్యకర్త. వారి సేవలు అమూల్యం.

మూడవ వారు అంతా తానై సలిపెలీల వేరొకండుగాదు అనే జగన్నాథునివలె యువభారతి రథసారథియై విజయ పతాకాన్ని ఎగురువేసిన మహానుభావులు డా॥

వంగపల్లి విశ్వనాథంగారు. ఈయన కార్యదీక్ష, ఆచరణీయమైన ప్రణాళిక, క్రమశిక్షణ అమోఘమైన వాక్చాతుర్యం, మూగవారినికూడా మాట్లాడించగలిగే శక్తి సామర్థ్యాలు, అందరియందు చూపించే ప్రేమాభిమానాలు మరువరానివి. వారి ప్రభావం యువభారతి సభ్యులందరిపైన గోచరిస్తుంది. వారు ఆదర్శ ప్రాయులు మరియు మార్గదర్శి.

ఇంకా ఎందరో మహానుభావులు. వారందరిగురించి చెప్పాలంటే ఒక ఉద్గ్రంథమవుతుంది. అది మన విశ్వనాథంగారికి మాత్రమే సాధ్యమవుతుంది. ముఖ్యంగా నా జీవన పోరాటంలో ఎన్నో క్లిష్ట సమస్యలు ఎదుర్కోటంలో యువభారతి ద్వారా నేర్చుకున్న సంస్కారం, శిక్షణ ఎంతో దోహదపడింది. యువభారతితో అనుబంధం ముందు తరానికి కూడా కొనసాగాలన్న ఉద్దేశంతో నా ప్రథమ పుత్రికకు మహతి అని నామకరణం చేసుకోవడం నాకెంతో ఆనందాన్నిచ్చింది.

యువభారతి సంస్థ విషయానికి వస్తే కీ॥శే॥ డా॥ దివాకర్ల వేంకటావధాని గారి నుండి నేటి బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వర రావు గారి వరకు ఎందరో పండితులు, కవులు, కళాకారులు, వ్యక్తిత్వ వికాస నిపుణులు, డాక్టర్లు, న్యాయాధికారులు మరియు వివిధ రంగాలలో నిష్ణాతులైన మహానుభావులను యువభారతి సభావేదికలపై చూడటం, వారి ఉపన్యాసాలను వినటం, వారి రచనలు చదవటం నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను.

ఈ వ్యాసం వ్రాయడానికి నాలో పరకాయప్రవేశం చేసి నాలో ప్రేరణ స్పందన స్ఫూర్తిని కలిగించిన శ్రీ విశ్వనాథం గారికి శతసహస్ర నమస్కారాలు. 50సంవత్సరాల నుండి నన్ను ఆదరిస్తూ అభిమానిస్తున్న యువభారతి ఆత్మీయ మిత్రులకు, యువభారతికి నాహృదయపూర్వక కృతజ్ఞతలు, ధన్యవాదాలు. యువభారతి వజ్రోత్సవ కార్యక్రమాలు విజయవంతం కావాలని మున్ముందు శత వసంతోత్సవాలు జరుపుకోవాలని త్రికరణశు ద్ధిగా శ్రీ వాగ్దేవిని ప్రార్థిస్తునాను.



# నన్ను దిద్దితీర్చిన గురువు

డా॥ వై. కృష్ణకుమారి
విశ్రాంత ఉపన్యాసకురాలు
98854 51014

జీవితంలో సగంకన్నా ఎక్కువ భాగం గడిచాక ఒకసారి సింహావలోకనం చేసుకుంటే ఎన్నో ఎన్నెన్నో స్మృతులు కంటిముందు కదలాడుతాయి. అందులో కొన్ని పసితనంలోనే ఒక ముద్రగా స్థిరపడి ఉంటాయి . దాని ప్రభావం తర్వాతి జీవితకాలంలో చాలా గాఢంగా ఉంటుంది. చిన్నప్పుడు నేర్చుకున్న సరళీస్వరాలు తర్వాతికాలంలో కీర్తనలుగా రూపు దిద్దుకున్నట్లు యువభారతిలో నేను నేర్చుకున్న ఓనమాలు తర్వాతికాలంలో నన్నొక వక్తగా తీర్చిదిద్దాయి. అటువంటి ప్రభావశాలి యువభారతిలో నేను అడుగు పెట్టిన ఘడియను ఎట్లా మర్చిపోతాను? అదొక పుణ్యకాలం.

అప్పుడే నేను పదవ క్లాసు పూర్తి చేసి, ఇంటర్మీడియెట్ లో చేరాను. 'రేపు సాయంత్రం 5. 00 కల్లా సిద్ధంగా ఉండమ్మా" అన్నారు నాన్నగారు. మర్నాడు సాయంత్రం 5 .15 వరకు ఆంధ్ర సారస్వత పరిషత్తుకు చేరాం. అప్పటికే రోడ్డు మీద పరిషత్తు గేటు ముందర జనం ఉన్నారు. నాకయితే ఏమీ అర్థం కాలేదు. ఎవరికో నాన్నగారు నమస్కరించారు. నేను కూడా పెట్టాను. ఇంకెవరో నాన్నగారికి నమస్కరించారు. ఆయనెవరో తెలియదు.

నాన్నగారు నా వేలు పట్టుకొని జనం మధ్యనుంచి నెమ్మదిగా నడచుకుంటూ వెనుక భాగానికి తీసుకెళ్లారు. అక్కడ మేము కూర్చున్నాం. ఇంతలో వేదిక మీద ఎవరో మైకు ముందు నిలబడి "నమస్కారం, సమయం సరిగ్గా 5 గంటల 30 నిముషాలు.." అంటూ మొదలుపెట్టారు. నేను టైము చెప్పడం ఎందుకు? అనుకున్నాను. తర్వాతికాలంలో తెలిసింది దాని ఔచిత్యం ఏమిటో. సమయపాలన యువభారతి ఊపిరి. సమావేశం అయింది. ఎవరెవరో ఏదేదో మాట్లాడారు. ఒక్క ముక్క అర్థం కాలేదు. ఇంటికి వస్తున్నప్పుడు దాని గురించి నాన్నగారిని అడిగితే "అది మన సాహిత్యం, సంస్కృతి" అన్నారు క్లుప్తంగా.

తర్వాత కొన్నిరోజులకు మళ్ళీ పరిషత్తుకు ఆఫీసుకు వెళ్ళాం. అక్కడ నాన్నగారు బయటనే ఆగి "నీవు లోపలికి వెళ్ళి నేను చెప్పినవి కనుక్కో" అన్నారు. నెమ్మదిగా ఆఫీసు లోపలికి వెళ్ళాను. ఆ గదిలో కొందరు కూర్చుని ఉన్నారు. గుమ్మం దగ్గర ఆగిపోయాను. "ఏం కావాలమ్మా?" ఒక గంభీరమైన గొంతు. "నేను యువభారతిలో సభ్యురాలిగా చేరాను. నాకు ఏమైనా నేర్పిస్తారా? నేను చేసే పనులు ఏమైనా ఉన్నాయా?" చాలా నెమ్మదిగా అడిగాను. ఒక్కసారిగా అందరు నవ్వారు. "మొదట సమావేశాలకి రా తల్లీ! తర్వాత నీవేం చేయాలో నీకే తెలుస్తుంది. మొదటి ఆదివారం జరిగే భాషానిలయంలో ఉదయం సమావేశాలకి వెళ్ళు" అన్నారు అందులో ఒకరు.

తర్వాత అక్కడ కూర్చున్న వారెవరు అని నాన్నగారిని అడిగాను. వాళ్ళు త్రిమూర్తులు అన్నారు గంభీరంగా. "అక్కడ ఎవరూ కిరీటాలు పెట్టుకున్నవారు లేరు కదా?" నా తెలివిలేని సందేహం. "ఒక్కొక్కసారి దేవతలు మానవ రూపంలో కన్పిస్తారు" అన్నారు. "అంటే" అన్నాను. "తెలుగు భాషను సుసంపన్నం చేయడానికి కంకణం కట్టుకున్న మహనీయులు శ్రీ కృష్ణమూర్తి గారు, శ్రీ సుబ్రహ్మణ్యం గారు, శ్రీ విశ్వనాథం గారు తల్లీ. వాళ్ళే త్రిమూర్తులు" అన్నారు నాన్నగారు.

తర్వాత భాషానిలయానికి వెళ్ళాను. అది నా జీవితంలో ముఖ్యమైన మలుపుకు కారణమైంది. జన్మతః తెలుగుదానినే అయినా తెలుగు భాష, దాని సౌందర్యం, పదాల గుబాళింపు, సంస్కృతి, మహనీయత అర్థమైన పర్వకాలం అది. నెమ్మదిగా సమావేశాలలోని అంశాలు అర్థమవడం మొదలైంది. ప్రసిద్ధి పొందిన మహా వక్తల ఉపన్యాసాలు విని ఆకళింపు చేసుకునే స్థాయికి ఎదిగాను. తరువాత ఏ మాత్రం కష్టపడకుండా తెలుగు సాహిత్యంతో ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి చేశాను. యువభారతి అనే పునాది మీద సాహిత్య ప్రపంచంలో నాదైన భవంతిని కట్టుకున్నాను. ఎక్కడికి వెళ్ళినా ప్రశంసలు అందుకున్నాను. కేవలం సాహిత్యంలోనే కాదు, వ్యక్తిత్వంలో కూడా నన్ను దిద్దితీర్చిన గురువు యువభారతి. అదొక వ్యాసపీఠం. మనిషి జన్మ ఎత్తినందుకు సార్థకత నా యువభారతీయం.

స్వస్తి



# యువభారతితో నా అనుబంధం

శ్రీ జీడిగుంట వెంకట్రావు
విశ్రాంత పాత్రికేయుడు, హైదరాబాద్
93913 73684

యువభారతి సంస్థతో నాకు 55 సంవత్సరాల అనుబంధం ఉంది. యువభారతితో పరిచయం చాలా విచిత్రంగా జరిగింది. నేను వివేకవర్ధిని ఎక్సెల్షియర్ హై స్కూల్లో ఆరవ తరగతి చదువుతున్న రోజుల్లో జరిగిన వక్తృత్వ పోటీలలో నాకు ప్రథమ బహుమతిగా గురజాడ వారి "కన్యాశుల్కం" పుస్తకాన్ని బహూకరించారు. అప్పట్లో మేము సుల్తాన్ బజార్ లోని రాయల్ టాకీస్ పక్క వీధిలో ఉండే వాళ్ళం. మా ఇంటి నుంచి ఐదు నిమిషాల నడక దూరంలో ఉన్న శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయానికి చందమామ పుస్తకాన్ని చదువడానికి వెళ్లేవాళ్లం.

ఒకరోజు మధ్యాహ్నం వేళలో ఆ గ్రంథాలయానికి వెళ్ళినప్పుడు ఒక హాలులో చాలామంది కూర్చుని ఉన్నారు. ఒకరు కన్యాశుల్కం గిరీశం పాత్రను ఏకపాత్రాభినయం గా డైలాగ్స్ చెబుతున్నారు. అప్పటికే నేను కన్యాశుల్కం పుస్తకాన్ని చదివి ఉండటం వల్ల ఆ హాలు బయట నిలబడి డైలాగ్స్ వింటున్నాను. కార్యక్రమ నిర్వాహకులు నన్ను లోపలికి వచ్చి కూర్చోమన్నారు. తరువాత నన్ను పరిచయం చేసుకోమంటూ ఒక పత్రం ఇచ్చారు. ఇది యువభారతి తో నా తొలి పరిచయం. ఈ విషయం సాహిత్యం అంటే ఇష్టమున్న మా అన్నయ్య కామేశ్వరరావు తో చెప్పాను. అప్పటి నుంచి ఇద్దరం కలిసి కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం లో జరిగే సమావేశాలకు క్రమం తప్పకుండా వెళ్లేవాళ్లం.

యువభారతి ఆ రోజుల్లో నిర్వహించిన సమావేశాలు – ప్రస్తుత కాలానికి అనుగుణంగా చెప్పాలంటే – "వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలు". ఒక అంశంపై అప్పటికప్పుడు ఆలోచించి రెండు నిమిషాల్లో మాట్లాడవలసిన నిర్దిష్ట కాలపరిమితి ఉన్న 'క్లుప్త గోష్ఠి', మనిషిలోని ప్రతిభను వెలికి తీసే 'నా ఊహా పథంలో' మొదలైనవి. అలాగే ప్రతినెలా ఒక గ్రంథాన్ని చదివి సభ్యులందరూ దానిని సమీక్షించడం – ఇలా ఎన్నో ఉండేవి.

'మారుతున్న విలువలు రచయితల బాధ్యతలు' అన్న అంశంపై ఒకరోజు సదస్సు నిర్వహించి 'రచన' అనే గ్రంథాన్ని ప్రచురించారు. ఈ సదస్సులో పాల్గొన్నప్పుడు అనేకమంది లబ్ధప్రతిష్ఠులైన వారిని చూసే అవకాశం దొరికింది. ఆ కార్యక్రమం తర్వాత తెలుగు లోని పంచ మహా కావ్యాలపై ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారితో ఉపన్యాసాలు ఇప్పించి వాటిని 'కావ్య లహరి' పేరిట ప్రచురించారు. వసుచరిత్ర గురించి అవధాని గారు ప్రసంగిస్తున్న సమయంలో పెద్ద వర్షం కురిసింది. అయినా ఏ ఒక్కరు వెళ్ళిపోకుండా కూర్చున్న godrej కుర్చీలను మడిచి, గొడుగుల లాగా తలపై 'పట్టుకుని' కార్యక్రమం ముగిసే వరకు అలాగే నిల్చొని ప్రసంగాన్ని విన్నారు. అదీ – దివాకర్ల వారి ప్రసంగం యొక్క గొప్పతనం.

'కావ్య లహరి' సమావేశాల సందర్భంగా యువభారతి 'ప్రచురణ పూర్వ విరాళం' పద్ధతిని ప్రారంభించింది. ప్రచురణ పూర్వ విరాళాల కోసం రసీదు పుస్తకాలు పట్టుకుని తొలిసారిగా పెద్దల వద్దకు వెళ్ళినప్పుడు ముందుగా విరాళాలను ఇవ్వడానికి నిరాకరించినా 'మా అబ్బాయివి అనుకుని....' లేదా 'నా శిష్యుడివి కాబట్టి....' అంటూ డబ్బులు ఇచ్చారు. కావ్య లహరి ప్రచురణ తరువాత ప్రతులను వారికి అందించినప్పుడు 'తర్వాత కార్యక్రమాలు ఎప్పుడు? మా పుస్తకాన్ని రిజర్వ్ చెయ్యి. ఇదిగో ఇప్పుడే ప్రచురణ పూర్వ విరాళం ఇస్తాం' అంటూ రిజర్వ్ చేసుకోవడం మరిచిపోలేని అనుభూతి.

యువభారతి కార్యక్రమాల్లో అనేక సూక్తులను, కవితలను, అందంగా డ్రాయింగ్ షీట్ ల మీద రాసి 'ప్లకార్డులు' గా అక్కడక్కడ గోడల మీద అతికించేవారు. ఆ ప్లకార్డులను నేను రాసేవాడిని. అప్పుడే ఇంటర్మీడియట్లో చేరిన నాకు ఆ ప్లకార్డులు రాసినందుకు యువభారతి పెద్దలు అభినందనలు తెలిపి 20 రూపాయల పారితోషికం ఇచ్చారు. నా జీవితంలో నా తొలి సంపాదన అది.

ఆ రోజుల్లో హైదరాబాదులో పండుగలు అంటే యువభారతి సమావేశాలే. అనేకమంది సాహిత్య అభిమానులు యువభారతి సభ్యత్వం కోరేవారు. అలాంటివారి కోసం "సాహితీ మిత్ర", " భారతీ మిత్ర", "భారతీ భూషణ" వంటి పథకాలను ప్రారంభించారు. నేను తెలుగు కొంచెం బాగా మాట్లాడడానికి, జర్నలిస్టుగా ఎదిగి వార్తలని, వ్యాసాలని, మంచి వాక్య నిర్మాణంతో రాయడానికి యువభారతే కారణం. ఈ విషయాన్ని నేను ఎప్పుడూ గొప్పగా భావిస్తాను.



# 'యువభారతి' ద్వారా నాకు సిద్ధించిన ప్రయోజనాలు

శ్రీ చేగొండి రామజోగయ్య
విశ్రాంత బ్యాంక్ అధికారి, హైదరాబాద్
93910 07780

ముందుగా, లాంఛనంగా, స్వీయపరిచయం – పెద్దలు పెట్టిన పేరు మాత్రమే గాని, "పెద్దగాపేరున్న" వాణ్ని, అంటే, "లబ్ధ ప్రతిష్ఠుడి" నో ప్రసిద్ధుడినో కానే కాను. అన్ని విధాలా సామాన్యుడిని. అయితే నాకున్న ఏకైక ఘనత "యువభారతీయుడి"ని కావటం. వ్యవస్థాపక సభ్యుడిని కాదు గాని తొలితరం క్రియాశీలక సభ్యుడిని. నేడు సంస్థకు పెద్దగా విశిష్ట సేవలు చేయకపోయినా వయసురీత్యా వరిష్ఠ సభ్యునిగా ఆదరించబడుతున్న అదృష్టవంతుడిని.

1965లో ఆంధ్రప్రదేశ్ సహకార బ్యాంకులో చిరుద్యోగిగా చేరి 2003లో 'చీఫ్ జనరల్ మేనేజర్' 'చీఫ్ విజిలెన్సు అధికారి'గా ఉద్యోగ విరమణ. వర్తమానంలో, సమీప బంధువుల పరంగా, నమ్మకద్రోహం వంటి సమస్యలతోపాటు విపరీత అనారోగ్య అంశాలలో అవిశ్రాంత పోరాటం చేయవలసిన దుస్థితి కారణంగా మనసు ఎంతగా కోరుకుంటున్నా సాహిత్యసేవా కార్యక్రమాల్లో ఎక్కువగా పాల్గొనలేకపోతున్నాను.

సదా నా మాతృసంస్థగా మనసులోన నిలుపుకున్న "యువభారతి" వజ్రోత్సవ వేడుకలు జరుపుకుంటున్న ఈ శుభసందర్భంలో ఈ గొప్ప సాహితీ సాంస్కృతిక సంస్థతో నా సుదీర్ఘప్రయాణం, చిరకాల అనుబంధం, తద్వారా నాకు దక్కిన అపూర్వమైన, మధురాతి మధురమైన అనుభవాలు, అనుభూతులు, ప్రయోజనాలను నెమరువేసుకొని, కృతజ్ఞతా పూర్వకంగా, అక్షరీకరించి సాదర సోదర సభ్యులతో, మిత్రులతో పంచుకోవటం, నా కర్తవ్యంగా ఒక సదవకాశంగా భావిస్తున్నాను.

ఇంకా ఓటు హక్కురాని వయసులో (అప్పట్లో అర్హతప్రాయం 21) ఉద్యోగిస్తూ,

సమాంతరంగా సాయం కళాశాలలో న్యాయశాస్త్రం అభ్యసించడానికి, కోస్తాంధ్ర ప్రాంతం నుండి 1965లో భాగ్యనగరానికి చేరుకున్న నాకు, సహజ స్వభావ రీత్యా మాతృభాషాభిమానినైన కారణంగా, వినూత్న రీతిలో అంతవరకు కనివిని ఎరుగనంత భారీ స్థాయిలో నిర్వహిస్తున్న సాహిత్య ప్రసంగ సభలను ప్రశంసనీయంగా నిర్వహిస్తున్న 'యువభారతి' సంస్థ పట్ల ఆకర్షితుడిని కావడానికి ఎంతో సమయం పట్టలేదు. అదొక సహజ లేదా అనివార్య పరిణామంగా జరిగిపోయింది. 'యువభారతి' నా జీవితంలో ఒక ప్రధాన భాగమైపోయిందనే చెప్పాలి.

'యువభారతి' వ్యవస్థాపక సమావేశ కర్త, నిత్య చైతన్యశీలి, స్ఫూర్తి ప్రదాత 'శ్రీ వంగపల్లి విశ్వనాథం' గారే నన్ను 'సంస్థ' లో చేర్చుకుని శ్రీయుతులు ఇరివెంటి కృష్ణమూర్తి, జి.వి. సుబ్రహ్మణ్యం, శీలా వీర్రాజు, దివాకర్ల వేంకటావధాని, తిరుమల శ్రీనివాసాచార్యులు, దేవులపల్లి రామానుజారావు, సి.నా.రె వంటి ఉద్దండ పండిత వరేణ్యులతో పరిచయం మాత్రమే కాదు, సాన్నిహిత్య భాగ్యానికి దోహదపడ్డారని, ఆ విధంగా నాకు జీవితంలో ఎంతో మేలు చేశారని, ఈ సందర్భంలో కృతజ్ఞతా పూర్వకంగా జ్ఞాపకం చేసుకుంటున్నాను. "విశ్వం" గారి ప్రోత్సాహంతో సమ వయస్కులైన ఇతర సభ్యులను స్ఫూర్తిగా తీసుకుని తీరిక సమయాల్లో సంస్థ కార్యాలయానికి వచ్చి అప్పచెప్పిన పనులు చేయటం కొన్ని సంవత్సరాలు సాగింది.

ప్రచురణ పూర్వ విరాళాలు వసూలు చేయటంతోపాటు, ఆయా ప్రచురణల విక్రయం, ప్రచారం వంటి కార్యకలాపాల్లో పాల్గొనేవాణ్ణి. నాకు ఎంతో సంతృప్తినిచ్చిన ఒక విషయం చెప్పాలి. ఆ రోజుల్లో కొద్దిపాటి రుసుంతో సాహితీమిత్ర, భారతీమిత్ర' వంటి పథకాలు నిర్వహించేవాళ్ళం. ఆ అనుబంధ సభ్యత్వాన్ని నమోదుచేసేటప్పుడు వారి వారి జన్మదినం వివరాలు సేకరించేవాళ్లం. సంభ్రమాశ్చర్యానందాలు కలిగే విధంగా వారికి జన్మదిన శుభాకాంక్షల కార్డును, యువభారతి పక్షాన వారి చిరునామాలకు పంపేవాళ్లం ఆ రోజుల్లో. ఇప్పట్లోలా సామాజిక మాధ్యమం లేదు. జన్మదిన శుభాకాంక్షలు తెలిపే సంస్కృతి పెద్దగా లేదు. కాబట్టి సాహితీమిత్రులు "యువభారతి" సంస్థ నుండి జన్మదిన శుభాకాంక్షల కార్డులు అందుకుని ఆ 'అ'యాచిత మర్యాదకు ఎంతగానో పొంగిపోయేవాళ్ళు.

కొన్ని సంవత్సరాలపాటు వారంలో మూడు నాలుగు సాయంత్రాలు సంస్థ కార్యాలయానికి వచ్చి, జన్మదిన శుభాకాంక్షల కార్డులను చిరునామాలు వ్రాసి,

సమయానికి అందేలా పోస్ట్ చేసే ఆనందదాయకమైన కార్యక్రమాన్ని నేను చేసేవాణ్ణి. అందుకు కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. కాలక్రమేణా, ఉద్యోగ జీవితంలో సంభవించిన బదిలీలు, అధిక బాధ్యతల భారం, సమయాభావం కారణాలుగా నేను యువభారతి సంస్థకు చేసే శ్రమదానం, సేవలు తగ్గు ముఖం పట్టాయి. అయితే సంస్థ పట్ల గౌరవ ఆదరాభిమానాలు ఎప్పుడూ తగ్గలేదు.

యువభారతి ద్వారా నాకు సిద్ధించిన మరొక గొప్ప ప్రయోజనం ప్రస్తావనార్హంగా భావిస్తున్నాను. నాకు సంస్థ కొన్నిసార్లు 'ఎస్కార్ట్ డ్యూటీ' వేసేది. అదేమిటంటే ఆహ్వానిత వక్తల, ప్రసంగకర్తలు నగరానికి విచ్చేసి, ఎక్కడో బసచేసి ఉంటే, వారిని సభాస్థలికి నిర్ణీత సమయానికి మర్యాదపూర్వకంగా 'తోడ్కొని' రావటం ఆ విధంగా నాకు శ్రీశ్రీ, విశ్వనాథ సత్యనారాయణ, ఆరుద్ర, అభినవ పోతన వానమా మలై వరదాచార్యులు వంటి ఉద్ధండ పండితులతో పరిచయ భాగ్యం కలిగింది. ఇది నేను ఎన్నో జన్మల పుణ్యఫలంగా, యువభారతి ఇచ్చిన వరంగా పరిగణిస్తున్నాను.

యువభారతి ద్వారా నాకు దక్కిన మరొక ప్రయోజనం ఏమిటంటే బహుముఖ ప్రజ్ఞాశాలి 'సుధామ'తో సాన్నిహిత్యం. అలాగే ఇంకా అయలసోమయాజుల నాగేశ్వరరావు, నాగినేని భాస్కరరావు, రాధాయి, మురళీధర్ గౌడ్, కామేశ్వరరావు, అనంతాచార్యులు, తిరుమల శ్రీనివాసాచార్యులు వంటి కవులు, రచయితలతో స్నేహానుబంధం ఏర్పడటం. శ్రీయుతులు విజయకుమార్, నారాయణ రెడ్డి, జీడిగుంట వెంకట్రావు'లతో కూడా ప్రత్యేకానుబంధం ఏర్పడటం కూడా నా సుకృతం. 'చేగొండి కథాకదంబం' పేరున మూడు నా కథా సంకలనాలు యువభారతి సంస్థ ప్రచురించి నందుకు 'సదాకృతజ్ఞుడిని'. ప్రస్తుతం సంస్థను, దక్షతతో నిర్వహిస్తున్న ఆచార్య ఫణీంద్రగారికి ఇతర కార్యనిర్వాహక సభ్యులకు నా నమస్సులు. సదా నాకు మార్గదర్శి విశ్వంగారికి కోటివందనాలు.



# యువభారతి సంస్థతో నా అనుబంధం

అయలసోమయాజుల నాగేశ్వరరావు
హిందుస్తాన్ పేపర్ కార్పొరేషన్, విశ్రాంత అధికారి
హైదరాబాద్, 92473 28440

నేను 1972 ఏప్రిల్‌లో ఉద్యోగ రీత్యా హైదరాబాద్ వచ్చాను. ఉద్యోగంలో చేరిన కొద్దిరోజులకే మా తమ్ముడు రాజుకూడ నా దగ్గరికి వచ్చేశాడు. ఇద్దరం కలిసి మా సూరక్క గారింట్లోనే ఉండేవాళ్ళం. మా మేనల్లుడు విశ్వనాథ సూర్యనారాయణ కి సాహిత్యాభిమానం ఎక్కువ. తెలుగు సాహిత్యం అంటే ఎనలేని మక్కువ. అప్పట్లో యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ, హైదరాబాద్ వారు జంటనగరాలలో చక్కటి సాహిత్య కార్యక్రమాలు చేస్తూ, మంచి ఉపన్యాసాలనిప్పిస్తూ, అందంగా అచ్చువేసిన పుస్తకాలను అందరికీ అందుబాటులోకి తెస్తూ, ఎంతో క్రమశిక్షణతో కార్యక్రమాలు నిర్వహించేవారు. ఆ కార్యక్రమాలకు ఆకర్షితుడైన మా బాబు అంటే విశ్వనాథ సూర్యనారాయణ ఆ సంస్థలో చేరి సాహితీసేవ చేయనారంభించాడు.

అవి చైతన్యలహరి, మహతి కార్యక్రమాలు జరుగుతున్న రోజులు. కార్యక్రమాల పని ఒత్తిడిలో కార్యకర్తలందరూ తలమునలవుతున్న రోజులు. మా మేనల్లుడు కూడా ఆ కార్యక్రమ నిర్వహణాబాధ్యతతో సతమతమవుతుండేవాడు. రోజూ ఇంటికి ఆలస్యంగా వస్తుండేవాడు. వాడి చదువు సరిగా సాగడం లేదని, వాడు ఈ కార్యక్రమాలలో పడి తన చదువు మీద శ్రద్ధ చూపడం లేదని మా బావగారు, అక్క విసుక్కునేవారు, బాధపడేవారు. అది చూచి నేను చలించిపోయాను. 'సాయంత్రం ఆఫీసయిన తరువాత యువభారతికి వెళ్ళి వాడికి కాస్త పనిలోసాయం చేస్తే వాడి పని తొందరగా అయిపోతుంది. ఆ తరువాత ఇద్దరం కలిసి కాస్త పెందరాళే ఇంటికి చేరవచ్చు' అనే ఉద్దేశంతో మొట్టమొదటిసారిగా నేను యువభారతిలో అడుగుపెట్టాను. కొత్తలో కొద్దిరోజులు అలాగే మా బాబుతో పాటే ఉంటూ, వాడి పనులలో సహాయం చేస్తూ గడిపాను.

అయితే శ్రీ వంగపల్లి విశ్వనాథం, శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారల కార్యదీక్ష, కార్యకర్తలను మోటివేట్ చేసేతీరు, అందరు కార్యకర్తల సలహాలు తీసుకుంటూ అందరూ పాల్గొనేలా చేస్తూ, కార్యక్రమాలను నడిపేతీరు నన్నెంతో ఆకర్షించాయి. నేను కూడా మెల్లిగా యువభారతి కార్యక్రమాలకు ఆకర్షితుడనయి, వాటిలో పాలుపంచుకోసాగాను. మరేముంది! మా విశ్వనాథం గారు నాక్కూడా కాస్తంత పని అప్పగించారు. ఆ పనిలో తలమునకలవుతూ నేను కూడా ఇంటికి ఆలస్యంగా వెళ్ళటం ప్రారంభించాను. అలా మామా అల్లుళ్లం ఇద్దరమూ ఇంటికి ఆలస్యంగా వెళ్ళటం చూచిన మా సూరక్క "సీతిని కూడి భాగి చెడిందన్న సామెతలా ఉంది మీ మామా అల్లుళ్ళ వ్యవహారం" అంటుండేది. నాకు తెలుగు సాహిత్యం అంటే అభిమానమే గాని అభినివేశం లేదు. అయినా యువభారతిలో సభ్యునిగా చేరాను. అనతికాలంలోనే యువభారతి పక్ష సమావేశాలకు, సుధామతో కలిసి సహసమావేశకర్తగా వ్యవహరించాను. సంస్థాపరమయిన వ్యవహారాలు, పక్ష సమావేశాల నిర్వహణ బాధ్యతలను స్వీకరించి నా శక్తివంచన లేకుండా చక్కగా నిర్వహించేందుకు కృషి చేశాను. 'చైతన్యలహరి', 'మహతి' పుస్తకావిష్కరణ తరువాత కూడా ఆ పుస్తకాలను ప్రచురణ పూర్వ విరాళ ధరలకే అందించాలంటూ సర్వసభ్య సమావేశంలో విశ్వనాథంగారు చేసిన ప్రతిపాదనను వ్యతిరేకిస్తూ మొదటిసారిగా యువభారతి సర్వసభ్య సమావేశంలో గొంతెత్తి మాట్లాడాను.

అలా చేయడం ప్రచురణ పూర్వ విరాళాలను ముందుగా అందించి, ఆదరించి, ఆదుకున్న సాహితీ బంధువులను, దాతలను అవమానపరచడమే అని వాదించాను. అలా చేస్తే భవిష్యత్తులో ప్రచురణ పూర్వవిరాళాలను వసూలు చేయడం సాధ్యం కాదని వివరించాను. డా. నాగినేని భాస్కరరావు గారు, డి.ఎల్.ఎన్. ప్రసాద్‌గారు నా గొంతులో గొంతుకలిపారు. సి.వి.ఎ.ఎస్. సూర్యనారాయణ, రాధాయి, విశ్వనాథ సూర్యనారాయణ, సుధామ నాకు బాసటగా నిలిచారు. అయినా విశ్వనాథం గారి తీర్మానం అధిక సంఖ్యాకుల అంగీకారం పొందింది. నాకు యువభారతిలో ప్రతిపక్షనాయకుడుగా ముద్రపడింది. అటు తరువాత నేను మూడు సంవత్సరాలు సహకార్యదర్శిగా వ్యవహరించాను. 1977లో శ్రీ సింగంపల్లి వెంకటేశ్వరరావు గారు పదవీ విరమణ చేయడంతో నేను యువభారతి కార్యదర్శి బాధ్యతలను స్వీకరించాను.

యువభారతి కార్యదర్శి నయినప్పుడు నేనేదో దేశానికి ప్రధానమంత్రి అయినంత సంతోషంతో పొంగిపోయాను. సంస్థ నిర్వహణలో కల సాధక బాధకాలను క్రమేపీ

తెలుసుకున్నాను. సంస్థ కార్యకలాపాల నిర్వహణలో ఏకాభిప్రాయం సాధించడంలో ఎదురయ్యే ఇబ్బందులను, వాటి నధిగమించేందుకు చేయవలసిన ప్రయత్నాలను గూర్చి అధ్యయనం చేశాను. సంస్థ అధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారితో సాన్నిహిత్యం పెంచుకున్నాను. మా నాన్నగారి పేరు కూడా కృష్ణమూర్తి కావటంతో ఆయనని పితృ సమానులుగా భావించాను. వారి దగ్గర నుండి ఎన్నో విషయాలు నేర్చుకున్నాను. నా అనుభవంలో నాకు తెలిసిందేమిటంటే కృష్ణమూర్తి గారి చేత కలం పట్టించడం కష్టం. కాని ఆయన ఒకసారి చెప్పడం ఆరంభిస్తే ఇక ఆ ప్రవాహం ఆగదు. అందుకని ఒకటికి పదిసార్లు ఆయన వెంట పడి ఆయన డిక్టేట్ చేస్తే వ్రాసుకుని తెచ్చుకునే వాడిని. అప్పట్లో ఆయన అటు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి కార్యదర్శిగా కూడా పనిచేసేవారు. సాహిత్య అకాడమీ కార్యాలయం అప్పుడు కళాభవన్‌లో ఉండేది. మా ఏ.జి. ఆఫీసుకి దగ్గరే కాబట్టి సాయంకాలం ఆఫీసయిపోయాక నడచి వెళ్ళి ఆయన్ని కళాభవన్‌లో కలిసి ఆయనతో సంస్థాగత విషయాలు చర్చించి అక్కడి నుండి యువభారతి కార్యాలయానికి చేరుకునే వాడిని. సెలవురోజుల్లో అయితే ఏకంగా ఆయన ఇంటికే వెళ్ళిపోయేవాడిని. ఇలా ఆయన్ని ప్రతిరోజూ విసిగించినా ఆయన కోపగించుకోకుండా ఎంతో శాంతంగా మాట్లాడి, కార్యక్రమాల యోచన, రూపకల్పనలలో నాకు సలహాలనిస్తూ ఎంతో సహకరించేవారు. అలా మా యిద్దరి అనుబంధం రోజు రోజుకీ పెరుగుతూ వచ్చింది.

అటు సాహితీ కార్యక్రమాల రూపకల్పనలో కృష్ణమూర్తిగారు సహకారం అందిస్తే ఇటు సంస్థాగత విషయాల, సమావేశాల నిర్వహణలో శ్రీ సింగంపల్లి వెంకటేశ్వరరావు గారు నాకు ఎంతో సహకరించేవారు. ఆయన కార్యదర్శిగా ఉన్నప్పుడు నేను ఆయన్ని చూచి “ఏమిటీయన? ఇంత మెతకగా ఉంటారు. ఏ విషయంలోనూ ఎక్కువగా మాట్లాడరు” అని అనుకునేవాడిని. కాని నేను కార్యదర్శి అయ్యాక ఆయనలా ఉండటం ఎంత అవసరమో తెలిసొచ్చింది.

వంగపల్లి విశ్వనాథం గారి నుండి నేను ఎంతో నేర్చుకున్నాను. నిజానికి ఆయన ఓ ‘సంచార విశ్వవిద్యాలయం’. గిరీశం మాటల్లో చెప్పాలంటే ఆయనతో మాట్లాడటమే ఎడ్యుకేషన్. నేను ఫలానా విషయాలను గూర్చి విశ్వనాథం గారి వద్ద నేర్చుకున్నాను అని వ్రాయడం ఆయన్ని అవమానించడమే అవుతుంది. నేను

యువభారతి కార్యదర్శిగా ఎన్నో చక్కటి కార్యక్రమాలను చేయగలిగానంటే వాటన్నిటికీ వెనకాల ఉన్నది మా విశ్వనాథం గారు నాకు అందించిన స్ఫూర్తి. నా ఎడల వారు కనబరిచిన ప్రేమ, నాపై వారు నిలిపిన నమ్మకం, నా పై వారికి గల విశ్వాసం. పోతన గారి మాటల్లో చెప్పాలంటే,

*చేసెడిది 'యువభారతి' కార్యక్రమమ్మట*
*తాచేయించెడివాడు విశ్వనాథుండట*
*నే చేసిన జయప్రదమగునట*
*చేసెద వేరొండు కార్యము చేయగనేలా?*

అని చెప్పాలి. అలాగే ఆంధ్ర సారస్వత పరిషత్ అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు కూడా నన్ను ఎంతో ఆప్యాయంగా పిలిచి సంస్థ కార్యకలాపాల నిర్వహణలో సూచనలను అందజేస్తుండేవారు. యువభారతి కార్యాలయం పెట్టుకోడానికి, పుస్తకాలను నిలవచేయడానికి అవసరమయిన స్థలాన్ని కూడా వారే మాకందించి సహకరించారు. అలాగే సారస్వత పరిషత్ ఆఫీసు కార్యదర్శి శ్రీహరి కిషన్ రావు గారు కూడా నా పట్ల ఎంతో అభిమానంతో ఉండేవారు. యువభారతి మిత్రులు కూడా కార్యక్రమ నిర్వహణభారాన్ని పంచుకుని, తమకందించిన బాధ్యతలను చక్కగా నిర్వర్తించారు. ఇలా... ఎందరో మహానుభావులు తన సహకారాన్ని అందించి, సుహృద్భావంతో ఆశీర్వదించబట్టే నేను ఆ సంస్థ కార్యకలాపాలను సక్రమంగా నిర్వర్తించ కలిగాను.

అలా 1984 వరకు నేను యువభారతి కార్యదర్శి పదవిలో కొనసాగాను. 1984లో నాకు నాగపూర్ బదిలీ అయింది. అలా దాదాపు ఏడేళ్ళు యువభారతి కార్యదర్శిగా బాధ్యతలను నిర్వహించాను. ఆ సమయంలోనే దాదాపు 60 ప్రచురణలను వెలువరించడం జరిగింది. నేను కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించిన నాటికి సంస్థకు దాదాపు లక్షరూపాయలు అప్పులుండేవి. ఆ ఏడేళ్ళలో నెమ్మదిగా ఆ అప్పులన్నిటినీ తీర్చి, నేను పదవీ విరమణ చేసేనాటికి దాదాపు లక్షా ఏభైవేల రూపాయలు బ్యాంకు బ్యాలెన్స్, రెండు లక్షల విలువచేసే పుస్తకాల నిల్వలతో సంస్థను తిరిగి అప్పగించాను.

ఇది నిజంగా నాకు గర్వకారణం. ఆ తరువాత దాదాపు 20 సంవత్సరాలు సంస్థకు దూరంగా ఉన్నాను. ఉద్యోగరీత్యా నాగపూర్ – నాగపూర్ నుండి ముంబాయి,

ముంబాయి నుండి అస్సాంలో గౌహతికి సమీపంలో జాగీరోడ్, జాగీరోడ్ నుండి దేశరాజధాని ఢిల్లీ. చివరగా ఢిల్లీలో సీనియర్ మేనేజర్ (ఫైనాన్స్)గా 2005 సెప్టెంబరు 30న ఉద్యోగ విరమణ చేసి 2005 అక్టోబరులో తిరిగి హైదరాబాద్ చేరుకున్నాను. హైదరాబాద్‌లో ఎర్రగడ్డ సమీపంలో గల మోతీనగర్‌లో నేను 1995లో పరమేశ్వరి అపార్ట్‌మెంట్స్‌లో ఒక ఫ్లాట్ కొన్నాను. ఉద్యోగ విరమణ చేసి హైదరాబాద్ తిరిగి వచ్చాక అందులో దిగాను. కొత్త ప్రదేశంలో సెటిల్ అవటానికి దాదాపు రెండు మూడు నెలలు పట్టింది. అటు తరువాత 2006వ సంవత్సరంలో తిరిగి యువభారతిలో క్రియాశీల సభ్యునిగా వ్యవహరించాను. 2009లో రెండోసారి కార్యదర్శి బాధ్యతలను చేపట్టాను.

నాకంటే ముందు కీ॥శే॥ రెడ్డి రాఘవయ్య గారు కార్యదర్శిగా ఉండేవారు. అప్పుడు కూడా యువభారతి ఆర్థిక పరిస్థితి 1977 మాదిరిగానే ఉంది. కార్యక్రమాలు చెయ్యడానికి డబ్బులు లేవు. కార్యక్రమాలు చేస్తే దాని డబ్బులు రావు. ఇదొక విషవలయం. దీన్ని ఎలాగైనా ఛేదించాలని నిర్ణయించుకున్నాను. డా॥ కె.వి. రమణాచారి గారి సహాయంతో 2009వ సంవత్సరంలో శ్రీ వెంకటేశ్వర వేద విశ్వవిద్యాలయం – తిరుపతి వారి సౌజన్యంతో 'వేద విజ్ఞానలహరి' కార్యక్రమాన్ని చేపట్టాము. అది విజయవంతమైంది. అటు తరువాత 2011లో హిందూధర్మ ప్రచార పరిషత్తు, తిరుమల తిరుపతి దేవస్థానం వారి సౌజన్యంతో 'ఉపనిషత్ సుధాలహరి' కార్యక్రమాన్ని చేపట్టి విజయవంతంగా నిర్వహించగలిగాము. ఈ రెండు కార్యక్రమాలు నిద్రాణంగా, స్తబ్ధంగా ఉన్న సంస్థకు ఊపిరులూదాయి.

మరో జంఘాలశాస్త్రి, విజయానికి అభయం, వ్యక్తిత్వ వికాసం – సూత్రాలు – సూక్తులు, దివాకరప్రభ, ప్రభావం, దాశరథి కవితావైభవం వంటి కొత్త పుస్తకాలను ప్రచురించటమే కాక వివిధ వ్యక్తుల, సంస్థల సౌజన్యంతో మందార మకరందాలు, వేమన్న వేదం, భోగినీలాస్యం, ప్రజాసూక్తం, భావన వంటి పుస్తకాలను పునర్ముద్రించడం జరిగింట.

2013 అక్టోబరులో రవీంద్రభారతి వేదికగా యువభారతి స్వర్ణోత్సవాలను ఉన్నంతలో ఘనంగానే నిర్వహించామనే చెప్పాలి. దాదాపు మళ్ళీ ఏడు సంవత్సరాలు కార్యదర్శిగా పనిచేసి 2016 ఏప్రిల్ 9వ తేదీన 'కార్యదర్శి' బాధ్యతల నుండి

తప్పుకున్నాను. అయితే నన్ను పూర్తిగా బాధ్యతల నుండి తప్పించడం ఇష్టంలేక యువభారతి పెద్దలు నన్ను గౌరవంగా ఉపాధ్యక్షపదవిలో కూర్చోబెట్టారు.

అయితే మా తమ్ముడు సూర్యనారాయణ (రాజు) కొడుకు కృష్ణపెళ్ళి, మా అబ్బాయి కిరణ్‌కి 'కవలలు' పుట్టడం, మా అబ్బాయికి సింగపూర్‌లో ఇంట్లో మెట్ల నుంచి జారిపడి కాళ్ళు ఫ్రాక్చర్ కావటం, అటు తరువాత కోవిడ్ 19 రావటం వంటి సంఘటనలు నన్ను సంస్థకి పూర్తిగా దూరం చేశాయి.

మళ్ళీ 2022 ఆగష్టులో 'అమృతభారతి' కార్యక్రమం, డిశంబరు 2022లో మహాభారతోపన్యాసలహరి, 2023 ఆగష్టు 27,28 తేదీలలో బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు గారి చేత "శ్రీమద్రామాయణం – మానవీయ సంబంధాలు" ఉపన్యాస కార్యక్రమాలను నిర్వహించడంలో క్రియాశీల పాత్రపోషించాను.

'యువభారతి' వజ్రోత్సవ కార్యక్రమాల సమన్వయకర్తగా ఈ వజ్రోత్సవ సంచికను వెలువరించడంలోనూ 29 అక్టోబర్ 2023న జరిగే వజ్రోత్సవ సమాపన కార్యక్రమాల రూపకల్పనలోనూ, నిర్వహణలోనూ నావంతు సహకారాన్ని అందించాను. అయితే, నేను యువభారతికి యిచ్చిన దానికంటే నేను తీసుకున్నదే ఎక్కువేమో! ఏమంటే నేను యువభారతి దగ్గర అంతకంటే ఎక్కువ నేర్చుకున్నాను. ప్లానింగ్, కో ఆర్డినేషన్, ఎగ్జిక్యూషన్, వంటి మేనేజ్‌మెంట్ స్కిల్సుని చక్కగా అభ్యసించాను. కార్యదీక్షా దక్షతను అలవరచుకున్నాను. నాయకత్వలక్షణాలను సంస్థలోని పెద్దల నుండి పుణికి పుచ్చుకున్నాను. ఆత్మస్థైర్యాన్ని పెంపొందించుకున్నాను. కమిట్‌మెంట్, డెడికేషన్, డిసిప్లిన్‌లను అభివృద్ధిపరచుకున్నాను. అలా నేను వ్యక్తిగతంగా ఎంతో నేర్చుకుని లాభపడ్డాను. సంస్థ పురోభివృద్ధికి దోహదపడ్డాను. 'నాగేశ్వరరావా కార్యదర్శి? అన్న స్థితి నుంచి 'నాగేశ్వరరావే కార్యదర్శి'! అనే స్థితికి ఎదిగాను. ప్రతిపక్ష నాయకుడి నుండి కథానాయకుడిగా రూపుదిద్దుకున్నాను. గొంగళిపురుగుగా యువభారతిలో చేరిన నేను అందమయిన సీతాకోకచిలుకగా రూపాంతరాన్ని పొందాను. యువభారతి నన్ను తీర్చిదిద్ది ఒక కవిగా, రచయితగా, కార్యకర్తగా ఈ సమాజం ముందు నిలబెట్టింది. అందులకు నేను యువభారతికి సదా కృతజ్ఞుడనై ఉంటాను.

నేను యువభారతిలో అలవరచుకున్న ఈ సుగుణాలు భవిష్యత్తులో నా ఉద్యోగ విధి నిర్వహణలో నాకెంతో తోడ్పడ్డాయి. హిందుస్తాన్ పేపర్ కార్పోరేషన్‌లో

కూడా మంచి కార్యదీక్షా దక్షుడనని పేరుతెచ్చుకున్నాను. నేను, నవగాం పేపర్‌మిల్‌లో పనిచేస్తున్నప్పుడు నాకో నిక్‌నేమ్ ఉండేది. "ఝాడూ మాష్టర్" అని, అంటే చెత్తని శుభ్రంగా ఊడ్చేవాడని అర్థం. ఏదయిన సెక్షన్‌లో చెత్తపేరుకు పోతే అక్కడ నన్ను పారేయడం, నేనక్కడంతా శుభ్రం చేశాక చెత్త పేరుకున్న మరో సెక్షన్‌కి నన్ను బదిలీ చేయడం పరిపాటి.

1999లో ఢిల్లీలోని మా ప్రాంతీయ విక్రయ కార్యాలయంలో దాదాపు 15కోట్ల రూపాయల 'ఘోటాలా' జరిగింది. దానిని సరిచేసి, ఢిల్లీ ఆఫీసులోని ఆర్థికపరమయిన లావాదేవీలను క్రమబద్ధీకరించే బాధ్యతకు నన్ను ఎంచుకోవడమే మా కంపెనీకి నాపట్ల ఉన్న విశ్వాసానికి తార్కాణం. ఆ కార్యక్రమాన్ని విజయవంతంగా ముగించి నాపై ఉన్న నమ్మకాన్ని నిజం చేశాను. అలా యువభారతి నా జీవితంలో భాగం అయిపోయింది. మఖలో పుట్టి పుబ్బలో అంతరించే సంస్థలే ఎక్కువ ఉంటాయి. అలాంటిది బాలారిష్టాలకు తట్టుకుని నిలబడి ఒక సాహిత్య సంస్థ వజ్రోత్సవం చేసుకోవటం నిజంగా ముదావహం. అటువంటి సంస్థలో సభ్యుడనైనందుకు నాకు ఇంకా ఆనందంగా ఉంది.

అయితే నేటి యువతకు తెలుగు సాహిత్యం పట్ల మక్కువ లేకపోవటం, ఆ కారణంగా సంస్థలోకి యువకులు చేరకపోవడం, ప్రస్తుతం పనిచేస్తున్న కార్యకర్తల సంఖ్య క్రమేపీ తగ్గడం, సంస్థకు ఒక స్వంత కార్యాలయంగాని, విక్రయశాలగాని, సమావేశమందిరం గాని లేకపోవటం విచారకరం. మా సుధామ చెప్పినట్లు మా స్థానం తెలుగు సాహిత్యాభిమానుల హృదయాలలో పదిలంగా ఉంటుందని భావిస్తూ! సెలవ్.



# నే నెరిగిన 'యువభారతి'

శ్రీ ఎస్.వి. ప్రభాకరరావు
విశ్రాంత రాష్ట్ర ప్రభుత్వ అధికారి, హైదరాబాద్.
94418 84957

అది 1972వ సంవత్సరం. దేశానికి స్వాతంత్ర్యము వచ్చి 25 వసంతాలు గడచిన సందర్భంగా దేశం రజతోత్సవాలు జరుపుకుంటున్న సంవత్సరం. గత యేడాది వలె ఈ సంవత్సరం కూడా 'యువభారతి' చైతన్యలహరి పేరున లహరి కార్యక్రమాలు నిర్వహించింది. దేశ స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా ఈ సంస్థ చైతన్యలహరితో పాటు 'మహతి' పేరిట తెలుగు సాహిత్యంపై వంద వ్యాసాలను ప్రముఖ రచయితలతో వ్రాయించి పుస్తక రూపంలో తెలుగు పాఠక లోకానికి అందజేయాలని సంకల్పించింది. అందుకు ప్రచురణ పూర్వ విరాళంగా చైతన్యలహరికి రూ. 3/-, మహతికి రూ. 7 వెరసి 10 రూపాయలు వసూలు చేసినారు. నేను మా ఆఫీసులోని మరో మిత్రుడు ఈ విరాళం చెల్లించి రశీదులు పొందినాము.

చైతన్యలహరి కార్యక్రమాలు ముగిసినాయి. 'చైతన్య లహరి' మరియు 'మహతి' పుస్తకాలు ఆవిష్కరించారు. 'మహతి' పుస్తకాలు అచ్చుకాని కారణంగా ప్రచురణ పూర్వ విరాళాలు చెల్లించిన వారికి రెండు మూడురోజులలో పుస్తకాలు అందజేస్తామని సభలో ప్రకటనతో విజ్ఞప్తి చేసినారు.

కొద్దిరోజుల తరువాత ఒకనాటి సాయంత్రం నేను 'మహతి' పుస్తకం కోసం ప్రచురణ పూర్వ విరాళం రసీదు పట్టుకుని ఆంధ్రసారస్వత పరిషత్ కార్యాలయానికి వెళ్ళాను. యువభారతికి ప్రత్యేకంగా కార్యాలయమంటూ లేదు. పరిషత్ కార్యాలయములోనే కొంతమంది యువభారతీయులు ఏదో పనిచేస్తున్నారు. నేను రసీదులు చూపిస్తూ, "అయ్యా! మహతి పుస్తకం యిప్పిస్తారా అని అడిగాను. వెంటనే ఒక వ్యక్తి నా ముందుకొచ్చారు. ఆయన మన విన్నపాల విశ్వనాథం గారని గుర్తు పట్టాను. యువభారతి కార్యక్రమాలలో 'విన్నపాలు' కూడా ఒక భాగం. అవి ఈయన

గారే వినిపించేవారు. అందువలన శ్రోతలలో ఈయన విన్నపాల విశ్వనాథంగా పేరుగాంచినారు.

శ్రీ వంగపల్లి విశ్వనాథం గారు వ్యక్తులనే కాదు సంస్థలను కూడా ప్రభావితం చేయగల ప్రజ్ఞాశాలి. అందుకే ఆయనంటే నాకు ఎనలేని గౌరవం, అభిమానం. ఆ విశ్వనాథం గారు నా వద్దకు వచ్చి నా వివరాలు అడుగుతూ కొంతసేపు ముచ్చటించి, "నాన్నా! నీకు సాహిత్య విమర్శ అంటే ఇష్టమనుకుంటాను ఈ పుస్తకం చదువుమని 'రచన' అనే పుస్తకాన్ని చేతిలో పెట్టి 'మహతి' పుస్తకం లభించడానికి ఇంకా రెండు మూడు రోజులు ఓపిక పట్టమన్నారు. 'మహతి' మాటేమిటో గాని ఆయన సంభాషణలో ఏదో తెలియని ఆకర్షణ వుంది. నేను అందుకు సమ్మోహితుడనైనాననే చెప్పాలి. "ఖాళీ సమయాలలో ఏంజేస్తుంటావు, ఆఫీసు ముగిసిన తరువాత సాయంకాలం కొంతసేపు మాతో కలిసి ఏదేని సహాయం చేయవచ్చును గదా?" అన్నారు. నేను ఆనందంగా సరేనన్నాను. ఆనాటి నుండి సాయంత్రం నేరుగా ఆఫీసు నుండి ఆంధ్ర సారస్వత పరిషత్‌కు వచ్చి ఏదేని పనిలో మిగతా సభ్యులకు చేతనైన సహాయం చేసేవాడిని. శ్రీ నాగేశ్వరరావు గారు నాతో "శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయంలో ప్రతినెలా మొదటి, మూడు ఆదివారాలలో 'యువభారతి' పక్ష సమావేశాలు నిర్వహింపబడతాయి మీరు రండి" అన్నారు. అప్పట్లో మేము "సుల్తాన్ బజార్"లో నివాసం వుండేవారం. భాషానిలయం మాకు సమీపంలో వున్నందున పక్ష సమావేశాలకు తరచూ వెళ్లేవాడిని.

యువభారతి పక్ష సమావేశాలు ఎంతో అర్థవంతంగా నిర్వహింపబడేవి. "అదొక మినీ భువన విజయం". ఉత్తమ వక్తలుగా, కవులుగా, విమర్శకులుగా తమ తమ వ్యక్తిత్వాలను తీర్చిదిద్దుకోడానికి ఈ సమావేశాలు ఎంతగానో దోహదపడేవి.

ఈ సమావేశాలలో నాకు ఏదో తెలియని అనిర్వచనీయమైన ఆనందానుభూతి కలిగెడిది. అదే సాహిత్యానికున్న శక్తి. ఈ సమావేశాలలో 1) క్లుప్త గోష్ఠి అనుబంధంగా పునరపి సమీక్ష (2) నాకు నచ్చింది – నేను మెచ్చింది 3) స్వీయరచనా పఠనం 4) అప్పుడప్పుడు పుస్తక చర్చ నిర్వహింపబడుతుండేవి.

ఈ పక్ష సమావేశాలకు యువభారతి అధ్యక్షులు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారు, శ్రీ విశ్వనాథంగారు తరచుగా వస్తుండేవారు. ఈ సమావేశాలలో శ్రీకృష్ణమూర్తి గారితో పరిచయం, చనువు పెరిగినాయి. శ్రీకృష్ణమూర్తి గారొక విజ్ఞాన సర్వస్వం (నా దృష్టిలో) ఆయనతో మాట్లాడమే ఒక 'ఎడ్యుకేషన్'. ఈ పక్ష సమావేశాలను

తరచుగా శ్రీనాగేశ్వరరావ్ర గారు, శ్రీ ఆమాతి రవీంద్రగారు నిర్వహిస్తూండేవారు. శ్రీ అల్లంరాజు వెంకట్రావు (సుధామ) గారు, వారి సోదరుడు రాధాయి, శ్రీ చేగొండి రామజోగయ్య, శ్రీ ఎస్. నారాయణరెడ్డి, శ్రీ మురళీధర్‌గౌడ్, శ్రీ రామచంద్రరావు (వీరు స్వర్గస్థులైనారు) ఈ సమావేశాలకు వచ్చే మిత్ర బృందం. కీ.శే. నాగినేని భాస్కరరావు, శ్రీ విశ్వనాథ సూర్యనారాయణ, కె.వి. కామేశ్వరరావు గారు అప్పుడప్పుడు వచ్చేవారు.

ఆ రోజులలో శ్రీఅల్లంరాజు వెంకటరావు (సుధామ) గారు 'యువమిత్ర' పేరుతో వ్రాత మాసపత్రిక ఒక దానిని స్వహస్తాలతో అతి సుందరంగా వ్రాసి భాషానిలయంలో వుంచేవారు. ఎవరైనా దానిని చదువుకుని భద్రంగా మళ్ళీ అచటనే వుంచాలి. ఇందులో యువకవులు వ్రాసిన కవితలు ఎక్కువగా యువభారతి పక్ష సమావేశాలలో వినిపించినవి వుండేవి. శ్రీ సుధామగారికి తెలుగు భాషా సాహిత్యాల మీద ఎంతటి అభిమానమో ఇటువంటి కార్యక్రమాల ద్వారా తెలుస్తుంది. అంతటి సాహిత్యాభిలాష కలదు. గనకనే నిబద్ధతతో సాహిత్యంలో ఉన్నత శిఖరాలకు చేరి నేడు పేరొందిన సాహితీవేత్తలలో ఒకడుగా వున్నాడు. యువభారతి తోటి సాంగత్యం శ్రీ సుధామ గారికి కొంతమేరకైనా సహకరించిందని నా అభిప్రాయం.

పక్ష సమావేశాలలో స్వీయరచనలు చాలామంది వినిపించేవారు. అప్పుడప్పుడు నేను కూడా చిన్న రచనలు వినిపించేవాడిని. స్వీయ రచనలను విని శ్రీ కృష్ణమూర్తిగారు రచయితలకు తగు సూచనలు సలహాలు యిచ్చి ప్రోత్సహించేవారు. ఒకనాటి సభలో శ్రీ ఎ. నాగేశ్వరరావు గారు 'మరో జంఘాలశాస్త్రి' పేరున మంచి ఉపన్యాసాన్ని వినిపించినారు. అది విని శ్రీకృష్ణమూర్తి గారు ఈ జంఘాల శాస్త్రికి దీటుగా మరొక 'గిరీశం' వస్తే బాగుంటుంది అని నా వంక జూసినారు. నాలో స్పందన కలిగింది. తదుపరి పక్ష సమావేశంలో 'మరో గిరీశం' పేర శ్రీ నాగేశ్వరరావు గారి 'జంఘాల శాస్త్రి' ప్రస్తావించిన విషయాలను అధిక్షేపిస్తూ ఉపన్యాసాన్ని వినిపించాను. చాలా బాగుంది. మీరిద్దరూ ఈ ఉపన్యాసాలను కొనసాగించండని శ్రీ కృష్ణమూర్తి గారు ప్రోత్సహించినారు. నేను మరో మూడు వ్యాసాలు మాత్రం వ్రాయగలిగాను. ఇతరత్రా పనులవొత్తిడిలో సాహిత్యానికి సమయం చిక్కక నా రచనా వ్యాసంగం ముగిసింది. శ్రీ నాగేశ్వరరావు గారు ఎంతో ఉత్సాహంతో ఎన్నో వ్యాసాలు వ్రాసి ఆ ఉపన్యాసాలను 'మరో జంఘాల శాస్త్రి' పేర గ్రంథాలుగా ప్రచురించి ఒక 'రచయిత'గా నిలిచాడు.

యువభారతి కార్యక్రమాలన్నీ ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాంగణం నుండే జరిగేవి. ఆ రోజులలో యువభారతి సభ్యత్వం పొందడం సులభమైన విషయమేమీ కాదు. సికిందరాబాద్ క్లబ్బులో సభ్యత్వం పొందడం ఎంత కష్టమో యువభారతి సభ్యత్వం అంత కష్టం. ఎలాగైతేనేమి నాకు యువభారతి సభ్యునిగా చేర్చుకొన్నారు. నా అదృష్టం! ప్రతిరోజూ సాయంత్రానికి ఆం.సా. పరిషత్ చేరుకునే వారము. పరిషత్‌లో యువభారతికి ప్రత్యేకించి ఒక గదికూడా లేదు సరికదా కుర్చీ కూడా లేదు. శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు దయతలచి ఒక 'మలిగి'ని మాకు ఆఫీసు నిమిత్తం కేటాయించినారు. అదే యువభారతి ఆఫీసు, గోదాము, పుస్తక విక్రయ కేంద్రం, సమావేశ మందిరం అన్నీను. ఆ దుకాణం ముందు, ఇంకా ఖాళీగావున్న మలిగిల ముందు వరండాలలో కూర్చుని పనులు చేసుకునేవారం. సంస్థకు సంబంధించిన విషయాలను కూడా చర్చించుకొనేవారం. శ్రీ విశ్వనాథంగారు వీధిలోని బండి మీది పకోడిలు కొని తెప్పించేవారు. వాటిని తింటూ పనులు చేసుకునేవారం. యువభారతి వారు పరిషత్ అరుగులపై పకోడీలు తింటూ పనిచేసుకొని సంస్థను ఉన్నత స్థితికి తెచ్చికొనినారని శ్రీ దేవులపల్లి వారు ఒకనాటి సభలో వెల్లడించి మా గుట్టు బయట పెట్టినారు. అది పొగడ్తా లేక ఎగతాళినా అన్నది విజ్ఞులు నిర్ణయించాలి.

లహరి కార్యక్రమాలతో పాటు సాహితీ వాహిని పేర ప్రసిద్ధి చెందిన కవుల కవిత్వ వ్యక్తిత్వాల మీద క్లుప్తంగా రచనలు చేయించి పుస్తకాలను ప్రచురించేవారం. సాహితీ ప్రియులకు యువభారతితో సాన్నిహిత్యం పెంచేందుకు సాహితీ మిత్ర, భారతీ మిత్ర, భారతీ భూషణ పథకాలను ప్రవేశపెట్టి మిత్రులను చేర్చుకొనినాము. వీరి జనన తేదీలను పరిశీలించి వీరందరికి జన్మదిన శుభాకాంక్షలు పంపేవారం. రీడర్స్ డైజెస్ట్ తరహాలో సాహిత్య సంబంధిత విషయాలలో ఒక మాస పత్రిక ప్రచురించాలని ఆలోచనచేసి 'నందిని' అనుపేర మాసపత్రికను ప్రచురించాము. ఈ నందిని శ్రీ విశ్వనాథంగారి మానసపుత్రిక. ఒక విషయం గమనించాలి. ఇన్ని కార్యక్రమాలు నిర్వహిస్తున్నా మాకు వున్నది పరిషత్‌లోని ఒక 'మలిగ' ఒకే ఒక ఉద్యోగి శ్రీ జహంగీర్ (ఆయన పరమపదించినాడు).

కార్యక్రమాలకు శ్రీ విశ్వనాథంగారు ప్రణాళిక సిద్ధం చేసేవారు. దానిని సర్వసభ్య సమావేశంలో అమోదానికి ప్రవేశపెట్టేవారు. సభ్యులంతా ప్రణాళికలోని బాగోగులను, ఆచరణలో ఎదురుపడే కష్ట నష్టాలను కూలంకషంగా చర్చించేవారు. చర్చ ముగిసిన తరువాత అధ్యక్షులు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారు సభ్యుల

సంశయాలన్నింటిని నివృత్తిచేస్తూ ప్రణాళికకు ఏకగ్రీవ ఆమోదాన్ని పొందేవారు. సభలో అనేకసార్లు వాడి వేడి చర్చలు జరిగేవి. 'నందిని' విషయంలో లోతుగా చర్చించినారు. ఒక మాసపత్రికను నడిపేందుకు కావలసిన వనరులు. పత్రిక ప్రచారం పొంది పాఠకులు ఆదరించే స్థాయికి చేరడంలోని ఇబ్బందులు విశేషంగా చర్చించి విశాల ప్రయోజనాలను ఆశించి 'నందిని' మాసపత్రిక వెలువరించడానికి సర్వసభ్య సమావేశం ఆమోదించింది. అయితే నందిని ఆశించిన స్థాయిలో పాఠకలోకాన్ని ఆకర్షించలేకపోయింది. అది వేరే విషయం. వేరొక సన్మాన కార్యక్రమ నిర్వహణకు సంబంధించి సర్వసభ్య సమావేశంలో వేడి వేడి చర్చ జరిగింది. అంత తీవ్రంగా సమావేశంలో ఏనాడూ చర్చలు జరుగలేదు. చివరకు శ్రీ ఇరివెంటి వారు కలుగజేసుకొని సభ్యులందరిని సమాధానపరచి ఆ కార్యక్రమ నిర్వహణకు ఆమోదం పొందినారు. ఈ రెండు విషయాలు ఉదాహరణకు మాత్రం ప్రస్తావించాను.

యువభారతి నిర్వహించే 'లహరి' ఉపన్యాస మంజరి కార్యక్రమాల గూర్చి తప్పక ప్రస్తావించాలి. క్రమశిక్షణలో, సమయపాలనలో యువభారతితో సరితూగ గల సాహితీ సంస్థ ఆ రోజులలో మరొకటి లేదు. అన్నిపనులూ సభ్యులే చేసేవారు. సభా ప్రాంగణంలో కుర్చీలు (ఆ రోజులలో ఇనుప, మడత కుర్చీలు) సభ్యులంతా వయసుతో, హోదాలతో నిమిత్తం లేకుండా వేసేవాళ్లం. కుర్చీల వరుసలు రేఖలు గీసినట్లుండాలి. వాటి మీద మురికి బట్టతో తుడిచేందుకు పరిషత్‌లోని కాపలదారు సహాయపడేవాడు. కుర్చీల ఏర్పాటుకు ఒకరు బాధ్యత వహించేవారు. సభావేదిక అలంకరణ అప్పట్లో శ్రీ సుభాష్ అనే మిత్రుడు శ్రీ ఆమాతి రవీంద్ర సహకారంతో పూర్తిచేసేవారు. తండోపతండాలుగా తరలివచ్చే సాహిత్యాభిమానులను ముఖద్వారం వద్ద అత్తరుజల్లి గులాబి పూలను చేతికందించి ఆహ్వానం పలికేవారు. స్త్రీలకు ప్రత్యేకంగా ఆహ్వానం పలికేందుకు యువభారతి వనితా విభాగం అధ్యక్షురాలు శ్రీమతి కె.బి. లక్ష్మిగారు, కొంతమంది మహిళా సభ్యులతో కలిసి ఆదరంగా ఆహ్వానించేవారు. సభకు వచ్చే వారిని ఈ విధంగా అత్తరు, పుష్పాలతో ఆహ్వానం పలుకాలనే ఆలోచన, దాని ఆచరణ శ్రీ విశ్వనాథంగారి ఆలోచనే! ఈ ఏర్పాట్లు చూసి చాలామంది విశేషంగా అభినందించినారు. కొద్దిమంది ఈర్ష్యచెందినారని గూడా చెప్పవచ్చును.

ఆ రోజులలో లహరి కార్యక్రమాలు అంతట ప్రేక్షకాదరణ పొందడానికి అనేక కారణాలు. కార్యక్రమాలకు విశేషమైన ప్రచారం చేసేవారం. ప్రతి గ్రంథాలయంలో, ప్రతి ఆఫీసులో, దుకాణాలలో, వీధులలో కరపత్రాలు పంచేవారం.

శ్రీ దివాకర్ల వేంకటావధాని గారు, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు, శ్రీమరుపూరి కోదండ రామిరెడ్డిగారు, శ్రీ సి. నారాయణ రెడ్డిగారు, శ్రీ జి.వి. సుబ్రహ్మణ్యంగారు, శ్రీ దాశరథిగారు, శ్రీ ఆరుద్రగారు, అత్యంత పేరుగాంచిన పండితులు ఉపన్యాసకులుగా వచ్చేవారు. ఆం.ప్ర. సారస్వత పరిషత్ అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు ఎంతో ప్రసిద్ధిగాంచిన కవి పండితులు, వక్తలు హైకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ చిన్నపరెడ్డివంటి వారు సభాధ్యక్షులుగా, ముఖ్య అతిథులుగా సభికులకు సాహిత్యా మృతధారలనందించేవారు. యువభారతి లహరి ఉపన్యాసాలు వినడానికి శ్రోతలు ఎంత తాపత్రయపడే వారో ఈ వేదికపై నుండి ఉపన్యసించడానికి పండితులనే వారు కూడా అంతే ఉబలాట పడేవారు. ఆ విషయం అందరూ బయల్పడనీయరు. శ్రీ మరుపూరు కోదండ రామిరెడ్డిగారు, 1983 సంవత్సరంలో ప్రచురించిన “లోక కవి వేమన యోగి” అనే తన పుస్తకం ముందు మాటలో ‘ఈలోక కవిని యోగిని కొనియాడే అవకాశం 1972లో హైదరాబాదు యువభారతివారు నాకు కల్పించినారు. వారి ఆనాటి చదువుల తిరునాళ్ళలో వేమనను గూర్చి నా ఉపన్యాస ముండినది. (చైతన్యలహరి) మంచిపేరు వచ్చినది”. ఈ రెడ్డిగారు ఎంతటి నిగర్వి! యువభారతి తనకు ఉపన్యసించే అవకాశం కల్పించింది అని చెప్పికొనినాడు.

ఆనాటి ఉపన్యాసాలు మహోజ్జ్వలమైనవి. మహోన్నతమైనవి. శ్రీ అవధాని గారి ప్రసంగం గంగా ప్రవాహం, శ్రీనారాయణరెడ్డి గారి ప్రసంగం వింటుంటే మధుర సంగీతఝరి, శ్రీదాశరథిగారి ప్రసంగం వింటే అలనాటి నిజాం వ్యతిరేక పోరాటం గూర్చిన చరిత్ర మళ్లీ చదువాల్సిన పనిలేదు. శ్రీ పుట్టపర్తి వారి ప్రసంగం శివతాండవమే.

ఇలా శోభాయమానంగా కార్యక్రమాలు జరిగిపోతుండేవి. ఇది యువభారతికి ‘స్వర్ణయుగం’. దీనికి ముఖ్యంగా శ్రీ వంగపల్లి విశ్వనాథంగారు, శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారు, కార్యదర్శి శ్రీ ఎస్. వెంకటేశ్వర రావు గారలు కారకులు. వీరెంతో నిబద్ధత కలిగి నిస్వార్థంగా సేవలందించి కార్యక్రమాలను విజయవంతం చేసినారు. ఇతర సభ్యుల సహాయ సహకారాలు లేవని నా ఉద్దేశం కాదు. అన్నిటిని, అందరిని సమన్వయ పరచి సంస్థను నడిపించినారు. శ్రీ ఎస్. వెంకటేశ్వరరావు గారి తరువాత యువభారతిని ఎంతో దక్షతతో, నిబద్ధతతో, సంస్థకు ఊపిరిలూది నిలబెట్టిన కార్యదర్శి శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు గారు. నేటికీ ఈయన సలహా సహకారాలతో సంస్థ కార్యకలాపాలు సజీవుగా సాగుతున్నాయి.

లహరులు, కవితా వైభవాలు అనేకం ముద్రించినాము. కాని అనుకున్న పరిమాణంలో పుస్తకాల విక్రయాలు జరగడం లేదు. పుస్తకాల నిల్వలు పేరుకుపోయినాయి. నగదు రాబట్టి అంతంత మాత్రంగానే వుండేది. ఈ పరిస్థితులలో సంస్థకు మానవ వనరుల కొరత ఏర్పడింది. చాలామంది యువకులు ఉద్యోగరీత్యా వేరే ప్రదేశాలకు పోవడం, కొంతమంది ఉద్యోగరీత్యా వేరే ప్రదేశాలకు పోవడం. కొంతమంది ఉద్యోగబాధ్యతలు పెరిగి తగిన సమయం కేటాయించలేక పోవడం జరిగింది. అదే సమయంలో శ్రీ జహంగీరు ఉద్యోగం సంపాదించుకుని సంస్థకు దూరం అయినాడు. అట్టి పరిస్థితులలో కార్యకలాపాలు కూడా జరగలేదు సరికదా పరిషత్ ఆవరణలోని పుస్తక విక్రయ కేంద్రం తెరిచే మనిషిలేక పోయినాడు. ఆ సమయంలో నేను సాయంత్రం ఆఫీసు నుండి వస్తూ దుకాణం తెరచి రోజూ రాత్రి 8 గంటల వరకు కార్యకలాపాలు చూసేవాడిని. కొంతకాలానికి శ్రీ శ్రీరామమూర్తి అనే పెద్ద మనిషి లభించి ఆ బాధ్యతలను తీసుకొని చాలాకాలం సంస్థకు సేవలందించినారు. సంస్థకు అవసరం అనుకున్నప్పుడు ఏ పని చేయడానికైనా వెనుకాడలేదు.

యువభారతి నన్ను అనేక పదవులతో సత్కరించినది. ముందు సహసమావేశ కర్తను చేసింది. తరువాత సహాయకార్యదర్శి, కోశాధికారి తదనంతరం కార్యదర్శిని కూడా చేసింది. అందుకు సంస్థకు నేనెంతో ఋణపడి వున్నాను.

శ్రీ ఎ. రామలింగేశ్వరరావుగారు కొంతకాలం కార్యదర్శిగా పనిచేసినారు. తరువాత కాలంలో వీరు 'యువభారతి ఫౌండేషన్' స్థాపనలో కీలకపాత్ర వహించారు. ఈయన రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తిగా సేవలందించి ఉద్యోగ విరమణ పొందినారు. వీరి తరువాత శ్రీ వివేకానందగారు కార్యదర్శిగా పదవీ బాధ్యతలు చేపట్టినారు. ఆ కాలంలో నేను కోశాధికారిగా వున్నాను. అప్పుడు కొంతకాలం పరిస్థితులు సజావుగానే సాగినాయి. కాలక్రమేణా ఆర్థిక పరిస్థితి గతి తప్పింది. కొన్ని అనాలోచిత నిర్ణయాల వలన కలిగిన ఖర్చులు, పథకాల అమలులో వైఫల్యం కొంతమేర కారణాలు. తగిన సమయంలో వీటిని శ్రీ విశ్వనాథంగారి వంటి పెద్దల సహకారంతో సరిదిద్దుకొనినాము. ఏది ఏమైనా ఆ గడ్డుకాలంలో నేను కోశాధికారిననే బాధ నన్ను వేధిస్తుంది.

యువభారతిలో అత్యంత ముఖ్యులు శ్రీమతి కె.బి. లక్ష్మిగారు. వీరి సుమధుర గాత్రంతో ప్రార్థన శ్లోకం వినిపించడంతో యువభారతి కార్యక్రమం ప్రారంభమయ్యేది. ఈమె భర్త శ్రీ కె.వి. కామేశ్వరరావు. యువభారతిలో చురుకైన సభ్యులు. వీరిరువురికి

యువభారతి అనినా, యువభారతీయులనినా ఎంతో అభిమానం వీరు మా యింటికి తరచు వస్తూవుండేవారు. వీరు చూపిన అభిమానం, ఆప్యాయత ఎన్నటికీ మేము మరువలేం. వారిరువురూ పోవడం సంస్థకి తీరనిలోటు.

యువభారతి చేసిన పొరపాటు ఏమిటంటే భవిష్యత్ అవసరాల కొరకు ఆస్తులు సంపాదించాలనే ఆలోచన చేయకపోవడం. తలదాచుకొనేందుకు ఒక చిన్న భవనం గాని, చిన్న భవన నిర్మాణానికి అనువైన స్థలంగాని సంపాదించకపోవడం అదంతా గతం. ఇప్పుడు విచారించి ప్రయోజనం లేదు.

కాలక్రమేన తెలుగు గ్రంథాలు, తెలుగు సాహిత్యం మీద ఆదరణ తగ్గిపోయింది. మనలాంటి సాహితీ సంస్థలు మూలనపడ్డాయి. అయినప్పటికీ తెలుగు సాహిత్యాన్ని బతికించుకోడానికి మేము వున్నాం అంటూ యువభారతి నేటికీ కార్యక్రమాలు చేస్తున్నది. ఎవరు ఔననినా కాదనినా ఇది సత్యం.

నేను కవినిగాను, రచయితను గాను, నా రచనలేవీ ముద్రణకాలేదు. అయినా నేను యువభారతిలో సభ్యునిగా నేటికి కొనసాగుతున్నాను. అందుకు ప్రథమంగా మొదటి సమావేశంలోనే, నన్ను అత్యంత ప్రభావితుణ్ని జేసి యువభారతివైపు ఆకర్షించిన ప్రభావశీలి నాకు ఎన్నటికీ ఆరాధ్యుడు శ్రీ వంగపల్లి విశ్వనాథంగారు కారణం.

తరువాత అత్యంత స్నేహశీలి, సాహితీవేత్త, నిస్వార్థసేవాతత్పరుడు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారు. ఈయన స్వాతంత్ర్యసమరయోధుడు. ఈయన తరువాత మృదుస్వభావి, మితభాషి, కవి, పండితుడు, అత్యంత స్నేహశీలి శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యులుగారు. వీరు ముప్వురి సాన్నిహిత్యం, సాహచర్యం లభించడం నా అదృష్టంగా భావిస్తాను.

మిత్రులు శ్రీ అయలసోమయాజులు నాగేశ్వరరావు గారంటే నాకెంతో అభిమానం, గౌరవం. ఆయన కార్యదర్శిగా యువభారతికి చేసిన సేవలు మరువరానివి. వీరికి తోడు శ్రీ ఆమాతి రవీంద్రగారు నాటి నుండి నేటి వరకు యువభారతికి సేవలందిస్తూనే వున్నారు. వీరిరువురికి నా హృదయపూర్వక అభినందనలు, ఆశీస్సులు.

నా యువభారతి ప్రస్థానంలో శ్రీయుతులు డా॥ నాగినేని భాస్కరరావు (వీరు కీ॥శే॥లు), ఎస్. నారాయణరెడ్డి, టి. మురళీధర్‌గౌడ్, అశ్వనీకుమార్‌ల స్నేహానురాగాలు మరువలేనివి. వారికి కృతజ్ఞతలు. యువభారతీయులందరికీ నమస్సులు.



# యువభారతితో నా ఆత్మీయత

శ్రీ ఆమాతి రవీంద్ర
విశ్రాంత రాష్ట్ర ప్రభుత్వోద్యోగి, కోశాధికారి, హైదరాబాద్
98499 09896

*"సత్సంగత్వే నిస్సంగత్వం – నిస్సంగత్వే నిర్మోహత్వం*
*నిర్మోహత్వే నిశ్చలతత్వం – నిశ్చలతత్వం జీవన్ముక్తిః"*

....యువభారతి వల్ల నాకు సజ్జనుల సాంగత్యం లభించింది. ఆనాడు 19–11–1972. ప్రతినెల మొదటి, మూడవ ఆదివారాల్లో యువభారతి పక్ష సమావేశాలు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయం, సుల్తాన్‌బజార్‌లో జరుగుతాయని ప్రియమిత్రుడు తాళ్లపల్లి మురళీధర గౌడ్ గారు చెప్పారు. అప్పుడు "నూనూగు మీసాల నూత్న యౌవనం.." కదా..!! "రాయల్ లో సినిమానా? భాషా నిలయంలో సమావేశమా?" అనుకుంటూ యువభారతి పక్ష సమావేశానికే వోటు వేసుకుని, పక్షసమావేశానికి వెళ్లాను. అద్భుతం..!! పక్ష సమావేశాలు నన్ను కట్టిపడేశాయి. క్లుప్తగోష్ఠి ఇంకా నన్ను వదల్లేదు. అప్పుడప్పుడు నిర్వహిస్తూనే ఉంటాను. ఒక నిర్దిష్ట సమయాన్ని దృష్టిలో ఉంచుకుని క్లుప్తంగా మాట్లాడటం ఒక గొప్ప కళ. అప్పుడున్న పెద్దలు, దిగ్గజాలు, నాలాంటి యువకులను ఉత్సాహపరిచేవారు. పక్ష సమావేశాల సమావేశకర్తగా యువభారతిలో నా బాధ్యతలు పెరిగాయి. పక్షసమావేశాలను ఆపివేయడం వల్లనే యువభారతిలో యువరక్తం రాలేదని నా వ్యక్తిగత అభిప్రాయం.

ఈత మరియు క్రికెట్ నాకు నచ్చిన క్రీడలు. నేను "హైదరాబాద్ క్రికెట్ అంపైరింగ్ క్లబ్" సభ్యుణ్ణి కావడం వల్ల 1974 లో వెస్టిండీస్ జట్టుతో సౌత్ జోన్ మ్యాచ్ హైదరాబాదులో జరిగింది. మ్యాచ్ కి వెళ్లడంవల్ల నేను అప్పుడు జరిగే 'లహరి' సమావేశాలకు ఆలస్యంగా వెళ్లడం జరిగింది. సమావేశానంతరం ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారు సంస్థ సభ్యుల–బాధ్యతల గురించి తెలియజేశారు. కొంత కనువిప్పు కలిగింది. నాటినుండి వారిని వెన్నంటే ఉండేవాడిని. వారిచే నిర్వహించబడిన

వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలకు ఉడుతాభక్తిగా నేను సేవ చేశాను. వారి ప్రభావం చాలామంది పైన పడినట్లే నాపై కూడా పడింది. వారి ఋణం ఎలా తీర్చుకోవాలి అని అనిపించేది. ఒకసారి 5, కింగ్స్ వే లో వారి నివాసానికి వెళ్లాను. ఇంట్లో జనాలు ఉన్నారు. ఆరోజే వారి తల్లిగారు స్వర్గస్థులయ్యారు. ఆ రోజంతా అక్కడే ఉండి అంత్యక్రియల్లో సహాయం చేశాను. యువభారతికి శక్తిమంతుడైన ఒక కొడుకుని ఇచ్చిన ఆ మహాతల్లి చివరి ప్రయాణంలో నా భుజం అందించాను, అది ఒక చిన్న తృప్తి.

కోశాధికారిగా ఉన్న శ్రీ పత్రి అశ్వనీకుమార్ గారు బదిలీ కావడం వల్ల, కార్యదర్శిగా ఉన్న శ్రీ ఎస్ వి ప్రభాకర రావు గారు ఉద్యోగరీత్యా సమయం ఇవ్వలేకపోవడం వల్ల, నగరంలోనే పనిచేస్తున్న నేను కార్యదర్శిగా, శ్రీ కె వి కామేశ్వరరావు గారు కోశాధికారిగా కొంతకాలం పనిచేశాము. తరచుగా నేను డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారిని సాహిత్య అకాడమీలో కలిసే వాడిని. నాపై వారికి వాత్సల్యం ఉండేది. అక్కడే ఉన్న శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు నాలాంటి యువకులనుద్దేశించి చురకలు వేసేవారు. అవి కూడా ఆశీర్వాదాలేగా !! డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి గారు ఆకస్మికంగా స్వర్గస్థులు కావడం నన్ను కలచివేసింది. యువభారతిలోని ఎక్కువమంది సభ్యుల అభిప్రాయానుసారం శ్రీ జి వి సుబ్రహ్మణ్యం గారు అధ్యక్షులుగా ఎన్నికైనారు.

అంతర్జాతీయ యువజన సంవత్సరంగా యువత కార్యక్రమం బాగా జరిగింది. ఈ కార్యక్రమంలో నా గురువులు స్వామి రంగనాథానంద, డాక్టర్ ప్రసాదరాయ కులపతి గారు పాలుపంచుకోవడం నాకు చాలా ఆనందాన్ని కలిగించింది. 'నందిని' పత్రికకు చాలా భిన్నంగా పనిచేయాల్సివచ్చింది. అందులోని శీర్షికలు – ముఖ్యంగా 'ప్రభావం' నన్ను బాగా ప్రభావితం చేసింది. అందుకే ఆ శీర్షిక కింద అందుబాటులో ఉన్న రచనలను సేకరించి, ఆర్థికంగా సహకారాన్ని అందించి 'ప్రభావం' ప్రచురణను వెలుగులోకి తెచ్చాను. అది నా మరో మానసపుత్రిక.

నేను మా తల్లిదండ్రులకు ఏకైక సంతానం. కె బి లక్ష్మి గారిని మా అమ్మకు పెద్దకూతురు గా పరిచయం చేశాను. వారిరువురూ బాగా కలిసిపోయారు. శ్రీ అనంత మరియు శ్రీ కామేశ్వరరావు దంపతులు మా ఇంటికి వస్తే మా ఇంటికి అల్లుళ్ళు కూతుర్లు వచ్చినంత సంబరంగా ఉండేది. స్థలాభావం వలన యువభారతి

ఆత్మీయ మిత్రుల ప్రస్తావన తేవడం లేదు కానీ అందరితోనూ నాకు ఆత్మీయ సంబంధాలు ఉన్నాయి. ఎందరో మిత్రుల ఆత్మీయతను, ప్రేమను చూరగొన్నాను.

యువభారతిలో ఆఫీసు మేనేజరుగా ఉన్న శ్రీ శ్రీరామమూర్తి గారి మరణం తరువాత ఆఫీసును తెరిచి పనిచేయడానికి మనుషులు లేరు. మా మిత్రులు శ్రీ విజాపురి శ్యామసుందర మూర్తి గారి తండ్రి, శ్రీ కృష్ణమూర్తి గారిని ఒప్పించి ఆఫీసును తెరిపించడం జరిగింది. వారు సుమారు 10 సంవత్సరాల పాటు మనకు సహాయం చేశారు. అప్పట్లో ఏటేటా ఎక్జిబిషన్ గ్రౌండ్స్ లో జరిగే ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్‌లో యువభారతి ఒక స్టాల్ ను ఏర్పాటు చేసి, నేను, శ్రీ రాజన్న కలిసి యువభారతి ప్రచురణలు అమ్మేవాళ్ళం. ఆ సమయంలో మన జహంగీర్ కూడా ఎంతో సహాయం చేసేవాడు. ఒక్కొక్కసారి నేను గతంలో పనిచేసిన RTA నుంచి RTO గారు వచ్చి పుస్తకాలు కొనేవారు. వెళ్తూ వెళ్తూ వారొక మాట అన్నారు "నువ్వు ఇలాగే పుస్తకాల మధ్య ఉండు. RTA కు రాకు."

ఆ మాట నాలో ఆలోచనలు రేకెత్తించింది. నాకు ఇతర నగరాల్లో ఉద్యోగ అవకాశాలు ఉన్నా హైదరాబాదులోనే పుట్టి పెరిగిన నేను హైదరాబాదును వదలకుండా యువభారతి సాంగత్యాన్నే అంటిపెట్టుకోవాలని, పుస్తకాల మధ్యే ఇలా జీవితాన్ని గడిపాను. విశ్వకవి రవీంద్రుని కంటే దివ్య జీవన శ్రీ అరవిందుడు నాకు ఆదర్శం. ఇప్పటికీ ఆదివారం అబిడ్స్ లో ఒక మంచి పాత పుస్తకం దొరికితే ఎంత సంతోషమో..! ఎంత ఆనందమో..!

నేను 22 ఏళ్ళ వాడిగా ఉన్నప్పుడు యువభారతిలో చేరాను. నాకిప్పుడు 72 ఏళ్ళు అంటే ఏభై ఏళ్ళపాటు నాకు సత్సాంగత్యాన్ని ఇచ్చి, నాలో మరింత మంచితనాన్ని పెంచిన యువభారతికి సదా కృతజ్ఞతలు. నాజీవితంలో సగభాగమై వెలిసింది యువభారతి. యువభారతి – యువతరాన్ని ప్రేరేపించే కార్యక్రమాలను సదా నిర్వహించాలని నేటి యువకులు మరో 60 సంవత్సరాల వరకు యువభారతి కార్యక్రమాలను కొనసాగించి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేయాలని ఆకాంక్షిస్తున్నాను.



# యువభారతితో నా అనుబంధం

డా॥ ఎస్.నారాయణరెడ్డి
విశ్రాంత ఉపాధ్యాయుడు
హైదరాబాద్, 99491 66104

యువభారతి అంటే క్రమశిక్షణ
యువభారతి అంటే ఆప్యాయతానురాగాలు
యువభారతి అంటే వాత్సల్యతానుబంధాలు
యువభారతి అంటే నిరాడంబరత
యువభారతి అంటే నిస్వార్థ భావన, సర్వసమానత్వం

1968లో ఉద్యోగాన్వేషణలో హైదరాబాదు చేరిన నాకు హిందీ మాధ్యమ పాఠశాలలో ఉపాధ్యాయ ఉద్యోగం లభించింది. బాల్యం నుండే తెలుగు భాషా సాహిత్యాలపై అభిమానం. చిన్నప్పుడే సుమతి, కృష్ణ, ప్రసన్న రాఘవ, నరసింహ శతక పద్యాలతోపాటు నీతి శతక పద్యాలు, పోతన భాగవతంలోని పోతన రత్నాలు గజేంద్రమోక్షం, రుక్మిణీ కళ్యాణంలోని పద్యాలు కంఠతా వచ్చేవి. ఈ విధంగా తెలుగు భాషా సాహిత్యాలపై ఉన్న మమకారంతో ఆంధ్ర (తెలంగాణ) సారస్వత పరిషత్తు ప్రాచ్య కళాశాలలో చేరటం జరిగింది. దినమంతా బడిలో పిల్లలతో, సాయంకాలం కళాశాల. ఈ విధంగా జీవితం హడావిడిగా, యాంత్రికంగా గడచిపోతుండేది.

అవి ఉధృతంగా ప్రత్యేక తెలంగాణ ఉద్యమం జరుగుతున్న రోజులు, ఎప్పుడూ అల్లకల్లోలం, ఆందోళన. మనుషులు ఒకరికొకరు అనుమానంగా చూసుకుంటున్న రోజులు. ఇంకొకవైపు సమాజంపై తిరుగుబాటు చేస్తూ దిగంబరకవులు ప్రకటించిన దిగంబర కవిత్వం సాహిత్యంలోను అలజడి రేపింది. ఈ విధంగా అటు సమాజంలోను, ఇటు సాహిత్యంలోను మార్పులు కోరుకుంటున్న సమయం.

సరిగ్గా ఈ సమయంలోనే "సమాజంలో సమన్వయం, సామరస్య సాధనకు సాహిత్యాన్ని మించిన సాధనం లేదు, చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని

తిట్టుకుంటూ కూర్చోవడం కంటె ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించడం మంచిది" అన్న సూక్తి స్ఫూర్తితో వెలసిన యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ వెలుగులోకి వచ్చింది. సారస్వత పరిషత్తులో రెండు గదుల్లో యువభారతి కార్యాలయం. పనిచేసేది. గదుల ముందు అరుగులపై సాయంకాలం యువభారతి సభ్యులు, ఉత్తరాలకు సమాధానాలు రాస్తూ, కార్యక్రమాలు చర్చించుకొంటూ కనిపించేవారు. కళాశాలకు వస్తూపోతూ ఆసక్తిగా గమనించేవాడిని. కావ్యలహరి నాటికి నేను ఇంకా సభ్యునిగా చేరలేదు కాని కార్యక్రమ నిర్వహణ నన్నెంతగానో ఆకర్షించింది. వచ్చిన వారందరికి గులాబీ పూలతో స్వాగతం పలుకటం కార్యక్రమ నిర్వహణలో సమయపాలన, క్రమశిక్షణ, అవధాని గారి ఉపన్యాసాన్ని వినడానికి వచ్చిన అసాధారణ జనసమూహం– ఇవన్నీ నాకు కొత్తగా కనిపించాయి.

అప్పటికే మా సహాధ్యాయి కీ.శే. జి.కుమారస్వామి నాయుడు గారు సభ్యుడుగా ఉన్నారు. వారిని యువభారతి సభ్యత్వం గూర్చి అడిగాను. ప్రతి నెల మొదటి, మూడవ ఆదివారాలు మధ్యాహ్నం 2:30 గంటలకు శ్రీకృష్ణ దేవరాయాంధ్ర (తెలుగు) భాషా నిలయంలో జరిగే పక్ష సమావేశాల గురించి చెప్పి నన్ను రమ్మని చెప్పారు. సరిగ్గా నెల, తేది గుర్తు లేదు కాని 1972లో ఒకరోజు పక్ష సమావేశానికి వెళ్ళటం జరిగింది. ఆ సమావేశంలో జరిగిన 'క్లుప్తగోష్ఠి' కార్యక్రమంలో పాల్గొన్న నాకు మొదటి బహుమతిని ఇచ్చారు.

పక్ష సమావేశాలలో క్లుప్తగోష్ఠి, క్లుప్తప్రసంగం, ఆశురచన, నాకు నచ్చినది నేను మెచ్చినది, స్వీయ కవితా పఠనం, పుస్తక పరిచయం, చర్చాగోష్ఠి, నా గురించి మొదలైన వినూత్నమైన, వ్యక్తి సమగ్ర వికాసానికి తోడ్పడే కార్యక్రమాలు రూపొందించి, సభ్యులందరూ వాటిలో పాల్గొనేలా చేసేవారు. ఈ కార్యక్రమాలన్నీ సభ్యులకు తమను తాము ఉన్నతీకరించుకోవటానికి తాలీంఖానాలాగా, శిక్షణా కేంద్రంగా ఉండేవి. డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారు, ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు, డా. తిరుమల శ్రీనివాసాచార్యులు మొదలైన మేధావుల, ప్రతిభామూర్తుల మార్గదర్శనం సభ్యులను తీర్చిదిద్దేవి. ఆరోజే యువభారతి సభ్యుడిగా చేరిన నేను బహుశః ఇప్పటి వరకు జరిగిన ఏ సమావేశానికి కూడా హాజరవకుండా ఉండలేదేమో!

డా. ఇరివెంటి కృష్ణమూర్తి, ఆచార్య వంగపల్లి విశ్వనాథం, డా. తిరుమల శ్రీనివాసాచార్యులు గారల వాత్సల్యం, ప్రేమ, పలుకరింపులోని మాధుర్యం మరచిపోలేనివి. సభ్యులలో ఏ చిన్న మెరుపు కనిపించినా ప్రశంసించి ప్రోత్సహించేవారు.

అంతర్గత సమావేశాల్లో వాడి వేడి చర్చల తర్వాత అధ్యక్షులు ఇరివెంటి కృష్ణమూర్తి గారి సమన్వయ భాషణం మనసును హత్తుకునేలా ఉండేది. యువభారతి ప్రచురించిన సభ్యుల కవితా సంకలనం "వేడి వెలుగులు"లో నా కవితలకు స్థానం లభించింది. యువభారతి నిర్వహించిన అనేక సభల కార్యక్రమ నిర్వహణలో నాకు స్థానం కల్పించారు.

కళాశాలలకు వెళ్ళి విద్యార్థులను, అధ్యాపకులను పక్ష సమావేశాలకు రావాలని ఆహ్వానించే వారము. ఆ విధంగా వివేకవర్ధిని కళాశాల నుండి అప్పుడు విద్యార్థిగా ఉన్న ప్రదీప్ కుమార్ (సినీనటుడు) వచ్చిన వారిలో ఉన్నారు.

శ్రీ సింగంపల్లి వేంకటేశ్వరరావు శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు, శ్రీ సుధామ, శ్రీ మాడభూషి అనంతాచార్యులు, శ్రీ తాళ్ళపల్లి మురళీధర గౌడ్, శ్రీ ఆమాతి రవీంద్ర, శ్రీ డి.ఎల్.ఎన్.ప్రసాద్, శ్రీ ఎస్.వి. ప్రభాకరరావు, శ్రీ పి.చంద్రప్రకాశరావు, శ్రీ భార్గవ, ఆచార్య ఫణీంద్ర, శ్రీ జీడిగుంట వేంకట్రావ్, శ్రీపతి అశ్వినీకుమార్, శ్రీ చేగొండి రామజోగయ్య లాంటి స్నేహశీలుర సాహచర్యం లభించింది.

కీ.శే.కె.వి. కామేశ్వరరావు, కె.బి.లక్ష్మి, గోళ్ళ కుమారస్వామి నాయుడు, నాగినేని భాస్కరరావు, బి.రామచంద్రరావు, రెడ్డి రాఘవయ్య, మలపాక పూర్ణచంద్రరావు కార్యాలయంలో మేనేజరుగా పనిచేసిన శ్రీరామమూర్తి, జహంగీర్ వీరందరూ పంచిన స్నేహామృతాన్ని ఈ సందర్భంగా స్మరించుకొంటున్నాను.

ఈ విధంగా యువభారతి తెలుగు సాహిత్యానికి, తద్వారా సమాజానికి చేసిన సేవ న భూతో న భవిష్యతి. దాని గురించి ఎందరో మహానుభావులు కొనియాడారు. నేను ప్రత్యేకంగా పేర్కొనవలసిన పనిలేదు.

200 పైగా ప్రామాణిక గ్రంథాలను ప్రచురించి చిరస్మరణీయమైన సేవ చేస్తూన్న యువభారతిలో నేను సభ్యుడిగా, భాగస్వామిగా ఉండటం చాలా ఆనందంగాను, గర్వంగాను ఉంది.



# యువభారతితో నేను

జస్టిస్ ఎ.రామలింగేశ్వరరావు
విశ్రాంత హైకోర్టు న్యాయమూర్తి, హైదరాబాద్
93910 02170

యువభారతి అరవై ఏళ్ళ పండుగ సందర్భంగా నా అనుబంధాన్ని గుర్తుచేసుకునే అవకాశాన్ని కల్పించిన కార్యకర్తలకు కృతజ్ఞతలు. చుట్టూరా వున్న చీకటిని పారద్రాలడానికి ఒక చిన్న దీపమైనా వెలిగించాలని, ఎక్కువ మందికి తక్కువ ధరలో ఉత్తమ సాహిత్యాన్ని అందించాలని ఏర్పడిన సంస్థతో నాకు ముప్పై ఏళ్ళ అనుబంధం ఉందని చెప్పవచ్చు. అధ్యక్షులను దృష్టిలో పెట్టుకొని యువభారతి కాల విభజన చేస్తే, కృష్ణమూర్తిగారి కాలం, జి.వి.సుబ్రహ్మణ్యంగారి కాలం, తిరుమల శ్రీనివాసాచార్యగారి కాలం మరియు ఇతరుల కాలంగా విభజించవచ్చు. యువభారతి వెలిగించిన దీపం ఇంతకాలం ఆరకుండా వెలుగుతూనే ఉందంటే ఎంతో మంది కృషి వుంది. దానిలో నా పాత్ర కూడా స్వల్పంగా వుంది.

1977లో నేను ఉద్యోగ రీత్యా హైదరాబాదు వచ్చినపుడు నా వయసు ఇరవై ఒక్క సంవత్సరాలు. హైదరాబాదు వచ్చిన తర్వాత యువభారతి ప్రత్యక్షంగా పరిచయం అయినా పరోక్షంగా 'మహతి' ద్వారా అంతకు ముందే పరిచయం. మహతి ముద్రణకు చేసిన ప్రయత్నాన్ని నిర్మొహమాటంగా ముందు పేజీల్లో వ్రాసిన తీరు నన్నాకర్షించింది. సాహిత్యాభిలాష ఉండబట్టి యువభారతిని వెదుక్కుంటూ వెళ్ళాను. కింగ్ కోఠీ ప్రాంతంలో నివాసం, సాయం కళాశాలలో న్యాయశాస్త్ర అధ్యయనం, అబిడ్స్‌లో కార్యాలయం నన్ను యువభారతి కార్యక్రమాల్లో పాల్గొనడానికి దోహదపడ్డాయని చెప్పవచ్చు. కొత్తగా వచ్చిన వారికి ప్రయోగశాల ఐన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలోని పక్ష సమావేశాలకు హాజరవడం, వక్తృత్వ ప్రదర్శన, రచనా పాటవం ప్రదర్శించడం, చిన్న చిన్న బహుమతులు తీసుకోవడం, 'వేడి వెలుగులు' కవితా సంకలనంలో కవిత్వం ముద్రణ జరగడం ఇవన్నీ జ్ఞాపకాలు.

ఇంతే కాకుండా నలుగురితో కలిసి ఒక కార్యకర్తగా ఎలా పనిచేయాలి, సభాకార్యక్రమాలు క్రమశిక్షణతో ఎలా నిర్వహించాలి, సమయ పాలన విలువ – ఇవి అన్నీ మరచిపోని అనుభూతులు. పనిచేసే కార్యాలయం, నివాసం, చదివే కళాశాల–అన్నీ రెండు కి.మీ. దూరంలోనే ఉండటం, పెళ్ళి కాని వయసు, తీరిక సమయాన్ని సత్సంగత్వానికి దగ్గరగా గడపడం యువభారతి కార్యకలాపాల్లో పాల్గొనడానికి సహకరించాయి. విశ్వనాథం గారి ఉత్సాహం, మిగిలిన మిత్రుల స్నేహం ఒక సహృదయ వాతావరణాన్ని తయారు చేసింది. గోదావరి జిల్లాల 'ఆయ్', 'అండి', లను పూర్తిగా వదలుకోలేకపోయినా, ప్రాంతాల గురించి కాని, కులాల గురించి కాని, మతం గురించి కాని ప్రస్తావన లేని రోజులు విస్తృత కుటుంబాన్ని ఏర్పరచాయి. దానికి తోడు కుటుంబాలతో వనభోజనాలు, కుటుంబ సభ్యులు లేని లోటును తీర్చేవి. ఇలా దాదాపు 1990 వరకు సాగింది.

1989లో పెళ్ళి, న్యాయవాద వృత్తిలో పనిభారం, ఇరివెంటి వారి లాంటి మెత్తటి వ్యక్తి దూరం కావడం, సంసార బాధ్యతల వల్ల యువభారతికి వెచ్చించే సమయం తగ్గినా, దూరం మాత్రం కాలేదు. తేదీలూ, సంవత్సరాలూ గుర్తుపెట్టుకోలేదు కాని, మొదటి నా పదిహేనేళ్ళ ప్రస్థానంలోనే కార్యవర్గంలో ప్రవేశించడం, కార్యదర్శిగా, ఉపాధ్యక్షుడిగా కొంత కాలం బాధ్యత నిర్వహించడం జరిగాయి. యువభారతిలో పదవులు నామమాత్రమే. ఎందుకంటే అందరూ పనులు పంచుకుంటారు కాబట్టి. ఎక్కువ తక్కువ భేదం లేదు. కార్యవర్గ సమావేశాల్లో అందరూ నిర్మొహమాటంగా తమ అభిప్రాయాలు వ్యక్తం చేస్తూ, అప్పుడప్పుడు వ్యక్తిగత ఆవేశం కొందరు ప్రదర్శించినా, చివరికి విశ్వనాథం గారి గద్గద స్వరమో, చెమర్చిన కళ్ళో, అధ్యక్షుల వారి అనునయ వాక్యాలో వాతావరణాన్ని చల్లబరచి ఏకాభిప్రాయం వైపు అందర్నీ నడిపించేవి. ఇటువంటి సంస్కృతికి ఇమిడే వారే వుండేవారు లేకపోతే దూరమయ్యే వారు కాని, పోటీ సంస్థ కాని, చీలిక సంస్థ కాని ఏర్పడలేదు.

యువభారతి సేవలో ఎందరో తరించి కాల ప్రవాహంలో కనుమరుగయినా, ఇప్పటి వృద్ధకార్యకర్తలు కలుసుకునేటప్పుడు ఆప్యాయతల్లో లోటు కనబడదు. ఈ అరవై ఏళ్ళ ప్రస్థానంలో ఎంతో మంది వారి వ్యక్తిగత ఉద్యోగాల్లో ఉద్యోగవిరమణ చేసి, సంసార బాధ్యతల్లో మునిగితేలి, నగరంలో వివిధ దూరప్రాంతాల్లో స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నా, యువభారతి ప్రస్తావన వచ్చినా, సమావేశాల్లో కలుసుకున్నా ఒక కుటుంబసభ్యులే నన్న భావన కనబడుతుంది.

యువభారతికి ఒక పటిష్ఠమైన నిధిని ఏర్పాటు చేయాలనే సంకల్పంతో 2008లో ఒక ధర్మనిధిని ఏర్పాటు చేయడం, దానికి నేను వ్యవస్థాపక కార్యనిర్వాహక ధర్మకర్తృత్వ బాధ్యతను తీసుకోవడం జరిగింది. 2013లో హైకోర్టు న్యాయమూర్తిగా పదవీ బాధ్యతలు తీసుకున్న సందర్భంగా ధర్మనిధి బాధ్యతలకి దూరమవడం, ఇతర కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనకపోయినా, కొన్ని కార్యక్రమాలకు ముఖ్యఅతిథి హోదాలో హాజరు కావడం గర్వకారణం.

సమకాలీనుల్లో వయసు రీత్యా నేను చిన్నవాణ్ణి. ఇప్పటికింకా నా వయస్సు అరవై ఏడే. యువభారతి దీపం కొడిగట్టుందనుకునే సమయంలో చమురు పోసి దీపం ప్రకాశించేటట్టు చేసినవాళ్ళు ఎంతోమంది వున్నారు. ఈరోజు ప్రత్యక్షంగా, పరోక్షంగా యువభారతితో సంబంధం వున్న వాళ్ళు చాలామంది ఆర్థికంగా పరిపుష్టిగా వున్నా, ఆర్థిక, హార్దిక ఉదారతతో బాటు సంస్థల్ని సమర్థవంతంగా నడిపించగల వ్యక్తుల కొరత వుంది. మారిన, మారుతున్న కాలాన్ని గుర్తించాలి. తెలుగుభాషపట్ల నిరాసక్తతను ప్రదర్శిస్తున్న ప్రభుత్వ విధానాలు, తెలుగు భాషకు దూరమవుతున్న తరాలువున్న ఈ కాలంలో యువభారతి రూపాంతరం చెందవలసిన అవసరం వుంది. తెలుగు భాషను, సాహిత్యాన్ని, సంస్కృతిని బతికి బట్టకట్టించాలంటే అంతర్జాలంలో 'నిమజ్జనం' కాక తప్పదు. కరోనా నేర్పిన పాఠాల్లో ఇది కూడా ఒకటి.

సంస్థలతో మమేకమైన వ్యక్తుల జీవితాలు, చరిత్రలు వేర్వేరుగా వుండవు. కలిసే వుంటాయి. యువభారతి మాలాంటి వాళ్ళకి ఒక చక్కటి సాహితీవేదికే కాకుండా మానవ సంబంధాల అనుభవసారం. వ్యక్తుల పరిశీలనా ప్రయోగశాల. కార్యకర్తల శ్రమదానం. కార్యనిర్వాహకుల దృష్టి కోణం చరిత్రకు సాక్ష్యం. విలువలకు నిలువెత్తు అద్దం, గర్వంగా చెప్పుకునే బంధుత్వం. దీని కంతకీ ప్రత్యక్ష సాక్షిగా శ్రీ విశ్వనాథంగారు మనలో వుండడం మన అదృష్టం.

'నందిని' కోసం నార్లవెంకటేశ్వరరావు గారిని ఇంటర్వ్యూ చేయడం నా మరచిపోని సంఘటన. వారు స్వయంగా పుస్తక భాండాగారాన్ని చూపించడం నా దస్తూరీ బాగుందని కితాబివ్వడం మరచిపోలేను.



# స్ఫూర్తిదాయక సంస్థ 'యువభారతి'

డా॥ బ్రాహ్మణపల్లి జయరాములు
విశ్రాంత ఉపన్యాసకులు
99875 11051

అది 1992. తెలుగు భాషా సాహిత్యాలను బోధించే అధ్యాపకునిగా ఎంతోకొంత సాహితీ సేవ చేయాలనే సంకల్పం నాలో కలిగి "కళా కౌముది" అనే సాహితీ సాంస్కృతిక సంస్థను, సహోద్యోగులు, మిత్రులతో కలిసి ఏర్పాటు చేసి మొదటి సభలోనే 'భారతం- కథా పరమార్థం" అనే గ్రంథాన్ని పద్దెనిమిది మంది రచయితలతో తలొక పర్వం వ్రాయించి, ఆవిష్కరింపజేశాం. ఆ గ్రంథాన్ని ఆచార్య సి.నారాయణరెడ్డి గారు ఆవిష్కరించారు. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు సభాధ్యక్షులుగా, ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి లాంటి పెద్దలంతా ఆ సభలో పాల్గొని ప్రశంసించారు. "సాహిత్య సభలకు జనం రారు అనే మాటను కళాకౌముది పరాస్తం చేసింది" అన్నారు సి.నా.రె.గారు.

ఆ తర్వాత మా గురువర్యులు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు నన్ను "యువభారతి"లోకి రమ్మని ఆహ్వానించారు. అది చాలా గొప్పసంస్థగా నాటికే పేరు పొంది ఉండడంవల్ల వెంటనే నేను అంగీకరించాను. నేను మొదట సంయుక్త కార్యదర్శిగా, తరువాత కార్యదర్శిగా "యువభారతి"లో సాహితీసేవచేసే అవకాశం లభించడంతో "కళాకౌముది"ని మామిత్రులకు వదిలేశాను. జి.వి.సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షులుగా నేను కార్యదర్శిగా చాలా కార్యక్రమాలే నిర్వహించాం. ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు నాటి సంస్థ నిర్వహణా కార్యక్రమాల్లో అత్యంత కార్యభారాన్ని వహించేవారు. కామేశ్వరరావుగారు, కె.బి.లక్ష్మిగారు, శ్రీ డి.ఎల్.ఎన్.ప్రసాద్‌గారు ఇప్పుడున్న చాలామంది పెద్దలు నాడు చురుకుగా పనిచేస్తూండేవారు.

నేను ఆ కాలంలో 'యువభారతి' నిర్వహించిన ప్రతి సభలో అతిథులను వేదికమీదకు ఆహ్వానిస్తూండేవాడిని "సమాలోచనం" పేరుతో అనేక గ్రంథావిష్కరణలు, ప్రసంగాలు మనోహరంగా నిర్వహించబడుతూ ఉండేవి. యువభారతిలో నిర్వహించిన ప్రతికార్యక్రమం విశిష్టమైందే! అయితే నన్ను ఒక వక్తగా తీర్చిదిద్దిన కార్యక్రమం, నేను జీవితంలో మరచిపోలేని గొప్ప కార్యక్రమం "విశ్వనాథ సాహితీ సమాలోచనం".

తేది: 4-9-1994 నుంచి 3-9-1995 దాకా ఒక సంవత్సరం పాటు మహాకవి విశ్వనాథ సత్యనారాయణగారి శతజయంతి ఉత్సవాలను 'యువభారతి' ఘనంగా

నిర్వహించింది. ఆంధ్రప్రదేశ్‌లోని సాహితీ దిగ్గంతులంతా ఈ కార్యక్రమాల్లో పాలుపంచుకున్నారు, ప్రసంగాలు చేశారు. ఈ మహా యజ్ఞ నిర్వహణలో నేను కూడా పాల్గొనడం, ఒక ప్రసంగం చేయడం నా అదృష్టంగా భావించాను. చివరి సమావేశంలో "విశ్వనాథ సాహితీ సమాలోచనం" అనే ఉపన్యాస వ్యాస మంజరిని ఆచార్య డా.సి.నారాయణరెడ్డిగారు ఆవిష్కరించారు. 'యువభారతి' తన 32వ వార్షికోత్సవాన్ని ఈ సభలో జరుపుకుంది. ఇలాంటి 'సమాలోచనం' కార్యక్రమాలతోపాటు, అనేక కార్యక్రమాలు నిర్వహిస్తూ 'యువభారతి' సాహిత్య క్షేత్రంలో రాజనాలను పండించిన కవులను గురించి, రచయితలను గురించి, పండితుల గురించి, బహుముఖ ప్రజ్ఞావంతులను గురించి అనేక కార్యక్రమాలను నిర్వహిస్తూ, ఆ ప్రతిభామూర్తులకు 'యువభారతి' నీరాజనాలు అందిస్తూ ఉంది.

సాహితీలోకంలో ఎన్నో సంస్థలున్నా "యువభారతి"కి "యువభారతే సాటి" అని పలువురిచే ప్రశంసలందుకుంది. అలాంటి యువభారతి 'లహరి' ఉపన్యాస కార్యక్రమాలు, తదితర సాహిత్య కార్యక్రమాలు ఆంధ్ర (తెలంగాణ) సారస్వత పరిషత్తు విద్యార్థిగా, ఆ ప్రాంగణంలో ఘనంగా జరగడం చూశాను. జనం స్థలం సరిపోక, గోడలపై, చెట్లపై కూర్చున్న సన్నివేశం ఇంకా నా మదిలో మెదులుతూనే ఉంది. నాకు వైయక్తింగా కార్యక్రమ నిర్వహణా దక్షతను, సందర్భోచిత ప్రసంగ నైపుణ్యాన్ని యువభారతే ప్రసాదించింది. అలాంటి యువభారతి ప్రచురించిన గ్రంథాలను ప్రతి సాహితీవేత్త ఎప్పుడో ఒకప్పుడు తప్పక చదివే ఉంటాడు. ఈ సంస్థ సాహితీవ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దింది.

నా అనారోగ్య పరిస్థితుల రీత్యా 'యువభారతి"కి కొంత కాలం దూరంగా ఉంటున్నప్పటికీ యువభారతిలోని పెద్దలు నన్ను వదిలేయకుండా సంపాదకుడుగా స్వీకరించారు. ఇప్పుడు సుధామ గారి స్థానంలో ప్రధాన సంపాదకునిగా నియమించడం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఇంతటి గొప్ప సంస్థకు "అధ్యక్షుడు" అయ్యే సమయం వచ్చినప్పుడు భయంతో నిరాకరించాను. ఈ సంస్థలోని కార్యవర్గ సభ్యులు, సాధారణ సభ్యులంతా నిబద్ధతతో, నిస్వార్థంగా కృషిచేసేవారు. వారంతా చేసే కృషిలో "నేను పదోవంతు కూడా పనిచేయలేనేమో"! అనే భయంతో అధైర్యంతో నిరాకరించాను. ఓ నాలుగు రోజులు బాధపడ్డా "మంచి పనే" చేశాననిపించింది.

తెలుగు సాహితీ కాసారంలో 'యువభారతి' ఒక సుమనోహర కల్హారం. సాహిత్య నేపథ్యం ఉన్నవాళ్ళూ, లేనివాళ్ళూ ఈ 'సౌగంధికా'నికి ఆకర్షితులు కాకతప్పదు. 'యువభారతి'లోని సభ్యులంతా వృద్ధులైపోతున్నారు కాబట్టి ఇది 'వృద్ధభారతి' అని ఒకరిద్దరు వ్యాఖ్యానించడం విన్నాను. కాని, 'యువభారతి' నిత్యయౌవని. జరుగుతున్న

కార్యక్రమాలు చూస్తే, ఆధునిక సాంకేతికతకు అనుగుణంగా కొంత మార్పులు చేసుకుంటూ, తన ఉనికిని, మూలాలను చక్కగా నిలుపుకుంటూ ముందుకు సాగుతూంది. భారతోపన్యాసలహరి, రామాయణోపన్యాసలహరి కార్యక్రమాలు "యువభారతి" జిగిబిగులను లోకానికి చాటుతున్నాయి.

డా॥ కె.వి.రమణాచారిగారు, డా॥కె.ఐ.వరప్రసాదరెడ్డిగారి లాంటి పెద్దల వెన్నుదన్నుతో ముందుకు సాగుతున్న 'యువభారతి' ఇకముందు సాహితీలోకంలో నిటారుగా నిలిచి, అత్యున్నతమైన కార్యక్రమాలతో సాహితీ ప్రియులను, సాహితీవేత్తలను అబ్బురపరుస్తుందనడంలో అతిశయోక్తిగాని, ఆశ్చర్యంగాని లేదు. ప్రతి తెలుగువాడి జీవితంలో "యువభారతి" ఎప్పుడో ఒకప్పుడు స్మరణీయంగా, అనుసరణీయంగా నిలిచి ఉంటుందనేది నా దృఢ విశ్వాసం–

'యువభారతి' సంస్థకు "షష్టిపూర్తి" జరుగబోతుంది. దాన్ని వజ్రోత్సవ వేడుకగా ఘనంగా జరుపుకుంటూ, చిరస్మరణీయమైన, స్ఫూర్తిదాయకమైన సంచికను వెలువరించాలని కార్యవర్గం నిర్ణయించి, దానికోసం ప్రతి సాహితీస్రష్టను, సాహితీవేత్తను, యువభారతీయుడిని, వ్యాసం వ్రాసి ఇవ్వమనడం, పెద్దల సందేహాలను సేకరించడం ఒక యజ్ఞంలా "యువభారతి" సాగించడం తెలుగు వారంతా గర్వించదగిన విషయం.

నా శక్తిమేరకు (అశక్తుడనైనా) 'యువభారతి' సాహితీసేవలో కొంతమేరకైనా పాలుపంచుకోవడానికి అవకాశం లభించడం ఒక అదృష్టంగా, సదవకాశంగా భావిస్తున్నాను. యువభారతి ప్రతి ప్రచురణా విలువైనదే! నేటి యువతకు తగ్గట్టుగా అశ్వనీకుమార్‌గారి సౌజన్యంతో వాటిని డిజిటలైజేషన్ చేసి అందించడం బహుప్రశంసనీయం. ఆచార్య వంగపల్లి వారి మార్గదర్శనంలో కార్యవర్గమంతా వారి, వారి అభిప్రాయాలను స్వేచ్ఛగా వెల్లడిస్తూనే ఏకాభిప్రాయానికి రావడం చూస్తే ఇదే విధంగా సంస్థ మరో నాలుగు దశాబ్దాలు నడిచి, "శతజయంతి" ఉత్సవాలను ఘనంగా జరుపుకుంటుందనే భావన దృఢంగా కలుగుతుంది.

వ్యక్తులు మారినా, పోయినా సంస్థ నిలచి ఉంటుంది. అదే వ్యవస్థాపకులకు, గతంలో పనిచేసిన కార్యవర్గ సభ్యులకు నేటి వారికీ, రాబోయే వారికీ స్ఫూర్తిని, గౌరవాన్ని కలిగిస్తుందనేది నిర్వివాదాంశం. వజ్రోత్సవాలు జరుపుకుంటున్న సందర్భంగా యువభారతీయులందరికీ మనసావాచా అభినందనలు, పెద్దలకు అభివందనాలర్పిస్తున్నాను.

*"సర్వేభవంతు సుఖినః, సర్వే సంతు నిరామయాః !*
*సర్వే భద్రాణి పశ్యంతు, మాకశ్చిద్దుఃఖ భాగ్భవేత్॥ "*



# యువభారతి - నేను

డా॥ ఆచార్య ఫణీంద్ర
కవి, విశ్రాంత వైజ్ఞానిక అధికారి, అణు ఇంధన సంస్థ, హైదరాబాద్
99598 82963

అది 1993. నా తొలి ముద్రిత గ్రంథం "ముకుంద శతకం" వెలువడిన సంవత్సరం. కులశేఖర ఆళ్వార్ రచించిన ప్రసిద్ధ సంస్కృత భక్తిమయ గ్రంథం "ముకుందమాల"కు కందపద్యాలలో అనుసృజనగా నేను వెలువరించిన శతక కృతి అది. ఉత్సాహవంతుడనైన యువకవిగా నా ఆ గ్రంథాన్ని పలువురు లబ్ధప్రతిష్ఠులైన పండితులకు, కవులకు అందించి ఆశీస్సుల నందుకోవాలన్న ప్రయత్నంలో భాగంగా ఒకరోజు హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయానికి వెళ్ళి, అక్కడ తెలుగు శాఖాధ్యక్షులుగా ఉన్న ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారిని దర్శించుకొన్నాను. ఆయనకు నా గ్రంథాన్ని అందజేయగానే, అయన ఆ గ్రంథాన్ని అక్కడికక్కడే రెండు మార్లు అటు ఇటు తిరగేసి, "మంచి ధార, చక్కని పదగుంఫనంతో ఉన్నాయి మీ పద్యాలు. మీరెందుకు మా 'యువభారతి'లో చేరరు?" అన్నారు. వృత్తిరీత్యా "అణు ఇంధన సంస్థ"లో ఇంజనీరుగా ఉన్న నేను సాహిత్య లోకానికి నన్ను నేను అప్పుడప్పుడే పరిచయం చేసుకొంటున్నాను కాబట్టి – కాస్త అయోమయంగా "నాకు తెలియదండి" అన్నాను. ఆయన ఒకింత ఆశ్చర్యంగా చూసి, "లేదు.. లేదు.. మీ వంటి యువకుల అవసరం యువభారతికి ఉంది" అని చెప్పి, "సాయంత్రం ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణంలో యువభారతి పుస్తక విక్రయ కేంద్రానికి రండి – అక్కడ కలుద్దాం" అన్నారు. "సరేనండి" అని నమస్కారం సమర్పించి, ఇంటికి తిరిగి వచ్చాను.

ఆ రోజు శనివారం. సాయంత్రం నా గ్రంథ ప్రతులు మరికొన్ని పట్టుకొని బొగ్గులకుంటలో ఉన్న యువభారతి పుస్తక విక్రయ కేంద్రానికి వెళ్ళాను. అప్పటికే సుబ్రహ్మణ్యం గారు అక్కడ కూర్చొని ఉన్నారు. మరికొందరు సభ్యులు కూడ ఉన్నారు. ఎదురుగా ఉన్న ర్యాక్ లో అనేక ఆకర్షణీయమైన శీర్షికలతో ఉన్న సాహిత్య

గ్రంథాలున్నాయి. నా ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. పిల్ల కాలువగా వచ్చిన నాకు ఒక సాహితీ మహా సముద్రాన్ని చేరుకొన్న అనుభూతి కలిగింది. సుబ్రహ్మణ్యం గారు అక్కడ ఉన్న యువభారతి సభ్యులను ఒక్కొక్కరినీ పరిచయం చేస్తున్నారు. కె.వి కామేశ్వరరావు గారు, కె.బి. లక్ష్మి గారు, డి.ఎల్.ఎన్ ప్రసాద్ గారు, రెడ్డి రాఘవయ్య గారు, ఎస్. నారాయణ రెడ్డి గారు ... అందరూ నా కంటె కనీసంగా పది, పదిహేను సంవత్సరాలు పెద్దవారు. చేతులు కలుపుతున్నాను .. కానీ ఏం జరుగుతుందో అర్థం కావడం లేదు. "ఈయన చక్కని పద్య కవి .. మన యువభారతి నూతన సభ్యుడు" అని సుబ్రహ్మణ్యం గారు నన్ను వారికి పరిచయం చేసారు. అంతలో జయరాములు గారు వచ్చారు. ఆయన సంస్థ కార్యదర్శిగా పరిచయమయ్యారు. పుస్తక విక్రయ కార్యాన్ని నిర్వహిస్తున్న కృష్ణమూర్తి గారిని మేనేజరుగా పరిచయం చేసారు.

సుబ్రహ్మణ్యం గారు వెళ్ళిపోయాక కూడ చాల సేపు అందరం కలిసి కూర్చొని మాట్లాడుకొన్నాం. హెచ్.ఎం.టి. సంస్థలో ఇంజనీరుగా పనిచేస్తున్న కామేశ్వరరావు గారికి నేను బాగా కనెక్ట్ అయ్యాను. కె.బి. లక్ష్మి గారు ఆయన సతీమణి అని, మంచి రచయిత్రి అని తెలిసింది. సభ్యులంతా ప్రతి శనివారం అక్కడ కలుసుకొంటూ ఉంటామని చెప్పారు. చాల ఆనందంగా రాత్రి ఇంటికి చేరుకొన్నాను. మా నాన్న గారు, మా అన్నయ్య కు "యువభారతి"లో చేరిన విషయం చెప్పాను. వారు చాల సంతోషించి నా వెన్ను తట్టారు. ఉస్మానియాలో మెడిసిన్ చదివిన మా అన్నయ్య తన వద్ద ఉన్న "మందార మకరందాలు", "జీవన గీత" మొదలైన యువభారతి ప్రచురణలను నాకిచ్చి చదువుమన్నాడు. ఆ రాత్రి చాల సేపు ఆ గ్రంథాలు చదువుతూనే ఉన్నాను. గుండె నిండా "యువభారతి" నిండిపోయింది. ఆ మధురానుభూతిలో తేలిపోతూ చాల ఆలస్యంగా నిద్రలోకి జారుకొన్నాను.

మళ్ళీ శనివారంకై ఎదురుచూస్తూ ఆ వారం గడిపాను. "యువభారతి" గ్రంథాలను మాత్రం వదలడం లేదు. ఆఫీసుకు వెంట తీసుకొని వెళ్ళేవాణ్ణి. ఒకటి రెండు సంవత్సరాల తేడాతో దాదాపుగా యువభారతి వయస్సే నా వయస్సు. అయినా .. సంస్థలోని సీనియర్ సభ్యులందరూ నన్ను ఎంతో ఆప్యాయంగా అక్కున చేర్చుకొన్నారు. ప్రతి గ్రంథంలో ఎక్కడో ఒకచోట – "చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా

వెలిగించడం మంచిది" అన్న సూక్తి కనిపించగానే .. నాలో ఏదో కొత్త దీపాన్ని వెలిగించుకొన్న అనుభూతి కలిగేది. యువభారతి గురించి తలచుకోగానే – ఏదో తెలియని ఉత్సాహం .. ఆనందం ... నిలువెల్ల ఆవరించేది.

ఆపై వచ్చిన శనివారం సాయంత్రం ఆఫీస్ నుండి డైరెక్ట్ గా యువభారతి మిత్రులను కలిసేందుకు వెళ్ళాను. కామేశ్వరరావు గారు ఆత్మీయంగా పలుకరించారు. ఆయన మార్గదర్శనంలో శాశ్వత సభ్యత్వ రుసుమును కట్టి, అధికారికంగా యువభారతి సభ్యుణ్ణి అయ్యాను. మేనేజర్ కృష్ణమూర్తి గారు ఆ రుసుముకు సరిపడా యువభారతి ప్రచురణలను ఉచితంగా తీసుకోవచ్చని చెప్పారు. "కావ్యలహరి", "కవి సమయములు", "తెలుగు కవిత – లయాత్మకత" మొదలైన గ్రంథాలను ఆనందంగా స్వీకరించాను.

ఆ రోజు తిరుమల శ్రీనివాసాచార్య గారు, ఎస్. వేంకటేశ్వరరావు గారు, కుమార స్వామి నాయుడు గారు, తాళ్ళపల్లి మురళీధర్ గౌడ్ గారు మొదలైన మరికొందరు సభ్యులు కూడ పరిచయమయ్యారు. కామేశ్వరరావు గారు ప్రతి శనివారం తాను తప్పక వస్తానని, నన్నూ తప్పక రమ్మని చెప్పారు. ఆ రోజు కామేశ్వరరావు గారు యువభారతి కి వివిధ ప్రాంతాల నుండి వచ్చిన లేఖలకు నా చేత ప్రత్యుత్తరాలు వ్రాయించారు. ప్రతివారం అది నా బాధ్యతగా ఆయన నిర్దేశించారు. ఆ పైన ప్రతి శనివారం వెళ్ళగానే కృష్ణమూర్తి గారిని అడిగి వచ్చిన లేఖలను తీసుకొని, ప్రత్యుత్తరాలు వ్రాసి ఆయనకు పోస్ట్ చేసేందుకుగాను అప్పజెప్పడం చేసేవాణ్ణి.

వారం వారం వెళ్ళినప్పుడల్లా సభ్యులంతా సంస్థ పూర్వాధ్యక్షులు డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారి ఔన్నత్యాన్ని గురించి, సంస్థను క్రమశిక్షణతో ఆయన నిర్వహించిన చాకచక్యాన్ని గురించి చెప్పి, ఆయన అకాల మరణాన్ని గురించి వివరిస్తూ బాధ పడుతూ ఉండేవారు. సంస్థ సభ్యులలో సీనియర్లు, జూనియర్లు అంటూ ఏమీ లేదని, కార్యక్రమాల నిర్వహణలో అందరూ కుర్చీలు వేస్తూ, బ్యానర్లు కట్టడానికి ముందుంటారని చెప్పుతూ ఉండే వారు. ఆ రకంగా సంస్థ సభ్యులందరితో నాకు చనువు, ఆత్మీయత ఏర్పడింది. అందరితో బాటు నాకు కామేశ్వరరావు గారితో మరింత ఆత్మీయ అనుబంధం పెనవేసుకొంది. బహుశః ఇద్దరం మెకానికల్ ఇంజనీర్లమై కూడ సాహిత్యారాధకులం కావడం కారణమేమో!

ఆ రోజులలో ఒక గమ్మత్తైన సంఘటన జరిగింది. కామేశ్వరరావు గారి ద్వారా నాకు వైద్య వృత్తిలో ఉన్న యువభారతి సభ్యులు డా. నాగినేని భాస్కరరావు

గారు పరిచయమయ్యారు. అప్పుడు నేను నా "ముకుంద శతకం" గ్రంథాన్ని ఆయనకు ఇచ్చాను. ఆయన గ్రంథంపై ఉన్న శ్రీకృష్ణుని చిత్రాన్ని చూసి, ఏ మాత్రం మొహమాటం లేకుండా – "నేను ఇటువంటి సాహిత్యం చదువను" అంటూ వెంటనే వెనుకకు ఇచ్చేసారు. నాకేమి అర్థం కాక అయోమయంలో పడ్డాను. అప్పుడు కామేశ్వరరావు గారు నన్ను ఒక పక్కకు కొనిపోయి – "ఆయనంతే! ఆయనది కమ్యూనిస్ట్ భావజాలం. భక్తి రచనలు చదువడు" అని చెప్పారు. అంతే కాదు .. యువభారతి లో అన్ని రకాల భావజాలాలు ఉన్నవారున్నారని, యువభారతి అన్ని భావజాలాలను సమానంగా గౌరవిస్తుందని వివరించారు. అందుకు ఉదాహరణగా యువభారతి ప్రచురించిన ప్రసిద్ధ గ్రంథం "మహతి" లో అటు విశ్వనాథ వారి వ్యాసం, ఇటు శ్రీశ్రీ గారి వ్యాసం పక్కపక్కనే ప్రచురించారని చూపారు. ఆ సమ దృష్టిని చూసాక యువభారతి పై నాకు మరింత గౌరవం పెరిగింది.

అంతలోనే కొన్ని రోజులకే .. యువభారతి అధ్యక్షులు జి.వి. సుబ్రహ్మణ్యం గారి ఆధ్వర్యవంలో సంస్థ సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. ఆ సందర్భంగా నాకు యువభారతి సమావేశకర్త వంగపల్లి విశ్వనాథం గారి దర్శనం అయింది. కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి శతజయంతి సందర్భంగా సంవత్సర కాలం పాటు యువభారతి విశిష్ట కార్యక్రమంగా నిర్వహించాలని ప్రతిపాదించిన "విశ్వనాథ సాహితీ సమాలోచనం"లో యువ సభ్యుల ప్రాతినిధ్యం అవసరమంటూ, సుబ్రహ్మణ్యం గారు ఆ ఎన్నికలలో నన్ను సంస్థ "సంయుక్త కార్యదర్శి" గా నియమించారు. సంస్థ సభ్యులందరి ఆమోదంతో అనతి కాలంలోనే కార్యవర్గ సభ్యునిగా ఎదగడం నాకు మహదానందాన్ని కలిగించింది.

ఆ పైన నెల నెలా జరిగే "విశ్వనాథ సాహిత్య సమాలోచన సభల" లో సీనియర్ సభ్యుల సూచనల మేరకు నా వంతు బాధ్యతలను నిర్వహించేవాడిని. ముఖ్యంగా సభ జరుగుతున్నపుడే ప్రెస్ కవరేజ్ కోసం రైటప్ వ్రాసి విలేకరులకు అందించవలసిన బాధ్యతను కొన్నిసార్లు నేను ఎంతో సంతోషంగా నిర్వహించే వాణ్ణి. కొన్ని సభలలో ఆపద్ధర్మంగా నన్ను ప్రార్థనాశ్లోకాన్ని ఆలపించవలసిందిగా కార్యదర్శి జయరాములు గారు కోరారు. నా గొంతు బాగుందని, చక్కగా ఆలపించానని కొందరు సభ్యులు చేసిన ప్రశంసలు ఆ రోజులలో నా కెంతో ప్రోత్సాహకరంగా ఉండేవి. ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య, ఆచార్య రవ్వా శ్రీహరి, ఆచార్య నాయని కృష్ణకుమారి,

డా. ముక్తేవి భారతి, శ్రీ పేరాల భరతశర్మ, శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య, శ్రీ విశ్వనాథ పావనిశాస్త్రి, డా.వి.వి.ఎల్. నరసింహారావు, శ్రీ పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి మొదలైన లబ్ధప్రతిష్ఠుల ప్రసంగాలతో సంవత్సరం పాటు సాగిన ఆ కార్యక్రమం యువభారతి ప్రఖ్యాతిని మరింత ఇనుమడింపజేసింది. ఆనాడు రైల్వే అధికారిగా ఉన్న సంస్థ సీనియర్ సభ్యులు శ్రీ ఆంజనేయశర్మ గారు ఈ సభల నిర్వహణకు కావలసిన ఆర్థిక వనరులను సాధించడంలో విశేష కృషిని చేసారని సభ్యులందరూ ప్రశంసించారు. సంవత్సరాంతంలో ఆ ప్రసంగాలన్నిటినీ కూర్చి మహాకవి విశ్వనాథ వారి సాహిత్యంపై రూపొందిన గ్రంథం యువభారతి వెలువరించిన విశిష్ట గ్రంథాలలో ఒక మణిపూసగా రాజిల్లింది.

తరువాత కొన్ని రోజులకు యువభారతి పత్రిక “నందిని”ని త్రైమాసిక పత్రికగా పునరుద్ధరించాలని నిర్ణయించడం జరిగింది. ఆ సందర్భంగా సుధామ గారితో పరిచయ భాగ్యం కలిగింది. కామేశ్వరరావు గారి ప్రోత్సాహంతో “నందిని” పత్రికలో నేను “మాట – ఆట” పేరిట తెలుగు పదాల “క్రాస్ వర్డ్ పజిల్” ను ధారావాహికంగా నిర్వహించడం నాకెంతో తృప్తిని ఇచ్చింది. నందిని త్రైమాస పత్రిక అనతి కాలంలోనే అందరి ఆదరాభిమానాలను చూరగొన్నది. ఒక సాహిత్యకారునిగా ఆ పత్రికలో నేను కొందరు రచయితలు పంపిన గ్రంథాలకు సమీక్షా వ్యాసాలను వ్రాయడం జరిగింది. పత్రిక ముద్రణ సమయంలో ఇద్దరు ముగ్గురు సభ్యులం కలిసి ప్రూఫులు దిద్దే వాళ్ళం. అదే సమయంలో నెల కొకమారు ఆదివారం మధ్యాహ్నం శ్రీకృష్ణదేవరాయ భాషా నిలయంలో యువభారతి “క్లుప్త గోష్ఠి” కార్యక్రమాన్ని నిర్వహిస్తూ ఉండేది. క్రమంగా ఆ కార్యక్రమానికి వెళుతున్న నాకు యువభారతి వ్యవస్థాపక సభ్యులైన వంగపల్లి విశ్వనాథం గారితో, సభ్యులు ఆమాతి రవీంద్ర గారితో, మాడభూషి అనంతాచార్య గారితో చక్కని సాన్నిహిత్యం ఏర్పడింది. “క్లుప్త గోష్ఠి”లో చీటీల ద్వారా అప్పటికప్పుడు వచ్చిన అంశంపై 2 నిమిషాల పాటు నిరంతరాయంగా, విషయ ప్రాధాన్యంతో ప్రసంగించడం ఒక విచిత్రానుభూతి. అప్పుడప్పుడు ప్రత్యేక అంశంగా ఒక ప్రాచీన పద్యాన్ని తీసుకొని వ్యాఖ్యానంతో ప్రసంగించడం కూడ నాకు ప్రాప్తించిన సౌభాగ్యం. మధుర స్మృతులుగా ఇప్పటికీ అవన్నీ నా మదిలో మెదులుతూ ఉంటాయి.

తరువాత జరిగిన సంస్థ ఎన్నికలలో కవిగా నాకు గురుతుల్యులు, ఆత్మీయులు అయిన డా. తిరుమల శ్రీనివాసాచార్య గారు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. ఎస్.

వేంకటేశ్వరరావు గారు కొన్నాళ్ళు, రెడ్డి రాఘవయ్య గారు కొన్నాళ్ళు కార్యదర్శిగా వ్యవహరించారు. నేను సంయుక్త కార్యదర్శిగా కొనసాగాను. 1997 – భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సరం. ఆ సందర్భంగా యువభారతి వినూత్న కార్యక్రమాన్ని చేపట్టింది. రాష్ట్ర వ్యాప్త యువ కవుల నుండి దేశభక్తి పూరిత కవితలను ఆహ్వానించి “స్వాతంత్ర్య స్వర్ణ భారతి – యువకవితా హారతి” అన్న గ్రంథాన్ని యువభారతి ప్రచురించింది. అందులో నా కవిత కూడ చోటు చేసుకోవడం చాల ఆనందాన్ని కలిగించింది. అంతే కాదు. ఆ గ్రంథ ముద్రణ సమయంలో ప్రూఫులు దిద్దడంతోబాటు, పద్య కవితలను సరిచూచిన నా పేరు, శీలా వీర్రాజు గారు, డా. తిరుమల శ్రీనివాసాచార్య గారి వంటి ప్రముఖులతోబాటు సంపాదక వర్గంలో స్థానం పొందడం మరింత ఆనందాన్ని కలిగించింది.

ఆ మరుసటి సంవత్సరం డా. జి. కుమార స్వామి నాయుడు గారు తన పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథం – “దివాకర్ల వేంకటావధాని జీవితం – సాహిత్యం”ను యువభారతి ప్రచురణగా వెలువరించారు. ఆ సందర్భంలో దివాకర్ల వారు యువభారతి వేదికపై నుండి ప్రాచీన కావ్యాలపై చేసిన ప్రసంగ కార్యక్రమాలకు విచ్చేసిన క్రిక్కిరిసిన జన సందోహం గురించి, వారి ప్రసంగాలకు ఆనాటి శ్రోతలు అత్యంత పారవశ్యంతో ఓలలాడిన వైనాన్ని గురించి – సభ్యులందరి ద్వారా తెలుసుకొని ఆశ్చర్యానందాలకు లోనయ్యాను. అదే సమయంలో కుమార స్వామినాయుడుగారు దివాకర్ల వారి స్మారక ట్రస్ట్ ను యువభారతి అధ్యక్షునికి కూడ ప్రాతినిధ్యం కల్పిస్తూ ఏర్పాటు చేయడం జరిగింది. అదే పద్ధతిలో యువభారతి పేరిట కూడ ఒక ట్రస్ట్‌ను రూపొందించడం జరిగింది. ఆ సమయంలోనే నాకు అప్పుడు న్యాయవాదిగా ఉన్న ప్రస్తుత విశ్రాంత హైకోర్ట్ న్యాయమూర్తి జస్టిస్ శ్రీ రామలింగేశ్వరరావుగారితో పరిచయం కలిగింది. ఈ రెండు ట్రస్టులు ఏర్పడ్డాక యువభారతి ప్రతి సంవత్సరం ఇరివెంటి కృష్ణమూర్తి గారి జయంతి సభను, దివాకర్ల ట్రస్ట్ సౌజన్యంతో దివాకర్ల వారి జయంతి సభను నిర్వహిస్తూ ప్రఖ్యాతులైన సాహితీవేత్తలకు పురస్కారాలను ప్రదానం చేస్తూ వస్తున్నది. అట్లా ప్రతి సంవత్సరం జరుగుతున్న యువభారతి పూర్వాధ్యక్షులు కీ.శే. ఇరివెంటి కృష్ణమూర్తి గారి జయంతి సభలో, వారి అబ్బాయి శ్రీ ఇరివెంటి శ్రీధర్ గారిని కలుస్తూ ఉండడంతో, ఆయనతో నాకు ఆత్మీయ మైత్రి ఏర్పడింది.

ఆ తరువాతి కాలంలో జరిగిన ఎన్నికలలో మాడభూషి అనంతాచార్య గారు అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు. నన్ను కార్యదర్శిగా ప్రధాన బాధ్యతలు నిర్వహించవలసిందిగా కొందరు సీనియర్లు ఒత్తిడి చేసారు. కానీ, ఉద్యోగ బాధ్యతలలో తీరిక లేకుండా ఉండడమే కాకుండా, కవిగా అనేక ఇతర సంస్థలు నిర్వహించే కవి సమ్మేళనాలలో, ఇతర కార్యక్రమాలలో పాల్గొంటూ ఉన్న నేను, ఆ పదవికి న్యాయం చేయలేనని వెనుకంజ వేసాను. సంస్థలోని చాల మంది సభ్యులంతా నేను నగరంలో, రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలలో జరిగే అనేక సాహిత్య కార్యక్రమాలలో తరచుగా పాల్గొంటూ ఉన్న సంగతి చూస్తూ ఉండడంతో సహృదయతతో మన్నించారు. అప్పుడు .. ఆనాటి సంస్థ సభ్యులలో ఒకరైన పరవస్తు కృష్ణస్వామి గారు కొన్నాళ్ళు ఆ బాధ్యతలు నిర్వహించారు. కె.బి. లక్ష్మి గారిని, నన్ను ఉపాధ్యక్షులుగా నియమించారు. ప్రముఖ కవి, ఆకాశవాణి కార్యక్రమ నిర్వహణాధికారి సుధామ గారు సంస్థ ప్రచురణల ప్రధాన సంపాదకులుగా బాధ్యతలను చేపట్టారు.

2002 సంవత్సరంలో యువభారతి తెలుగు సాహిత్యంలో హాస్య రచయితలు, వారి రచనలపై ప్రముఖ సాహితీ మూర్తుల చేత ప్రసంగ కార్యక్రమాలను నిర్వహించి, ఆ పైన "హాస్య లహరి" పేరిట ఒక చక్కని గ్రంథాన్ని వెలయించడం జరిగింది. 2003 లో డా. నాగినేని భాస్కరరావు గారు రచించిన "నవ జీవనం" గ్రంథావిష్కరణ సభలో తొలిసారిగా నేను యువభారతి వేదికపై గ్రంథ సమీక్షకునిగా పాల్గొని ప్రసంగించాను. ఆనాటి నా ప్రసంగాన్ని కె.బి. లక్ష్మి గారు, ఇతర పెద్దలు ప్రశంసించి నన్ను ప్రోత్సహించారు.

ఆ పైన సంస్థ వరిష్ఠ సభ్యులు శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు గారు కార్యదర్శిగా బాధ్యతలు చేపట్టి, అనేక కార్యక్రమాలను నిర్వహించడానికి దోహదపడ్డారు. అనంతాచార్య గారు రచించిన "అనంత గీత", చేగొండి రామజోగయ్య గారు రచించిన "చేగొండి కథా కదంబం", అయ్యదేవర పురుషోత్తమరావు గారు రచించిన "శ్రీకృష్ణదేవరాయలు" నవల, నాగేశ్వరరావు గారు రచించిన ''మరో జంఘాల శాస్త్రి" వ్యాస సంపుటి.. ఇట్లా చాల వైవిధ్యభరితమైన మంచి గ్రంథాలను ఆ కాలంలో (2007 – 2009) యువభారతి ప్రచురించి పాఠక లోకానికి అందించింది. ఆ సమయంలో "బాలానందం" సంస్థలో ప్రధాన భూమికను నిర్వహిస్తున్న పూర్ణచంద్రరావు గారు యువభారతిలో క్రియాశీలక సభ్యులుగా చేరి అనేక సేవల నందించారు.

యువభారతి నిర్వహించిన విశిష్ట కార్యక్రమాలలో ప్రత్యేకంగా పేర్కొనదగినవి "వేద విజ్ఞాన లహరి" మరియు "ఉపనిషద్సుధా లహరి". తిరుమల తిరుపతి దేవస్థానం వారి సౌజన్యంతో నగరంలోని 'బాలాజీ భవన్" లో అనేకులైన సంస్కృతాంధ్ర వేద పండితుల చేత "వేద విజ్ఞాన లహరి" ప్రసంగ కార్యక్రమాలను నిర్వహించడమే కాకుండా, ఆ ప్రసంగ పాఠాలతో గ్రంథాన్ని వెలువరించడం జరిగింది. అట్లాగే డా. పుల్లెల శ్రీరామచంద్రుడు, రవ్వా శ్రీహరి, మసన చెన్నప్ప గార్లు వంటి ప్రముఖుల ప్రసంగాలతో "ఉపనిషద్సుధా లహరి" గ్రంథం రూపొందింది. ఈ రెండు గ్రంథాలు యువభారతి ప్రచురణలలో – హైందవ సంస్కృతి గరిమను చాటే బృహత్ గ్రంథాలుగా రూపుదిద్దుకొన్నాయి. ఆ తరువాత డా. తిరుమల శ్రీనివాసాచార్య గారు రచించిన "దివాకర ప్రభ", "దాశరథి కవితా వైభవం", నాగినేని భాస్కరరావు గారు రచించిన "నగరం నిద్రపోదు" గ్రంథాలు యువభారతి ప్రచురణలుగా వెలువడ్డాయి.

ఆ మధ్య కాలంలోనే దురదృష్టవశాత్తు యువభారతి వరిష్ఠ సభ్యులు కె.వి. కామేశ్వర రావు గారు, అటు తరువాత డా. నాగినేని భాస్కరరావు గారు పరమపదించడం సంస్థ సభ్యులకు, ముఖ్యంగా వ్యక్తిగతంగా నాకు అశనిపాతంలా తగిలి, కోలుకోలేని బాధను మిగిల్చింది. సంస్థలో కొంత స్తబ్ధత నెలకొంది. ఆ సమయంలో ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారు ప్రతి నెలా మొదటి ఆదివారం నగర కేంద్ర గ్రంథాలయంలో విద్యార్థులకు, యువకులకు యువభారతి ద్వారా వ్యక్తిత్వ వికాస పాఠాలను బోధిస్తూ సామాజికోద్ధరణకు కృషి చేశారు. ఆమాతి రవీంద్ర గారు వారికి అన్ని విధాలుగా తోడ్పడుతూ కార్యక్రమాలను క్రిక్కిరిసిన యువ శ్రోతలతో విజయవంతంగా నిర్వహించారు. నేను నాకు వీలయినప్పుడల్లా పాల్గొంటూ, ఆ కార్యక్రమాలలో నాకు తోచిన ప్రసంగాలను చేస్తూ ఉండేవాడిని. యువభారతి 2017, 2018 సంవత్సరాలలో "మీ మార్గం – మీ గమ్యం", "వ్యక్తిత్వ వికాసం" అన్న గ్రంథాలను తెలుగుతో బాటు ఆంగ్లంలోనూ ప్రచురించి యువ పాఠక లోకానికి సేవలందించింది.

2018 లో అధ్యక్షులు మాడభూషి అనంతాచార్య గారు అనారోగ్య కారణంగా బాధ్యతల నుంచి తప్పుకోవాలని నిర్ణయించడం వలన ఎన్నికలు నిర్వహించడం జరిగింది. ఆ ముందు రోజు రాత్రి పూర్ణచంద్రరావు గారు నన్ను సంస్థ ప్రధాన బాధ్యతలు చేపట్టడానికి సిద్ధమై రావాలని కోరారు. నేను కూడ ఉద్యోగ విరమణకు చేరువలో ఉండడం మూలాన కార్యదర్శిగా బాధ్యతలు చేపట్టడానికి సిద్ధమై ఎన్నికల

సమావేశానికి వెళ్ళాను. కానీ అనూహ్యంగా పెద్దలు వంగపల్లి విశ్వనాథం గారు నన్ను యువభారతి అధ్యక్షునిగా ప్రతిపాదించడం .. సభ్యులంతా వెంటనే ఆమోదించడం జరిగిపోయింది. కాసేపు ఆశ్చర్యంలో ఆ పైన .. ఇరివెంటి కృష్ణమూర్తి గారు, జి.వి. సుబ్రహ్మణ్యం గారు, తిరుమల శ్రీనివాసాచార్య గారు, మాడభూషి అనంతాచార్య గారి వంటి సాహితీ వేత్తలు, పెద్దలు నిర్వహించిన బాధ్యతలను నేను నిర్వహించగలనా – అని సందేహంలో మునిగినా, తరువాత నేను అది విశ్వం గారి రూపంలో సరస్వతీ మాత ఆదేశంగా భావించి బాధ్యతలను స్వీకరించాను. కార్యదర్శిగా వరిష్ఠ సభ్యులు శ్రీ జీడిగుంట వెంకట్రావు గారు బాధ్యతలను చేపట్టారు. ఆ సమయంలో నా మదిలోని భావాలను ఇట్లా పద్యాలుగా మార్చి, సంస్థ పెద్దలకు విన్నవించుకొన్నాను –

చం. “పలువురు గూడి నన్ను ‘యువభారతి’ నాయక పీఠమందునన్
వెలయగ జేసినారు! అది వేల్పు సరస్వతి యాజ్ఞగా మదిం
దలచుచు శక్తి మేర కృషి తప్పక సల్పెద, సంస్థ కున్న యా
విలువల గాచుచున్ సతము, విజ్ఞులు, పండితు లెల్ల మెచ్చగాన్!

ఆ.వె. చుట్టు నావరించు దట్టమౌ చీకటిన్
తిట్టిపోయు కన్న, తిమిర మార్ప –
చిట్టి దీప శిఖను చివురింప జేయగా
కట్టుకొంటి నేను కంకణమును!

కం. ఓ హితవరులారా! ఓ
సాహిత్య ప్రముఖులార! సత్కవులారా!
సాహెూ యని ప్రార్థింతును
సౌహిత్యము జూపి నాకు సహకార మిడన్!”

నేను అధ్యక్షునిగా బాధ్యతలు స్వీకరించిన సంవత్సరంలోనే దేశమంతటా గాంధీ మహాత్ముని 150 వ జయంతి ఉత్సవాలు ప్రారంభమయ్యాయి. యువభారతి కూడ మహాత్మునికి నివాళిగా అనేక కార్యక్రమాలకు రూపకల్పన చేసింది. సంస్థ

ప్రచురణ ప్రధాన సంపాదకులు సుధామ గారు సేకరించి సంకలనం చేసిన "గాంధీ మహా(త్ముని) సూక్తులు" అన్న గ్రంథం లక్ష ప్రతులను ముద్రించి అతి తక్కువ ధరకు, కొన్ని సందర్భాలలో ఉచితంగా కూడ పంపిణీ చేసింది. ఆ సూక్తులపై జంట నగరాలలోని కళాశాల విద్యార్థులకు వక్తృత్వ పోటీలను, వ్యాస రచన పోటీలను నిర్వహించి బహుమతి ప్రదానం చేయడం జరిగింది. యువ కవుల చేత మహాత్మునిపై రాష్ట్ర స్థాయి కవి సమ్మేళనం నిర్వహించి, ఆ కవితలతో "గాంధీ సందేశ పథం" అన్న గ్రంథాన్ని ప్రచురించడం జరిగింది. అప్పటి తెలంగాణ రాష్ట్ర అధికార భాషా సంఘం అధ్యక్షులు శ్రీ దేవులపల్లి ప్రభాకరరావు గారు రచించిన "అమరుడు బాపూజీ" గ్రంథాన్ని యువభారతి ప్రచురించి పాఠక లోకానికి అందించింది. ఇన్ని వైవిధ్య భరిత కార్యక్రమాలతో ఆ శాంతిదూతకు సముచితమైన శ్రద్ధాంజలి ఘటించినందుకు యువభారతి గర్విస్తున్నది.

2019 లో యువభారతి – ప్రముఖ కవి, రచయిత "విహారి" గారు రచించిన "తెలుగు వారి నాల్కలపై నడయాడిన నాటక పద్యాలు" అన్న గ్రంథాన్ని వ్యాఖ్యాన సహితంగా ప్రచురించి పద్య కవితాభిమానులైన పాఠకులకు అందించింది. అట్లాగే డా. పుట్టపర్తి నాగపద్మిని గారు రచించిన "పుంభావ సరస్వతి పుట్టపర్తి" డా. తిరుమల శ్రీనివాసాచార్య గారు రచించిన "అభినవ పోతన వానమామలై" అన్న గ్రంథాలను ప్రచురించి ఆ మహాకవులకు నీరాజనాలను సమర్పించింది. ఈ గ్రంథాలన్నింటి ముద్రణలో ప్రధాన సంపాదకులు సుధామ గారు చేసిన కృషి విశేషమైనది. సుధామ గారు స్వయంగా విద్యార్థి యువత కోసం రచించిన "తెలుగు సొగసులు" అన్న గ్రంథం యువభారతి ప్రచురణగా వెలువడి పాఠకులను అలరించింది. ఇంకా వేయికి పైగా సూక్తులను సంకలనం చేయబడిన గ్రంథం – "విజయ పథం", శ్రీ చేగొండి రామజోగయ్య గారు రచించిన "చేగొండి కథా కదంబం" (2, 3 భాగాలు), శ్రీ ఎర్రాప్రగడ రామకృష్ణ గారు రచించిన "నేర్పుగా జీవించడం ఎలా?" మొదలైన గ్రంథాలు కూడ ఈ పరంపరలో యువభారతి ప్రచురణలుగా వెలువడ్డాయి. ఈ గ్రంథాల ఆవిష్కరణ సభలు మరియు ఇతర కార్యక్రమాలన్నీ నిర్వహించేందుకు వంగపల్లి విశ్వనాథం గారి మార్గదర్శనం, సంస్థ ఉపాధ్యక్షులు శ్రీ అయల సోమయాజుల నాగేశ్వరరావు గారు, కార్యదర్శి వెంకట్రావు గారు, ఇతర వరిష్ఠ సభ్యుల కృషి, సహకారం బహుధా ప్రశంసనీయం.

2020 సంవత్సరంలో ప్రపంచాన్ని కోవిడ్ మహమ్మారి పట్టి పీడిస్తుంటే, యువభారతి సంస్థ డిజిటల్ మాధ్యమం ద్వారా వినూత్న ప్రయోగాలకు శ్రీకారం చుట్టింది. ఈ విషయంలో ముంబాయిలో నివాసమున్న సంస్థ సీనియర్ సభ్యులు శ్రీ పత్రి అశ్వనీ కుమార్ ముందుండి అందించిన సహకారం ఎనలేనిది. యువభారతి యూట్యూబ్ ఛానల్ ప్రారంభించడం జరిగింది. ఈ ఛానల్ ద్వారా యువభారతి గతంలో ప్రచురించిన అనేక ప్రశస్తి నొందిన గ్రంథాల వైశిష్ట్యాన్ని, సీనియర్ సభ్యులకు సంస్థతో గల అనుబంధాన్ని వివరించే ఆడియో ప్రసంగాలను, శ్రోతలకు శ్రవణ సంచికల రూపంలో అందుబాటులోకి తెచ్చింది. ఈ సమయంలోనే డా.బి.జయ రాములుగారు యువభారతి ప్రచురణల సంపాదకులుగా బాధ్యతలను స్వీకరించారు.

2021-2022 భారత స్వాతంత్ర్య అమృతోత్సవ (75) సంవత్సరంగా భారత ప్రభుత్వం ప్రకటించింది. ఆ సందర్భంగా యువభారతి తన వంతు బాధ్యతగా గతంలో భారత స్వాతంత్ర్య రజతోత్సవాల (25) సందర్భంగా ప్రచురించిన "మహతి" గ్రంథ పునర్ముద్రణతో బాటు, దానికి కొనసాగింపుగా ఆ తరువాతి 50 సంవత్సరాలలో తెలుగు సాహిత్య రంగంలోని వివిధ ప్రక్రియలలో సాగిన ప్రస్థానంపై విశిష్ట సాహితీ మూర్తులచే ప్రసంగాలు ఇప్పించి, ఆ ప్రసంగ పాఠాల సంకలనాన్ని "అమృత భారతి" పేరిట తెలుగు సాహిత్యాభిమానులకు సమర్పించింది. "మహతి" పునర్ముద్రణకై పూర్తి బాధ్యతను వహించి, ఐ.ఐ.యం.సి. కళాశాల ప్రధానాచార్యులు శ్రీ కూర రఘువీర్ గారు చూపిన సౌజన్యానికి యువభారతి సర్వదా ఋణపడి ఉంటుంది.

ఇట్లా అనేక కార్యక్రమాలతో ముందంజ వేస్తూ యువభారతి అరువదవ సంవత్సరంలో అడుగిడుతూ, వజ్రోత్సవాలను ఘనంగా నిర్వహించుకొనేందుకు ప్రయత్నిస్తున్న కాలంలోనే, మళ్ళీ విషాదాన్ని చూడ వలసి వచ్చింది. సంస్థ వరిష్ఠ సభ్యులైన డా. కె.బి. లక్ష్మి గారు, డా. కుమారస్వామి నాయుడు గారు, శ్రీ పూర్ణచంద్రరావు గారు అకస్మాత్తుగా పరమపదించడం చాల బాధాకరమై సభ్యుల హృదయాలను కలచివేసింది. ఒడిదుడుకుల నడుమ స్థితప్రజ్ఞతతో కర్తవ్య నిర్వహణకై ముందడుగు వేయడమే కదా మానవ జీవిత పరమార్థం!

యువభారతి వజ్రోత్సవాల (1963-2023) సందర్భంగా, మా సంస్థకు ఎప్పుడూ పెద్ద దిక్కుగా ఉంటూ, సదా మార్గ దర్శనం చేస్తూ ఉండే సహృదయులు, పెద్దలు తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు డా. కె.వి. రమణాచారి గారి ఆశీస్సులతో

పెద్ద ఎత్తున వజ్రోత్సవ కార్యక్రమాలను నిర్వహించేందుకు పూనుకొంది. ఈ వజ్రోత్సవాల సమన్వయకర్తగా మా ఉపాధ్యక్షులు శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు గారు బాధ్యత వహించగా, ఇతర సీనియర్ సభ్యుల సహకారంతో, యువభారతి వ్యవస్థాపకులు, సమావేశకర్త ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారి మార్గదర్శనంలో "మహాభారతోపన్యాస లహరి" అనే విశిష్ట కార్యక్రమాన్ని గత డిసెంబర్ 2022 మాసంలో వైభవంగా నిర్వహించి సాహిత్యాభిమానుల మన్ననల నందుకొంది. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ భాషా సాంస్కృతిక సంస్థ సహకారంతో, నగరంలోని మోతీనగర్ శంకరమఠం వారి సౌజన్యంతో – వారి ప్రాంగణంలోని వేదికపై నిర్వహించిన ఈ కార్యక్రమంలో డా. శలాక రఘునాథ శర్మ గారు, డా. గరికిపాటి నరసింహారావు గారు, శ్రీ సామవేదం షణ్ముఖ శర్మ గారు, ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి గారు, డా. ఎన్. అనంతలక్ష్మి, డా॥ కడిమిళ్ల వరప్రసాద్, శ్రీ సమావేదం షణ్ముఖశర్మ, శ్రీ ఎల్.గంగాధరశాస్త్రి వంటి విద్వత్ ప్రవచనకారుల చేత మహాభారతంలోని వివిధాంశాలపై వారం రోజుల పాటు ప్రసంగ సమావేశాలను నిర్వహించి, గ్రంథాన్ని కూడ "మహాభారతోపన్యాసలహరి" పేరిట ప్రచురించి అనతి కాలంలోనే 2000 ప్రతులను పాఠక లోకానికి అందించడం జరిగింది.

ఇదే సందర్భంలో – డా. వై. కృష్ణకుమారి గారు రచించిన "దక్షిణ భారత వనితా వాగ్గేయ వాఙ్మయం" గ్రంథాన్ని, యువభారతి గత 60 ఏళ్ళలో ప్రచురించిన 200 గ్రంథాలకు శ్రీ పత్రి అశ్వనీ కుమార్ గారి పరిచయ వాక్యాలు, ఆ గ్రంథాల ముఖచిత్రాలు, ఆ పుస్తకాలను ఉచితంగా చదువుకోవడానికి వీలుగా QR కోడ్ లతో కూర్చిన సంపుటి "ద్విశతభారతి" అన్న గ్రంథాన్ని కూడ వినూత్నంగా ప్రచురించి సాహిత్యాభిమానులకు నివేదించ గలిగాం.

ఇక ఈ ఆగష్టు 2023 మాసంలో, ప్రముఖ పారిశ్రామిక వేత్త, సాంస్కృతిక సేవాతత్పరులు – పద్మభూషణ్ డా॥ కె. ఐ.వరప్రసాదరెడ్డి గారి సౌజన్య సహకారాలతో, బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు గారిచే "శ్రీమద్రామాయణం – మానవీయ సంబంధాలు" అన్న అంశంపై రెండు రోజుల పాటు ప్రవచన సమావేశాలను, అదే మోతీనగర్ శంకరమఠం వేదికపై విజయవంతంగా నిర్వహించాం. అట్లాగే వజ్రోత్సవాల సంపన్న సభ ఆగామి అక్టోబర్ 2023 మాసంలో వైభవోపేతంగా నిర్వహించాలని మా సంస్థ సభ్యులందరమూ సంకల్పించాము. ఆ సందర్భంగా రూపొందిస్తున్న ఈ "వజ్రోత్సవ సంచిక"లో సంస్థ అధ్యక్షునిగా కాకుండా, ఒక సాధారణ కార్యకర్తగా సంస్థతో నాకు గల అనుబంధాన్ని, అనుభూతులను పంచుకొనే భాగ్యం కల్పించిన

యువభారతి పెద్దలందరికీ నా ధన్యవాదాలను, నమోవాకాలను సమర్పించుకొంటు న్నాను.

నా వయస్సు ఇప్పుడు 62. యువభారతి వయసు 60. నా జీవితంలో ఉత్తరార్ధం ప్రారంభంలో యువభారతిలో చేరి, యువభారతి ఉత్తరార్ధం మొత్తంతో విడదీయలేని అనుబంధం కలిగిన సౌభాగ్యం నాది. ఈ అనుబంధం ఇట్లాగే కొనసాగి, నా సాహితీ జీవితాన్ని మరింత పునీతం చేసుకోవాలన్నదే నా అభిలాష!

సారస్వతాభిమానుల ప్రోత్సాహంతో యువభారతి సంస్థ మరిన్ని మంచి కార్యక్రమాలను నిర్వహిస్తూ, అనేక జగద్ధిత సాహిత్య గ్రంథాలను ప్రచురిస్తూ, మరింత యువరక్తం చేరికతో ముందుకు సాగుతూ, ఈ వజ్రోత్సవాలతో బాటు, అమృతోత్సవాలను, శతాబ్ది ఉత్సవాలను కూడ ఘనంగా నిర్వహించుకొంటూ ముందుకు సాగాలని ఆకాంక్షిస్తూ, అందుకు అనుగ్రహించవలసిందిగా ఆ మాణిక్య వీణాపాణి, వాణీ మాతను మనఃపూర్వకంగా ప్రార్థిస్తున్నాను.





దివాకర్లవారిని యువభారతి పక్షాన సత్కరిస్తున్న కార్యదర్శి శ్రీ ఎస్. వెంకటేశ్వరరావు. చిత్రంలో సభ్యులు శ్రీ ఎ.రవీంద్ర, శ్రీ ఎస్వీ ప్రభాకరరావు

# చదువులతల్లి హృదయం యువభారతి

శ్రీ పులుకూరి చంద్రప్రకాశరావు
విశ్రాంత రాష్ట్ర ప్రభుత్వోద్యోగి, హైదరాబాదు
99490 89108

యువభారతి సర్వ భావాల, సర్వ వ్యక్తిత్వాల, సల్లక్షణాల, సమైక్య కృషి సమాహారం, చదువులతల్లి హృదయం, జంటనగరాలలో వెలసిన సాహిత్య సాంస్కృతిక సంస్థ. సత్సాహిత్యం చదివే మస్తకాలకు తగు విజ్ఞాన, వ్యక్తిత్వ వికాస కార్యకమాలనేకంగా నిర్వహించటానికి 1963లో తన ప్రయాణం, ప్రయాస, నిబద్ధత ఔత్సాహికంగా స్వీకరించింది.

నాటినుండి యువభారతి ఒక మాతృభాషా విశ్వ విద్యాలయ స్థాయి సాహిత్య అంతరంగాల దర్శన కృషి ప్రతిఫలింప చేస్తూన్నది. ఈ రంగంలో అప్పటికే ఉన్న పుస్తక సంస్థల కన్నా మిన్నగా నాటి నుండి ఈ నాటివరకు సాహిత్యశీలు రందరి, నూతన రచయితల రచనలు, వారి భావాలను అక్షరీకరించి చదువరులకు అందచేయడం, చదివింప చేయడం, అత్యంత చౌకగా వారికి చక్కని గ్రంథాలు అందజేయడం, వారి అభిరుచుల మేరకు కొత్త కొత్త గ్రంథాలు వెలువరింప చేయటం యువభారతి కొనసాగిస్తున్నది.

ఆనాటినుండి గొప్ప సంస్థలైన ఎం. శేషాచలం, విశాలాంధ్ర మొదలగు సంస్థలతో పాటు ప్రజల్లోకి పాకిన సంస్థ ఇది. నగరకేంద్ర గ్రంథాలయం, కృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం, ఆంధ్ర సారస్వత పరిషత్తు లాంటి సంస్థలతో పాటు అద్భుత సాహిత్య, ఉపన్యాస, వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలు నిర్వహించింది. సి.నారాయణ రెడ్డి, దేవులపల్లి రామానుజరావు, రమణాచారి, ప్రసాదరెడ్డి గార్ల వంటి మహానుభావులు సంస్థకు అండగా ఉండగా, యువభారతి సారథులు ఇరివెంటి కృష్ణమూర్తిగారు, జి.వి.సుబ్రహ్మణ్యంగారు, తిరుమల శ్రీనివాసాచార్యులుగారు సత్సాహిత్య ప్రోదికోసం, సాహిత్య సౌరభాలను సమర్థంగా అందరికీ అందచేయటానికి

వంగపల్లి విశ్వనాథం, అయలసోమయాజుల నాగేశ్వరరావు, సుధామ, జయరాములు, యస్.వెంకటేశ్వర రావు, యస్.నారాయణ రెడ్డిగారలు, అశ్వనీ కుమార్, వెంకటరావు, రవీంద్ర, మురళీధర్ గౌడ్ మున్నగు వారు ఎనలేని కృషి కొనసాగిస్తున్నారు.

సంస్థకు ఆది నుండి ఔత్సాహికులే కొండంత అండ. శాశ్వత భవనాలు, లక్షలాది నిధులు లేని సంస్థ 200 పైగా సాహిత్య గ్రంథాలు ప్రచురించటం అనన్య సామాన్య విషయం. నేను ఎక్కడో మారుమూల గుంటూరు జిల్లా పల్లెటూరులో పనిచేస్తూ, కావ్యలహరి ఉపన్యాసాల గురించి దినపత్రికల్లో ప్రకటనలు చూచి ఆకర్షింపబడ్డాను. అత్యంత చౌకగా, ప్రచురణ పూర్వ విరాళాలు సేకరిస్తూ గొప్ప గొప్ప రచయితల, తరతరాల సాహిత్యకారుల గ్రంథాలు మాతృ భాషా వికాసం కొరకు అద్భుతమైనటువంటి ప్రయోగాలు చేసిన సంస్థ ప్రచురిస్తున్న పుస్తకాలంటే ఎవరికి ఆకర్షణ కలుగదు? పదుల సంఖ్యలో గ్రంథాలను పొంది మిత్రులకు, చిన్న గ్రంథాలయాలకు అందచేసిన వాడ్ని.

తరువాత 1978లో నేను హైదరాబాద్ లో ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వ శాఖలలో ఉద్యోగించదానికి చేరినపుడు సంస్థకు సన్నితంగా చేరాను, శాశ్వత సభ్యుడినైనాను. ఉపన్యాస కార్యక్రమాలు, వ్యక్తిత్వ వికాస సమావేశాలు, పుస్తక ప్రదర్శనలు, ఆత్మీయ సమావేశాల్లో చురుకుగా పాల్గొన్నాను. ఉద్యోగ ధర్మం పాటింపవలసి ఉన్న అనేక సందర్భాలలో సంస్థ కార్యక్రమాల్లో పాల్గొనకపోయినా, నాటి నుంచి నేటి వరకు సంస్థ మిత్రులందరి సహృదయాలను, ఆత్మీయతల నందుకుంటున్నాను. యువభారతి సభ్యులందరూ సభ్యత, సంస్కారం, సహృదయత, ఇతరులపట్ల ఆప్యాయతలు, కార్యదక్షతలు కలిగి, కలబోస్తున్న వారే!

సంస్థ మరి పది కాలాల పాటు సమర్థవంతంగా మాతృ భాషా సాహిత్య, సాంస్కృతిక సేవలు కొనసాగిస్తూ అందరి మన్ననలు పొందే విధంగా నూతన కార్యక్రమాలు, నేటి తరం ఆశయాల ప్రతిబింబంగా రూపొందేందుకు దోహదం చేస్తుందని ఆశిస్తూ, వ్యక్తిగతంగా నా వంతు పాలుపంచు కొంటానని మనవి చేస్తూ... అభివందనములు.



# ఏ వెలుగుల కీ ప్రస్థానం ?

శ్రీ పత్రి అశ్వనీకుమార్
విశ్రాంత ఉన్నతాధికారి, రిలయన్స్ ఇండస్ట్రీస్, ముంబై
93737 14349

యువభారతి షష్ట్యబ్ది ఉత్సవాల సందర్భంలో నాకు "శంకరాభరణం" పతాక సన్నివేశంలోని ఒక డైలాగ్ గుర్తుకు వస్తోంది.

"పాశ్చాత్య సంగీతపు పెనుతుపానుకు రెపరెప లాడుతున్న సత్సంప్రదాయ సంగీత జ్యోతిని ఒక కాపు కాయడానికి తన చేతిని అడ్డుపెట్టిన ఆ దాత ఎవరో, వారికి శతసహస్ర వందనాలను అర్పిస్తున్నాను. శుష్కించి పోతున్న భారతీయ సంస్కృతిని సంప్రదాయాన్ని పునరుద్ధరించడానికి నడుం కట్టిన ఆ మహా మనీషికి శిరస్సు వంచి పాదాభివందనం చేస్తున్నాను."

అది ఆ సినిమాలో శంకరశాస్త్రిగారి నోటిద్వారా వచ్చిన డైలాగ్ లాగా కాక, అరవై సంవత్సరాల కిందట 1963 సంవత్సరంలో విజయదశమి నాడు "యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ" ఆవిర్భవించిన రోజున, తెలుగుతల్లి, వీణాపాణి సరస్వతీదేవి నోటిద్వారా వచ్చినట్లు నాకు అనిపిస్తోంది. 'సంగీతం' అన్న పదం బదులు 'సాహిత్యం' అన్న పదాన్ని మార్పుచేసి చూస్తే, మీకూ అలాగే అనిపిస్తుంది. లేకపోతే "చుట్టూరా ఆవరించుకున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చునేకంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపమైనా వెలిగించడం మంచిది" అన్న tag line పెట్టాలన్న ఆలోచన – సంస్థ సంస్థాపకులకు ఎలా తట్టి ఉంటుంది?.... మీరే ఆలోచించండి.

అలా ఆ విద్యలతల్లి ఆశీస్సులతో ఉద్భవించిన సంస్థ, తెలుగు భాష సేవలో ఎన్ని మరువలేని, మరపురాని కార్యక్రమాలను చేపట్టిందో, ఆ తరం వారు అశ్రుపూరిత నయనాలతో, వణుకుతున్న చేతులతో తమ తమ వ్యాసాలలో వెల్లడించిన సన్నివేశాలు, సంఘటనలు – ప్రత్యక్ష సాక్ష్యాలు.

'సమావేశాలకు గులాబీ పూలతో ఆహ్వానించారు' అని సంబరపడ్డ వారు కొందరైతే, 'కూర్చున్న కుర్చీలను మడత పెట్టి, తలపై గొడుగుగా చేసుకుని వర్షంలో తడుస్తూ అవధాని గారి ఉపన్యాసాలను విని ఆనందించినవారు కొందరు. 'చేతికి అత్తరు రాసి మరీ ఆహ్వానించడం ఏమిటి?' అని ఆశ్చర్యపడ్డవారు కొందరైతే, 'రిక్షా దిగి చిల్లరకోసం వెతుకులాడుతుంటే చటుక్కున రూపాయి చిల్లర అందించిన' కార్యకర్తలను అభినందించిన వారు కొందరు. కూర్చోడానికి స్థలం లేకపోయినా గోడల మీదా, గొబ్బెల మీదా కూర్చుని వక్తల ఉపన్యాసాలలో ఆసక్తికరమైన అంశాలను తమతో తెచ్చుకున్న పుస్తకాలలో note చేసుకుని హర్షాతిరేకంతో పొంగిపోయిన M. Phil. విద్యార్థులు కొందరైతే, IAS పరీక్ష కు హాజరయ్యే సమయంలో యువభారతి ప్రచురణలు అక్కరకు వచ్చాయని' ఆనందించిన మహావ్యక్తులు మరి కొందరు.

మరి – "ఏవి తల్లీ – నిరుడు కురిసిన హిమసమూహము లేవి తల్లీ" ....?

రెండు/మూడు దశాబ్దాల పాటు నిరంతరంగా, నిరాఘాటంగా పొంగి ప్రవహించిన ఆ సాహితీ వాహినులు ఏమయ్యాయి? సాగరగర్భంలో కలిసి పోయాయా? ఎడారులలో ఇంకిపోయాయా? తెలుగు భాష పట్ల, తెలుగు సాహిత్యం పట్ల ఉన్న ఆ అభిమానం ఎక్కడ మాయమయ్యింది? దీనికంతటికీ కారకులు ఎవరు? మాతృభాషను చదువడం, వ్రాయడం మరిచిపోయిన నేటితరమా? అందుకు బాధ్యులైన నాటి తరమా? ఈ ప్రశ్నలన్నీ మన మస్తిష్కాలలో రావడం సహజమే. ఒక్కసారి కాలచక్రాన్ని వెనక్కి తిప్పి కారణాలను వెతికితే మనకే అర్థమౌతుంది.

ఇడ్లీలు, దోశెల స్థానంలో పిజ్జాలు, బర్గర్లు వచ్చాయి. ఆహార పద్ధతులలో వచ్చిన మార్పులతో పాటు, ఆలోచనా విధానాలలో కూడా గణనీయమైన మార్పులు చోటు చేసుకున్నాయి.

గత నలభై, నలభైఐదేళ్ళ కాలంలో సాంకేతిక పరిజ్ఞానం పెరిగిపోయింది – మనదేశంలో 1978 లో పర్సనల్ కంప్యూటర్స్ ప్రవేశించగా, 1982 లో కలర్ TV, 1994 లో మొబైల్ ఫోన్ వచ్చి సగటు మనిషికి ఉన్న విరామ సమయాన్ని క్రమక్రమంగా హరించాయి. సాహిత్య సమావేశాలకు వెళ్ళాలన్న ఆకాంక్ష, ఆసక్తి సన్నగిల్లసాగాయి. ఆ సమయంలో వచ్చిన వార, మాస పత్రికలు కాస్తో కూస్తో పుస్తక పఠనం మీద ఉన్న ఆసక్తిని తగ్గకుండా ఉంచినా, 1995 లో అంతర్జాలం (internet) అనే ఇంద్రజాలం, 1998 లో గూగులయ్య / గూగులమ్మ రంగప్రవేశం

చేయడంతో – ఏదైనా తెలియని విషయం గురించి తెలుసుకోవడానికి, పుస్తకంలో వెతుక్కోవడానికి బదులు ఇంటర్నెట్ లో వెతుకులాట మొదలైంది. అంతవరకూ బాగానే ఉంది. ఈ శతాబ్ది మొదట్లో – (2001) వికీపీడియా, తర్వాత రెండు మూడేళ్ళ తేడా తోనే facebook (2004), youtube (2008), whatsapp (2009) లు మనుషులకున్న విరామ సమయంతో పాటు వారి నిద్రాసమయాన్ని కూడా తగ్గించేశాయి.

ఇక ఇటీవల వచ్చిన కోవిడ్ పుణ్యమా అని "work from home" అన్న concept రావడంతో, "రోజుకు 8 గంటల పని" అన్న విధానం పోయి, 'రోజంతా పని" (24/7) విధానం అమలులోకి వచ్చింది. ఉద్యోగపతులు కూడా తమ ఉద్యోగులకు 'personal space' లేకుండా చేశారు.

మరి నేటి యువతీ యువకులకు, ప్రముఖంగా ఉద్యోగస్థులకు వారి వారి కుటుంబ సభ్యులతో గడపడానికే సమయం లేనప్పుడు, సాహితీ వ్యాసంగం గురించి ఆలోచించడానికి, సమయం ఎక్కడుంటుంది? అలాగని నిరాశ పడనవసరం ఎంతమాత్రమూ లేదు. మారుతున్న దేశ కాల పరిస్థితులకు అనుగుణంగా – మార్పును వేగంగా స్వీకరిస్తే – ఆ మార్పుల యొక్క ప్రయోజనాలను సంపూర్ణంగా పొందగలం. మార్పును నెమ్మదిగా స్వీకరిస్తే, మిగిలినవాళ్ళకన్నా వెనుకపడతాం. అసలు మార్పునే స్వీకరించకపోతే మారుతున్న, మారిన వాళ్ళ కాళ్ళ కిందపడి నలిగి నశించిపోతాం.

ఉదాహరణకు – పేరొందిన దిన / వార / మాస పత్రికలూ వారి వారి "e-version" లు ఇంటర్నెట్ లో ఉచితంగానో, లేదా nominal subscripton ద్వారానో జనాలు చదివేలా చేస్తున్నారు (వారి పత్రికల physical circulation తగ్గి ఉండచ్చు కాక)..!!

తెలుగులో "సంచిక", "ఈ మాట", వంటి 'e-magazines ఔత్సాహిక రచయితలను, కవులను ప్రోత్సహిస్తూ సాహితీ వ్యాసంగంలో తమకంటూ చోటు సంపాదించుకుంటున్నాయి.

షష్టి పూర్తి జరుపుకుంటున్న యువభారతి " – నవ భారతిగా, అభినవ తెలుగు భారతి గా మారడానికి – యువభారతి 'మేనమామ', జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డాక్టర్ సి. నారాయణరెడ్డి గారు చెప్పినట్లు "గతాన్ని మనసులో ఉంచుకుని, వర్తమానాన్ని జేబులో వేసుకుని, భవిష్యత్తు వైపు జంగసాచి అడుగులు వేయడానికి" – నాకు తోచిన కొన్ని సూచనలను ఇస్తున్నాను –

యువభారతి పూర్వ వైభవం చవిచూసినవారు, వారికి తెలిసిన సాహితీ ప్రియులను, సాహితీ వేత్తలను, యువభారతి కార్యక్రమాలలో పాలు పంచుకోవడానికి ఆహ్వానించవచ్చు. యువభారతి నిర్వహించనున్న కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనవచ్చుబీ ఆ విధంగా యువభారతి సంస్థతో తమ సంఘీభావాన్ని వ్యక్తపరచవచ్చు.

యువభారతికి ఉన్న youtube channel ను revive చేయవచ్చు. యువభారతికి ఉన్నంత 'original content' బహుశా మరే youtube channel కు ఉందని నేను అనుకోను. యువభారతి ప్రచురణల గురించి, లహరీ సమావేశాలలో ప్రసంగించిన వక్తల గురించి, వారు ప్రసంగించిన కావ్యాలు, నాటకాల గురించి చిన్న చిన్న youtube videos లేదా shorts తయారుచేసి, channel ను వ్యవస్థీకరించవచ్చు.

తెలుగు రాష్ట్రాలలోనూ, రాష్ట్రేతర ప్రాంతాలలోనూ వందలాది సాహితీవేత్తలున్నారు. వారిని పరిచయం చేస్తూ youtube లో video లను పెట్టవచ్చు. twitter లో తెలుగు సమూహాలను ఏర్పాటు చేసి, మన కావ్యాలు. నాటకాల గురించి చర్చా కార్యక్రమాలను నిర్వహించవచ్చు.

ఇవన్నీ జరగాలంటే – "యువభారతి" సంస్థలో సాహిత్యాభిలాషతో పాటు సాంకేతిక పరిజ్ఞానం కూడా ఉన్న తెలుగు యువతీ యువకులు – ఆసక్తితో, తెలుగుభాష పట్ల అనురక్తితో – ముందుకు రావాలి. వారికి అనుభవజ్ఞులైన సీనియర్ యువభారతీయులు సహకారం అందించాలి. పాతకొత్తల మేలు కలయికతో యువభారతి గత వైభవాన్ని తిరిగి పొందాలి.

అలా జరిగిన నాడు, యువభారతి 75 వసంతాల వేడుకలు – అంతర్జాలమే వేదికగా, దేశవిదేశాలనుండి లక్షలాది వీక్షకులు, వేలాది ప్రతినిధులు, వందలాది సాహితీవేత్తల సాక్షిగా – రెండు రోజుల పాటు ఘనంగా నిర్వహించుకుందాం.



# 'యువభారతి' – నేనూ

శ్రీ దినవహి వేంకట హనుమంతరావు
విశ్రాంత ప్రభుత్వ బ్యాంక్ అధికారి, రాజమండ్రి
99497 05166

శాంతా బయోటెక్నిక్స్ వరప్రసాద్ రెడ్డి గారి మానసిక పుత్రిక – తెలుగునేల రూపు దిద్దుకున్న 'హాసం క్లబ్'... సుమారు 15 ఏళ్ళ క్రితం శ్రీ ఎం.వి.ఎస్.ప్రసాద్ ('హాసం' పత్రిక మేనేజింగ్ ఎడిటర్)గారి ఆధ్యక్షంలో, హాసం క్లబ్, హైదరాబాదు వారు, ఇక్కడ జరిపిన ఒక సమావేశంలో .. రాజమండ్రిలోని 'హాసం క్లబ్' సమన్వయకర్తనైన నన్ను ముఖ్య అతిథిగా గౌరవించారు. యథాలాపంగా 'నేను యువభారతీయుణ్ణి' అనగానే శ్రీ యమ్వీయస్ గారు సావధానులైపోవడం నాకు ఇంకా గుర్తుంపు. అపుడూ ఇపుడూ ఎప్పుడూ "నేను యువభారతి వాణ్ణి" అంటే సమాజమిచ్చే గౌరవం విలక్షణమైనది, ప్రత్యేకమైనది.

మొట్టమొదట 'యువభారతి'ని నాకు పరిచయం చేసినవారు, మా స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో ఉన్నతాధికారి, సాహిత్యాభిమాని శ్రీ ఐ.సదాశివ గుప్త గారు. వారు రుచి చూపిన 'మందార మకరందాలు' – సంస్థతో నాకు పరోక్ష పరిచయం చేసింది. తదాది ఆ మాధుర్యం (పరిచయం) కొనసాగుతోంది.. ఆరోజుల్లోనే మా బ్యాంకు హైదరాబాద్ ప్రధాన కార్యాలయంలో ఉద్యోగించే శ్రీ యస్.వేంకటేశ్వర రావు గారు (యువభారతి కార్యదర్శి) తమంతా తామే ఉత్తరాలద్వారా నన్ను పరిచయం చేసుకుని, నాకు దగ్గరయ్యారు. వారు మన సంస్థతో అనుబంధం మరింత పెంచారు. సంస్థ విడుదల చేసిన అనేక ప్రచురణల వ్యాప్తికి నా వంతు సహకారం అందించగలిగానంటే వేంకటేశ్వర రావు గారే కారణం.. మా బ్యాంకు వారిచ్చే ట్రైనింగ్ ప్రోగ్రాముకి హైదరాబాద్ వచ్చినపుడు వారిని మొదటిసారి కలిసాను. అప్పటినుంచీ ఇప్పటిదాకా అదే ప్రేమ. వారి సహృదయతను మరువలేను. అలా

ఒకసారి కలిసినపుడు హైదరాబాదులో, వారు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారితోనూ, శ్రీ విశ్వనాథంగారితోనూ పరిచయం చేసారు.

1980లో ఉద్యోగరీత్యా నేను హైదరాబాద్ కు బదలీ అయ్యాను. అప్పటినుంచీ అక్కడున్న ఆరు సంవత్సరాలూ "యువభారతి"కి దగ్గరయ్యాను. కార్యక్రమాల నిర్వహణలో సహకరిస్తూ యెంతోమంది లబ్ధప్రతిష్ఠులైన సాహితీమూర్తులను చూడగలిగాను, వినగలిగాను. ఇప్పటికీ సంస్థతో అనుబంధం కొనసాగుతున్నదీ అంటే ప్రధాన కారణం శ్రీ యస్.వేంకటేశ్వరరావు గారే! "...ప్రయత్నించి చిన్ని దీపమైనా వెలిగించాలనే" సదాశయంతో ప్రారంభమైన యువభారతి తన దీపపు వెలుగులను సాహిత్య ప్రపంచంలో అద్భుతంగా ప్రకాశింప జేస్తోందని అనడం నిజం. నిజం. నిజం.

కేవలం ఒక రూపాయికే అందించబడిన "మందార మకరందాలు"కానీ, 'వేమన్న వేదం' కానీ పునర్ముద్రణలు పొందడం విశేషం కాదా? 'మహతీ' నాదం విదేశాలలో కూడా ప్రతిధ్వనించడం అద్భుతం కాదా? మహాకవుల కవితా వైభవాలు, లహరీ ఉపన్యాస సంకలనాలు, పరభాషా సాహిత్య వైభవాలు... యెన్నో యెన్నో సాహిత్యలోకాన్ని ప్రభావితం చేసాయనడం నిర్వివాదాంశమే కదా! వీని ద్వారా తెలుగు సాహిత్యపు రుచులు చూచి .. అపారమైన మన సాహిత్యం చదువాలని కుతూహలం పెంచుకుని ఆ దిశగా అడుగులు వేస్తున్నవారెందరో! తాను ఆశించిన ప్రయోజనం నెరవేరుతున్నందుకు అరువది శరత్తుల 'యువ' భారతి గర్వంగా తలెత్తుకునే సమయం.

ఈ సాహిత్య సరస్వతిని ఆరాధిస్తున్నవారు ఒకవ్యక్తి కాదు.. అంకిత భావంతో సేవించే, వయోభేదం లేని ఒక యువశక్తి... క్రమశిక్షణ, సమయ పాలన, పరస్పర ఆత్మీయతానురాగాలు దానికి ఆయువుపట్టు. కార్యక్రమాల సంరంభం:: సర్వాంగ సుందరంగా నిరాడంబరంగా అలంకరింప బడిన వేదిక మీద సాయంత్రం సరిగా ఆరవగంట కొడుతుండగా సందడి మొదలవుతుంది.. యువభారతి సమయపాలన తెలిసిన శ్రోతలు అప్పటికే ఆసీనులై ఉంటారు. నాటి ముఖ్య అతిథి ముందే వస్తారు. అలా రాకపోయినా సభ ప్రారంభమైన సందర్భాలు కూడా ఉన్నాయి.. అతిథులకు పూలహారం వేయవలసిన సభ్యునికి, కబురు వెళ్తుంది. ఆ కబురు అందుకుని ఏ కార్యక్రమ బాధ్యతలో ఉన్నా వదిలి రావడం, వేదికపై నిర్వహణ చేస్తున్న కార్యకర్త అందించిన పుష్పహారం అందుకుని అతిథిని గౌరవించడం, తిరిగి తన విధినిర్వహణకు మరలడం క్షణాలలో జరుగుతుంది.. యాంత్రికంగా.. కాని ఆత్మీయంగా.

యువభారతి సభా నిర్వహణ తీరు, .. సినారె వంటి లబ్ధప్రతిష్ఠులైన వారి ప్రశంసలను పొందిందంటే అతిశయోక్తి కాదు.. మూడు రోజుల లహరీ కార్యక్రమాలు జరిగేటప్పుడు మొదటి రోజు అధ్యక్షులు మాట్లాడుతారు, ఆఖరి రోజు కార్యదర్శి వందన సమర్పణ చేస్తారు..అంతే. వక్త తప్ప మరెవరూ వేదికమీద ఈ మూడు రోజులూ కనపడరు, అధ్యక్షుల వారు మాత్రం అతిథికి గౌరవసూచకంగా వారితో పాటు కూర్చుంటారు..

'నాన్నా' అంటూ పలుకరించే సమావేశకర్త, అంతే ప్రేమతో పలుకరించే కార్యదర్శి, ఇంటి నుంచి ఏ పులిహోరో తెచ్చి ప్రేమగా పంచే సభ్యులు... అంతేకాకుండా అప్పుడప్పుడు జరిగే కార్యనిర్వాహక వర్గ సమావేశాలు సభ్యుల ఇళ్ళల్లో కుటుంబ వాతావరణం నడుమ జరిపించడం... 'యువభారతి' ఒక సంస్థ మాత్రమే కాదు.. ఆత్మీయతలు ప్రవహించే కుటుంబ వ్యవస్థ...

ఇంక వ్యక్తి గతంగా... శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయంలో జరిగే పక్ష సమావేశాల ప్రభావం నాపై చాలా వుంది. తర్వాత బ్యాంకు సమావేశాలలో కానీ, రాజమండ్రిలో హాసం క్లబ్ స్థాపించి 10 సంవత్సరాలు సమన్వయకర్తగా బహుళ జనామోదంగా కార్యక్రమాలు నిర్వహించడంలోకాని, ఇక్కడ బ్రహ్మశ్రీ సామవేదం వారి ప్రవచన సభలు నిర్వహించడంలో వేలాది సదస్యుల ప్రేమ పొందడంలో కానీ,.. ఇదంతా 'యువభారతి' ద్వారా నాకు అబ్బిన సంస్కారమని సగర్వంగా చెప్పగలను...

మన కుమారస్వామి నాయుడు గారి ప్రోత్సాహంతో నేను తొలిసారి హాస్యరచన చేసి ఆకాశవాణి ద్వారా మన యువభారతివారి 'యువవాణి' లో చదువడం ఒక ఆనందానుభూతి. అందులోని హాస్యాన్ని మన రవీంద్రగారు ఈనాటికీ తలచుకుంటూ ఉంటానని చెప్పడం.. నాకు ఆస్కార్ పురస్కారం.. తదాది 'హాసం క్లబ్' కోసం హాస్య ప్రధానమైన 'స్కిట్స్' చాలా వ్రాసాను. వైజాగ్ ఆకాశవాణి కార్యక్రమాల్లోనూ పాల్గొన్నాను.

హైదరాబాద్ లో ఉన్నపుడు – అర్ధరాత్రి వేళల్లో కూడా నా బైక్ పై వ్యాసాల కోసం కవులను కలవడం, ప్రింటింగ్ ప్రెస్సులనుంచి ప్రూఫ్ లు తెచ్చి సవరణలకు ఈయడం... ఉత్సాహంగా చేసేవాణ్ణి. నాతోపాటు వెన్నంటి ఉండే మన వివేకానంద గారి వలన నాకేమీ శ్రమకూడా తెలిసేది కాదు.. ఆ రోజులలోనే యువభారతి

కార్యక్రమానికి శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థ స్వామివారు విచ్చేయడం .. వారి దివ్య చరణాలపై నేను పూలుంచడం, నాచే సమర్పించబడిన పుష్పమాలిక వారు స్పృశించి దీవించడం, మన అధ్యక్షులు శ్రీఇరివెంటి వారితో కలిసి జగద్గురువులతో సభాప్రాంగణానికి అడుగులు వేయడం, యువభారతి వలన పొందిన – ఒక మహద్భాగ్యం.

నిజానికి అరువది సంవత్సరాల యువభారతితో నా ప్రత్యక్ష అనుభవం ఆరు సంవత్సరాలు మాత్రమే. నేను సంస్థకు చేసింది చాలా తక్కువ.. సంస్థనుండి పొందినది మాత్రం చాలా యెక్కువ... ఇప్పటికీ సంఘంలో 'యువభారతి'వాడినని చెప్పుకోవడం నాకు గర్వకారణం.

'యువభారతి' వజ్రోత్సవ వేడుకలలో నాకూ ఈవిధంగా భాగస్వామ్యం కల్పించిన నిర్వాహకులకు – ముఖ్యంగా శ్రీ నాగేశ్వరరావు గారికి.. కృతజ్ఞతాభివందనాలు.





యువభారతీయులు తమ కుటుంబసభ్యులతో
ఇందిరా పార్కుకి వనభోజనాలకు వెళ్ళిన సందర్భం

# స్ఫూర్తిప్రదాత

శ్రీ పి. జవహర్‌లాల్ నెహ్రూ
వ్యక్తిత్వ వికాస నిపుణులు, హైదరాబాద్
98480 36040

నేను కేవలం సమాచారం కొరకుమాత్రమే ఈ వివరణ సమర్పిస్తున్నాను.

గురువుగారు శ్రీ వంగపల్లి విశ్వనాథం గారు చేస్తున్న సమాజ సేవ చూసి, గురువుగారికి సహాయకుడిగా ఉండాలనే ఆలోచనతో మాత్రమే నేను యువభారతిలో చేరటం జరిగింది. గురువుగారి సూచనలమేరకు జీవిత సభ్యత్వం చెల్లించినాను.

గురువుగారు చేసే ప్రతి సేవాకార్యక్రమంలో కేవలం అనుంగు శిష్యుడిగా మాత్రమే ఉండాలన్నది నా బలమైన కోరిక.

గురువుగారి సమయపాలన, నిస్వార్థసేవ, బాధ్యతాపరమైన శ్రద్ధ నిరంతరం కొనసాగించాలన్నది నా ప్రగాఢ వాంఛ.

యువభారతి నిర్వహించిన సర్వకార్యక్రమాలలో కేవలం శ్రీవంగపల్లి విశ్వనాథం గారి అనుంగు శిష్యుడిగా కొనసాగటం జరిగింది.

అటు నగర కేంద్ర గ్రంథాలయంలో మధ్యాహ్నం 2గం సమావేశాలు / శ్రీకృష్ణ దేవరాయ ఆంధ్ర భాషానిలయంలో సమావేశాలు / బాగ్ అంబర్‌పేట సాయిబాబా మందిరంలో నిర్వహించిన కార్యక్రమాలను నేను భుజస్కంధాలపైన వేసుకుని శిష్యుడిగా నిర్వహించేను.

నేను ఎటువంటి పదవినీ, గుర్తింపును ఎట్టిపరిస్థితులలోనూ ఆశించలేదు. కేవలం గురువుగారి ఆశీస్సులే మాకు శ్రీరామరక్ష. వారే మాకు స్ఫూర్తిప్రదాత.



# వజ్రోత్సవ యువభారతికి అభినందన అక్షర సుమమాల

డా॥ జి.ఎల్.కె. దుర్గ
విశ్రాంత ప్రాచార్యులు, హైదరాబాద్
93466 56051

యువభారతి కుటుంబ సభ్యులందరికీ వందనాలు, అభినందనలు. యువభారతి పూర్వ సభ్యుల నిబద్ధతకి, క్రమశిక్షణకి, నిరంతర శ్రమకు, జోహార్లు. తెలుగు సాహిత్యం ఒక ప్రవాహం అయితే, దానిని దోసిట్లో పట్టి అమృతధారగా మార్చిన ఘనత యువభారతిది. తెలుగు అక్షరాలకి అమరత్వాన్ని అద్ది, అందరికీ అందించిన సాహితీ చరిత్ర యువభారతిది.

సరస్వతీదేవి ఉన్నచోట లక్ష్మీదేవి కనబడదు అన్న అపోహను అబద్ధం చేస్తూ, సాహిత్యంతో పాటు, ఆదరణ లక్ష్మిని దశాబ్దాలుగా ఒకే వేదిక మీద నిలబడేటట్లు చేసిన కీర్తి యువభారతిది. కాలాలు మారినా, దశాబ్దాలు గడచినా, ఏనాటికీ వన్నె 'తరగని' – వయసు 'మళ్ళని' – 'యువ' భారతి – ఈ యువభారతి.

కొండరాళ్ళ కింద జలం ఉంటుందన్నది సత్యం. ఆ జలను వెలికి తియ్యడానికి కట్టిన యంత్రాలు – కాదు కాదు – అక్షరసేద్యం చేసే కలాలు, తెలుగువారి పొలాల నిండా ఉన్నాయని ఋజువు చేసింది యువభారతి. రాసినవాళ్ళు రాస్తూనే ఉంటారు – చదివిన వాళ్ళు కూడా రాసేటట్టుగా మార్చగలిగిన మాట శక్తి, ప్రేరణ శక్తి, మాయా శక్తి కలిగినది యువభారతి.

తెలుగు సాహిత్యం, సారస్వతం ఏనాటికీ మరిచిపోలేని మహామహులందరినీ ఒకే వేదికమీదికి ఆహ్వానించి, వారిచేత వారి అంతరంగాలను ఆవిష్కరింపజేసి, అందరూ ఒకే విశ్వంలో కలిసి జీవించే జీవులు అని ఋజువు చేసినవారు యువభారతివారు. దీని జీవనాధారం వంగపల్లి విశ్వనాథం గారు – వారి బృందం

నాగేశ్వరరావు గారు, పూర్ణచంద్ర రావుగారు, రవీంద్ర గారు తదితరులు. ఆయన పేరునే కాదు జీవితాన్ని కూడా అందరూ ఆప్యాయంగా కోరుకునే విశ్వనాథుడు. ఆయన కృషి, నిరంతర శ్రమ, అందరినీ కలుపుకుపోయే కలివిడితనం, యువభారతి మనుగడకు అచంచలమైన పునాది.

యువభారతిది కాలపరీక్షకి నెగ్గిన, శతాబ్దానికి పైగా నిలబడే సాహిత్య ప్రణాళిక. ఇది నిరంతరం నిలుస్తుందని, తెలుగువారి శ్వాసకు సాహిత్యపు ఊపిరులందిస్తుందని మనస్ఫూర్తిగా ఆకాంక్షిస్తున్నాను. ఈ అనంతమైన అమృతధారలో ఒక దోసెడు గ్రోలి, నేను అనంతమైన ఆనందాన్ని పొందాను. నాకు అందిన ఆ సౌభాగ్యానికి నేను సదా విశ్వనాథుడికి కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

ఈ విశిష్ట సంస్థలో నేను ఒక శిశువును మాత్రమే. 2005 వ సంవత్సరం నుంచి సభ్యురాలిగా. వ్యక్తిత్వ వికాస శిక్షకురాలిగా, 'వ్యక్తిత్వ వికాసం' పై వెలువడ్డ 186 వ ప్రచురణలో విశ్వనాథం గారితో కలిసి వ్రాసే భాగ్యం, నా పూర్వజన్మసుకృతంగా భావిస్తున్నాను. యువభారతి మాతంగకన్యను పల్లకీమోసిన పూర్ణ గారు, నాగేశ్వరరావు గారు,రవీంద్ర గారు, గోవిందరాజుల వారు, వారి బృందానికి, వారు అందించిన సేవలకు శిరసు వంచి నమస్కరిస్తున్నాను. యువభారతిలో వారి ముద్రలు నిలిపి, మార్గదర్శకత్వం చేసిన కీ.శే. ఆచార్యులు జి.వి.సుబ్రహ్మణ్యం గారికి, కీ.శే. ఇరివెంటి కృష్ణమూర్తి గారికి, శ్రద్ధాంజలి ఘటిస్తున్నాను. యువభారతికి ఆర్థిక, హార్దిక సహాయ సహకారాలను అందిస్తున్న రమణాచారి గారికి, వరప్రసాదరెడ్డి గారికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

యువభారతి పగ్గాలు చేపట్టి, కొత్త పంథాను, కొత్త చేవను, పుష్టిని, అందిస్తూ ఆత్మ విశ్వాసానికి రెక్కలు తొడుగుతూ బృందస్ఫూర్తిని పెంపొందిస్తున్న ప్రస్తుత కార్యవర్గ సభ్యులు, డా.ఆచార్య ఫణీంద్ర, జీడిగుంట వెంకట రావు, పత్రి అశ్వనీ కుమార్, సుధామ తదితరులకు ప్రత్యేక అభినందనలు.



# నా యువ భారతి
# నవ్య భారతి, భవ్య భారతి

శ్రీ పోరూరి మారుతీ కిరణ్
వ్యక్తిత్వ వికాస నిపుణులు, హైదరాబాద్
94910 63089

కాలం ముందుకెళుతున్న కొద్దీ వయస్సు పెరుగుతుంది. జవసత్వాలు ఉడిగిపోతాయి. కానీ, అదేమి చిత్రమో యువ భారతికి ఎప్పుడూ యౌవనమే. ఒక శతాధికుడన్నట్టు "నాకు సమాజంలో ప్రస్తుతం పాతికేళ్ళ వృద్ధులు, ఎనభై ఏళ్ల యువకులు కనిపిస్తున్నారు" అని. ప్రస్తుత కాల మాన పరిస్థితుల్లో ఇది ఎంతవరకూ నిజమో పాఠకులుగా మీరే చెప్పాలి.

వ్యాసానికో పరిధి అంటూ వుంటుంది. కాబట్టి ఆ పరిధిని గౌరవిస్తూ నాకు బాగా నచ్చిన వ్యక్తుల గురించి ప్రస్తావిస్తాను.

అధ్యక్షులు ఆచార్య ఫణీంద్ర గారు. వారి నిగూఢ పరిజ్ఞానాన్ని, కావ్య గంభీరతను ప్రస్థావించే సామర్థ్యం నాకు లేదు. ఆ సాహసం నేను చెయ్యను. ఒకే ఒక్క మాట. సాహిత్యం మీద, కావ్యం మీద వారికున్న పట్టు కుటుంబ నేపథ్యంనుంచి వచ్చినదైనా, యువ భారతికి పునర్వైభవాన్ని తెచ్చిందనడంలో ఏమాత్రమూ అతిశయోక్తి లేదు. విపత్కర పరిస్థితిని చక్కగా విశ్లేషించి తగు సూచనలు ఇవ్వడంలో వారికి వారే సాటి.

మా నాగేశ్వరరావు గారు. ఎనభై వసంతాలకు దగ్గర పడుతున్నా, కారు స్టీరింగు చేతికి తగలగానే యువకులైపోతారు. చక్కటి వస్త్ర ధారణ, చేతిలో సూట్ కేసు, అందులో గుండుసూది, పేపర్ వెయిట్ మొదలుకొని ఏదికావాలన్నా అది తీసివ్వగలరు. పొదుపరిగా వారు మాట్లాడే మాట, "యువ భారతే నా శ్వాస" అన్న భావాన్ని స్ఫురింపచేస్తుంది. కార్యవర్గ సమావేశాల్లో వారి మొదటి మాట కార్యక్రమాన్ని పట్టాలెక్కిస్తుంది. ఆఖరి మాట ఆలోచింప చేయిస్తుంది. అలా ఎన్నో నిర్ణయాలు

తీర్మానాలుగా మారిన దాఖలాలు వున్నాయి. ఏది గట్టిగా చెప్పరు. చెప్పేదాంట్లో మటుకు స్థిరత్వం వుంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే "అన్నీ తానై " అన్నట్టుగా వుంటుంది వారి వ్యవహార శైలి.

సుధామ గారు జగమెరిగిన వారు. సాహిత్య వ్యాసాల్లో, కవిత్వంలో అందె వేసిన చెయ్యి. ఎన్ని పుస్తకాలో వారివి. ఆలిండియా రేడియోకి వారొకప్పుడు వెన్నుదన్ను. కొంతమంది గురించి ఎక్కువగా చెప్పకూడదు. ఇంటర్నెట్లో వెతుక్కుంటే, వారి ప్రతిభాపాటవాలకు ఆశ్చర్యపోవడం మీవంతవుతుంది. స్వతంత్రం వుంది కాబట్టి నా భావన ఏంటంటే, వారు ఈ నవతరానికి జార్జ్ బెర్నార్డ్ షా.

అలాగే, కారుండదు. స్కూటరుండదు. అందరికంటే అరగంట ముందుంటారు ప్రొఫెసర్ వంగపల్లి విశ్వనాథం గారు. సమావేశాల్లోని అభిప్రాయాలను, ఆలోచనలను, సలహాలను, వారి మాట అనే ఉలితో నిత్యం చెక్కుతూ వుండే మహా శిల్పి వారు. మందలింపులో మృదుత్వం, ఖండించడంలో చాతుర్యం, ఒప్పించడంలో ఓరిమి వారి సహజ గుణాలు. నిజాయితీతో చెప్పాలంటే, వారి ప్రభావం నా మీద కనక లేకపోతే, ఈపాటికి తడుస్తూ, ఎండుతూ పడుండే చెక్కలా వుండే వాడిని. అందరినీ ఒక్క తాటిమీద నిలబెట్టగల ధీశాలి. వ్యక్తిత్వ వికాసంలో వారు నా దృష్టిలో డేల్ కార్నిగ్. ప్రోగ్రాం ఐపోయిన వెంటనే, "శుభం. వస్తా. జాగ్రత్తగా వెళ్ళండి " అంటూ ఎనభై ఒక్క వయస్సును పద్దెనిమిది చేసుకొని, వడివడిగా నడుస్తూ, ట్రాఫిక్కుకు చెయ్యడ్డం పెట్టేసి రోడ్డు దాటేస్తూ వుంటారు.

వారి గురించి ఇంకో విషయం. ఆగిన ఆటోవాడు రేటు చెబుతాడు. దాదావు రెండింతలు చెబుతాడు. అవసరాన్నిబట్టి తెలుగులో, లేదా వాడి వాలకాన్ని చూసి ఖరీదైన ఉర్దులో ఏం మాట్లాడుతారో, ఏం బేరం చేస్తారో కానీ, వారి రేటుకు ఆటో స్టార్ట్ కావాల్సిందే. విశ్వానికి నాథుడు ఎలా వుంటాడో ఎవ్వరం చూడలేదు. కానీ అన్నీ తానై యువ భారతి అనే దీపాన్ని రెండు చేతులతో ఇప్పటికి కాపాడుతూనే వున్నారు మా గురువర్యులు విశ్వనాథుల వారు.

వీరందరూ ప్రస్తుత సాహితీ, సాంస్కృతిక కళ్యాణ మండపానికి నిలువెత్తు స్తంభాలు. వారు మారుతున్న సాంస్కృతిక పోకడలను కాలానుగుణంగా అధ్యయనం చేయకపోతే, ఈరోజు ఈ వజ్రోత్సవాలు ఇంత జట్టుకృషితో వైభవోపేతంగా ఉండేవికావు.

మిగతా పెద్దలున్నారు. కొందరు గతించారు. అద్భుతమైన వారసత్వ సంపదతో పాటు, జ్ఞాపకాలనూ వదలి వెళ్లారు. మరికొంతమంది అవసరానికి తప్పక వచ్చి అమూల్యమైన సలహాలు ఇస్తూ వున్నారు. ఒకవిధంగా చెప్పాలంటే, పరికించే పరిజ్ఞానం ఉండాలేకాని, అందరూ గురు తత్వాన్ని, నాయకత్వ లక్షణాలను పుణికి పుచ్చుకున్నవారే.

అవసరానికి తగ్గట్టుగా పుష్పమంత మృదువుగాను, వజ్రమంత కఠినంగానూ ఉండగలరు కూడా. భావలేమి ఏనాడూ లేదు. వీరి ముందు సంకుచితత్వం సిగ్గుపడుతుంది. లౌక్యం ముఖం చాటేస్తుంది. భావ ప్రకటన విహంగంలా రెక్కలు విప్పుతుంది. అలా ప్రజాస్వామ్యం వెల్లివిరుస్తుంది యువభారతిలో.

ఏమాటకామాట. తరం మారింది. తరం, స్వరం మారింది. సాంకేతికత మారింది. కానీ, యువ భారతి పల్లకిని మోసే వీరి భాష మారలేదు. యాస మారలేదు. వీరి ప్రయాసకు ఎప్పుడూ యౌవనమే. కాలానుగుణంగా ప్రభుత్వాలు మారుతున్న కొద్దీ, తెలుగు భాషకు ఆదరణ తగ్గుతున్న మాట వాస్తవమే. అయినా, యువ భారతీయులందరూ పట్టువదలని విక్రమార్కులే. తెలుగుతల్లి ఇంకా తన మాతృత్వాన్ని కోల్పోలేదంటే, అది యువ భారతి చలవే.

మనదేశం మీద జరిగినవన్నీ దాడులే. అయినా అస్తిత్వం చెక్కు చెదరకుండా వుంది. అలాగే యువ భారతి ఇప్పటికి తన ప్రాభవాన్ని కోల్పోలేదు. ప్రాపకం కోసం ప్రాకులాడనూలేదు. చెక్కు చెదరని మనోధైర్యంతో, తనదైన శైలిలో ఉత్సాహంగా అడుగులు వేస్తూ, ఎంతమంది యువకుల్లో ఉత్సాహన్ని నింపిందో, భవిష్యత్తు గురించి ఎన్ని ఆశలు చిగురింప చేసిందో, తలచుకుంటుంటే, ఒళ్ళు గగుర్పాటుకు గురవుతుంది. మనస్సు పులకాంకితమవుతుంది.

భగవంతుడు జన్మనిచ్చినందుకు యువభారతీయులందరూ తమ జీవితాలను సార్థకం చేసుకున్నారు. అనేక రంగాలలో అనుకున్నది సాధించి ఇతోధికంగా సేవ చేస్తున్నారు. న్యాయ వ్యవస్థలో నాది నిశ్శబ్ద వృత్తి. స్టేనోగ్రాఫర్ ను. నాలోని సహజత్వాన్ని తట్టిలేపి, నన్ను ఉపన్యాసకుడిగా, వక్తగా, యూట్యూబర్ గా, రచయితగా, వ్యాఖ్యాతగా, పరిచయకర్తగా, కంటెంట్ రైటర్‌గా తీర్చిదిద్ది, నా జీవితానికో అర్థం కల్పించిన మాతృమూర్తి నా యువ భారతి.

నేను రామకృష్ణ మఠంలో ఫాకల్టీ గా గుర్తింపు నోచుకోవడమేంటి? ప్రముఖ టీవీ ఛానల్ వాళ్లు నన్ను ఆహ్వానించడం ఏంటి? నా వీడియోలు ప్రసారం

చెయ్యడమేంటి? కాలేజీలు, యూనివర్సిటీలు నన్ను ఆదరించడమేంటి? ప్రభుత్వ శాఖలు నన్ను పిలువడమేంటి? అసలు 472 వీడియోలతో యూట్యూబ్ నడిపించడ మేంటి ?

వీడు పనికొస్తాడని నమ్మి, పెద్దలు, అనుభవజ్ఞులు, ప్రాతః స్మరణీయులు నన్ను యువ భారతి కార్య వర్గంలో చేర్చుకోవడమేంటి? ఇలా సరస్వతీదేవి నన్ను యువ భారతి రూపంలో ఆశీర్వదించిందనడంలో ఏమాత్రం సందేహం లేదు. నా మేధ, నా ప్రజ్ఞ, నా ఆలోచనలకు ఆలంబన యువ భారతి తప్ప మరేమి కాదని సరస్వతీదేవి పాదాలకు నా శిరస్సును తాటించి ప్రమాణం చేస్తున్నాను.

మరణానికి భయపడని వ్యక్తి కూడా నలుగురి ముందు మాట్లాడటానికి భయపడతాడు " అన్నది జగమెరిగిన సామెత. ఇప్పుడు నాకు ఈ రెండు భయాలూ లేవు. ఎందుకంటే నేను యువ భారతీయుడను. "ఉత్సాహం పోయిన మరుక్షణం ముసలితనం వచ్చేయడం ఖాయం " అని ఎక్కడో చదివాను. యువ భారతి పుణ్యమా అని నా ఉత్సాహం తరగదుగాక తరగదు. కానీ, రాబోయే రోజుల్లో నేను వృద్ధి చెందిన వృద్ధుణ్ణి అవుతాననిమటుకు నమ్మకముంది.

యువ భారతి పెద్దల ద్వారా - మంచి మంచి ముత్యాల్లాంటి మాటలు తరతరాలకి తరగని సౌరభాన్నే కాదు, అంతులేని జ్ఞాన సారాన్ని, అమూల్యమైన అనుభవ సంపదని, మేధావులు సాధించిన ఊహలకందని విజయ రహస్యాలను భావి తరాలకు నిండైన ప్రేరణలను వారసత్వ సంపదగా– అందించబడ్డాయి.

1963 లో యువ భారతి రూపు దిద్దుకున్నప్పుడు, బలపం కూడా పట్టని నా వయస్సు ఐదేళ్లు. కానీ, వజ్రోత్సవం జరుపుకుంటున్న యువ భారతి నన్నిప్పటికి యువకుడిగానే తీర్చిదిద్ది పైన చెప్పిన వారసత్వ సంపదకు వారసుణ్ణి చేసింది.

యువ భారతిలో నేను ప్రవేశించిన తర్వాత స్వతహాగా voracious reader ను అయిన నేను ferocious reader గా మారాను. ఏది చదువుతున్నా నలుగురికి చెప్పే ఓ కాన్సెప్ట్ దొరకకపోదా అన్న ఆత్రుతే నాది. ఆ ప్రవృత్తే నన్నీ ఆర్టికల్ రాయడానికి పురికొల్పింది.

మనిషి స్వప్నాల సాకారంతోనే ఎదిగే ప్రయత్నం చేస్తాడు. ఆ స్వప్నాలను సాకారం చేసే దిశగా నడిపించగల మేధావిగాని, వ్యవస్థకానీ వుంటే, ఆ ఎదుగుదల వేగం పుంజుకుంటుంది. ఇందుకుగాను, యువ భారతి నాలో ఎప్పుడెప్పుడు దూకుదామా అని ఆత్రుతతో ఎదురు చూస్తున్న బాలుణ్ణి బైటకు తీయడమే కాదు, ప్రపంచానికి కూడా పరిచయం చేసింది.

చరిత్రలో నాకో పేజీ ఉండకపోవచ్చు. కానీ యువ భారతి అనే పేజీలో నేను పొదగబడిన అక్షరాన్ని. చదువు పట్ల, జ్ఞానం పట్ల నాకున్న ఉత్సాహన్ని ఉదారత్వంతో ఊపిరులూది నేను గెలవాలని మనస్ఫూర్తిగా కోరుకుంది నా యువభారతి.

నిర్లక్ష్యం, బద్ధకం వల్ల పనులను వాయిదా వేసే నన్ను "నువ్వు సమాజానికి పనికొస్తావ"ని నమ్మింది తప్ప నవ్వలేదు. " కిరణు నువ్వు రేపు అరగంట మాట్లాడాలి" అని నిర్దేశించి, నేను సమాయత్తం ఆయిన తర్వాత "ఐదు నిమిషాలే నీకు'' అని అగ్ని పరీక్ష పెట్టి, అందులో నన్ను నెగ్గేలా చేసింది. అప్పుడే ఒక సత్యాన్ని తెలుసుకున్నాను. అదే "అనుకున్నది కాదు జీవితం, అనుభవించేది జీవితం" అని. ఇది చాలాదూ నాకు!!!

"ఆలోచించి మాట్లాడు, ఆలోచించి మరీ రాయి"అని గద్దించింది. మొదట్లో ఇది గుదిబండ అనుకున్నాను. కానీ తర్వాత తెలిసింది సుగంధహారం అని. ఎవరన్నా మాట్లాడుతున్నప్పుడు ప్రేక్షకుల్లో వుండి, ఆత్రుతను ఆపుకోలేక పక్కవాళ్ళతో మాట్లాడుతుంటే కన్నెర్ర చేసింది. " ఎప్పుడూ అక్కడే కూర్చుంటావా, ఇక్కడికి రావా?" అని నిలదీసింది. అలా యువభారతి నేను ఆశపడింది ఇవ్వకపోయినా, అవసరమైంది మటుకు తప్పక ఇచ్చింది. "మన విధి నిర్మాతలం మనమే " అని నొక్కి వక్కాణించింది. "జీవితాన్ని ఆనందించడంలో వున్న మౌలిక సూత్రం ఇదే " అని చెప్పింది.

చివరగా ఒక్క మాట.....

నా దగ్గర ఏమీ లేవు. శూన్య హస్తాలు తప్ప. మభ్యపెట్టే మాటలు రావు. నిష్కలంక మనస్సు తప్ప.

మురిపించే సిరులు లేవు.
పెనవేసుకున్న కష్టాలు తప్ప.
కళ్ళల్లో విషపూరిత దృశ్యాలు లేవు.
అనుభవాల కన్నీళ్లు తప్ప.

అన్నీ తెలిసి యువ భారతి నన్ను అభిమానిస్తున్నదంటే, ఏమిచ్చి ఋణం తీర్చుకోగలను నేను? ఈ ఒక్క నాలుగు మాటలు తప్ప.



# సాహిత్య కల్పతరువు

శ్రీ గొడవర్తి నరసింహాచార్య
అధ్యక్షుడు, సాధన సాహితీస్రవంతి, హైదరాబాద్
94409 27200

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చునేకంటే చిరుదీపం వెలిగించే ప్రయత్నం చేయడం మంచిది" అన్న కవి వాక్కును ఆచరణలో పెట్టి ఆరు దశాబ్దాలుగా అసమానరీతిలో సాహిత్యసేవకే అంకితమైన ఆదర్శ సంస్థ యువభారతితో నా అనుబంధం ఒక అందమైన మజిలీ..!!

1982 సంవత్సరంలో నేను హైదరాబాద్ వచ్చిన తొలినాళ్లలో గురువర్యులు దివాకర్ల వేంకటావధాని గారు, ముదిగొండ శివప్రసాద్ గార్ల సూచనతో "యువభారతి" పరిచయ భాగ్యం కలిగి, సంస్థ రథసారథులు ఇరివెంటి కృష్ణమూర్తి గారు, వంగపల్లి విశ్వనాథం గార్ల ఏకలవ్య శిష్యునిగా మలచబడ్డాను. సాహితీ రాజధానిగా పేరొందిన రాజమండ్రి (రాజమహేంద్రవరం) స్వస్థలమైన నేను ఆ సాహితీ సుగంధాల కోసం అన్వేషిస్తున్న తరుణంలో సాహిత్య నందనవనంలా భాసిల్లింది యువభారతి. క్లుప్తగోష్ఠి, సాహిత్య ఉపన్యాసాలు, కవి సమ్మేళనాల్లో పాల్గొనడం ఒక మధురానుభూతి. ముఖ్యంగా క్రమశిక్షణ, సమయపాలన అనే అంశాలు నన్ను ఆకట్టుకున్నాయి.

నందిని వార్తా సంచిక మరో సాహితీ రవికిరణంలాగా మార్గదర్శనం చేసేది. "లహరి" ప్రసంగ కార్యక్రమాలు యువభారతి కార్యక్రమ పరంపరలో స్వర్ణయుగంగా సాహితీ మిత్రుల అభిప్రాయం. ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు, డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రి గారు, డా॥ ముదిగొండ శివప్రసాద్ గారు మొదలగు సాహితీ మేరుశిఖరులు చేసిన ప్రసంగాల స్ఫూర్తి నవకవులకు జ్ఞానదీప్తులుగా నిలిచాయి. వర్షం పడుతున్నా కుర్చీలను గొడుగులుగా మలుచుకుని ప్రసంగాలను ఆస్వాదించిన అనుభూతి ఇంకా స్మృతిపథంలో మెదులుతూనే ఉంది.

ప్రసంగాలను అందించడం ఒక ఎత్తు అయితే వాటిని ప్రచురించి సాధారణ

మూల్యానికి అందించడం మరో సేవా కోణం. ఇది చిరస్థాయిగా నిలిచిపోవడమే కాక సామాన్య పాఠకుణ్ణి సైతం చదివింపచేసే సేవా దృక్పథం. ఇరివెంటి వారు, విశ్వం మాస్టారు, ఇతర పెద్దల నిబద్ధత సంస్థను ఆదర్శవంతంగా తీర్చిదిద్దాయి అనడం అక్షరసత్యం.

సమావేశాలలో కూడా సాహిత్య విలువలకే తప్ప వ్యక్తిగత విషయాలకు, పొగడ్తలకు, తెగడ్తలకు తావే లేని రీతిలో నాటి నుండి నేటివరకు కొనసాగడం విశేషం. ఆ సంస్కారమే మా "సాధన సాహితీ స్రవంతి" అలవర్చుకుందని గర్వంగా చెప్పగలను. సంస్కారం, సహృదయత వంటి పదాలను సాహిత్యానికి జతచేసిన సంస్థ మన యువభారతి.

మలినాళ్ళలో విశ్వంగారి ఆధ్వర్యంలో జరిగిన వ్యక్తిత్వ వికాస శిక్షణా శిబిరాలు సిటీ సెంట్రల్ లైబ్రరీలో జరగడం, వాటికి ఎందరో పోటీ పరీక్షల అభ్యర్థులు హాజరు కావడం, వారందరిలో పుస్తకపఠనంలో అభిరుచి కలిగించడం, సాహిత్య విశ్లేషణా శక్తిని రూపొందించడం యువభారతి కీర్తి కిరీటంలో కలికితురాయి అని చెప్పవచ్చు.

యువభారతితో కలిసి సేవాపథంలో పయనించే అవకాశం మా సాధన సాహితీ స్రవంతి, తెలుగు రథం, మానస ఆర్ట్ థియేటర్ సంస్థలకు "అక్షర" శీర్షికతో సంవత్సరం పాటు సాహిత్య సమావేశాలను శ్రీ త్యాగరాయ గానసభలో నిర్వహించడం ద్వారా లభించింది. లబ్ధప్రతిష్ఠులైన సాహితీవేత్తలు, ప్రవర్ధమాన సాహితీవేత్తలను వేదికపై సమన్వయం చేస్తూ సాహిత్య సమావేశాలను నిర్వహించడం ఒక మధుర స్మృతి. కానీ కొన్ని కారణాల వల్ల ఆ ప్రసంగ వ్యాసాలను పుస్తకరూపంలో తేలేకపోవడం ఒక లోటు. విశ్వంగారు ఎన్నిసార్లు చెప్పినా ఆ ప్రసంగ వ్యాసాలను సేకరించలేకపోవడం మా అసమర్థతగా చెప్పుకోక తప్పదు.

డాక్టర్ కె.వి.రమణాచారి గారి సారథ్యంలో రాళ్ళబండి కవితా ప్రసాద్ గార్ల ఆశీస్సులతో "ఉపనిషత్సుధాలహరి" కార్యక్రమ నిర్వహణలో అనంతాచార్యులు గారు, నాగేశ్వరరావు గారు, రవీంద్ర గారు, పూర్ణచంద్రరావు గారు, జీడిగుంట వెంకటరావు గార్ల సాహచర్యంలో పనిచేయడం ఒక ఆహ్లాదకరమైన అనుభూతిగా నిలిచింది.

మహాత్మాగాంధీ 150వ జయంతి కార్యక్రమంలో భారత వికాస పరిషత్, యువభారతి సంయుక్త నిర్వహణలో దాదాపు 1500 విద్యార్థులకు గాంధీజీ సూక్తులు పుస్తకాల వితరణ జరిగింది. కె.వి.రమణాచారి గారు, దేవులపల్లి ప్రభాకరరావు

గారు, ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారు చేసిన స్ఫూర్తిదాయక ప్రసంగాలు అందరిని అలరించాయి.

ఇలా వైవిధ్యభరితమైన ఎన్నో సామాజిక సాహిత్య కార్యక్రమాలను నిర్వహించిన జయరాములు గారు, సుధామ గారు, ఫణీంద్ర గారు వంటి సాహితీమిత్రుల సాహచర్యంలో నన్నొక సాహిత్యాభిమానిగా రూపొందించిన ఆదర్శసంస్థ యువభారతి.

ఇటీవలే జరిగిన 'మహాభారతోపన్యాసలహరి' నాటి వైభవాన్ని తలపింపచేయడమే కాకుండా, సాంకేతిక సౌకర్యాన్ని ఉపయోగించి, జాతీయ, అంతర్జాతీయ తెలుగు భాషాభిమానుల సౌకర్యార్థం Live telecast చేయడం, ఆ ఉపన్యాస కార్యక్రమాలను Youtube లో శాశ్వతంగా నిక్షిప్తం చేయడం యువభారతికే చెల్లింది.

ఇటువంటి సాహితీ కల్పతరువు మరెన్నో సంవత్సరాలు నిలవాలని... నవ, యువ, భారతీయులకు ఆలంబన కావాలని ఆకాంక్షిస్తూ... అరవయ్యవ వార్షికోత్సవ శుభాకాంక్షలతో...

"ఎందరో మహానుభావులు అందరికీ వంద వందనాలు"





రామాయణ సుధాలహరి కార్యక్రమంలో ఒక సన్నివేశం
చిత్రంలో దివాకర్ల, దేవులపల్లి, ఇరివెంటి

# 'యువభారతి విన్నపాల' విశ్వనాథం గారు

శ్రీ అంచూరి మల్లయ్య
విశ్రాంత బ్యాంక్ ఉద్యోగి, హైదరాబాద్
91008 57011

నేను జీవితంలో ఎప్పుడూ వక్తృత్వ పోటీల్లో పాల్గొన లేదు..వ్యాస రచనలూ చేయలేదు (ఒకేఒక్క సారి విద్యార్థి దశలో బి కాం చదివేరోజుల్లో పాల్గొని రెండిట్లోనూ ద్వితీయ బహుమతి తీసికోవడం తప్ప)

అవి నేను రిజర్వ్ బ్యాంక్ ఉద్యోగంలో చేరాను.అంటే దాదాపు రెండు రెండున్నరేండ్లే అయింది(1969 ఆ ప్రాంతంలో అని గుర్తు). అప్పటి..మా సహోద్యోగి శ్రీ గౌరినాథ శాస్త్రిగారు ఒక రోజు నాతో 'ఏమోయ్!!నీక్కొంచెం తెలుగు సాహిత్యం పట్ల అభిరుచి, ఆసక్తి,అభిమానం,ఇష్టం ఉందని విన్నాను.ఇదిగో!!రేపు ఇక్కడే.. మనకు దగ్గర్లోనే..(అప్పుడు మా బ్యాంక్ కొన్ని విభాగాలు అప్పటి ఆంధ్రా బ్యాంక్ కేంద్ర కార్యాలయం భవనాల్లో (సుల్తాన్ బజార్) ఉండేవి)ఒక దాంట్లో పనిచేసే వాణ్ని. కోఠీలోనే శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయంలోనే.. జరిగే సమావేశానికి రా"అంటూ చిన్న కరపత్రాన్ని ఇచ్చాడు. వెంటనే పట్టించుకోలేదు..కాని ఇంటికివెళ్లి ఒక్కమారు చూస్తే సమావేశం చివర "విన్నపాలు" వంగపల్లి విశ్వనాథం గారిచే అని ఉండడం గమనించిన నాకు ఎందుకో ఈ వి విశ్వనాథం గారు మా బి. కాం మొదటిసంవత్సరంలో (1963-64) మాకు పాఠాలు నేర్పిన గురువు గారిలా ఉ న్నట్లుందే అనిపించి తెల్లవారి గౌరీనాథ శాస్త్రిగారినడిగితే "ఔనోయ్..ఆయనే!! నేనూ ఆయన కొంతకాలం యస్.బి.ఐ లో పనిజేశా"మన్నాడు.అది విన్నాక నా ఆనందానికవధుల్లేకుండా పోయాయి ..ఎందుచేతనంటే..(వీడు హద్దుమీరుతున్నా డంటూ మా గురువుగారు ఆగ్రహించక క్షమించాలి) వారి గురించి అల్లరిపట్టించడానికి ఆటపట్టైన మా వరంగల్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజ్ విద్యార్థిలోకంలో ఒక గుస గుస ఉండేది.. ఏమనీ.. "అరేయ్!!సార్ రూపంలోనే కాదు..భాషలో (ఆంగ్లంలో గూడా)ఎంత

దిట్టరా అని. కాబట్టి, “ఐననుపోయిరావలయు హస్తినకున్”అన్నట్లుగా సమావేశానికి పోయి సారు తెలుగు భాషనుగూడా వినాలి అన్న దృఢసంకల్పంతో వెళ్లి వారి.. విశ్వనాథం గారి.. విశ్వరూపం చూశాను.తెలుగుభాష దిగ్గజాల్లాంటి పండిత ప్రకాండుల ఉపన్యాసాలకు దీటుగా వారి “విన్నపాలు” భాషాప్రియులందరినీ ఆకట్టుకొన్నాయి..అలరించాయి.విశిష్టమైన శైలిలో,వినసొంపైన భాషతో,స్పష్టతతో వారి విన్నపాలు నిజంగానే అన్నమయ్య బాణీలో చెప్పా లంటే.. “విన్నపాలు వినవలె వింత వింతగా”అంతే.. నాటి నుండి నేటివరకు విశ్వనాథం గారి అసలు ఇంటిపేరు మరచిపోయి వారు “విన్నపాల విశ్వనాథం” గారు గానే గుర్తుండిపోయారు యువభారతి సాహితీ బంధువులందరికీ.. యువభారతి అంటే విశ్వనాథం గారు..విశ్వనాథం గారంటే యువభారతి అన్న స్థాయికి ఎదిగారు వారంటే అణుమాత్రంగూడా అతిశయోక్తి లేదు.వాస్తవం జెప్పాలంటే యువభారతి శైశవదశలో వారిల్లే సంస్థ కార్యాలయానికి నెలవు.తొలిదశలోని సంస్థ ప్రచురణలను చూస్తే ఈ విషయం సుస్పష్టంగా తెలుస్తుంది.

హరిహరుల్లా..నరనారాయణుల్లలా బాలభారతి “యువభారతి”కి తోడుగా..నీడగా,అండగా “దండగా” నిలిచిన ద్వయం సంస్థ అధ్యక్షులు స్వర్గీయ ఇరివెంటి కృష్ణమూర్తి గారు మరియు సంస్థ వ్యవస్థాపక సమావేశకర్త వంగపల్లి విశ్వనాథం గారు.కవి పండితుల శ్రేణుల్లో ప్రముఖులెందరో ఎందరో గౌరవాధ్యక్షులుగా ఉన్నా, వీరిద్దరి సారథ్యంలో సంస్థ ఎంతటి ఉన్నత శిఖరాలనధిరోహించిందో,తెలుగు భాషా సాహిత్యనికెంతటి ఉత్కృష్ట సేవజేసిందొ సాహితీ ప్రియులందరికీ తెలుసు.సాహిత్యం పేరుతో ఎన్నో సంస్థలు వచ్చాయి..పోయాయి.కాని నిస్వార్థంగా కేవలం సాహితీ సేవాభావంతోనే మరపురాని మహత్తరమైన,ఎనలేని సేవలందించింది మాత్రం ఒక్క యువభారతే!!పేరుకు యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ ఐనా కేంద్రీకృతంగా కేవలం సాహిత్యానికే పెద్ద పీట వేసి ఆ దిశగా తెలుగు భారతికి ఎన్నోవిధాలుగా సేవజేసింది/ చేస్తుంది.

నెల నెలా వెలువడుతుండే “నందిని” భాషాభిమానులకు హృదయానందిని ఐంది!!.లక్ష ఇళ్లు చేరాలనే ఏకైక దృఢ లక్ష్యంతో ఒక్క రూపాయి.. కేవలం ఒక్క రూపాయికే మన తెలుగువారి పుణ్యాలపేటి పోతన గారి భాగవత మాధుర్యాన్ని చవిచూపించే “మందార మకరందాలు” అందించడానికి ఏ సంస్థ ముందుకొచ్చింది? పదిరూపాయలకే..అంతకు మించిన విలువగల పుస్తకాలందిస్తూ సంవత్సరంపాటు “సాహితీ మిత్ర” సభ్యత్వాన్నిస్తూ..కూడా కొనబోయే పుస్తకాలపై రాయితీ ఇచ్చిన వారెవరు? మన యువభారతి వారు తప్ప!!మన “మహతి”ఎందరో సాహితీ పిపాసులకు

"రిఫరెన్సె బుక్" ఔతుంది!!ఎందరో సాహిత్యాభిమానుల మనోవీణల్ని మీటుతుంది. ఇక మన "లహరి"సంపుటాలు ఎంతమంది సాహిత్య పరిశోధకులకుపకరిస్తుందో! ప్రతి తెలుగువాడు భద్రపరచుకోదగ్గ ఎన్ని ప్రచురణలు గావించిందో!!ఎవరి మాటెలా ఉన్నా వ్యక్తిగతంగా "మందార మకరందాలు" మరియు "రామాయణపరమార్థం," " భారతీ వైభవం" నా ఉద్యోగ విరమణానంతర విశ్రాంత జీవితం కోసం నేను చేపట్టిన రికార్డింగ్ ప్రక్రియలో భాగాలై నిలిచిపోయాయి. అతులితమైన ఆనందాన్నిచ్చాయి..ఒక రకంగా నాకు గర్వ కారణాలుగూడా ఐనాయి. సమయం,సందర్భం వచ్చినప్పుడల్లా "మా యువభారతి"అని రికార్డింగుల్లోగూడా చెప్పుకుంటూ..మురిసిపోతూ పొంగిపోతుంటాను.

ఇవన్నీ ఒక ఎత్తైతే యువభారతి వారు నిర్వహించిన సాహిత్యోపన్యాసాలు మరో ఎత్తు.. దివాకర్ల, జంధ్యాల, దాశరథి, సి.నా.రె,జి.వి.సుబ్రహ్మణ్యం, ముదిగొండ లాంటి మన ఉమ్మడి రాష్ట్ర ప్రముఖ తెలుగు భాషాకోవిదులేగాక పొరుగురాష్ట్రాల చల్లా రాధాకృష్ణ, బడాల రామయ్య లాంటి వాళ్ల ఉపన్యాస మాధుర్య ఝరిలో ఓలలాడుతూ కిక్కిరిసిపోయిన వేలాది సాహిత్యాభిమానులైన శ్రోతలతో కళకళ లాడిన ఆనాటి ఆంధ్రసారస్వతపరిషత్తు ప్రాంగణంలో జరిగిన సభలను గురించి తలచుకుంటే మది ఆనందంతో పరవళ్లుతొక్కుతుంది..నిజంగా ఆ రోజులూ యువభారతి స్వర్ణదినాలు. అవి మళ్లీ రావాలని ఆశిద్దాం!!

యువభారతి కార్యక్రమాల్లో పాల్గొనడం నా కెంతో ముదావహం. ముంబాయికి బదిలీ అయేంతవరకు..హైదరబాదులో ఉన్నంతకాలం.. నా పరిధిలో.. ఉడుతాభక్తిగా..''నేను సైతం'' అంటూ సంస్థకు సేవజేసుకునే భాగ్యం లభించింది. తద్దిశగా ఇరివెంటివారిచే బ్యాంకులో చిన్న ఉపన్యాసాలేర్పాటుజేసి సహోద్యోగ మిత్రుల నెందరినో సాహితీ మిత్రులుగా/భారతీ మిత్రులుగా చేర్పించాను. సంస్థలో పనిజేసే కీ.శే.జహంగీర్ సహాయ సహకారాలతో మన ప్రచురణలను అమ్మించాను. సంస్థ గురించి అప్పుడప్పుడు తిలక్ రోడ్లోని మన యువభారతి కార్యాలయం పక్కనే ఉన్న ఇరాని హొటల్లో కార్యదర్శి నాగేశ్వర్రావుగారితో కూర్చొని ముచ్చటించుకునే వాణ్ని.. ఇప్పటికీ ఇంకా ఇంకా చేయాలనే ఉంది. కాని.."చేవగల కాలమెంతయో చెల్లిపోయె, ఏమిసేయగనున్నాడొ ఈశ్వరుండు"?



# యువభారతితో నా అనుబంధం

శ్రీ మరుమాముల దత్తాత్రేయశర్మ
విశ్రాంత ఉపన్యాసకులు
94410 39146

నాటికీ నేటికీ వన్నె తరగని క్రియాశీలక సాహిత్య సంస్థ ఏదైనా ఉందా అంటే అది కేవలం యువభారతి మాత్రమే. మఖలో పుట్టి పుబ్బలో మాడిపోయిన సంస్థలు ఎన్నో ఉన్నాయి. ఒక నిర్దిష్ట లక్ష్యంతో, సక్రమ ప్రణాళికతో తన పని తాను చేసుకుంటూ జాతికి తేజాన్నిచ్చే భాషా సాహిత్యసేవలో తరించిన యువభారతి లాంటి సంస్థలు దేశంలోనే అరుదు. చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిడుతూ కూర్చునే కంటే ప్రయత్నించి చిన్న దీపాన్నైనా వెలిగించడం మంచిదన్న సూక్తి యువభారతికి స్ఫూర్తి. ఆ స్ఫూర్తే యువభారతిని వజ్రోత్సవాల దిశగా నడిపింపజేస్తోంది.

1963 విజయదశమి రోజున యువభారతి పుట్టింది. దాని తర్వాత రెండు రోజులకే (శోభకృత్ ఆశ్వయుజ శుద్ధ ద్వాదశినాడు)నేను పుట్టాను. ఇంచుమించుగా యువ భారతి నేను ఒకేసారి జన్మించాం.

అయినా యువభారతి తో నాకు ప్రత్యక్ష అనుబంధం ఏర్పడింది 1983లో తెలుగు ఎమ్మేలో చేరినవెంటనే. సైన్స్ గ్రాడ్యుయేట్ గా సిద్దిపేట వదిలి భాగ్య నగరానికి స్నాతకోత్తర స్థాయి చదువుకు వచ్చిన సమయంలో నాకు దారిదీపం యువభారతి రచనలే. మాఇంట్లో మా పెద్ద నాన్న గారివద్ద ఉన్న పుస్తకాల భాండాగారం లో యువభారతి ప్రచురణలెన్ని ఉన్నప్పటికీ హైదరాబాద్ లో బొగ్గులకుంట తిలక్ రోడ్ సారస్వత పరిషత్తు భవనంలోని యువభారతి కార్యాలయంలో ఇష్టపడి కొనుక్కుని చదివిన పుస్తకాలతోనే నా సాహిత్య జిజ్ఞాస ఇనుమడించింది.

అప్పుడప్పుడే వెలుగు చూస్తున్న యువకవులను ప్రోత్సహించాలన్న ఉద్దేశంతో యువభారతి సంకల్పించిన మినీ కవితా సంకలనానికి నేనూ ఒక రచన పంపించాను. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే యువ భారతి 'రవ్వలు' సంకలనలో నా కవిత ప్రచురించబడుతుందని ఒక కార్డు ముక్క ఉస్మానియా యూనివర్సిటీ A హాస్టల్ ,

రూమ్ నెంబర్ 14 అడ్రస్ కొచ్చింది. ఆ కార్డు చూసి నేను పొందిన ఆనందం మాటల్లో వర్ణించలేను. నిజంగా ఎగిరి గంతేశాను. నా రచనల్లో మొట్టమొదటిసారిగా ముద్రితమవుతున్న కవిత కూడా అదే. "తీరని కోరిక " పేరుతో రాసిన నా కవిత రవ్వల్లో (మినీ కవితా సంకలనంలో ) చోటు చేసుకోవడం నా రచనా ప్రస్థానానికి బీజవాపన చేసింది.

పూర్వ కవుల పురాణేతిహాసాలను, ప్రాచీనకవుల కావ్యమధురిమలను, అర్వాచీనకవుల కావ్యాదర్శాలను, ఆధునిక కవుల ప్రయోగవిన్యాసాలను, ప్రాచీనాటకాలంకారాల పరిచయాలను, సవిమర్శకంగా, సప్రమాణంగా విభిన్న కోణాలలో సాహిత్యానుశీలనాన్ని పరిచయం చేసింది యువభారతి "లహరి" ప్రచురణల పరంపరలే. భారతీ మిత్రునిగా, భారతీ భూషణునిగా ప్రతిరచనను ఆత్రంగా చదువడం యువభారతి వల్ల నాకు అలవాటయింది. నిత్యకృత్యంగా సాహిత్యానుశీలనాన్ని యువభారతే నేర్పింది. సభానిర్వహణలో, సమయపాలనలో యువభారతి ఆదర్శాలే అనుసరణీయాలయ్యాయి.

తక్కువ ధరలో విలువైన పుస్తకాలు లభించడం, సభ్యులకు ఉచితంగా అందించడం, కొన్ని అపూర్వ గ్రంథాలను ప్రచురణ పూర్వ విరాళాలతో సరసమైన ధరలకే అందించడం, అందంగా, చదువదగిన శైలిలో ఆహ్లాదకరమైన ముఖచిత్రాలతో ముద్రించడం యువభారతికున్న విలక్షణ లక్షణాలు. యువభారతి నిఖార్సైన ఏ లాభాపేక్షలేని స్వచ్ఛంద సేవా సంస్థ కనుక ప్రతి ఇంట్లో కనీసం కొన్ని తెలుగు పుస్తకాలు అయినా ఉండాలని ప్రతి తెలుగువాడు కొన్ని తెలుగు పుస్తకాలనయినా చదువాలనే అద్భుత సంకల్పాన్ని అక్షరాలా నిర్వహించి నిరూపించింది.

ఆ సంకల్పం నిరాటంకంగా సాగుతున్న రోజుల్లోనే నేను యువభారతీయుడిని కావడం నా అదృష్టం. బహుభాషావేత్త, మహావక్త, అంతర్ముఖులైన విద్వన్మణి డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు నాకు ఎంఫిల్ లో మార్గదర్శకులు. ఎంఏలో ప్రత్యక్షంగా నేను వారి వద్ద చదువుకోకపోయినా పరోక్షంగా ఇలా వారి శిష్యుడనై ఎంఫిల్ విద్యార్థిగా మార్గదర్శనం పొందగలిగిన భాగ్యవంతుడను. యువ భారతి అధ్యక్షులుగా వారిని వేదికపై వింటూ ఎదిగిన నేను ఎప్పటికైనా వారిని కలుసుకోగలనా? వారితో మాట్లాడగలనా? అన్న కోరికను భగవంతుడిలా తీర్చాడు. వారితో మాట్లాడడమే ఒక ఎడ్యుకేషన్ అన్నది అక్షర సత్యం. నాకు బెజవాడ గోపాల రెడ్డి గారి వంటి మహనీయుల పరిచయాన్ని కలిగించింది, ముట్నూరి కృష్ణారావు గారి సంపాదకీయాల పైన సిద్ధాంత

వ్యాసాన్ని రచింపజేయించింది వారి ప్రియ అంతేవాసిత్వమే. విశిష్టమైన యువభారతి కార్యక్రమాలకు వారితో కలిసి వెళ్ళగలిగిన అదృష్టం నాకు ఎన్నో సార్లు లభించింది. ఇద్దరం కలిసి విద్యానగర్ నుంచి బస్సులో బయలుదేరి హిమాయత్ నగర్ లో దిగి, బస్ స్టాప్ ఎదురు సందులో నడుస్తూ చిక్కడపల్లి సిటీ సెంటర్ లైబ్రరీ హాల్లో ఉపన్యాసాలకు వెళ్లడం నా కిప్పటికీ గుర్తే.

ఒక దశలో మా తరువాత యువ భారతిని నడపాల్సింది మీరే అన్న ఇరివెంటి వారి మాట కూడా ఈనాటికీ నా మనసులో భద్రంగా నిలిచిపోయింది. వారి హఠాన్మరణం యువభారతి కెంత తీరని లోటో వ్యక్తిగతంగా నాకు అంతే. ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ఆచార్య జీ.వీ.సుబ్రహ్మణ్యం, ఆచార్య సి. నారాయణ రెడ్డి, ఆచార్య రవ్వాశ్రీహరి, ఆచార్య ఎస్వీ జోగారావు, డా. దేవులపల్లి రామానుజరావు, ఆరుద్ర, కాళోజీ, కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావుగారల వంటి ఎందరో మహనీయుల ప్రసంగాలు వినడం, రచనలు చదువగలగడం యువభారతి కలిగించిన అపూర్వ వరమే.

కార్యక్రమాల రూపకల్పనలో నిర్వహణలో ఆచార్య వంగపల్లి విశ్వనాథం, సుధామ,మాడభూషి అనంతాచార్య, శ్రీమతి కే.బీ.లక్ష్మి, నాగేశ్వరరావు వంటి మహితాత్ముల నిబద్ధత, దీక్షాదక్షతలే యువభారతిని ఎప్పుడూ నిలబెట్టాయి.

గురుకుల విద్యాలయాల సంస్థలో ఉద్యోగిగా మారుమూల గ్రామీణ ప్రాంతాల్లో పనిచేయడం వల్ల యువభారతికి కొంత దూరమైనప్పటికీ ఉద్యోగం చేసినన్నాళ్ళు యువ భారతి పుస్తకాలే నా వెంట ఎప్పుడూ ఉంచుకునేవాడిని.

మా తరానికి ప్రతినిధిగా సుహృన్మిత్రుడు, కవిదిగ్గజ, సద్విమర్శకులు డా. ఆచార్య ఫణీంద్ర గారు యువభారతి అధ్యక్షులుగా ఉండడం, వారి నేతృత్వంలో పురావైభవాన్ని సంతరించుకునే దిశగా యువభారతి కార్యక్రమాలు కొనసాగుతుండడం ఎంతో ఆనందంగా ఉంది. యువభారతి షష్టిపూర్తిలో భాగస్వామినైనందుకు పొంగిపోతూ ...



# "యువభారతి"తో స్వర్ణోత్సవ సంబంధం

డా॥ వడ్డేపల్లి కృష్ణ
సినీకవి, దర్శకుడు, హైదరాబాద్,
92465 41699

1970 ప్రాంతంలో నాకు యువభారతితో పరిచయం ఏర్పడింది. అప్పుడే డా॥ఇరివెంటి కృష్ణమూర్తి. డా॥జి.వి.సుబ్రహ్మణ్యం, వంగపల్లి విశ్వనాథంగార్లతో అనుబంధం కలిగింది. ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణంలో అనేక సమావేశాల్ని ఏర్పాటు చేస్తూ సమావేశకర్తగా వంగపల్లి విశ్వనాథం సమావేశాల కరపత్రాన్ని విడుదల చేసేవారు. ఆచార్య దివాకర్ల వేంకటావధాని, పుట్టపర్తి నారాయణాచార్యులు, గడియారం రామకృష్ణశర్మ, విశ్వనాథ, సినారె, మొదలగు సాహితీ దిగ్గజాలతో 'కావ్యలహరి', 'ప్రతిభాలహరి', 'వికాసలహరి' పేర్లతో మన పంచకావ్యాల విశేషాలపై ఉపన్యాస కార్యక్రమాన్ని నిర్వహించేవారు. కాళోజీ గారిచే ఖలీల్ జీబ్రాన్ కవిత్వాన్ని 'జీవనగీత'గా, పోతన్న భాగవత శబ్దార్థ విశ్లేషణల్ని సి.నా.రె.గారిచే 'మందార మకరందాలు'గా, వేమన్న ఆటవెలదుల ఆంతర్యాన్ని ఆరుద్రచే 'వేమన్న వేదం'గా ఉపన్యాసాల పరంపరను కొనసాగించి, పుస్తకాలుగా ప్రచురించి, వాటిని అందరూ కొని చదివేలా కేవలం రెండు రూపాయలకే విక్రయించేవారు.

నేను సిరిసిల్లలో పోస్టాఫీసులో పనిచేస్తూ ఆ పుస్తకాల్ని ఎమ్.ఓ.ద్వారా డబ్బుచెల్లించి 'బుక్ పోస్ట్'లో తెప్పించుకునేవాడిని. 5రూ.చెల్లిస్తే 3 పుస్తకాల్ని 1రూ. తగ్గింపుతో పంపించేవారు. ఈ పథకంలో కొందరు మిత్రుల్ని చేర్పిస్తే 'గిఫ్ట్'గా కొన్ని ఎంచుకున్న పుస్తకాల్ని పంపేవారు. అలా ఈ 'పుస్తక పథకం' మూడుపువ్వులు– ఆరు కాయలుగా వ్యాప్తి చెందింది.

ఇప్పుడు సి.నా.రె.గారు తమ ఎం.పి.లాడ్స్‌తో కట్టించిన నూతన భవన ప్రాంతమంతా అప్పుడు ఖాళీ స్థలంగావుండి యువభారతి కార్యక్రమాలను విశాల

వేదికతో అనువుగా అలరించేది. కార్యక్రమాలన్నీ వంగపల్లి విశ్వనాథంగారు రేడియోటైమ్‌లా ప్రకటించిన సమయానికే ప్రారంభించేవారు. కావున అందరూ సకాలంలో విచ్చేసి ప్రసంగించేవారు. ప్రేక్షకులు కూడ ఆలస్యంగా వచ్చినా కుర్చీలు లేక నిలబడాల్సి వచ్చేది. అంతటి క్రమశిక్షణతో, సమయపాలనతో ఆ రోజుల్లో 'యువభారతి' సాహిత్య కార్యక్రమాలు జరుగుతూ వుండేవి. ఇప్పటిలాగా ముక్తసరిగా కాక పత్రికలు కూడా సమావేశాల్లో ఎవరెవరు ఏమి మాట్లాడారో వివరంగా వార్తలుగా ప్రచురించేవి. కావున స్థానికేతర ప్రాంతాల పాఠకులకు కూడ ఈ విశేషాలన్నీ తెలియవచ్చేవి.

అప్పుడప్పుడు నాబోటి సాహితీ మిత్రులం హైద్రాబాద్ వచ్చి సాహితీ కార్యక్రమాల్ని ఆసక్తిగా తిలకించేవాళ్ళం! మహాకవుల ప్రసంగాల్ని మనసారా ఆస్వాదిస్తూ ఆనందించేవాళ్ళం! అప్పుడే నాకు కార్యక్రమాల నిర్వహణకు చేదోడువాదోడుగా వ్యవహరించే సుధామ, తాళ్లపల్లి మురళీధరగౌడ్‌లతో పరిచయం ఏర్పడింది. ఆ పరిచయం కాస్తా చెరగని స్నేహంగా స్థిరపడింది. సుధామ చేతిరాతలు గుండ్రంగా అందమైన అచ్చుఅక్షరాలుగా తోచేవి. నా మొదటిగేయసంపుటి "కనరా నీదేశం" కు కవరుపేజీ ముఖచిత్రం వేయించడానికి నన్ను ఈ మిత్రులిద్దరూ అప్పటికే అనేక యువభారతి ప్రచురణలకు చిత్రకారుడుగా వున్న శీలావీర్రాజుకు పరిచయం చేశారు. ఆ తర్వాత నా మలికృతి 'అంతర్మథనం' కు సుధామయే ముఖచిత్రం వేసిచ్చాడు.

ఆంధ్ర సారస్వతపరిషత్తులో జరిగే 'యువభారతి' కార్యక్రమాల కన్నిటికీ దేవులపల్లి రామానుజరావుగారే అధ్యక్షత వహించేవారు. హైకోర్టు ప్రధాన న్యాయమూర్తియైన ఆవుల సాంబశివరావుగారు తరచుగా ముఖ్యఅతిథిగా వచ్చేవారు.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాల్ని పురస్కరించుకొని, 1972లో యువభారతి వంద వ్యాసాల్ని వివిధ సాహిత్య సాంస్కృతిక అంశాలపై విశిష్ట సాహితీవేత్తలచే వ్రాయించి, వందతంత్రులున్న నారదుని వీణయగు 'మహతి' పేరున ప్రచురించి వెలువరించారు. ఆరేడువందల పేజీల 'మహతి'ని 20/-రూ॥కే విక్రయించినా, ప్రచురణ పూర్వవిరాళంగా కేవలం 7/-రూ॥లు చెల్లించినా సాదరంగా ఆదరించారు. ఇట్టి ఘనత యువభారతికే చెల్లింది.

యువతను ప్రోత్సహించే నెపంతో యువభారతి వెలువరించిన 'నందిని' మాసపత్రికకు సుధామను సంపాదకుడిగా నియమించింది. ఈ 'నందిని'లో పుస్తక

సమీక్షలు, కవితలు, కథలు వగైరా ప్రచురణకు నోచుకొనేవి. ఆరోజుల్లో ఇరివెంటి కృష్ణమూర్తిగారి సంపుటి "రేణువులు' పై నేను సమీక్షా వ్యాసం వ్రాసిపంపగా అందులో ప్రచురితం కావడం విశేషం. అది చదివి ఇరివెంటి గారు నన్ను అభిమానించి అభినందించారు.

క్రమక్రమంగా కాలక్రమేణ, వివిధ మీడియా కార్యక్రమాల విజృంభణ వల్ల సాహిత్య సమావేశాలకు ప్రేక్షకుల కొరత ఏర్పడింది. కొన్నాళ్ళు నగర కేంద్ర గ్రంథాలయం హాలులో యువభారతి ప్రతి మూడవ ఆదివారం అనుకుంటాను, సాహిత్య సమావేశాల్ని కొనసాగించింది. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం తదుపరి డా॥తిరుమల శ్రీనివాసాచార్యగారు, మాడభూషి అనంతాచార్యులుగారు అధ్యక్షులుగా, ఆ తర్వాత పద్యకవిగా రాణిస్తున్న ఆచార్య ఫణీంద్ర అధ్యక్షులై 'యువభారతి' కార్యక్రమాలను పునరుద్ధరించే కార్యాలను చేపట్టారు.

ఇటీవల భారతేతిహాసంలోని ధర్మ, నీతి, భక్తి సంబంధిత అంశాలపై శలాక రఘునాథశర్మ, గరికిపాటి నరసింహారావు, సామవేదం షణ్ముఖశర్మ, ఎన్.అనంతలక్ష్మి గంగాధరశాస్త్రి, ప్రభృతులచే 'మోతీనగర్' లో ప్రసంగాలు నిర్వహించగా ఆయిదారు వందల ప్రేక్షకులు అరచేతుల్లోని ఫోన్లు అనేక ఆటంకాలు కల్పిస్తున్నా హాజరై ఆస్వాదించడం విశేషం. కావున ద్విగుణీకృత ఉత్సాహంతో ఫణీంద్ర మళ్ళీ రామాయణ కావ్యంలోని మానవీయ సంబంధాల గూర్చి బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు గారిచే ఇటీవల ఉపన్యాసలహరి నిర్వహించి కృతకృత్యులయ్యారు.

అరవై యేళ్ల షష్టిపూర్తితో వజ్రోత్సవ వేడుకకు సిద్ధమైన 'యువభారతి' మళ్ళీ పూర్వ వైభవంతో వర్ధిల్లాలి. చిరకాల మైత్రి కలిగిన నేను మనస్ఫూర్తిగా ఆశిస్తూ శుభాకాంక్షలందజేస్తున్నాను – నా గేయ మాలిక సమర్పిస్తున్నాను....

నాటి మేటి 'యువభారతి' – నేటి కిది ప్రౌఢ భారతి!
అరుదగు కార్యక్రమాల – అరవయ్యేళ్ల సేవలతో
అలరారిన యువభారతి – ఆయెను ఆ సరస్వతికి
అపురూపపు నవహారతి – వజ్రోత్సవ శుభకీరితి!



# ' యువభారతి'తో నా అనుబంధం

శ్రీ సబ్బని లక్ష్మీనారాయణ
రచయిత, విశ్రాంత ఉపన్యాసకులు, కరీంనగర్
89852 51271

యువభారతి – అమృత భారతి. 'యువభారతి' ది (1972–2022) యాభై యేండ్ల ప్రస్థానం. "చుట్టూరా ఆవరించుకొని వున్న చీకటిని తిట్టుకుంటూ వూరికే కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అనే సదాశయంతో మహామహులైన కవులు రచయితలచే స్థాపించబడిన సంస్థ 'యువభారతి'. భారత దేశ స్వాతంత్ర్యానంతరం ఇరువది అయిదు యేండ్లు అయిన సందర్భంగా 1947నుండి 1972 వరకు వచ్చిన తెలుగు నేలలోని సాహిత్య వికాసం పై మహామహులైన రచయితలచే విశేష వ్యాసాలు వ్రాయించి 'మహతి' అనే బృహత్ గ్రంథాన్ని ప్రచురించింది 'యువభారతి'. మరలా 1972 నుండి 2022 వరకు ఈ యాభై యేండ్లల్లో తెలుగు నేలలో జరిగిన సామాజిక, సాహితీ వికాసం గురించి ప్రసిద్ధులైన రచయితలచే వ్యాసాలు వ్రాయించి 'అమృత భారతి' పేరున మరొక పుస్తకం ప్రచురించింది 'యువభారతి'.

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చి డెబ్బయి అయిదు యేండ్లు అయి దేశం అమృతోత్సవం జరుపుకుంటున్న సందర్భంగా 'అమృత భారతి ' పేరున వచ్చిన పుస్తకం ఇది. అందులో తెలుగు నేలలో వచ్చిన సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిణామాలు, వివిధ అంశాలపై ప్రసిద్ధులైన రచయితల విశేషమైన వ్యాసాలు ఉన్నాయి. అందులో నేను వ్రాసిన 'తెలుగు సాహిత్యంలో మినీ కవితా రూపాలు ' అనే వ్యాసం కూడా ఉంది. అలా యువభారతి తో నా సాహితీ ప్రస్థానం మొదలయ్యింది సెప్టెంబర్, అక్టోబర్ 2022 సంవత్సరం నుండి. 'అమృత భారతి' పుస్తక ఆవిష్కరణ నాడు సభలో పాల్గొని సన్మానింపబడ్డాను. ఆనాడే 'యువభారతి ' శాశ్వత సభ్యత్వం కూడా తీసుకున్నాను. అలా 'యువభారతి' తో నా అనుబంధం కొనసాగుతూంది.



# యువభారతి యౌవన భారతి

డా॥ సంగనభట్ల నరసయ్య
సాహితీవేత్త, విశ్రాంత ప్రాచార్యులు, హైదరాబాద్
94400 73124

యువభారతి నేటితరానికి పాతదేమో కానీ మా తరానికి నిజంగా యువభారతి. ఆనాడు మేమంతా యువకులం. నేను 1972-74 ప్రాంతాల్లో శ్రీ లక్ష్మీ నరసింహ సంస్కృతాంధ్ర కళాశాల (ధర్మపురి జిల్లా) కరీంనగర్ లో BoL విద్యార్థిని. సాహిత్యాధ్యయనంతో పాటు ఈ యువభారతి ఆవిర్భావం మాలో కొత్త చైతన్యానికి, సాహిత్య స్ఫూర్తికి, నూతన ఆలోచనా విధానానికి నాంది పలికింది. ఈ సంస్థ హైదరాబాద్ "సారస్వత పరిషత్" లోనే ఆవిర్భవించినా మా ప్రాంతాల్లోనే ఉన్నట్లు భావించాం. సభ్యత్వం తీసుకోవడం, కరపత్రాలు అందుకోవడం, పుస్తకాలు తెప్పించుకోవడం మాకు fashion, passion..!!

సంస్థ నిర్వహణలో ఎంత నిబద్ధత చూపేవారో, ఎంత క్రమశిక్షణ, సమయపాలన ఉండేదో..!! నేనప్పుడు ధర్మపురిలో "శేషప్ప సాహితీ మిత్రమండలి" ని నడిపేవాడిని. ఈ సంస్థ (యువభారతి) కార్యక్రమాలు తెలిపేవాడిని. ఇరివెంటి కృష్ణమూర్తిగారు, వంగపల్లి విశ్వనాథం గారు, జి వి సుబ్రహ్మణ్యం గారు వంటి దిగ్గజాలు ఎందరో.. సాహితీమూర్తులు ఎందరో... నిర్వాహకులు ఎందరో..! సుప్రసిద్ధ రచయితల లేఖినుల నుండి వచ్చే సాహిత్య నిధులు కొత్త ఆలోచనలు మమ్మల్ని ఉత్తేజితుల్ని చేసేవి. శీలా వీర్రాజు గారు వేసే ముఖచిత్రాలు, అందమైన అక్షరాలతో ముద్రణ అన్నీ వింతలే.

ఈ సంస్థ ప్రవేశపెట్టిన మరో వింత ఏమిటంటే "ప్రచురణ పూర్వ విరాళం". ఈ మాటే అంతకు ముందు నేను వినలేదు. ఫలానా పుస్తకం రాబోతోంది అనగానే మనీ ఆర్డర్ చేసేవాడిని. పుస్తకం తక్కువ ధరకు ముఖ్యంగా విద్యార్థులకు కూడా అందుబాటులోకి వచ్చేది. నిజంగా వావిళ్ళ వారు చేసిన ముద్రణా కృషి, యువభారతి

చేసిందంటే అతిశయోక్తి కాదేమో. అప్పటికి మాకు వావిళ్ళ వారివి తక్కువ ధరలో ప్రాచీన కావ్యాలు అందుబాటులో ఉండేవి. వాటికి వ్యాఖ్యలు యువభారతి ప్రచురించే పుస్తకాలు. అందువలన రెండు సంస్థలవి కొనేవాడిని. కొనడం చదువడం హాబీలైన నాకు ఈ రెండు సంస్థల ప్రచురణలు పండుగే.

సుప్రసిద్ధ సాహితీమూర్తులపై సుప్రసిద్ధ పండితుల ప్రసంగాలు "లహరి" పేరుతో రావడం, ఆ ఉపన్యాస కార్యక్రమాలు కూడా (కరపత్రంగా వచ్చినవి) గ్రంథంలో పెట్టడం గమ్మత్తుగా ఉండేది. నన్ను కట్టిపడేసిన గ్రంథం "కావ్య లహరి". యువభారతి ఉత్కృష్ట గ్రంథాల్లో ఇది ఒకటి. ఆ గ్రంథం పునర్ముద్రితం ఐతే, దానిమీద ప్రేమతో ఇటీవల మళ్లీ కొన్నాను. గత స్మృతుల్లోకి వెళ్లాను. రెండోది "చైతన్య లహరి". ఇది ఉత్కృష్ట సాహిత్య విమర్శ గ్రంథం. ఆ ఉపన్యాస కార్యక్రమాలకు 'లహరి' అన్న నామకరణమే భావుకంగా, అర్థవంతంగా, సాహితీమూర్తుల ఆవిష్కరణగా ఉండేది. నేను ఈ గ్రంథంలోని తిక్కన వ్యాసం చదివి మరుచూపుతో మా ఓరియంటల్ కళాశాలలో, ఉపన్యాస స్పర్థలో బహుమతి పొందాను. మహా భారతం 18 పర్వాలు దొరకక ముఖ్యమైన పద్యాలు, కవితా సౌందర్యంతో మిసమిసలాడే "ఉటంకించిన పద్యాలు" కంఠస్థం చేసేవాళ్లం. "విరాటపర్వం దొరకకుంటే ఏమైంది?.. చైతన్యలహరి గ్రంథం ఉందిగా..!" అనుకునేవాడిని. నాడు ప్రసిద్ధ గ్రంథాలకు వ్యాఖ్యలు తక్కువ. ముఖ్యంగా భారతానికి. సుప్రసిద్ధులైన దివాకర్ల వంటి వారి ప్రసంగ లహరులే మాకు విజ్ఞాన భిక్ష పెట్టేవి. నావద్ద అన్ని లహరులూ ఉన్నాయి. "కొనిపించేది – చదివించేది యువభారతి".

యువభారతి ప్రచురణలో మరొక గొప్ప గ్రంథం "మహతి". నిర్వాహకుల శ్రద్ధ వ్యాసకర్తల నిజాయితీ, రచనా మాధుర్యం, కూలంకష విజ్ఞానం నన్ను కట్టిపడేసింది. నాకు అది ఒక విజ్ఞానసర్వస్వం. "పాతిక సంవత్సరాల తెలుగు సాహిత్య సామాజిక వికాసానికి దర్పణం" విషయంలో పెన్నిధి. యువభారతి గ్రంథం ఒకదానికి భిక్షలాగా ఇల్లిల్లు తిరిగాను. నా మిత్రుడు చిలకముక్కు నరహరి నేను కలిసి, విడివిడిగా తిరిగాం. అప్పటి ఒక సంభాషణ ఇలా నడిచేది –

"నమస్కారం.. ఓ పని మీద వచ్చాము" – "చెప్పు"

"భాగవతంపై అందమైన వ్యాఖ్యానం ఉంటే ఎలా ఉంటుంది?" – "బాగుంటుంది"

"దాన్ని సినారె వంటివారు రాస్తే..?" – "ఇంకా మధురం..!"

"ఓ 50 పద్యాలకు వ్యాఖ్యానం రాసి చిన్న పొత్తంగా అచ్చు వేస్తే..?" – "ఇంకేం ..ఇంకా అద్భుతం..!"

"దాన్ని ఒక రూపాయి ధరకే ఇస్తే..?" – "మరీ అద్భుతం రా..! ఇంతకీ ఎవ్రా అచ్చు వేసేది..?"

"చెప్తాం ఒక రూపాయి ఇవ్వు.. పుస్తకం తెచ్చి నెలరోజుల్లో ఇస్తాం..!" – "ఒకటేమిటి నాకు 5 కావాలి ఇవిగో ఐదు రూపాయలు.."

డబ్బు తీసుకుని రసీదు ఇచ్చాం... ఇలా పోగుచేసి ఊరంతా మందారమకరందాలు పంచాం. పోతన కవితా మకరందం ప్రవహింపచేశాం. లక్ష ప్రతుల "సినారె మందార మకరంద – పోతన పద్య వ్యాఖ్య" ఒక తీపి జ్ఞాపకం.

మా ఊరికి హైదరాబాద్ 225 కిలోమీటర్లు. అయినా లహరి ప్రసంగాలకు ఏదో మిషతో వచ్చేవాడిని. ఆ సాహితీ దిగ్గజాల "ప్రసంగ గంగ" లో మునిగి తేలేవాడిని. ఇలా ఎన్నెన్ని గ్రంథాలో – అన్నీ కొనేవాడిని. అందమైన అచ్చు. అందుకు తగ్గ విషయం దానికి తగ్గ గ్రంథమూల్యం. నేను కళాశాలలో పోటీలలో గెలిచిన విద్యార్థులకు బహుమతులుగా యువభారతి గ్రంథాల్ని ఇచ్చేవాణ్ణి.

సాహిత్య బాలునిగా నా ప్రస్థానంలో ఈ సంస్థ ఒక దివ్యమైన నావ. నాకు ప్రయాణం "అప్పుడే అయిపోయిందా" అనేంతగా సాహిత్య తరంగిణిలో పాదం ముట్టేంతవరకు ప్రయాణం. నదిలోకి వంగి జుర్రుకున్నవారికి జుర్రుకున్నంత దోసిళ్ళ సాహిత్య మధుర జలాలు. సభ్యులకు కవితా సంకలనం తెస్తున్నాం అంటే ఉషస్సు లాంటి సంచికలో నా కవిత్వం చూసుకుని పుస్తకంలో అపురూపంగా దాచుకున్న నెమలి ఈకల వంటి జ్ఞాపకాలు. ఇప్పుడు వృద్ధులం. 60 శరత్తులు గడచినా జ్ఞాపకాల తడి ఆరలేదు. మాకు ఇంకా యువభారతి యువ స్వప్నమే. ఇంకా యౌవన జీవనమే. ఇంకా యువ చైతన్యమే.

బాల్యం నుండి నాకు ఎంతో స్ఫూర్తినిచ్చిన యువభారతి సంస్థ నుండి 2021లో తిరుమల శ్రీనివాసాచార్య ధర్మనిధి పురస్కారం స్వీకరించడం నాకెంతో ఆనందదాయకం.

*అయి చిర పరిశ్రాంత విద్యా కంతర చారిణః*
*సమాగచ్ఛత వః తృప్తిం కరోమి జ్ఞాన ధారయా.*



# యువభారతితో నా జ్ఞాపకాలు

శ్రీ ఆచంట సుధాకర్
విశ్రాంత పాత్రికేయులు, హైదరాబాద్
94904 76993

యువభారతితో నా అనుబంధాన్ని తెలియచేయాలన్నా, నాటి జ్ఞాపకాలను నెమరువేసుకోవాలన్నా, వెంటనే మనసంతా మధురానుభూతులతో నిండిపోతుంది. యువభారతి తో నా పరిచయం వ్యక్తిగతం కాదు, కుటుంబబంధం. నాతోబాటు మా అక్కయ్య ఆచంట అంజని, మా అమ్మగారు కీ.శే. ఆచంట సత్యవతి ముగ్గురం కూడా యువభారతితో ఎంతో సాహిత్య ఆత్మీయ అనుబంధాన్ని పెనవేసుకున్నాము.

ఇంట్లో అందరం మాతృభాషాభిమానులం. సాహితీప్రియులం. మహామహుల గ్రంథ పఠనంతో అమ్మగారు అయితే ఎంతో భాషాజ్ఞానాన్ని సంపాదించారు. ఆమె ఒడి నాకు పెద్ద బడి అయింది. యువభారతిలో 1971 నుండి ఒక పుష్కరకాలం వరకు మేం హాజరు కాని ఏ సాహితీ సమావేశం లేదంటే అతిశయోక్తి కాదు. యువభారతి తన ప్రచురణల ద్వారా అతి తక్కువ ధరలకే ముఖ్యంగా ప్రముఖ గ్రంథాల సారం సామాన్యులు సైతం ఆకళింపు చేసుకుని మాధుర్యాన్ని గురయ్యే అవకాశాన్ని కల్పించింది. ఉదాహరణకి మందారమకరందాలు, వేమన్నవేదం, మహతి వ్యాసాలు, లహరి ఉపన్యాసాల పరంపర, ప్రజాసూక్తం, వాగ్భూషణం భూషణం, మొదలైనవి.

జోరువానలో సైతం హాజరైన లహరి సాహిత్య కార్యక్రమాల సమయంలో అనుబంధం మరింత దృఢంగా బలపడింది. ఇప్పుడు చూడాలనుకున్నా కుదరని మహా కవి పండితులను ఆ రోజుల్లో మేము యువ భారతి వేదికలపై ప్రత్యక్షంగా చూడడం, కొన్ని సందర్భాల్లో వారితో మాట్లాడే అవకాశం రావడం నా అదృష్టంగానే కాకుండా పూర్వజన్మసుకృతంగా భావిస్తున్నాను. దివాకర్ల వేంకటావధాని గారు, ఆరుద్ర గారు, దాశరథి గారు, డా. సినారె గారు, జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు,

కాళోజీ నారాయణరావు గారు ఇలా ఎందరో మహానుభావుల్ని చూశాను. యువభారతిలో గుర్తుంచుకోవలసిన మరో ముఖ్యమైన విషయం 'సమయపాలన'. "ఇప్పుడు సమయం ........ ప్రార్థనతో ఈనాటి కార్యక్రమం ప్రారంభిద్దాం.." అంటూ సమయాన్ని ప్రకటించి మరీ సభాకార్యక్రమాలను కొనసాగించడం ద్వారా యువభారతి అంటేనే సమయపాలన అన్న ముద్ర, అందరితో సమయాన్ని పాటించేలా చేసింది.

ఇక సాహితీ సమావేశాల్లో ప్రముఖ కవి, పండితుల ఉపన్యాసాల లోని ఆణిముత్యాలను కాగితాలపై వ్రాసుకుని భద్రపరచుకున్న సందర్భాలెన్నో. బహుశా ఆ ఉత్సాహంతోనేమో నేను 1976 సంవత్సరంలో ప్రముఖ దినపత్రిక ఈనాడు హైదరాబాద్ ఎడిషన్ కోసం సబ్ ఎడిటర్ ఉద్యోగానికి ఎన్నో వడపోతలను దాటుకుని చివరగా గౌరవనీయులు, శ్రీయుతులు రామోజీరావు గారి సమక్షంలో, ఆయన కూడా స్వయంగా చేసిన ఇంటర్వ్యూలో, సబ్ ఎడిటర్ గా ఉద్యోగం సాధించడంలో పరోక్షంగా యువభారతి ప్రభావం ఉంది.

యువభారతి నేపథ్యంలో గొప్ప అనుభవాన్ని అందరితో పంచుకోవాలని ఆశిస్తున్నాను. బ్రహ్మశ్రీ డాక్టర్ మాడుగుల నాగఫణి శర్మ గారు అత్యద్భుతంగా 1996 లో ఇరవైయ్యొక్క రోజులపాటు, 1,116 మంది పృచ్ఛకులతో మహా సహస్రావధానం, ఇంకా 1997 లో స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సమయంలో 37 రోజులపాటు 2,116 మంది పృచ్ఛకులతో బృహత్ ద్విసహస్రావధానం, పబ్లిక్ గార్డెన్స్ లోని లలిత కళాతోరణంలో నిర్వహించిన ఆ అవధానాలలో నేను, మా అమ్మగారు పృచ్ఛకులుగా పాల్గొని వాటిలో పాలుపంచుకోవడం నిజంగా ఓ సువర్ణావకాశంగా, మరువలేని అనుభవంగా, భావించడమే కాకుండా అవధుల్లేని మాతృభాషోత్సవ సందర్భాన్ని పొందడం యువభారతి సాహచర్యం వలననేమో అనిపిస్తుంది.

ఆనాటి ఏ సాహిత్య కార్యక్రమానికైనా ప్రవేశద్వారం వద్ద యువభారతీయులు నిలబడి అందమైన గులాబీ పువ్వును చేతిలో పెట్టి సాహితీ బంధువులను ఆహ్వానించటం తెలుగు ఉద్యానవనం లోకి స్వాగతిస్తున్న మధురానుభూతి కలిగేది. ఆ రోజుల్లో యువభారతి ఓ కొత్త ఒరవడిని సృష్టిస్తూ పుస్తక ప్రచురణ విషయంలో సగం ధరకే ప్రచురణ పూర్వ విరాళం ద్వారా, ఇంకా 'సాహితీ మిత్ర' పథకం ద్వారా అతి తక్కువ ధరలోనే అత్యుత్తమ సాహిత్యాన్ని అందించి, తద్వారా ఎందరిలోనో

మాతృభాషాభిమానాన్ని రేకెత్తించిన యువభారతి సంస్థలో ఒకడిగా పాలుపంచు కున్నందుకు గర్వంగా ఉంది.

తిరిగి ఎన్నో ఏళ్ళ తర్వాత 'గతి తప్పని సూర్యచంద్రుల' లాగా సాగిపోతున్న యువభారతి లోకి శాశ్వత సభ్యులుగా పునరాగమనం మనసుకు ఎంతో ఉత్సాహాన్ని ఉల్లాసాన్ని కలిగిస్తోంది. ఒక్కమాటలో చెప్పాలంటే యువ భారతిలో ఆనాటి సాహిత్య సమావేశాల రోజులు మన తెలుగు భాషా సంస్కృతులకు "స్వర్ణ యుగం" లాంటివి అని చెప్పడం ఎంత మాత్రం అతిశయోక్తి కాదు

ఎన్నెన్నో అనుభూతులు మరెన్నో జ్ఞాపకాలు మనసునిండా మెదలుతున్నా మనందరి ఆత్మీయ గురువు డా.వంగపల్లి విశ్వనాథం గారు సూచించినట్లు 'క్లుప్తత' పాటిస్తూ, యువభారతి ఆధ్వర్యంలో తెలుగు భాషా పతాకం ఎల్లవేళలా ఉన్నత స్థాయిలో ఎగురుతూనే ఉంటుందన్న నా ప్రగాఢ విశ్వాసాన్ని తెలియజేస్తున్నాను.





'మహతి' ఆవిష్కరణ సభలో ప్రసంగిస్తున్న మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి.
చిత్రంలో ఇరివెంటి, జి.వి.సుబ్రహ్మణ్యం, రామానుజరావు
ముఖ్యమంత్రి శ్రీ పి.వి.నరసింహారావు, దాశరథి

# యువభారతితో నా మరపురాని అనుబంధం

శ్రీమతి ఆచంట అంజని
విశ్రాంత బి.ఎస్.ఎన్.ఎల్. ఉద్యోగిని
94408 74641

సాహితీ జగత్తులో ఎన్నో ప్రభంజనాలను సృష్టించి, ఇంకా సృష్టిస్తూ, సాహితీ ప్రియుల్ని అలరిస్తూ వజ్రోత్సవాలు జరుపుకుంటున్న సందర్భంగా మా యువభారతికి నా హృదయపూర్వక శుభాకాంక్షలు.

సాహిత్యం ద్వారా ఇంటింటా సాహితీ దీపాలు వెలిగించి చీకటిని పారదోలి, యువభారతి ఇచ్చిన ప్రోత్సాహం నా సాహిత్య ప్రవేశానికి ఊపిరి పోసింది. అంతవరకు పరిమితమై ఉన్న నా సాహిత్యాభిలాష విస్తృతమైంది. నేను రాయగలనా లేనా అన్న అనుమానానికి చుక్క పెట్టి, తొలిసారిగా 'స్వరాలు' అనే కవితా సంకలనంలో 'ఏమిటీ ప్రపంచం' 'ఊహా ప్రపంచం' అనే రెండు కవితలు రాశాను.

నేను BSNL లో పని చేసి రిటైర్ అయ్యాను. యువభారతి పుట్టి 60 ఏళ్ళయితే యువభారతితో నా అనుబంధానికి 50 ఏళ్లు ఉంటాయి. ఆ బంధం నా జీవితంలో అపూర్వమైన అమూల్యమైన మధురమైన అనుబంధంగా గర్వపడతాను. నిజం చెప్పాలంటే యువభారతి సాహిత్యాభిలాషులకు శిక్షణా శిబిరం. ఎంతోమంది కవుల్ని రచయితల్ని రచయిత్రులను తయారుచేసిన గొప్ప వేదిక. నేను భారతీయురాలిని అని చెప్పడానికి ముందు యువభారతీయురాలిగా చెప్పుకునేందుకు గర్వపడతాను.

నేను యువభారతి వనితా విభాగంలో సభ్యురాలిగా చేరినప్పుడు దాదాపు 15 నుండి 20 మంది దాకా వనితా సభ్యులు ఉండేవాళ్లు. అందరం ప్రతి నెలా ఒక ఆదివారం ఆంధ్రభాషా నిలయంలో సమావేశం అయ్యేవాళ్ళం. 'క్లుప్త గోష్ఠి', 'పుస్తక చర్చ', 'నా ఊహాపథంలో', వక్తృత్వం, స్వీయ రచనా పఠనం లాంటి వివిధ ప్రక్రియల్లో

పాల్గొనేవాళ్ళం. అందరం ఒకరిని మించి మరొకరం ప్రిపేర్ అయ్యేవాళ్ళం. దీనివలన మా ఆలోచనా శక్తి, ఏకాగ్రత, రచనా శక్తి పెంపొందడమే కాక సభాకంపం పోయేది. దీనిద్వారా చాలామంది యువతీ యువకులు కవులు రచయితలు అయ్యారు.

ఆ రోజుల్లో ఆంధ్రసారస్వత పరిషత్ లో "న భూతో న భవిష్యతి" అన్నట్లుగా నిర్వహించబడే యువభారతి సమావేశాలు నిజంగా మా ఇంట్లో చేసుకునే పండుగ వేడుకలు గానే భావించేవాళ్ళం. మా కుటుంబ సభ్యులందరం ఎంతో ఉత్సాహంగా ఆసక్తిగా హాజరయ్యేవాళ్ళం. సభ్యులందరం ఒక గంట ముందే వచ్చి సమావేశాలకు హాజరయ్యే అతిథులను గులాబీపూలతో సాదరంగా ఆహ్వానించి కూర్చోబెట్టేవాళ్ళం. ఇలా సమష్టిగా, ఐకమత్యంగా సమావేశాన్ని విజయవంతం చేసే క్రమశిక్షణను మా సభ్యులందరికీ నేర్పించింది యువభారతి.

"గుప్తుల యుగం స్వర్ణయుగం" లాగా సాహితీ జగత్తులో "యువభారతి యుగం" 60 ఏళ్లు పూర్తి చేసుకుని వజ్రోత్సవాల్లో అడుగుపెట్టింది.

యువభారతి నిర్వహించిన సాహిత్యోద్యమ చరిత్రలోనే ఉర్రూతలూగించిన లహరి కార్యక్రమాల ద్వారా నన్నయ, తిక్కన, పోతన, సూరన, శ్రీనాథుడు, కాళిదాసు వంటి ప్రాచీనయుగం నాటి కవుల రచనల తీరు తెన్నులే కాక ఆధునికకవులైన గురజాడ, కందుకూరి, శ్రీశ్రీ, పానుగంటి, విశ్వనాథ, వంటి వారి సాహితీ వ్యక్తిత్వాల గురించి కూడా ప్రసిద్ధ ఆంధ్ర సాహిత్య ఆచార్యులు ఇచ్చిన ఉపన్యాసాలు ఆబాలగోపాలాన్ని ఆకట్టుకున్నాయి. ఇలా ఎన్ని సభలు..!! ఎన్ని సమావేశాలు..!! ఎంతోమంది సాహితీవేత్తలతో సారస్వత పరిషత్తు వేదిక నవరసభరితంగా పులకించి పోయేది.

సమావేశాలకి చిన్నా, పెద్దా యువతీ యువకులు, వృద్ధులతో సభ నిండిపోయి, కూర్చోవడానికి కుర్చీ లేక, నిలబడడానికి స్థలం దొరకక, గోడలపై ఎక్కి కూర్చుని సాహితీ ప్రసంగాలను నిశ్శబ్దంగా వినేవారు. ఇక డిగ్రీ, పోస్ట్ గ్రాడ్యుయేషన్, రీసెర్చ్ స్కాలర్స్ అయితే ఉపన్యాససారాన్ని నోట్ బుక్స్ లో శ్రద్ధగా రాసుకునేవారు. తలచుకుంటూ ఉంటేనే ఒళ్ళు గగుర్పొడుస్తుంది.

యువభారతి ఇచ్చిన శిక్షణ ప్రేరణతో నేను యువభారతి తరపున, వ్యక్తిగతంగా కూడా ఆకాశవాణి యువవాణి తరపున అనేక చర్చా కార్యక్రమాలు, కవితా పఠనం వ్యాసరచనలో హైదరాబాద్, చెన్నై నుంచి పాల్గొన్నాను. మా కార్యాలయానికి

సంబంధించిన సమావేశాల్లో కూడా ధైర్యంగా మాట్లాడేదాన్ని. నేను 18 ఏళ్ల వయసులో గుల్షన్ నందా రాసిన "ఝీల్ కే ఉస్ పార్" అన్న నవలని తెలుగులో "ఏటి అవతల" పేరుతో అనువదిస్తే, ఎమెస్కో సంస్థ వారు పుస్తకరూపంలో ప్రచురించారు. గుల్షన్ నందా గారు హిందీలో సుప్రసిద్ధ నవలాకారులు.

యువభారతి వజ్రోత్సవాల సందర్భంగా నా అభ్యర్థన ఒక్కటే. మన మాతృభాష అయిన తెలుగుని గౌరవించండి. తెలుగు సాహిత్యం గురించి తెలుసుకోండి. తెలుగులో మాట్లాడండి. ఇతర భాషల్లో లేని వివిధ సాహితీ ప్రక్రియలు మన భాషలో ఉన్నాయి. వీటి గురించి తెలుసుకోవడానికి ప్రయత్నించండి.

పాఠకులకు రచయితలకు మధ్య వారధిగా, ఉన్నత విలువలు కలిగిన సాహిత్యాన్ని ప్రచురించి, అతి తక్కువ వెలలో మనకు అందిస్తూ, పఠనాసక్తిని ప్రోత్సహిస్తున్న యువభారతి పుస్తకాల్ని చదువండి. నాటి తరం, నేటి తరాలే కాక, భావితరాలుకూడా తెలుగు భాషా సాహిత్యాలపై ఆసక్తి పెంచుకునేలా కృషి చేయాలని యువభారతీయురాలిగా మనస్ఫూర్తిగా ఆశిస్తున్నాను. ✷



'కావ్యలహరి' ఉపన్యాస మంజరి కార్యక్రమంలో ఉపన్యసిస్తున్న
డా॥ దివాకర్ల వేంకటావధాని

# 'వికసిత తెలుగు' కు వారధి – 'యువభారతి'

శ్రీ జ్వాలా సోమనాథ శాస్త్రి
విశ్రాంత ప్రభుత్వ బ్యాంక్ అధికారి, హైదరాబాద్
98783 13332

"చుట్టూరా ఆవరించుకొని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించడం మంచిది"

ఈ వాక్యాలు, 1970లలో, దాదాపు 14 ఏళ్ల వయసులో, గ్రామీణ వాతావరణం లో జీవిస్తున్న సమయంలో "యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ" వారి ఏదో కరపత్రం లో కనిపించినప్పటి నుండీ యువభారతి తో అనుబంధం మొదలయ్యింది.

పుస్తకాల మీది మక్కువతో చిన్నతనం లోనే ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్ వారి ఇంటింటా స్వంత గ్రంథాలయం అనే పథకంలో నెల నెలా ఐదు రూపాయల తోనే పుస్తకాలు వీపీపీ ద్వారా తెప్పించుకున్నపుడు, ఎమెస్కో వారి ప్రచురణలు మరియు యువభారతి సంస్థ వారి కార్యక్రమాలకు సంబంధించిన సమాచారం తెలుస్తుండేవి.

1972 లో డిగ్రీ చదవడానికి హైదరాబాద్ లో పట్టణ వాతావరణం లో జీవితం ఆరంభమయ్యాక, అప్పుడు నేను చేరిన శ్రీమతి సత్యమ్మ నర్సింహారావు కాలేజీ కి దగ్గరగా వున్న ఆనాటి ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాంగణంలో యువభారతి వారి సాహిత్య సమావేశాలు, లహరీ పరంపర ఉపన్యాసాలు వినే అదృష్టం కలిగింది.

రాజకీయ నాయకుల సభలకు (జన సమీకరణ ప్రయత్నాలు లేకుండానే) మాత్రమే వచ్చే జనం లాగా, అప్పుడు యువభారతి వారు నిర్వహించే సాహిత్య సమావేశాలకు, ముఖ్యంగా, లహరీ పరంపర సమావేశాలకు, తెలుగు వారు తండోపతండాలుగా, ఎక్కువ ప్రచార ప్రకటనలు లేకుండానే వచ్చేవారు.

1972 ప్రాంతములో సుమారు ఒక దశాబ్దం పాటు యువభారతి ఒక మహత్తర తెలుగు సాహితీ వికాస ఉద్యమ సారథిగా నిరాఘాటంగా కొనసాగింది.

ఆ కాలంలో సర్వశ్రీ దివాకర్ల వేంకటావధాని, జీ వీ సుబ్రహ్మణ్యం, డా. సి నారాయణ రెడ్డి, ఇరివెంటి కృష్ణమూర్తి, వంగపల్లి విశ్వనాథం వంటి ప్రముఖులు తెలుగు సాహిత్య ప్రపంచంలో సినీ తారల ప్రాచుర్యానికి సమానంగా ఆదరణ పొందారు. సాహితీ ప్రియులకు వారిని దర్శిస్తే చాలనిపించేది. యువభారతి సమావేశాలలో ఆ భాగ్యం కలిగేది.

వారం వారం సుల్తాన్ బజార్ లోని శ్రీకృష్ణ దేవరాయ ఆంధ్రభాషా నిలయంలో నిర్వహించే ఆశు లఘు ఉపన్యాస కార్యక్రమాలు అప్పటి యువకుల వ్యక్తిత్వ వికాసానికి, వక్తృత్వ సామర్థ్యము, తెలుగు భాషా విజ్ఞానము పెంపొందించుకోవడానికి కారణభూతమయ్యాయనడం నిర్వివాదం.

ఇప్పుడు సాహితీవేత్తలు గా కొనియాడబడే వారిలో హైదరాబాద్ నగరంతో ఎక్కువ అనుబంధం వున్నవారు చాలా వరకు యువభారతి కార్యక్రమాల ద్వారా ప్రేరణ, పురోగతి పొందినవారే అనడం అతిశయోక్తి కాదు.

ఆ కాలం లో యువభారతి వాయిదాల పద్ధతి లో కూడా చందా (నెలకు 10 రూ. చొప్పున) ఇచ్చే సౌకర్యంతో 'సాహితీ మిత్ర', 'భారతీ మిత్ర' వంటి కొత్త పుంతల ఆలోచనలతో ప్రవేశ పెట్టిన పథకాలు ఎంతో జనాదరణ పొందాయి. సామాన్యులు సైతం పుస్తకాలు కొనడానికి 'ప్రచురణ పూర్వ విరాళము' అనే విధానము అమలు చేయడం కూడా, నాకు తెలిసి, యువభారతి కొత్త ఆలోచనా ధోరణి ఫలితమే. యువభారతి ప్రచురణలు కొనుక్కోవడానికి బారులు తీరి నిలబడవలసి వచ్చేది అంటే ఇప్పుడు నమ్మశక్యం కాదు.

నాలోని కవిత్వ తృష్ణ తీరడానికా అన్నట్టు యువభారతి వారి ఆహ్వానం మేరకు "సాంధ్యవేళ" అనే కవితను వ్రాసి పంపిస్తే, ఆ కవిత కు వారు ప్రచురించిన "ఉషస్సు" అనే కవితా సంపుటిలో చోటు దక్కి, సంపాదకీయపు సమీక్ష లో కూడా కవి హృదయం గురించి వ్యాఖ్య చూసే దాకా నా కవిత్వము లోని గొప్పదనం నాకే తెలియలేదు.

1975 ప్రాంతం లో రాష్ట్ర ప్రభుత్వం వారు నిర్వహించిన మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు తెలుగు జాతికి, సాహిత్యానికి ఉద్దీపనలై, హైదరాబాద్ నగరం

లో, తెలంగాణా ప్రాంతములో, తెలుగు వెలుగు విస్తరించడానికి దోహదం చేశాయి. అప్పటినుండే తెలుగుకు అధికారభాష గా ఎక్కువ గుర్తింపు వచ్చింది. ఆ ప్రపంచ స్థాయి సభలలో యువభారతి అత్యంత ప్రముఖ పాత్ర పోషించిందన్న జ్ఞాపకాలు ఇప్పుడు మధుర స్మృతులే.

1979 లో ఉద్యోగరీత్యా హైదరాబాద్ వదిలి ఇతర రాష్ట్రాలకు వెళ్ళవలసివచ్చినపుడు, మొదటి రెండు మూడేళ్లు ఒక సాహితీ మిత్రుడి గా యువభారతి ప్రచురణలు తీసుకోవడానికి ప్రత్యేకంగా వచ్చే వాడిని. కాలం తెచ్చిన మార్పును అనుసరించి అప్పటి ఉత్సాహం తగ్గుతూ వచ్చిందన్నది కొంచెం బాధ కలిగిస్తూనే వుంది.

నేడు అరవై డెబ్బైలలో భాగ్యనగరం లో వున్న వేలాది తెలుగు భాషా ప్రియులకు ఆ నాటి యువభారతి కార్యకలాపాలు కనపడని జవసత్వాలు. నా వ్యక్తిత్వ వికాసానికి నా మాతృ భాషా పరిజ్ఞాన వికాసానికి సరి అయిన సమయం లో నాకు లభించిన యువభారతితో సరైన అనుబంధం, నా జీవితం లో చిన్ననాటి ఉపాధ్యాయుల తో వున్న అనుబంధం తో సమానమైనది.

ఆదినుండీ యువభారతి కార్యక్రమాలను – త్రికరణ శుద్ధిగా – కీర్తి మరియు ధనాపేక్ష రహితంగా తెలుగు తల్లికి సేవ చేసే అవకాశంగా నిర్వహిస్తున్న 'యువభారతీయు' లందరికీ నా హృదయపూర్వక నమస్సులు, శతకోటి ధన్యవాదాలు తెలియజేయడం తెలుగువాడిగా పుట్టినందుకు నా ధర్మం.

షష్టిపూర్తి చేసుకుంటున్న యువభారతి, తన కార్యక్రమాలను, నిర్వహించే విధానాలను పునర్నిర్వచించుకొని తెలుగు భాష చిరంజీవిత్వము ముఖ్య ధ్యేయంగా, నవ్యోత్సాహముతో, శతాబ్ది జరుపుకునే దిశగా పయనించే శక్తిని, వనరులను, ముఖ్యంగా కార్యకర్తలను యివ్వమని తెలుగు తల్లిని ప్రార్థిస్తున్నాను.



# సాహిత్య మహతి యువభారతి

శ్రీ కస్తూరి మురళీకృష్ణ
రచయిత, 'సంచిక' సంపాదకులు, హైదరాబాద్
98496 17392

1974-75లో మేము బోధన్ నుంచి హైదరాబాదు వచ్చాము. సికిందరాబాదులోని ఆలుగడ్డ బావిలో,అమ్మపనిచేసే స్కూలుకి దగ్గరలో ఇల్లు అద్దెకి తీసుకున్నాము. కాస్త వీలు చిక్కగానే నేను లైబ్రరీ వెతుకుతూ బయలుదేరాను. దగ్గరలోని మెట్టుగూడలో ప్రభుత్వ గ్రంథాలయం ఉంది. అవకాశం లభించినప్పుడల్లా లైబ్రరీకి వెళ్ళి పుస్తకాలు చదువుతూ కూర్చునేవాడిని. అలా విశ్వనాథ సత్యనారాయణ పుస్తకాలు అనేకం చదివాను. అర్థమయినా, కాకున్నా ఆయన రచనల్లో ఏదోశక్తి నన్ను ఆకర్షించింది. ఒక పుస్తకం పలుమార్లు చదువుతూండేట్టు చేసింది. నేను విశ్వనాథ సత్యనారాయణ రచనల పట్ల ఆసక్తి చూపటం గమనించిన లైబ్రేరియన్ ఓ రోజు ఓ లావుపాటి పుస్తకం చేతిలో పెట్టాడు. దీనిలో విశ్వనాథ వ్యాసం ఉంది. చదువు, నువ్వు ఆయన నవలలే చదువుతున్నావు. వ్యాసాలు చదువు, నవలలు వలలు తిన్నట్టుంటాయి అంటూ ఆ పుస్తకాన్ని అందించాడు.

పుస్తకం అట్టపై అంకెలు వీణ రూపంలో ఉన్నాయి. 'మహతి' పుస్తకం పేరు అది. 'యువభారతి' తో నా తొలి పరిచయం. ఆ కాలంలో నేను విశ్వనాథ వారి వ్యాసాన్ని బట్టీ పట్టాను.

"నేను కడచిన పాతికేళ్ళలో నా సాహిత్య రచనలు అనే విషయాన్ని గురించి నన్ను వ్రాయమన్నారు. ఇది నా వంటి వాడికిచ్చే ప్రశ్న కాదు. ఎవళ్లో అల్ప రచనలు చేసేవాళ్ళను అడగవలసిన విషయము" అన్న వాక్యాలు చదివి ముగ్ధుడనయి పోయాను. ఆ ఆత్మ విశ్వాసానికి అబ్బురపడ్డాను. అలా నేను తొలిసారి కాల్పనికేతర రచనలు సైతం అత్యంత అద్భుతంగా ఉంటాయని అర్థం చేసుకున్నాను. 'మహతి'లా ఇతర వ్యాసాలు కాలక్రమేణా తరువాత ఎన్నో ఏళ్లకు చదివేను. కానీ, నాకు మహతి అంటే విశ్వనాథ వారి వ్యాసమే! 'మహతి' అట్టమీద ఉన్న యువభారతి లోగో నన్ను

ఆకర్షించింది. 'మహతి' సంపాదకులలో ఒకరయన జి.వి.సుబ్రహ్మణ్యంగారి పేరు ఎందుకనో గుర్తుండి పోయింది. తరువాత ఆయన రచనలన్నీ వెతికి వెతికి చదివాను. ఆ తరువాత 'యువభారతి' 'లోగో' ఉన్న ప్రతి పుస్తకం చదవటం ఆరంభించాను. యువభారతి పుస్తకాల ద్వారా ఒక నూతన సాహిత్య ప్రపంచ ద్వారం తెరచుకుంది. అది సాహిత్య విమర్శ. యువభారతి ప్రచురణ కనిపించినా, దాన్ని చదవకుండా వదిలేవాడిని కాదు. లైబ్రరీలలో 'యువభారతి' పుస్తకాల కోసం వెతికేవాడిని. చదివిన పుస్తకమే అయినా మళ్లీ చదివేవాడిని. సాహిత్యం గురించిన ఉపన్యాసాలు, వ్యాసాలు, విమర్శలు, సాహిత్య లక్షణాలు, లక్ష్యం, కవిత్వ ప్రయోజనం, సంప్రదాయ కవిత్వం, భారత, రామాయణాల విమర్శ, ప్రబంధాలు పరిచయం.. ఒకటా రెండా ఒక మహాద్భుతమైన సాహిత్య ప్రపంచాన్ని నాకు పరిచయం చేసింది. నాకు చేరువ చేశాయి యువభారతి పుస్తకాలు. అందుకే నాకు ఉద్యోగం రాగానే నేను చేసిన మొదటి పనుల్లో 'రీడర్స్‌డైజెస్ట్' పత్రికకు చందా కట్టడంతో పాటు యువభారతి పుస్తకాలను కొనటం ఒకటి. అలా యువభారతి ప్రచురణలు, సాహిత్య విమర్శ, విశ్లేషణగ్రంథాలు అన్నీ నేను సేకరించాను. అయినా ఏదో అసంతృప్తి నన్ను పట్టి పీడిస్తుండేది. పుస్తకాలయితే సేకరించేవాడిని కానీ ఎన్నడూ యువభారతి సంస్థలో సభ్యత్వం తీసుకోవాలని కానీ, కార్యక్రమాలలో పాల్గొనాలని కానీ అనిపించలేదు. అది నా స్వభావ లోపం. పుస్తకాలకిచ్చిన ప్రాధాన్యం నేను మానవ సంబంధాలకు ఎన్నడూ ఇవ్వలేదు.

అయితే, 'ఇదీ' అని తెలియని అసంతృప్తి ఇటీవల అదృశ్యమై దాని స్థానంలో ఆనందం, సంతోషం, సంతృప్తులు చోటు చేసుకున్నాయి. మిత్రుడు ఫణీంద్ర యువభారతి అధ్యక్షుడయిన తరువాత ఓరోజు ఫోను చేశాడు. 1972 నుండి 2022 నడుమ తెలుగు నవలల పరిణామ క్రమం గురించి ఒక వ్యాసం రాయాలి. 'మహతి' తరువాత మళ్లీ అలాంటి ప్రయోగం చేయలేదు. మహతి 25 ఏళ్ళ సాహిత్య సింహావలోకనం చేసింది. ఇప్పుడు 50 ఏళ్ల సాహిత్య సింహావలోకనం చేయాలని ఆలోచన ఉందన్నాడు. నేను ఎగిరి గంతేసి ఒప్పుకున్నాను. సమయం తక్కువ ఉందనీ, అంత తక్కువ సమయంలో యాభై ఏళ్ళ నవల పరిణామక్రమాన్ని ప్రతిబింబించటం వీలవుతుందా? అని ఒక్క క్షణం కూడా సందేహించలేదు. 'మహతి'లో విశ్వనాథ వారి వ్యాసం ఉంది. అదే యువభారతి సంస్థ స్వతంత్ర భారత అమృతోత్సవం సందర్భంగా ప్రచురించే పుస్తకంలో 'నా వ్యాసం ఉంటుంది'. అంతకన్నా నాకు

కావాల్సింది ఏముంది? ఈ వ్యాసం ద్వారా యువభారతి అంటే నాకు ఉన్న గౌరవము, అభిమానము, ఒక విధమైన కృతజ్ఞతా భావాన్ని వ్యక్త పరచిన సంతృప్తి కలుగుతుంది అన్న భావనను మించిన సంతృప్తి ఏముంటుంది? అవ్యక్తమయిన, అత్యంత ప్రామాణికతలు, ఆలోచనా పూర్వకమైన సాహిత్యవిమర్శ ప్రపంచ ద్వారాలు తెరచి, ఆ ప్రపంచంలో అడుగుపెట్టే అర్హతను సాహిత్య పుస్తకాలను అందించిన యువభారతి ప్రచురణలు విమర్శనా వ్యాసం అందించడం మంచి ఒక రచయితగా నేను కృతజ్ఞతను ఇంకెలా వ్యక్తపరచగలను?

అందుకే యువభారతి సంస్థ ఏర్పడి 60 ఏళ్ల ఈ విజయ దశమికి పూర్తవుతాయని అశ్వనీకుమార్ కోరగానే, ఆవారం నుంచి విజయదశమి వరకూ 60 యువభారతి ప్రచురణల సంక్షిప్త పరిచయాలకు నేను సంపాదకత్వం వహిస్తున్న వెబ్ పత్రిక 'సంచిక'లో ప్రచురణ ప్రారంభించాను. ఇప్పటికి 45 పుస్తకాల పరిచయాలు ప్రచురితమయ్యాయి. 60 ఏళ్ళలో పలు తరాలను ప్రభావితంచేసి, ఉత్తమ సాహిత్యాన్ని పరిచయంచేసి, ఉత్తమాభిరుచిని సమాజంలో అభివృద్ధి చేయటంలో కృషి చేస్తన్న యువభారతి సాహిత్య సంస్థ మరిన్ని రాబోయే తరాలకను మంచి వైపు నడిపించాలని ఆశిస్తున్నాను.






జగద్గురు సాహితీలహరి కార్యక్రమంలో ప్రసంగిస్తున్న
యువభారతి అధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

# యువ భారతి తో నా అనుబంధం - ఒక సింహావలోకనం

శ్రీ కె.వి. ప్రసాదవర్మ
సికింద్రాబాద్
94412 74034

ఏవండోయ్ మీ పుట్టిన రోజుకి మూడు రోజుల ముందే బహుమతి పంపేరు యువభారతి వారు అంది మా శ్రీమతి. అది మే 1973 వ సంవత్సరం. మహతి, చైతన్య లహరి పుస్తకాల పార్సెల్ అందుకున్న రోజు.. 1972 నుంచి యువభారతితో నా అనుబంధం. తరువాత భారతీమిత్ర పథకంలో జీవిత సభ్యుడినయ్యాను.. (భా.మి. 477). సుమారు 50కి పైబడి యువభారతి ప్రచురణలు 'కొని' చదువుకొని ఆనందించి, ఇనుమడించిన సాహిత్య పరిజ్ఞానానికి కృతజ్ఞతా పూర్వక వందనాలు చెప్పుకున్నాను మనసులోనే. ఉద్యోగ రీత్యా వేరే వూళ్ళలో ఉండటం వల్ల సెలవు పెట్టుకుని శ్రీభారతీతీర్థ మహాస్వామి వారు పాల్గొన్న జగద్గురు సాహితీ లహరి సభకు హాజరు కాగలగటం ఒక అదృష్టం, ఒక అనుభూతి.

రవ్వలు కవితా సంకలనంలో నా రచన ప్రచురణ కావడం ఒక మంచి జ్ఞాపకం. తిరుమల రామచంద్రగారి మరపురాని మనీషి, వ్యాససాహితీ సంహిత, రామాయణ సుధాలహరి, అభినవ లోవచనం, సంస్కృత సాహితీ లహరి, దశరూపక సందర్శనం, ఎప్పటికీ నిలిచే అద్భుత, ప్రామాణిక గ్రంథాలని నా భావన. విశ్వనాథ వారిపై వచ్చిన విశ్వనాథ సాహితీ సమాలోచనం ఒక అపూర్వ సంకలనం. ఇవన్నీ తరతరాలకు ఉపయోగ పడతాయి అనటం లో సందేహం లేదు.

తెలుగులో "రీడర్స్ డైజెస్ట్" వంటి పత్రికగా అభివృద్ధి చెందాలన్న సంకల్పం తో మొదలు పెట్టిన నందిని పత్రికను కూడా స్మరించుకోవాలి. కేవలం ఒక రూపాయికే అందించటం గొప్ప ప్రయత్నం, అందులోను ప్రసిద్ధుల రచనలెన్నో వచ్చాయి.

కాలగమనంలో ఎన్నో మార్పులు, ఒడిదుడుకులకు లోనయ్యింది సంస్థ. కొంత కాలం స్తబ్ధుగా ఉండి పోయింది. మళ్ళీ పునర్వైభవ దిశగా ప్రస్థానం మొదలు పెట్టటం అత్యంత ముదావహం. అయితే వ్యథా కలిత హృదయంతో చెప్పవలసిన చిన్నమాట ఒకటున్నది. (దీన్ని ఫిర్యాదుగా భావించవలసిన అవసరం లేదు) వేద విజ్ఞాన లహరి పుస్తకంలో కార్యవర్గ సభ్యులు, జీవిత సభ్యులు, సాధారణ – సభ్యులు ఇత్యాది జాబితా ఒకటి ప్రచురించారు. ఈ జాబితాకి, అలాగే ప్రస్తుత కార్యవర్గానికి ప్రాతిపదిక, అనుసరించిన పద్ధతి ఏమిటొ మాబోటి జీవిత సభ్యులకు తెలియదు. జీవిత సభ్యులంటే సంస్థలో జరిగిన జరగబోవు మార్పులు చేర్పులు, మూసివేత, లాంటి విషయాలు తప్పని సరిగా తెలియజేయ వలసిన వారని అనుకుని ఈ రెండు మాటలు వ్రాయటం జరిగింది. వజ్రోత్సవ సభలు కలకాలం జ్ఞాపకముండేలా, సాహిత్యాభిమాను లందరి మనసులు పులకించేలా దిగ్విజయంగా జరగాలని మనసారా కోరుకుంటున్నాను.



*మిత్రులు శ్రీ కె.వి.ప్రసాదవర్మ గారు దీనిని ఫిర్యాదుగా భావించవలసిన అవసరం లేదంటూనే వేసిన ప్రశ్నలకు సమాధానం ఇవ్వవలసిన బాధ్యత మాపై ఉంది. మీకే కాదు, మీలాంటి మరికొంతమంది భారతీమిత్రులకు, భారతీభూషణులకు కూడా ఇటువంటి సందేహం ఉండవచ్చు. భారతీమిత్ర, భారతీభూషణ అనేవి యువభారతి ప్రవేశపెట్టిన పథకాలు మాత్రమే! వాటిలో చేరిన సభ్యులు యువభారతి సభ్యులు కానేరరు. ఆయా పథకాలలో ప్రకటించినట్లుగా వారికి ప్రతి సంవత్సరం పుస్తకాలు అందజేయడమే యువభారతి బాధ్యత. రూ. 116/– కట్టిన భారతి మిత్రులకు రూ. 12/– విలువగలిగిన పుస్తకాలూ, రూ. 558/– లేదా అంతకంటే ఎక్కువ మొత్తం కట్టిన భారతీభూషణులకు ప్రతి సంవత్సరం ఆ సంవత్సరంలో అచ్చువేసిన పుస్తకాలు అందిస్తామని చెప్పటం జరిగింది. అయితే, ఒకవైపు పెరుగుతున్న తెల్లకాగితం, మరియు ప్రింటింగ్ ధరలు, మరోవైపు క్రమంగా తగ్గుతున్న వడ్డీరేట్లు మా పథకాలను కొనసాగించడంలో ఇబ్బందులు సృష్టించాయి. అందుకని వాటిని రద్దుచేయటం జరిగింది. ఈ నిర్ణయాన్ని భారతీమిత్ర, భారతీభూషణ సభ్యులందరికీ ప్రకటన ద్వారా తెలియచేయటం జరిగింది. వారిచ్చిన మొత్తానికి సరిపోయే పుస్తకాలను ఒకేసారి తీసుకోవలసిందిగా కూడా కోరడమైనది.*

–సంపాదకులు

# యువభారతితో నా అనుబంధం

శ్రీ మత్స్యరాజ హరగోపాల్
న్యాయవాది, రచయిత, హైదరాబాద్
94904 24040

దాదాపు 1965-1974 మధ్య యువభారతితో నా అనుబంధం మధుర జ్ఞాపికం మీతో నా 75 సంవత్సరాల వయస్సులో నేను పంచుకోవడం సంతోషకరమైన విషయం.

ఆనాడు భాగ్యనగరంలోని శ్రీకృష్ణ దేవరాయ ఆంధ్ర భాషా నిలయంలో జరిగిన సాహిత్య సమావేశాలు, గోష్ఠీ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనేవాడిని..

ఆ సమయంలో యువభారతి సాహితీ సంస్థలతో బహు సన్నిహితంగా ఉండడం జరిగింది. యువభారతి సంస్థవారి చిహ్నం (లోగో) కమలంపై ఆసీనురాలైన వీణాపాణి సరస్వతీ అమ్మవారి చిత్రం బహు ఆకర్షణీయంగా ఉండడంవల్ల కూడా నన్ను ఆకట్టుకున్నది. సరదాగా చతురోక్తులతో గోష్ఠులు సాగేవి. ఒకసారి 'అద్దె కొంపల్లో ఉన్నవాళ్ల ఇక్కట్లు' అనే అంశంపై గోష్ఠి జరిగినప్పుడు 'అద్దెవాళ్లతో ఇంటి యజమానుల ఇక్కట్లు' అంటూ రివర్స్ గేర్ లో మాట్లాడి అందరి ఆశ్చర్య పరిచినట్లు జ్ఞాపకం. ఎందుకంటే 1964లోనే మలకపేటలో స్వంత ఇంట్లో ఉండడం జరిగింది.

ప్రతి నెలా జరిగే సమావేశాలలో సాహితీ ఉద్దండులైన శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారు, డా॥సుబ్రహ్మణ్యంగారు..(నేను నిజాం కాలేజీలో బి.ఎస్సి చదువుతున్న సమయంలో వారు తెలుగు విభాగంలో పనిచేసినట్లు జ్ఞాపకం, అలాగే వంగపల్లి విశ్వనాథంగారు ఉస్మానియా యూనివర్సిటీ కామర్స్ విభాగంలో ఆచార్యులు) తదితరులు పాల్గొన్న సమావేశాలలో నాలో తెలుగుభాష పట్ల స్ఫూర్తిని పెంపొందించాయి. నా మిత్రుడు ప్రొఫెసర్ గుడిపాటి హరగోపాల్ (మొగిలిగిద్ద) కూడా అలనాటి సమావేశాల్లో పాల్గొన్నట్లు జ్ఞాపకం. 1972 భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా ఇప్పటి ఆంధ్ర సరస్వాత పరిషత్, బొగ్గులకుంట, హైదరాబాదులో జరిగిన సాహితీవేత్తల సమావేశంలో 'స్వాతంత్ర్యోద్యమంలో యువ

జనుల పాత్ర' అనే అంశంపై జరిగిన వ్యాస రచనా పోటీలో ప్రోత్సాహక బహుమతి అందుకోవడం ఈనాటికీ మరువరాని అనుభూతిగా మిగిలిపోయింది. ఆ సందర్భంలో యువభారతి ప్రచురించిన పుస్తకాలను బహుమతిగా ఇవ్వడం ఆనవాయితీ. యువభారతి సంస్థ ప్రచురించిన పుస్తకాలు అనేకం నా గ్రంథాలయంలో ఉన్నాయి.

ఆ సమయంలోనే 'ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం యువవాణి విభాగం తెలుగు కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనే అవకాశం కలిగింది. ఆ సందర్భంలోనే శ్రీ సుధామగారు, శ్రీమతి చిన్నక్క, మరార్, బాలకృష్ణలాంటి సాహిత్యాభిమానులతో పరిచయాలేర్పడ్డాయి. ఆకాశవాణి కార్యక్రమాలు కూడా చురుకుగా సాగుతుండేవి. 1974 సంవత్సరంలో ఐ.ఏ.ఎస్ పరీక్షలో కూడా తెలుగుభాషను ప్రత్యేకంగా తీసుకొని 70 శాతంపైగా మార్కులు సంపాదించి ఇంటర్వ్యూకు సెలెక్ట్ అయ్యాను. ఐ.పి.ఎస్. లో రావడం: కొన్ని మెడికల్ బోర్డ్ కారణాలవల్ల చేరలేకపోవడం జరిగింది. ఈ విధంగా తెలుగుభాషా సాహిత్యాన్ని, తెలంగాణ చరిత్రను సమగ్రంగా అధ్యయనం చేశాను. అందుకు యువభారతి సంస్థ ప్రోత్సాహం కూడా పరోక్షంగా కొంతవరకు ఉందనడంలో సందేహం లేదు.

తెలుగు సాహిత్యాభిమానంవల్ల జాతీయ సాహిత్యపరిషత్ విభాగంలో రంగారెడ్డి జిల్లా సాహితీ సమితి కార్యదర్శిగా ఉన్నప్పుడు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిని కూడా మా పరిగి పట్టణానికి పిలవడం. జరిగింది. అయితే 1980 నుండి దాదాపు రెండు దశాబ్దాలపాటు వృత్తిరీత్యా విదేశాలలో ఉండడంవల్ల రాయప్రోలు వారు అన్నట్లుగా 'ఏ దేశమేగినా... ఎందుకాలిడినా, ఏ పీఠమెక్కినా, ఎవ్వరేమనినా, పొగడరా నీ తల్లి భూమి భారతిని' అన్న రీతిలో భారతీయ తెలుగు సంఘాలలోను చురుకుగా పని చేయడం జరిగింది. అదేవిధంగా 'దేశభాష లందు తెలుగు లెస్స' అన్నట్టుగా ఈనాడు మన మాతృభాష తెలుగులో విద్యాబోధన జరగాలని 2020 నాటి మన జాతీయ విద్యావిధానంలో కూడా ' సూచించడం ముదావహం.

మా నాన్నగారైన బ్రహ్మశ్రీ లక్ష్మీకాంత పరిగి బాబుగారు కూడా చిన్నప్పుడే ఆంధ్ర బాలానందం సంఘం సభ్యులుగా, నైజాం రాష్ట్ర విముక్తి పోరాట యోధునిగా, ఆనాటి హైదరాబాద్ రాష్ట్రంలోని ఆంధ్రభాషా ఉద్యమంలో పాల్గొనడంతో నాలో తెలుగుభాషపై అభిమానం పెరిగింది. ఉన్నతపాఠశాల వరకు తెలుగు మాధ్యమంలోనే విద్యనభ్యసించడం జరిగింది. అందుకు నిదర్శనంగా మా మత్స్యరాజ ప్రచురణలు,

(అమ్మా నాన్నగారి శతజయంతి ఉత్సవ సందర్భంలో ప్రచురణ 2022, 'పావన జీవన సందేశం' మా నాన్నగారి సహస్ర చంద్రదర్శన ఉత్సవ సందర్భంలో 2007, దర్పణం - 2008 నా షష్టిపూర్తి సందర్భంలో) ఈ వజ్రోత్సవాల సందర్భంలో జరిగే సమావేశంలో యువభారతి సంస్థకు సమర్పించుకోవడం నాకు ఎంతో సంతోషాన్నిస్తుంది.

ఈనాడు చరవాణి వచ్చినా కూడా గూగుల్ లాంటి వాటిలో విషయ సేకరణ జరిగినా కూడా అది సంపూర్తి కాదు, పుస్తకపఠనము అవసరమని గురువు ద్వారా విద్యనభ్యసించాలని వైజ్ఞానికులు కూడా అభిప్రాయ పడుతున్నారు. పుస్తకపఠనము ద్వారా మేధోసంపద అభివృద్ధి చెందుతుందని వారు భావిస్తున్నారు. అందువల్ల యువభారతి లాంటి సాహితీ సంస్థల అవసరం నేడు ఎంతైనా ఉన్నది. నేటి యువతరం మన తెలుగుభాషతోపాటు సంస్కృతభాషా సాహిత్యాలను పరిరక్షించుకోవలసిన అవసరం ఉన్నది. స్వామి వివేకానంద చెప్పినట్లుగా 'ఉత్తిష్ఠ జాగ్రత ప్రాప్యరాన్ని బోధిత' అన్నట్లుగా దేశాన్ని, మాతృభాషా సాహిత్యాన్ని పరిరక్షించుకోవడం, అందుకు మనమందరం ముఖ్యంగా నేటి యువతరం నడుం బిగించి సన్నద్ధం కావడం నేడు జాతీయ సమైక్యతకు ఎంతైనా అవసరం ఉందని చెప్పక తప్పదు.





డా॥ సినారె అభినందనసభలో డా॥ బెజవాడ గోపాలరెడ్డి



# యువభారతీయులు

## యువభారతి గౌరవ సభ్యులు

1. డా॥కె.వి.రమణాచారి గారు
2. శ్రీమండలి బుద్ధప్రసాద్ గారు
3. డా॥కె.ఐ.వరప్రసాద్ రెడ్డి గారు
4. డా॥అక్కిరాజు రమాపతిరావు గారు

## మా యువభారతి కార్యవర్గ సభ్యులు

1. డా॥తిరుమల శ్రీనివాసాచార్య, గౌరవాధ్యక్షులు
2. డా॥ ఆచార్య ఫణీంద్ర, అధ్యక్షుడు
3. డా॥బి. జయరాములు, ప్రధాన సంపాదకుడు, 98498 74207
4. శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు, ఉపాధ్యక్షుడు,
   చరవాణి : 92473 28440
5. శ్రీమతి జి.ఎల్.కె.దుర్గ, ఉపాధ్యక్షురాలు
   చరవాణి : 93466 56051
6. శ్రీజీడిగుంట వెంకట్రావు, కార్యదర్శి
   చరవాణి : 93913 73684
7. శ్రీ పోరూరి మారుతీకిరణ్, సహకార్యదర్శి
   చరవాణి : 94910 63089
8. శ్రీనవీన్ గౌడ్, సహకారదర్శి
   చరవాణి : 81212 12551
9. శ్రీఆమాతి రవీంద్ర, కోశాధికారి
   చరవాణి : 98495 09896

10. డా॥ వంగపల్లి విశ్వనాథం, వ్యవస్థాపక సమావేశకర్త
చరవాణి : 79881 80414
11. శ్రీ పత్రి అశ్వనీకుమార్, సమావేశకర్త
చరవాణి : 93737 12379
12. శ్రీ మాడభూషి అనంతాచార్య, కార్యవర్గ సభ్యుడు
చరవాణి : 92907 2328
13. శ్రీ ఎల్.ఎస్.భార్గవ, కార్యవర్గ సభ్యుడు
చరవాణి : 93935 65122
14. శ్రీ ఎస్.నారాయణ రెడ్డి, కార్యవర్గ సభ్యుడు
చరవాణి : 99491, 66104

## యువభారతి జీవిత సభ్యులు

1. శ్రీ ఎస్. వెంకటేశ్వరరావు
2. శ్రీ డి.ఎల్.ఎన్. ప్రసాద్
3. శ్రీ ఎస్.వి. ప్రభాకరరావు
4. శ్రీ ఎం.ఎస్.ఆర్. ఆంజనేయశర్మ
5. శ్రీ ఎ.జయరామశర్మ
6. శ్రీ వి.బి.శాస్త్రి
7. శ్రీ ఇరివెంటి శ్రీధరమూర్తి
8. శ్రీ చేగొండి రామజోగయ్య
9. శ్రీ కొమ్ము ఎస్.వి. దక్షిణామూర్తి
10. శ్రీ ఎ.రామలింగేశ్వరరావు
11. శ్రీ పి.చంద్రప్రకాశరావు
12. శ్రీ పి.సత్యనారాయణరాజు (కవిరాజు)
13. శ్రీ టి.కె.విజయకుమార్
14. శ్రీ వి.రాఘవరావు (రఘుశ్రీ)
15. శ్రీ టి. శేఖర్ రెడ్డి

16. శ్రీ పరవస్తు గోపాలకృష్ణ
17. శ్రీ తంగిరాల వేంకటేశ్వరరావు
18. శ్రీ గొడవర్తి (సాధన) నరసింహా చార్యులు
19. శ్రీ వి.వి. సత్యప్రసాద్
21. 20. శ్రీ అడెపు సుధాకర్
22. శ్రీ చెరువు రాంబాబు
23. శ్రీ వారణాశి రామబ్రహ్మం
24. శ్రీ ఘట్టి కృష్ణమూర్తి
25. శ్రీ దారా రామలింగం
26. శ్రీ కె.బి.ఎస్. శర్మ
27. శ్రీ నందూరి శ్రీనివాసరావు
28. శ్రీ మరుమాముల దత్తాత్రేయశర్మ
29. శ్రీ గణపవరపు నారాయణమూర్తి
30. శ్రీ రాణి సదాశివమూర్తి
31. శ్రీ కె.వి.ఎన్. ఆచార్య
32. శ్రీ సి.వి.ఎస్. రామకృష్ణ
33. శ్రీ చింతలపాటి బదరీనారాయణ
34. శ్రీమతి పి. లక్ష్మీకుమారి
35. శ్రీ ఎం.పరమేశ్వర
36. శ్రీ తిరునగరి కృష్ణారావు
37. శ్రీ పి.వేణుగోపాలస్వామి అయ్యంగార్
38. శ్రీ కె.పార్థసారథి
39. శ్రీ పి. జవహర్‌లాల్ నెహ్రూ
40. శ్రీ అల్లంరాజు వెంకట్రావు (సుధామ)
41. శ్రీ రాణి శ్రీరామమూర్తి
42. డా॥ వెలుదండ నిత్యానందరావు
43. శ్రీ అత్తూరి రామకృష్ణ
44. శ్రీ చిదానంద బాలేంద్ర సరస్వతి
45. శ్రీ కళ్ళేపు సాగరరావు

46. శ్రీ భట్టిప్రోలు శ్రీనివాసరావు
47. శ్రీ గౌతరాజు హనుమంతరావు
48. డా॥ గంగిశెట్టి లక్ష్మీనారాయణ
49. శ్రీమతి దేవారెడ్డి విజయలక్ష్మి
50. శ్రీ మొసలి దేవరాజ్ రెడ్డి
51. శ్రీ మహమ్మద్ రిజ్వాన్
52. శ్రీ ఆర్.వి.జి.కె. మూర్తి.
53. శ్రీ మదన్ గుప్త
54. డా॥ విఠల్ రావు
55. శ్రీ కూర రఘువీర్
56. శ్రీమతి ఆకెళ్ళ వెంకట సుబ్బలక్ష్మి
57. శ్రీ ముద్దు రాజయ్య
58. శ్రీ తుమ్మతాటి రమణయ్య
59. శ్రీ మల్లెపూడి రవిచంద్ర
60. శ్రీ పి. శేషగిరి రావు
61. శ్రీ మాత్రినేని అప్పారావు
62. శ్రీమతి టి. పూర్ణ
63. శ్రీ కె.వెంకటరమణ సుబ్రహ్మణ్యం
64. శ్రీ జె.రాంబాబు
65. శ్రీ వంశీకృష్ణ ముళ్ళపూడి
66. డా॥వై.కృష్ణకుమారి
67. శ్రీ తాళ్ళపల్లి మురళీధర గౌడ్
68. శ్రీ కేశిరాజు మురళీ మోహన్‌రావు
69. శ్రీ ధూర్జటి ప్రభాకరరావు
70. శ్రీ కస్తూరి నాగేశ్వరరావు
71. శ్రీ ఎస్.నీలాంబరరావు
72. శ్రీ ఆర్. రాజన్న.
73. శ్రీ ఆచంట సుధాకర్
74. శ్రీమతి ఆచంట అంజని

75. శ్రీ కస్తూరి మురళీకృష్ణ
76. శ్రీ యజ్ఞంభట్ వేంకటరమణ
77. శ్రీ బులుసు వేంకటేశ్వర్లు
78. శ్రీ సబ్బని లక్ష్మీనారాయణ
79. శ్రీ ఎం.వి.ఎస్. ప్రసాద్
80. శ్రీ వి.వి.యస్.బి.ఎస్.యు.ఎం.శాస్త్రి
81. శ్రీ అల్లెన వెంకటరమణమూర్తి
82. శ్రీ సూరి సీతారామ్
83. శ్రీ టి.హెచ్. రమాకాంత్
84. శ్రీ గరిమెళ్ళ వెంకటశివప్రసాద్
85. శ్రీ డా॥వడ్డేపల్లి కృష్ణ
86. శ్రీపంగులూరి హనుమంతరావు
87. శ్రీ కె.రవీంద్రనాథ్
88. శ్రీ వడ్లమాని వెంకటరమణమూర్తి
89. శ్రీ పల్లెర్ల రామమోహన్‌రావు
90. శ్రీ నండూరి వెంకటేశ్వరరాజు
91. శ్రీ కస్తూరి రాజశేఖర్
92. శ్రీ వి.ప్రభాకర్
93. డా॥ సంగనభట్ల నరసయ్య
94. శ్రీ జ్వాలా సోమనాథశాస్త్రి
95. శ్రీ నందం సాంబశివరావు
96. డా॥ రేవూరు అనంతపద్మనాభరావు
97. శ్రీ ద్విభాష్యం అగస్తేశ్వర్
98. శ్రీమతి జె.శకుంతల
99. శ్రీ మదిర దశరథ
100. శ్రీ ఎ.బి.వి.జి.ఎస్.అయ్యప్ప
101. శ్రీ కె.వి. రామానాయుడు
102. శ్రీ ఎం.వెంకటేశ్వర్లు
103. శ్రీ దినవహి వేంకట హనుమంతరావు

## యువభారతిలో గౌరవ సభ్యులుగా ఉండి గతంలో తమ అమూల్యమైన సేవలందించిన కీర్తిశేషులైన సాహితీమూర్తులు

1. డా॥ దివాకర్ల వేంకటావధాని గారు
2. డా॥ దేవులపల్లి రామానుజరావు గారు
3. డా॥సి.నారాయణరెడ్డి గారు
4. శ్రీ అక్కిరాజు వాసుదేవరావు గారు
5. డా॥ వానమామలై వరదాచార్యులు గారు
6. డా॥ ఖండవల్లి లక్ష్మీరంజనం గారు
7. డా॥ పాటిబండ మాధవశర్మ గారు
8. శ్రీ కాళోజీ నారాయణరావు గారు
9. శ్రీ అనుముల కృష్ణమూర్తి గారు
10. డా॥జి.వి.సుబ్రహ్మణ్యం గారు
11. శ్రీ శీలావీర్రాజు గారు
12. డా॥పోరంకి దక్షిణామూర్తి గారు
13. డా॥పుల్లెల శ్రీరామచంద్రుడు గారు
14. డా॥రవ్వా శ్రీహరి గారు

## గతంలో యువభారతికి తమ అమూల్యమైన సేవలందించి కీర్తిశేషులైన యువభారతీయులు

1. డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి, అధ్యక్షులు
2. డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం, అధ్యక్షులు
3. శ్రీ ఎస్.పాండురంగారెడ్డి, ఉపాధ్యక్షులు
4. శ్రీ ఎ.ఎన్.పురుషోత్తమరావు, ఉపాధ్యక్షులు
5. శ్రీ జి.ఎల్. నరసింహారావు, ఉపాధ్యక్షులు
6. డా॥ కె.బి.లక్ష్మి, ఉపాధ్యక్షులు
7. డా॥నాగినేని భాస్కరరావు, ఉపాధ్యక్షులు
8. శ్రీ సి.వి.ఎ.ఎస్.సూర్యనారాయణ, కార్యదర్శి
9. శ్రీ రెడ్డి రాఘవయ్య, కార్యదర్శి
10. శ్రీ కె.వి. కామేశ్వరరావు, కార్యదర్శి

11. శ్రీ మలపాక పూర్ణచంద్రరావు, కార్యదర్శి
12. శ్రీ ఆర్. రాధాకృష్ణమూర్తి
13. డా॥ జి.కుమారస్వామినాయుడు
14. శ్రీ వై.వి.ఎస్. కృష్ణమూర్తి
15. డా॥ రాపాక ఏకాంబరాచార్యులు
16. డా॥ ద్వానా శాస్త్రి
17. శ్రీ రాళ్ళబండి కవితాప్రసాద్
18. శ్రీ పి.శ్రీరామారావు
19. శ్రీ జె.ఎస్.ఆర్.వి. ప్రసాద్
20. శ్రీ గంధం నారాయణ
21. శ్రీ ఎస్.ఎస్. ప్రసాద్
22. శ్రీ చివుకుల సుందరరామశర్మ
23. శ్రీ కె.వి.వి. రామయ్య
24. డా॥ ఆశావాది ప్రకాశరావు
25. శ్రీ కె. బుచ్చిబాబు
26. శ్రీ జీడిగుంట కామేశ్వరరావు
27. శ్రీ డి.కె. శ్రీనివాసాచార్యులు
28. శ్రీ ఎం.ఆర్. శ్రీనివాసాచార్యులు
29. శ్రీ పింగళి జగన్నాథరావు
30. శ్రీ మాడభూషి రంగాచార్యులు
31. శ్రీ శ్రీపతి రఘురామ్ కుమార్
32. శ్రీ సుభాష్ బాబు
33. శ్రీ మహమ్మద్ జహంగీర్
34. డా॥ మంగళగిరి ప్రమీలాదేవి
35. శ్రీమతి సోమకూచి వెంకటపద్మ
36. శ్రీ తల్లాప్రగడ రాజారాం
37. శ్రీ బి.వి.ఎల్. జగన్నాథరావు
38. శ్రీ పి. కుటుంబరావు
39. శ్రీ ఎ.ఎస్. సూర్యనారాయణ (రాజు)
40. శ్రీ రామచంద్రరావు
41. శ్రీ ఎం.వి.పి. రామవరప్రసాద్



# కనుమరుగైన కొందరు యువభారతీయులు

– సుధామ

## చక్రవర్తి పి.ఎన్.వేణుగోపాల్

యువభారతి తృతీయ ప్రచురణ అయిన వీచికల్లోని యువభారతి సభ్యుడైన కవి చక్రవర్తి వేణుగోపాల్ అప్పటికే పత్రికల్లో కవిగా, కథకునిగా రచనలు వెలువరించినవారు. 1937 అక్టోబర్ 27న అనంతపురంలో జన్మించిన ఆయన విద్యుచ్ఛక్తి శాఖలో పనిచేసేవారు. యువభారతి పక్ష సమావేశాల్లో ఆయన ఓ ఎంకిపాట ఎంతో శ్రావ్యంగా పాడుతుండేవారు. క్రియాశీలక తొలిసభ్యుల్లో ఆయనొకరు. వీచికలుపై ఆంధ్రజ్యోతిలో పురాణం సమీక్షలోని విమర్శకు బాధపడి రాయడం తగ్గించేశారు. ఆ తరువాత సమావేశాలకు కూడా రావడం ఎందుకో తగ్గిపోయింది. నటన, సాహిత్యం ఆయనకు అభిమాన అంశాలు.

## నాగినేని భాస్కరరావు

వైద్యవిద్యార్థిగా గాంధీమెడికల్ కాలేజీలో యంబిబియస్ చదువుతూ యువభారతిలో అత్యంత క్రియాశీలక సభ్యులయిన నాగినేని భాస్కరరావు వామపక్షభావాలను సాకల్యంగా కలిగినవారు. ఖమ్మం జిల్లా ఎర్రుపాలెంలో జన్మించారు. సహకార్యదర్శిగా, ఉపాధ్యక్షులుగా సేవలందించడమే కాక, 1974లో సుధామతో కలిసి 'మేం' కవితాసంపుటి యువభారతి ప్రచురణగా వెలువరించారు. ప్రజాసూక్తం, భావన, సింధూరం వంటి ప్రచురణల వెనుక ఆయన శ్రమ ఎంతో వుంది. డాక్టర్‌గా తొలుత మధిరలో నాగినేని నర్సింగ్ హెూం నెలకొల్పి ప్రజాడాక్టర్‌గా సేవలందించారు. విరివిగా కథలు, కవితలు రాశారు. యువభారతి సభ్యుల కవితలతో వెలువడిన అక్షరాలు, స్వరాలు, వేడివెలుగులు, రేఖలు, రవ్వలు సంకలనాల్లోనే కాక స్వయంగా

తమ వచన కవితా సంకలనం 'ఆక్సిజన్', ఆరోగ్యసూత్రాలు, ఆరోగ్యగ్రంథం నవజీవనం (నాటకం), ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారితో కలిసి వ్యక్తిత్వ వికాసం–సూక్తులు, చొరవ కవితాసంపుటి, అలాగే తన దీర్ఘ కవిత నగరం నిద్రపోదు యువభారతి ప్రచురణలుగా వెలువరించారు. ఒకే కిడ్నీతో హైదరాబాద్‌లో చివరిరోజుల్లో ఓ దశాబ్దం పైబడి వైద్యాధికారిగా సేవలు అందిస్తూనే 2017 నవంబర్ రెండవతేదీన జీవయాత్ర చాలించాడు. కవిగా, వైద్యవిద్యావిషయక రచయితగా, నటునిగా రాణించిన నాగినేని భాస్కర్ యువభారతిలో వామపక్ష అభ్యుదయ దృక్పథాల పరివ్యాప్తికి సమ్యక్ దృష్టితో నిలచి గెలిచిన సాహిత్యసైనికుడు అనాలి. యువభారతిలో వుండగానే శారదతో అతని వివాహం జరిగింది. భారవి, భరత్ అని అతనికి ఇద్దరు అబ్బాయిలు.

## గోళ్ళ కుమారస్వామినాయుడు

ఆంధ్రసారస్వత పరిషత్ ప్రాచ్య కళాశాల విద్యార్థిగా వుంటూ యువభారతి సభ్యుడైన జి.కుమారస్వామి నాయుడు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా చేసిన చంద్రబాబు నాయుడు గారికి విద్యార్థి దశలో సహపాఠి. రామాయణంలో శబరిపాత్రపై ఎం.ఫిల్ తర్వాత దివాకర్ల వారిపై సిద్ధాంత గ్రంథంతో డాక్టరేట్ చేశారు. 'పువ్వులు నవ్వుతున్నాయి' అనే అతని కవితా సంకలనం యువభారతి ప్రచురణగానే బాపుగారు అభినందనతో వేసి పంపిన ముఖచిత్రంతో వెలువడింది. యువభారతీయుల కవితాసంకలనాలలో కవితలేకాక శ్రీమద్రామాయణ కల్పవృక్షం శబరిపాత్ర సిద్ధాంతగ్రంథం యువభారతి ప్రచురణగా 1990లో వెలువరించారు. అలాగే తమ పిహెచ్‌డి సిద్ధాంతగ్రంథం దివాకర్ల వేంకటావధాని జీవితం–సాహిత్యం కూడా 1998లో యువభారతి ప్రచురణగానే వెలువడింది. 2020 ఏప్రిల్‌లో తన 75వ పుట్టినరోజు తిరుపతిలో వైభవంగా జరుపుకుని ఆ సందర్భంగా ఒక వ్యాససంకలనం ఒక కవితాసంపుటి వెలువరించుకున్నాడు. దివాకర్ల ట్రస్టు నెలకొల్పి ఆ బాధ్యతలు నిర్వర్తిస్తూ స్వయంగా దివాకర్ల వారిపై సభలు నిర్వహించాడు. ఆయనపేర పలువురు సాహితీవేత్తలకు పురస్కారాలు అందించాడు.

2020 సెప్టెంబర్ 3 రాత్రి పరమపదించాడు.

## డా॥రెడ్డి రాఘవయ్య

బాలసాహిత్యంలో తనదంటూ ఒక ముద్రవేసి కేంద్రసాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత అయిన రెడ్డిరాఘవయ్య యువభారతి క్రియాశీలక సభ్యునిగా ఎదిగిన వారే. గుంటూరు జిల్లా అమృతలూరు ప్యాపర్రులో 1940 జూలై 1న జన్మించిన ఆయన హిందుస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్‌లో బెంగుళూరు, హైదరాబాద్‌ల్లో పనిచేసి 2000 సంవత్సరంలో ఉద్యోగవిరమణ పొందారు. అత్యంత సౌమ్యులుగా పేరొందిన ఆయన చేసిన బాలసాహిత్య కృషి అనుపమానం. 'విజ్ఞానోదయం' పేరిట వారి విజ్ఞాన శాస్త్ర వ్యాససంపుటి, 'గోరంతదీపం' పేరిట తెలుగు బాలసాహిత్యం యువభారతి ప్రచురణలుగా వెలువడ్డాయి. మణిదీపాలు నవరత్నాలు, బాలనీతిమాల, బాలలలోకం, పసిడిపాటలు, మంచిపూలు, పూలతోట, రంగులరాట్నం వంటి బాలసాహిత్య గ్రంథాలు స్వయంగా వెలువవరించడమే కాక ఎందరో బాలసాహితీ రచయితలను 1995లో వార్త దినపత్రికలో వారం వారం పరిచయంచేశారు. వారి 'చిరుదివ్వెలు' గ్రంథానికే 2012లో కేంద్రసాహిత్య అకాడమీ బాలసాహిత్య పురస్కారం లభించింది. 2022 జూలై 24 సాయంత్రం బాలానగర్‌లోని స్వగృహంలో ఆయన కాలధర్మం చెందారు. యువభారతికి కార్యదర్శిగా, ఉపాధ్యక్షులుగా ఆయన సేవలందించారు.

## అయ్యదేవర పురుషోత్తమరావు

రంగస్థలంపై కృష్ణపాత్రలో పేరొందిన పౌరాణిక నటులలో ఒకరైన అయ్యదేవర పురుషోత్తమరావు గారు యువభారతిలో క్రియాశీలక పాత్ర పోషించారు. ఆయన కంఠంతో యువభారతి సమావేశాలకు ప్రార్థనాగీతం ఆలపించారు. ఆయన మంచి నవలాకారుడు, కథకులు, కవి కూడాను. విద్యానగర్ ఎస్.వి.రాత్రి కళాశాలలో ఉ ద్యోగం చేస్తూనే చదివేవారు. 1933 జూన్ 30న జన్మించారు. భువనవిజయంలో శ్రీకృష్ణదేవరాయలుగా ఆయన వుంటూ పలు ప్రదర్శనలు ఇచ్చారు. ఆయన స్వయంగా 'విజ్ఞానదీపిక' పేరసాహిత్య సంగీత నాటక కార్యక్రమాలు కొన్ని నిర్వహించేవారు. స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ అధికారిగా పనిచేసేవారు. పీసపాటివారి పద్ధతిలో రాగాలాపన చేస్తూ శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, బిల్వమంగళుడు వంటిపాత్రలతో, దివాకర్లవారి భువనవిజయ ప్రదర్శనల్లో శేషేంద్ర తరువాత కృష్ణదేవరాయలుగా అమెరికాలో సైతం ప్రదర్శనలిచ్చారు. యువభారతీయుల స్వరాలు, అక్షరాలు వంటి

సంకలనాల్లో కవితలు రాశారు. వారి స్వీయకవితా సంపుటి 'అక్షతలు', శ్రీకృష్ణ దేవరాయలు (చరిత్ర నాటకం) యువభారతి ప్రచురణలుగా వెలువడ్డాయి. మరదలు వంటి నవలలు కూడా ఆయన రాసి ప్రచురించారు. సి.ఎస్సార్ కళామందిరం, ఆంధ్రనాటక విజ్ఞానసమితి, వైజయంతి ఆర్ట్స్ దివాకర్ల వేదిక వంటి సంస్థల్లో సైతం సేవలందించిన అయ్యదేవర పురుషోత్తమరావు గారు యువభారతి సహకార్యదర్శిగా, ఉపాధ్యక్షులుగా కూడా క్రియాశీలకపాత్ర పోషించారు. 1957 నుండి 1994 వరకు స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌లో పనిచేసిన ఆయన కొద్ది సంవత్సరాల క్రితమే కన్నుమూశారు.

## కె.వి.కామేశ్వరరావు

హెచ్ఎమ్‌టి ఉద్యోగిగా పనిచేసిన కొల్లూరి వెంకట కామేశ్వరరావు యువభారతిలో ఉత్సాహంగా పనిచేసిన క్రియాశీలక సభ్యులు. యువభారతికి కార్యదర్శిగా కూడా వుండి 'హాస్యలహరి' వంటి కార్యక్రమాల నిర్వహణలో ప్రముఖపాత్ర వహించారు. యువభారతి వనితావిభాగానికి అధ్యక్షురాలుగా వున్న వి.బి.లక్ష్మిని ప్రేమించి ఇద్దరూ యువభారతీయులుగానే పెళ్ళి చేసుకుని ఆదర్శ దాంపత్యం నిర్వర్తించారు. అడపాదడపా కవితలు రాసి యువభారతి కవితా సంకలనాల్లో వెలువరించినా ప్రధానంగా కార్యకర్తగానే ఆయన కృషిచేశారు. తెల్లవారితే ఉగాది నాడు అస్తమించాడు.

## డా.కె.బి.లక్ష్మి

తెలుగుసాహిత్య ప్రపంచానికి పరిచయం అక్కర్లేని పేరు కె.బి.లక్ష్మి. వివాహం కాకముందు వి.బి.లక్ష్మి వనితా కళాశాల విద్యార్థినిగా యువభారతి వనితావిభాగం సభ్యురాలై దానికి అధ్యక్షురాలిగా సమావేశాలు నిర్వహించిన దక్షతగల కార్యకర్త. ఆకాశవాణిలో క్యాజువల్ అనౌన్సర్‌గా పనిచేశారు. ఆ పై 1979నుండి 2006 వరకు ఈనాడు గ్రూప్ 'విపుల', 'చతుర' మాసపత్రికలలో పనిచేస్తూ ఆ పత్రికల సంపాదకత్వ బాధ్యతలు కూడా కొన్నేళ్ళు నిర్వర్తించారు. కవయిత్రిగా, కథకురాలిగా, ఉత్తమ పాత్రికేయురాలిగా పేరొందిన లక్ష్మి కవితలు యువభారతి కవితా సంకలనాలలో వచ్చాయి. 'కవితాలత' పేర యువభారతి కేవలం కవయిత్రుల కవితల ప్రచురణ కూడా వెలువరించింది. వక్తగా, ఉపన్యాసకురాలిగా, స్నేహశీలిగా పేరొందిన కె.బి.లక్ష్మి

యువభారతి సభ్యురాలుగా ఖ్యాతి గాంచింది. ఐ.వి.స్. అచ్యుతవల్లి కథలపై, సిద్ధాంతగ్రంథం రచించి డాక్టరేట్ పట్టా పొందిన కె.బి.లక్ష్మి మహిళా పాత్రికేయురాలిగా పేరొంది పలు విదేశీ పర్యటనలు కూడా చేశారు. 'వీక్షణం', 'గమనం' అనే కవితా సంపుటాలు, 'మనసున మనసై', 'జూకామల్లి' కథా సంపుటాలు స్వయంగా వెలువరించుకున్నారు. 'హాస్యలహరి' నిర్వహణలో ప్రముఖపాత్ర వహించారు. భర్త అకాల మరణానంతరం స్వయంసిద్ధగా నిలిచి బాధ్యతలు నిర్వహించుకుంటూనే ఒక సాహిత్యవేత్తగా ఎదిగి, ఎందరికో తలలో నాలుకగా మెలిగి అనేక అవార్డులు, రివార్డులు అందుకున్నారు. మునిమాణిక్యం మీద సి.పి.బ్రౌన్ అకాడమీకి, కేంద్ర సాహిత్య అకాడమీకి మోనోగ్రాఫ్‌లు రచించారు. 1953 ఆగస్టు 15న జన్మించి వేటపాలెంలో చదువుకుని హైదరాబాద్ మెట్టిన లక్ష్మి మిత్రులతో కంచి దైవదర్శనం చేసుకుని తిరిగివస్తూ రైలులోనే గుండెపోటుతో 2019 జూలై 29న కీర్తిశేషులయ్యారు. చిరస్మరణీయులుగా మిగిలిపోయారు.

## మాడభూషి రంగాచార్య

దక్షిణ మధ్యరైల్వేలో సీనియర్ క్యాషియర్‌గా పనిచేస్తూ యువభారతి సభ్యులైన మాడభూషి రంగాచార్య మంచి కథకులుగా, క్రియాశీలక సభ్యులుగా యువభారతి ప్రచురణల పూర్వ విరాళాల సేకరణకు కృషిచేసేవారు. 1941 ఫిబ్రవరి 25న జన్మించిన ఆయన 11మార్చి 2001లో అస్తమించారు. వారి శ్రీమతి మాడభూషి లలితాదేవి మాడభూషి రంగాచార్య స్మారక కమిటీ పేర తదాదిగా ఏటా ఒక ఉత్తమ కథాసంపుటికి పదివేల అవార్డునిస్తూ, పాఠశాల విద్యార్థులకు కథారచనలో పోటీలు నిర్వహిస్తూ ప్రోత్సహిస్తూ రంగాచార్య స్మారక ప్రసంగాలను ఇప్పిస్తూ వాటిని గ్రంథాలుగా ప్రచురిస్తున్నారు.

ఇంకా కె.కె. రంగనాథాచార్యులు గారి తమ్ముడైన ప్రముఖ నటుడు మంచుపల్లకి వంటి సినిమాలకు పనిచేసిన కె.బుచ్చిబాబు యువభారతిలో గొప్ప క్రియాశీలక పాత్ర పోషించి చిన్న వయసులోనే గుండె ఆపరేషన్ జరుగకుండానే కన్నుమూశాడు. బి.వి.యల్. జగన్నాథరావు, కుటుంబరావు, అయల సోమయాజుల రాజు వంటి యువభారతి సభ్యులు కూడా అర్ధాంతరంగా తనువు చాలించారు. కానీ వీరందరి సేవలు యువభారతి వైభవ, వికాసాలకు సదా స్మరణీయాలే.





# యువభారతి సంక్షిప్త పరిచయం

జననం (స్థాపనం): 28, సెప్టెంబర్ '1963–శనివారం –విజయదశమి

జన్మస్థలం : 102, జీరా, సికింద్రాబాద్ – 500 003

రిజిస్ట్రేషన్ తేది : 04-01-1964

రిజిస్ట్రేషన్ నంబర్ : 1/64

వ్యవస్థాపక సభ్యులు:

1. **శ్రీ కె.రఘునాథరావు,** అధ్యక్షులు
   యు.డి.సి, ఎ.జి.ఆఫీసు, హైదరాబాద్.
2. **శ్రీ ఎం.వి.ఎస్. ప్రసాద్,** కార్యదర్శి
   ఉపన్యాసకులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం
3. **శ్రీ వి.విశ్వనాథం,** సభ్యులు
   ఉపన్యాసకులు
   ఉస్మానియా విశ్వవిద్యాలయం
4. **శ్రీ టి.ఆంజనేయులు** సభ్యులు
   అకౌంట్స్ క్లర్క్
5. **శ్రీ టి.ఎల్.నారాయణ** సభ్యులు
   ఎల్.డి. ఆడిటర్
6. **శ్రీ ఎం.వి.రామకృష్ణ** సభ్యులు
   క్లర్క్, పరీక్షా విభాగం
   ఉస్మానియా విశ్వవిద్యాలయం
7. **శ్రీమతి ఎ.శ్రీదేవి** సభ్యులు
   యు.డి.సి., ఎ.జి.ఆఫీసు, హైదరాబాద్

**ముఖ్యోద్దేశాలు :**

1. దేశానికి, సంఘశ్రేయస్సుకు కావలసిన పద్ధతిలో సభ్యులు పరిపూర్ణ వ్యక్తిత్వం కలిగి ఉండేటట్లు పాటుపడటం, నవ జాగృతిని పెంపొందించడం.
2. బాల బాలికలను, యువతీయువకులను 'కలంస్నేహం' ద్వారా, సమావేశాల ద్వారా పరిచయం చేసి స్నేహ సౌహార్ద్ర భావాలను పెంపొందించటం.
3. సభ్యుల నుంచి అభిరుచులను పెంపొందించడానికి అనువైన వైజ్ఞానిక, సామాన్య, సంగీత కార్యక్రమాలను జరపడం
4. సంఘసేవ ద్వారా సమాజానికి తోడ్పడటం
5. పై ఆశయ సాధనకు అవసరమైనచో అనుబంధ శాఖలను ఏర్పరచుటకు 'యువభారతి'కి హక్కు కలదు.

**ముఖ్య కార్యక్రమాలు:**

1. **పక్ష సమావేశాలు :** ప్రతి నెల మొదటి, మూడు ఆదివారాలలో సుల్తాన్ బజార్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో మధ్యాహ్నం 2.00 గంటల నుండి సాయంకాలం 5.00 గంటల వరకు నిర్వహించబడేవి. అందులో క్లుప్త గోష్ఠి, పునరపి, స్వీయ రచనాపఠనం, నా ఊహా పథంలో, నాకు నచ్చినది–నేను మెచ్చినది, పుస్తక సమీక్ష వంటి వివిధ అంశాలుండేవి.
2. **లహరి ఉపన్యాస కార్యక్రమాలు:** 1971 సంవత్సరంలో తెలుగులో పంచకావ్యాలమీద ఉపన్యాసాలను ఏర్పాటు చేసి కావ్యలహరి పేర ప్రచురించడం జరిగింది. ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు వక్త. అటు తరువాత చైతన్యలహరి, వికాసలహరి, ప్రతిభాలహరి... ఇలా 20కి పైగా లహరీ కార్యక్రమాలు ఏర్పాటు చేసి పుస్తకాలను వెలువరించాము.
3. **'రచన', 'మహతి',** Free Inda Forges Ahead, యువత, 'అమృత భారతి' వంటి సామాజికోపయుక్తమైన అంశాలపై ప్రచురణలను వెలువరించాము.
4. అనేకమంది యువకవులను, కథకులను, రచయితలను ప్రోత్సహించి వారి రచనలను అచ్చువేశాము. అందులో కొన్ని ముఖ్యమైనవి 'వీచికలు', అక్షరాలు,

స్వరాలు, ఉషస్సు, కథా వాహిని రెండు భాగాలు, మేం, రవ్వలు, మరో జంఝూలశాస్త్రి, పువ్వులు నవ్వుతున్నాయి, వేడి వెలుగులు, రేఖలు, కవితాలత, వెలుగు రేఖలు.

5. సుప్రసిద్ధ కవుల జీవితాలను, సాహిత్యాన్ని పరిచయం చేస్తూ 'సాహితీవాహిని' పరంపరలో 50కి పైగా చిన్నచిన్న పుస్తకాలను ప్రచురించి అందించాము. అందులో ఆదికవి నన్నయ నుండి ఆధునిక కవి నారాయణ రెడ్డి వరకూ గల అనేకానేక కవుల జీవిత, సాహిత్యాలను దిగ్మాత్రంగా పరిచయం చేశాం. అందులో కొన్ని ముఖ్యమైనవి: నన్నయ కవితావైభవం, తిక్కన కవితా వైభవం, శ్రీనాథ కవితావైభవం, మందార మకరందాలు, వేమన్నవేదం.

6. **అక్షర:** 'అక్షర' పేర సోదర సంస్థలు, సాధన సాహితీస్రవంతి, తెలుగు రథం, మానస ఆర్ట్ థియేటర్స్ వారితో కలసి ఒక సంవత్సరం పాటు ప్రతినెలా ఉపన్యాస కార్యక్రమాలను ఏర్పాటు చేశాము.

7. **పథకాలు:** వీలయినంతమంది సాహితీ ప్రియులను యువభారతి ఛత్రఛాయలోకి తీసుకు రావాలనే సంకల్పంతో, సాహితీమిత్ర, భారతీమిత్ర, భారతీ భూషణ పథకాలను ప్రవేశపెట్టాము. ఈ పథకాలలో చేరిన సభ్యులు 'యువభారతి' సభ్యులు కానేరరు. కానీ ఈ పథకాలలో చేరిన సభ్యులు చాలామంది ఈ నాటకీ తాము 'యువభారతి' సభ్యులమని చెప్పుకుంటారు. అయితే ఒకవైపు పెరిగిన ముద్రణ ధరలు, మరోవైపు తగ్గిన వడ్డీరేట్లు ఈ పథకాలను కొనసాగించడంలో ఇబ్బందులు సృష్టించాయి. అందుకని వాటిని రద్దుచేయడం జరిగింది.

8. **ఇరివెంటి కృష్ణమూర్తి గారి జయంతి ఉత్సవాలు:** మా పూర్వ అధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారి జన్మదినాన్ని పురస్కరించుకొని ప్రతి సంవత్సరం వారి జన్మదినమైన 'శ్రీకృష్ణాష్టమి' నాడు సుప్రసిద్ధ సాహితీవేత్తలకు స్మారక పురస్కారాలను అందచేయటం జరుగుతోంది. ఈ పురస్కారాలను 1997లో ప్రారంభించి 2023 వరకూ ఈయటం జరిగింది. ఈ పురస్కారాన్ని అందుకున్న ప్రముఖుల జాబితా విడిగా ఇవ్వడం జరిగింది.

9. **తిరుమల శ్రీనివాసాచార్య, శ్రీమతి స్వరాజ్యలక్ష్మి ధర్మనిధి పురస్కారం:** మా ప్రస్తుత గౌరవాధ్యక్షులు తిరుమల శ్రీనివాసాచార్యులుగారు నెలకొల్పిన ఈ

ధర్మనిధి పురస్కారాన్ని ఉత్తమ వక్తకు 2011 వ సంవత్సరం నుండి అందచేస్తున్నాము. ఈ ధర్మనిధి పురస్కారాన్ని ఇంతవరకూ అందుకున్నవారి వివరాలు విడిగా ఇస్తున్నాం.

10. **ఆచార్య దివాకర్ల వేంకటావధాని స్మారక పురస్కారాలు:** మా దివంగత సభ్యులు శ్రీ గోళ్ళకుమారస్వామి నాయుడుగారు దివాకర్ల వారి మీద గల గౌరవంతో దివాకర్ల వేంకటావదాని మెమోరియల్ ట్రస్ట్‌ను ఏర్పాటు చేశారు. అందులో యువభారతి అధ్యక్ష, కార్యదర్శులను 'ఎక్స్-ఆఫీసియో' సభ్యులుగా చేర్చారు. దివాకర్ల వారి శతజయంతి ఉత్సవాలను వారి స్వగ్రామమైన 'ఎండగండి'లోనూ, హైదరాబాద్‌లోనూ, వరంగల్ లోనూ కూడా ఘనంగా నిర్వహించాము. అయితే మా కుమారస్వామి నాయుడిగారి హఠాన్మరణంతో ట్రస్టు కార్యకలాపాలు స్తంభించిపోయాయి. వాటిని పునరుద్ధరించవలసిన అవసరం ఉంది.

11. **పత్రికలు:** 'యువభారతి' ఆరంభదశలో ఒక లిఖిత మాసపత్రికను నడిపింది. మా 'సుధామ'గారు దానిని చాలాకాలం నిర్వహించారు. అటు తరువాత జి.వి.సుబ్రహ్మణ్యంగారి సంపాదకత్వంలో 'నందిని' మాసపత్రిక వెలువడింది. అది కూడా చాలాకాలం నడిచింది. తెలుగులో 'రీడర్స్ డైజెస్ట్' వంటి పత్రికను నడపాలనే ధ్యేయంతో 'నందిని' త్రైమాసిక పత్రికను ప్రారంభించాము. అయితే పాఠకుల నుండి తగిన ప్రోత్సాహం, త్రైమాస పత్రికను నడిపేందుకు కావలసిన ఉత్సాహం సభ్యులలో లేకపోవడంతో దానిని కూడా మానవలసి వచ్చింది.

12. **స్వీయ కవితా గానం:** స్వీయ కవితాగానం పేరిట కొంతమంది సుప్రసిద్ధ కవుల స్వీక కవితాగానాన్ని చేసేందుకు వీలుగా కార్యక్రమాన్ని రూపొందించడం జరిగింది. ఇందులో నారాయణరెడ్డిగారు, దాశరథిగారు, గుంటూరు శేషేంద్రశర్మగారు, బోయి భీమన్నగారు, ఉత్పల సత్యనారాయణాచార్య గారు వంటి ప్రముఖులు తమ కావ్యగానంతో శ్రోతలను అలరించారు. కాని సంస్థ ఆర్థిక పరిస్థితులు సహకరించనందువల్ల ఆపివేయవలసి వచ్చింది.

13. **వ్యక్తిత్వవికాస కార్యక్రమాలు:** నగర కేంద్ర గ్రంథాలయం, అశోక్‌నగర్, చిక్కడపల్లి వారి సహకారంతో మా వ్యవస్థాపక సమావేశకర్త ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు దాదాపు 20 సంవత్సరాలు ప్రతినెలా మొదటి ఆదివారం

నాడు సిటీ సెంట్రల్ లైబ్రరీ వారి హాలులో యువతకై వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలను నిర్వహించారు. వారికి మా యువభారతి సభ్యులు, వ్యక్తితత్వ వికాస నిపుణులు శ్రీ పి.జె.నెహ్రూ, శ్రీ పి.మారుతీ కిరణ్, శ్రీమతి జి.ఎల్.కె.దుర్గ సహకారాన్ని అందించి కార్యక్రమాలను దిగ్విజయంగా నడిపారు. కోవిడ్ కారణంగాను, సిటీ సెంట్రల్ లైబ్రరీ వారు తమ హాలును ఇవ్వటానికి నిరాకరించిన కారణంగానూ యువతీయువకులకు ఎంతగానో ఉపకరించే ఈ కార్యక్రమం ఆగిపోయింది.

ఇలా రాసుకుంటూపోతే చాలా ఉన్నాయి. కేవలం విహంగ వీక్షణంగా కడచిన 60 ఏళ్ళలో జరిగిన కొన్ని ముఖ్యకార్యక్రమాలను గూర్చి మాత్రమే నివరించటం జరిగింది.

పూర్వకాలంలో రాజులు, జమీందారులు, కవులను సత్కరించి, ఆదరించి తెలుగు సాహిత్యాన్ని పోషించారు. ప్రభువులు పోయారు. రాజ్యాలు పోయాయి. ఇక ప్రజలా! ఈ 'గ్లోబలైజేషన్' అనే సముద్రంలో చుక్కాని లేని నావలాగ ఎటుపోతున్నామో తెలియని స్థితిలో ఉన్నారు. జాతిని జాగృతంచేసి నడిపించవలసిన 'యువత' ర్యాంకుల వేటలో, ఉద్యోగాల వేటలో పడి మాతృభాషను మరచి, మాతృభూమిని విడిచి ఎక్కడెక్కడికో పోతున్నారు. స్మార్ట్‌ఫోన్లు, టీవీలు, అంతర్జాలం, వాట్సాప్‌లు, యూట్యూబ్‌లు, గూగులయ్యల వెనుకపడి మన భాష, సంస్కృతి, సంప్రదాయాలను మరచి మత్తులో జోగుతున్నారు.

ఇక కొద్దిగా మిగిలిన 'సాహితీవేత్తలు' తమను పల్లకీ ఎక్కించి మోసే బోయీలకోసం చూస్తారు కాని, పల్లకీ మోయటానికి సిద్ధపడరు. ఇష్టపడరు. ఇటువంటి పరిస్థితులలో మన భాష, సంస్కృతి, సంప్రదాయాలను నిలబెట్టేవి కేవలం 'సాహితీ సాంస్కృతిక సంస్థలే! అని బ్రతికితే మన భాషా సాహిత్యాలు, సంస్కృతీ సంప్రదాయాలు బతుకుతాయి. లేకపోతే చిల్లుకుండలో నీరులా హరించుకు పోతాయి.

అందుకని భాష, సాహిత్యం, సంస్కృతి, సంప్రదాయం వంటివి నిలబడాలంటే సాహితీ సాంస్కృతిక సంస్థల్ని ప్రజలే ఆదరించాలి, పోషించాలి. వారి కార్యక్రమాలలో పాలుపంచుకోవాలి. మమేకం కావాలి. అప్పుడే మన భాషా సాహిత్యాలు, సంస్కృతీ సంప్రదాయాలు నిలబడతాయి. లేకపోతే... ఆ తరువాత ఆకులు పట్టుకుని ప్రయోజనం లేదు.

–యువభారతి



# యువభారతి పురస్కారాలు

**డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారి స్మారక పురస్కార స్వీకర్తలు**

1997 ఆచార్య బిరుదురాజు రామరాజు
1998 ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం
1999 ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు
2000 ఆచార్య భీమ్ సేన్ నిర్మల్
2001 ఆచార్య పి. యశోదా రెడ్డి
2002 ఆచార్య నాయని కృష్ణకుమారి
2003 డ్రా॥ ఎం.ఎల్. నరసింహారావు
2004 ఆచార్య యం. కులశేఖర రావు
2005 ఆచార్య వేటూరి ఆనందమూర్తి
2006 ఆచార్య ముదిగొండ శివప్రసాద్
2007 డా॥ తిరుమల శ్రీనివాసాచార్య
2008 ఆచార్య రవ్వా శ్రీహరి
2009 ఆచార్య ఎస్.వి. రామారావు
2010 ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి
2011 ఆచార్య ఎల్లూరి శివారెడ్డి
2012 ఆచార్య సుమతీ నరేంద్ర
2013 డా॥ ముదిగంటి సుజాతారెడ్డి
2014 ఆచార్య రావికంటి వసునందన్
2015 ఆచార్య ననుమాస స్వామి
2016 డా॥ అక్కిరాజు రమాపతిరావు
2017 డా॥ ముక్తేవి భారతి
2018 డా॥ పోరంకి దక్షిణామూర్తి
2019 డా॥ నిడమర్తి నిర్మలాదేవి
2020 శ్రీ ఎస్. వెంకటేశ్వర రావు
2021 ఆచార్య వంగపల్లి విశ్వనాథం
2022 శ్రీ ఎర్రాప్రగడ రామకృష్ణ
2023 శ్రీ సుధామ

**డా॥ తిరుమల శ్రీనివాసాచార్య గారు, శ్రీమతి స్వరాజ్యలక్ష్మి గారి ధర్మనిధి పురస్కార గ్రహీతలు :**

2011 డా॥ ముదిగొండ శివప్రసాద్
2012 డా॥ ఎస్.వి. రామారావు
2013 డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి
2014 డా॥ ఎల్లూరి శివారెడ్డి
2015 శ్రీ సుధామ
2016 డా॥ మసన చెన్నప్ప
2017 డా॥ వంగపల్లి విశ్వనాథం
2018 డా॥ తిరునగరి
2019 డా॥ వెలుదండ నిత్యానందరావు
2020 శ్రీ ఉడయవర్లు
2021 డా. సంగనభట్ల నరసయ్య
2022 డా. గుమ్మన్నగారి బాలశ్రీనివాసమూర్తి
2023 డా. ఎమ్. కె. రాము (రసమయి)





# యువభారతి ప్రచురణలు

1. **సరస్వతీ సాక్షాత్కారం** (పద్యకావ్యం) – అనుముల కృష్ణమూర్తి (12–3–1967)
2. **జీవనగీత** (వచనకవితా సంకలనం) – ఖలీల్ జిబ్రాన్ 'ది ప్రాఫెట్'కు తెలుగులో స్వేచ్ఛానువాదం–కాళోజి (8–1968)
3. **వీచికలు** (వచనకవితా సంకలనం) – ఇరివెంటి కృష్ణమూర్తి, చక్రవర్తి వేణుగోపాల్, అల్లంరాజు వెంకట్రావు (సుధామ), వంగపల్లి విశ్వనాథం (1968)
4. **పంచవటి** (కథా సంకలనం), లత, శీలావీర్రాజు, అవసరాల, మంజుశ్రీ, ఆనందారామం (1969)
5. **రచన** (గోష్ఠి: వ్యాససంకలనం) – మారుతున్న విలువలు–రచయితల బాధ్యతలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (26.7.1970)
6. **కావ్యలహరి** (ఉపన్యాస వ్యాససంపుటి) – పంచమహాకావ్యాలు (శృంగారనైషధము, మనుచరిత్రము, పారిజాతాపహరణము, వసుచరిత్రము, విజయవిలాసము)పై ఉపన్యాస వ్యాసాలు – చార్య దివాకర్ల వేంకటావధాని (12–9–1971)
7. **అక్షరాలు** (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (24–10–1971)
8. **చైతన్యలహరి** (ఉపన్యాస వ్యాస సంకలనం) – తిక్కన, పాల్కురికి సోమన, శ్రీకృష్ణదేవరాయలు, వేమన, గురజాడలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (6–8–1972)
9. **మహతి** (వ్యాససంకలనం)–స్వాతంత్ర్యయుగోదయంలో తెలుగుతీరుతెన్నులు (1947–1972) వందమంది ప్రసిద్ధరచయితల సమీక్షావ్యాసాలు (14–8–1972)
10. Free India Forges Ahead (ఆంగ్ల వ్యాస సంకలనం) – డా॥పి.వి.రాజగోపాల్ (సం) (15–10–1972)
11. **స్వరాలు** (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (4–4–1972)
12. **ఉషస్సు** (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (4–4–1973)
13. **మళ్ళీ వెలుగు** (వచన కవితా కావ్యం) – శీలా వీర్రాజు (4–4–1973)
14. **ఉదయం** (కథాసంకలనం) – యువభారతీయులు (7–10–1973)

15. **కథావాహిని-1** (కథాసంకలనం) - యువభారతీయులు (7-10-1973)

16. **కథావాహిని-2** (కథాసంకలనం) - యువభారతీయులు (7-10-1973)

17. **మందార మకరందాలు** (వ్యాఖ్య) - ఎంపిక చేసిన పోతన భాగవత పద్యాలకు వ్యాఖ్య - సి.నారాయణరెడ్డి (21-10-1973)

18. **వికాస లహరి** (ఉపన్యాస వ్యాస సంకలనం) - నన్నయ, పోతన, సూరన, కందుకూరి, తిరుపతి వేంకట కవులపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (2-12-1973)

19. **ప్రజాసూక్తం** (సామెతలు) - సామెతల సంకలనం (2-12-1973)

20. **వేమన్న వేదం** (వ్యాఖ్య) - ఎంపికచేసిన ప్రజాకవి వేమన్న పద్యాలకు వ్యాఖ్య-ఆరుద్ర (ఉగాది 1974)

21. **భోగినీలాస్యం** (కవిత్వం - వ్యాఖ్య) - వానమామలై వరదాచార్యులు (24-3-1974)

22. **వడగళ్ళు** (వ్యాస సంకలనం) - రావూరి వేంకట సత్యనారాయణ (19-7-1974)

23. **నా గొడవ** (వచనకవితా సంకలనం) - కాళోజి (9-9-1974)

24. **శ్రీనాథుని కవితా వైభవం** (వ్యాఖ్య) - డా॥జి.వి.సుబ్రహ్మణ్యం

25. **మేం** (వచనకవితా సంకలనం) -సుధామ, నాగినేని భాస్కరరావు (6-10-1974)

26. **విశ్వనాథ కవితావైభవం** (వ్యాఖ్య) - జువ్వాడి గౌతమరావు (17-11-1974)

27. **సింధూరం** (వచనకవితా సంకలనం) - ప్రసిద్ధ కవులు (1-12-1974)

28. **శిఖరాలూ-లోయలూ** (వచనకవితా సంకలనం) - డా॥సి.నారాయణరెడ్డి (1-12-1974)

29. **భావన** (సూక్తులు) - డా॥ఇరివెంటి కృష్ణమూర్తి, డా॥నాగినేని భాస్కరరావు(సం) (1-12-1974)

30. **ప్రతిభాలహరి** (ఉపన్యాస వ్యాససంకలనం) - శ్రీనాథ, తెనాలి రామకృష్ణ, పానుగంటి, విశ్వనాథ, శ్రీశ్రీలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (1-12-174)

31. **మెరుపులు** (వచనకవితాసంపుటి) - పొట్లపల్లి రామారావు (1-12-1974)

32. **తిక్కన కవితావైభవం** (వ్యాఖ్య) - డా॥పాటిబండ మాధవశర్మ (1-12-1974)

33. **TELUU NOVEL** : VOL-1 (ఆంగ్ల వ్యాససంకలనం) – యం.శివరామకృష్ణ (సం) పదమూడు ప్రముఖ తెలుగు నవలలకు ఆంగ్లంలో వ్యాసాలు (2-2-1975)

34. **మరపురాని మనీషి** (వ్యాససంపుటి) – ముప్పైనాలుగు మంది ప్రముఖుల పరిచయ వ్యాసాలు – డా॥తిరుమల రామచంద్ర (2-2-1975)

35. **చేమకూర కవితావైభవం** (వ్యాఖ్య) – యమ్.కులశేఖరరావు (2-2-1975)

36. చలం ఆలోచనలు (సంపుటి) – చలం మ్యూజింగ్స్ నుంచి ఎంపిక చేసిన రచనలు (23-11-1975)

37. **భారతీ వైభవం** (వ్యాఖ్య) – పాతూరి సీతారామాంజనేయులు (14-12-1975)

38. **భారతనారి నాడు-నేడు** (వ్యాససంకలనం) – ఇల్లిందల సరస్వతీదేవి (14-12-1975)

39. **తిమ్మన కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥బి.వి.కుటుంబరాయశర్మ (21-12-1975)

40. **కవితాలహరి** (ఉపన్యాస వ్యాససంకలనం) – నాచన సోమన, పిల్లలమర్రి పినవీరభద్రుడు, జాషువా, దాశరథి కవులపై ప్రముఖుల వ్యాసాలు (15-1-1976)

41. **ధూర్జటి కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥పి.యస్.ఆర్.అప్పారావు (4-1-1976)

42. **తులసీదాస్ కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥భీంసేన్ నిర్మల్ (4-1-1976)

43. **కవితా లత** (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (మహిళలు) (4-1-1976)

44. **నన్నయ కవితావైభవనం** (వ్యాఖ్య) – ఆచార్య దివాకర్ల వేంకటావధాని (15-1-1976)

45. **ధర్మపథం** ( సంస్కృత శ్లోకాలకు వ్యాఖ్య) – బులుసు వేంకటరమణయ్య (31-3-1976)

46. **శతక సౌరభం** (వ్యాఖ్య) – ప్రసిద్ధ శతకాల నుండి ఎంపిక చేసిన పద్యాలకు వ్యాఖ్య – డా॥కె.గోపాలకృష్ణారావు (21-11-1976)

47. **నన్నెచోడుడి కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥నిడదవోలు వేంకటరావు (21-11-1976)

48. **పగలే వెన్నెల** (సినిమాపాటల సంపుటి) – డా॥సి.నారాయణరెడ్డి (21-11-1976)

49. **సూరదాస్ కవితా వైభవం** (వ్యాఖ్య) – డా॥ఇలపావులూరి పాండురంగారావు (19–12–1976)

50. **రామాయణ సుధాలహరి** (ఉపన్యాస వ్యాససంకలనం) – వివిధ భాషలలోని రామాయణాలపై ఉపన్యాస వ్యాసాలు (19–12–1976)

51. **కాళిదాస కవితావైభవం**(వ్యాఖ్య) – డా॥పుల్లెల శ్రీరామచంద్రుడు (19–12–1976)

52. **తిరుపతి వేంకటకవుల కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం (2–1–1977)

53. **కిరణాలు–కెరటాలు** (వచనకవితా సంకలనం) డా॥తిరుమల శ్రీనివాసాచార్య (2–1–1977)

54. **గోరాశాస్త్రీయం** (సంపాదకీయాలు) – గోరాశాస్త్రి (2–1–1977

55. **సాహిత్య అధ్యయనం** (ఉపన్యాస వ్యాస సంకలనం) – నవల, దృశ్యకావ్యం, పత్రికలు, కవిత్వంపై ప్రముఖుల వ్యాసాలు (2–1–1977)

56. **బాలభారతి** (బాలలరచనల సంకలనం) – డా॥వెలగా వెంకటప్పయ్య (సం) (10–3–1977)

57. **పాల్కురికి కవితా వైభవం** (వ్యాఖ్య) – డా॥ముదిగొండ శివప్రసాద్ (6–11–1977)

58. **నవోదయ లహరి** (వ్యాస సంకలనం) – రాయప్రోలు, నాయని, నండూరి, ఆరుద్ర, కుందుర్తి, సి.నారాయణరెడ్డిలపై ప్రముఖుల వ్యాసాలు (4–12–1977)

59. **విజ్ఞానోదయం** (విజ్ఞానశాస్త్ర వ్యాస సంపుటి) – డా॥రెడ్డి రాఘవయ్య (10–6–1979)

60. **గోపిచంద్ సాహిత్యం** (వ్యాఖ్య) – త్రిపురనేని సుబ్బారావు (8–9–1979)

61. **భారతీయ పునరుజ్జీవనం** (వ్యాస సంపుటి) – డా॥డి.రామలింగం (17–3–1980)

62. **రామాయణ పరమార్థం** (వ్యాఖ్య) – డా॥ఇలపావులూరి పాండురంగారావు (25–3–1980)

63. **పెద్దన కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥పల్లా దుర్గయ్య (25–3–1980)

64. **కంకంటి కవితావైభవం** (వ్యాఖ్య) – కరుణశ్రీ (25–3–1980)

65. **కుందుర్తి కవితా వైభవం** (వ్యాఖ్య) – డా॥అద్దేపల్లి రామ్మోహన్‌రావు (17–3–1980)

66. **వేడి వెలుగులు** (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (17–3–1980)

67. **వేగుచుక్కలు** (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (12–12–1980)

68. **సూర్యుడు కూడా ఉదయిస్తాడు** (వచనకవితా సంకలనం) – విశ్వనాథ సూర్యనారాయణ, జయప్రభ (12–12–1980)

69. **పురాణసంకేతాలు** (వ్యాస సంపుటి) – డా॥ముదిగొండ శివప్రసాద్ (12–12–1980)

70. **మరో జంఘాలశాస్త్రి** (వ్యాస సంపుటి) – అయల సోమయాజుల నాగేశ్వరరావు (12–12–1980)

71. **ఆలోచనాలహరి** (ఉపన్యాస వ్యాస సంకలనం) – కట్టమంచి, రాళ్ళపల్లి, కొమర్రాజు, గిడుగు, ముట్నూరి, విశ్వనాథలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (14–12–1980)

72. **శ్రీశ్రీ కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥మిరియాల రామకృష్ణ (20–1–1981)

73. **రేఖలు** (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (5–4–1981)

74. **ప్రేమచంద్ జీవితం–సాహిత్యం** (వ్యాఖ్య) – డా॥దాశరథి రంగాచార్య (20–2–1981)

75. **పువ్వులు నవ్వుతున్నాయి** (వచనకవితా సంపుటి) – డా॥జి.కుమారస్వామినాయుడు (14–02–1981)

76. **పింగళిసూరన కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥శ్రీరంగాచార్య (13–12–1981)

77. **కన్నడ కవితాసౌరభం** (వ్యాఖ్య) – డా॥గడియారం రామకృష్ణశర్మ (13–12–1981)

78. **అయ్యలరాజు కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥కొత్తపల్లి విశ్వేశ్వరశాస్త్రి (12–1981)

79. **కావ్య సందర్శనం** (ఉపన్యాస వ్యాససంపుటి) – ఆముక్త మాల్యద, పాండురంగ మాహాత్మ్యాలపై ఉపన్యాస వ్యాసాలు–ఆచార్య దివాకర్ల వేంకటావధాని(12–1981)

80. **నారాయణరెడ్డి సాహితీమూర్తి** (విమర్శగ్రంథం) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (13–12–1981)

81. **వెలుగుబాటలు** (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (2–3–1982)

82. **త్యాగరాజస్వామి భక్తి కవితావైభవం** (వ్యాఖ్య) – ఆకెళ్ళ అచ్యుతరామమ్ (6–6–1982)

83. **అడుగుజాడలు** (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (1-10-1982)

84. **ఉపనిషత్సుధ** (వ్యాససంపుటి) – ఇలపావులూరి పాండురంగారావు (5-12(1982)

85. **తమిళసాహిత్యం-భారతి కవిత** (వ్యాఖ్య) – డా॥చల్లా రాధాకృష్ణశర్మ (5-12-1982)

86. **ఇతిహాసలహరి** (ఉపన్యాస వ్యాస సంకలనం) – రాణాప్రతాపసింహచరిత్ర, శివభారతం, ఆంధ్రపురాణం, పోతనచరితం, ఝాన్సీరాణి, వందేమాతరంపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (5-12-1982)

87. **మరో జంఘాలశాస్త్రి-2** (వ్యాస సంపుటి) – అయలసోమయాజుల నాగేశ్వరరావు (5-12-1982)

88. **జానపద సాహిత్యం** (వ్యాస సంపుటి) – డా॥ఆర్.వి.యస్.సుందరం (5-12-1982)

89. **అభినవలోచనం** (వ్యాస సంపుటి) – రాయప్రోలు, విశ్వనాథ, మధునాపంతులపై వ్యాసాలు–డా.జి.వి.సుబ్రహ్మణ్యం (1983)

90. **ఆంధ్రసాహిత్య విమర్శ-ఆంగ్లప్రభావం** (విమర్శగ్రంథం) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం (14-1-1983)

91. **రవ్వలు** (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (5-6-1983)

92. **వెలుగుచూపే తెలుగుపద్యాలు** (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (1-8-1983)

93. **తెలుగు వాగ్గేయకారులు** (వ్యాఖ్య) – డా॥యస్.గంగప్ప (7-8-1983)

94. **అన్నమయ్య** (వ్యాఖ్య) – డా॥ముట్నూరి సంగమేశం (9-12-1983)

95. **మాఘ కావ్యవైభవం** (వ్యాఖ్య) – డా॥కె.వి.రాఘవాచార్య (9-12-1983)

96. **స్వామి వివేకానంద కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥ఓగేటి అచ్యుతరామశాస్త్రి (9-12-1983)

97. **సంస్కృతి** (వ్యాఖ్య) – డా॥ప్రసాదరాయకులపతి (12-09-1983)

98. **వాగ్భూషణం భూషణం** (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (12-9-1983)

99. **వెలుగురేఖలు** (వచనకవితా సంకలనం) – తాళ్ళపల్లి మురళీధర గౌడ్ (9–12–1983)

100. **సంస్కృతసాహితీలహరి** (ఉపన్యాస వ్యాస సంకలనం) – స్వప్నవాసవదత్తం, మృచ్ఛకటికం, అభిజ్ఞాన శాకుంతలం, ఉత్తరరామచరిత్రం, నాగానందం, ముద్రారాక్షసం నాటకాలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (9–12–1983)

101. **తెలుగులో స్వీయచరిత్రలు** (వ్యాస సంపుటి) – డా॥అక్కిరాజు రమాపతిరావు ( 16–4–1984)

102. **దేశమును ప్రేమించుమన్నా** (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (1–8–1984)

103. **తెలుగు జానపదకథాసంకలనం** (కథాసంకలనం) – జి.యస్.మోహన్ (10–1984)

104. **దశరూపక సందర్శనం** (వ్యాససంకలనం) – విషాదసారంగధర, ప్రతాపరుద్రీయం, బొబ్బిలియుద్ధం, గయోపాఖ్యానం, పాదుకాపట్టాభిషేకం, కన్యాశుల్కం, పాండవోద్యోగం, సత్యహరిశ్చంద్ర, వరవిక్రయం, నర్తనశాల నాటకాలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (15–10–1984)

105. **చిలకమర్తి కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥ముక్తేవి భారతి (5–10–1984)

106. **తిక్కన రసభారతి** (వ్యాఖ్య) – డా॥ఎల్లూరి శివారెడ్డి (5–10–1984)

107. **కృష్ణశాస్త్రి కవితావైభవం** (వ్యాఖ్య) – డా॥కడియాల రామమోహనరాయ్ (5–10–1984)

108. **జననీ జన్మభూమిశ్చ** (వ్యాఖ్య) – ఎంపిక చేసిన రామాయణ శ్లోకాలకు వ్యాఖ్య– డా॥యస్.బి.రఘునాథాచార్య (12–1984)

109. **వ్యాససూక్తం** (వ్యాఖ్య) – ఎంపిక చేసిన భారత శ్లోకాలకు వ్యాఖ్య – డా॥కె.కమల (7–12–1984)

110. **వ్యాససాహితీసంహిత** (ఉపన్యాస వ్యాససంకలనం) – వేదవ్యాసుని రచనలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (13–01–1985)

111. **చాటువులు** (వ్యాఖ్య) – ఎంపిక చేసిన చాటువులకు వ్యాఖ్య – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (1–1985)

112. (వివరాలు అలభ్యం)

113. (వివరాలు అలభ్యం)

114. **జ్ఞానపదులు జానపదులు** (వ్యాస సంపుటి) – డా॥దేవులపల్లి రామానుజరావు ప్రముఖులపై పరిచయవ్యాసాలు (5–10–1985)

115. **జగద్గురు సాహితీలహరి** (ఉపన్యాస వ్యాస సంకలనం) – శంకరాచార్యుల సాహిత్యంపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (5–10–1985)

116. **బాబాఫరీద్ సూక్తులు** (సూక్తులు) – డా॥ఇలపావులూరి పాండురంగారావు (9–1986)

117. **నన్నయభట్టు** (వ్యాఖ్య) – డా॥దివాకర్ల వేంకటావధాని (12–1986)

118. **హనుమప్ప నాయకుడు** (పద్యకావ్యం) – డా॥తిరుమల కృష్ణదేశికాచార్యులు (12–1986)

119. **తెలుగు బాలసాహిత్యం** (వ్యాస సంపుటి) – డా॥వెలగా వెంకటప్పయ్య (12–1986)

120. **కవిసమయములు** (సిద్ధాంత గ్రంథం)– డా॥ఇరివెంటి కృష్ణమూర్తి (26–4–1987)

121. **నవ్యసాహితీలహరి** (ఉపన్యాస వ్యాస సంకలనం) – నవల, కథానిక, వ్యాసం, నాటిక ప్రక్రియలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (10–1987)

122. **తెలుగులో గేయనాటికలు** (సిద్ధాంత గ్రంథం) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (12–1987)

123. **అక్షరాల ఆలోచనలు** (వ్యాస సంపుటి) – విశ్వనాథ, శ్రీశ్రీ, వానమామలై, దాశరథి, కుందుర్తి, భరద్వాజ, సి.నా.రె, ఉత్పల, బాపురెడ్డిలపై వ్యాసాలు – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం (1–1988)

124. **తెలుగు రుబాయీలు** (వ్యాఖ్య) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (1988)

125. **ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం** (ఉపన్యాస వ్యాస సంకలనం) – 1980–1990 తెలుగు సాహిత్యం, కవిత, నవల, కథానిక, పత్రికారచన, ప్రసార కళలు, విమర్శ, పరిశోధనలపై ప్రముఖుల వ్యాసాలు (2–1990)

126. **శ్రీమద్రామాయణ కల్పవృక్షం శబరిపాత్ర పరిశీలన** (సిద్ధాంత గ్రంథం) – డా॥జి.కుమారస్వామి నాయుడు (2–1990)

127. **యువత** (వ్యాస సంకలనం) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం, ఆచార్య వంగపల్లి విశ్వనాథం (సం) (3–1991)

128. **పరిశోధన పద్ధతులు** (వ్యాస సంకలనం) – డా॥ఆర్.వి.యస్.సుందరం (2–1990)

129. **కిన్నెరసాని పాటలు–వాక్య ప్రయోగ వైచిత్రి** (సిద్ధాంత గ్రంథం) – డా॥జి.యస్.లక్ష్మి (12–1990)

130. **కలంతో కాలం** (వ్యాస సంపుటి) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం (10–1990)

131. **ఋతుసంహారం** (పద్యకావ్యం) – కాళిదాసు శాకుంతలానికి తెలుగులో అనువాదం –డా॥తిరుమల కృష్ణదేశకాచార్యులు (1–1990)

131ఎ. **అమృతం కురిసిన రాత్రి – డా॥వాక్యలయ భావపోషణ** (సిద్ధాంత గ్రంథం) – బాలగంగాధరతిలక్ అమృతం కురిసిన రాత్రిపై పరిశోధన – డా॥వై.కామేశ్వరి (3–1991)

132. **ఇరివెంటి రచనలు** (సంపుటి) – ఇరివెంటి కథలు, కవితలు, గ్రంథపరిచయాలు, సమాలోచనల సంకలనం – తిరుమల శ్రీనివాసాచార్య (సం) (28–4–1991)

133. **భారతంలో ప్రేమ కథలు** (వ్యాస సంకలనం) – ముక్తేవి భారతి, లక్ష్మణరావు (5–1991)

134. **ఆక్సిజన్** (వచనకవితా సంకలనం) – డా॥నాగినేని భాస్కరరావు (8–1991)

135. **ఆధునిక సాహిత్య విమర్శ–అభిరుచి ధోరణి** (సిద్ధాంత గ్రంథం) – డా॥యం.నాగరాజు (11–1991)

136. **ద్వితీయ భాషగా తెలుగు బోధన – సమస్యల విశ్లేషణ** (సిద్ధాంత గ్రంథం) – డా॥వై.రెడ్డి శ్యామల (1–1992)

137. **గంగా తరంగాలు** (వచనకవితా సంపుటి) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (1–1992)

138. **పాతికేళ్ళ పత్రికారచన** (ఉపన్యాస వ్యాస సంకలనం) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం, తిరుమల శ్రీనివాసాచార్య (సం) సదస్సు వ్యాసాలు (5–1992)

139. **అమృత రాజీవం** (వచన కవితా సంకలనం) – వివిధ కవులు (6–1992)

140. **తెలుగు కవిత–లయాత్మకత** (వ్యాససంపుటి) – డా॥సి.నారాయణరెడ్డి (6–1992)

141. **అనుభూతి** (వచనకవితా సకంలనం) – యువభారతీయులు (6–1992)

142. **వెండి వెలుగులు** (వ్యాస సంకలనం) – ప్రముఖుల వ్యాసాలు–రజతోత్సవ సంచిక (6–1992)

143. **భావుకసీమ** (వ్యాస సంపుటి) – డా॥కోవెల సంపత్కుమారాచార్య (7–2–1993)

144. **దీపాల చూపులు** (వచనకవితా సంపుటి) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (3–1993)

145. **సాహితీ సమాలోచనం 1992–1993** (ఉపన్యాస వ్యాససంకలనం) – 1992–1993 సంవత్సరాలలో వెలువడిన సాహితీ ప్రక్రియలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (3–1994)

146. **విద్యా వైద్య శాస్త్ర కళారంగాలు – మానవతావిలువలు** (ఉపన్యాస వ్యాసాలు) – ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (3–1994)

147. **స్త్రీవాద ధోరణులు సమకాలీన సాహిత్యం** (ఉపన్యాస వ్యాససంకలనం) – ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (3–1994)

148. **వివేకానంద లహరి** (ఉపన్యాస వ్యాససకంలనం) – ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (3–1994)

149. **కొత్తగొంతుకలు–సరికొత్త విలువలు** (ఉపన్యాస వ్యాససంకలనం) – ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (3–1994)

150. **తెలుగు తమిళ కవితలు జాతీయవాదం** (వ్యాఖ్య) – చల్లా రాధాకృష్ణమూర్తి (2–1994)

151. **ఆధునికసాహిత్యం దళిత స్పృహ** (ఉపన్యాస వ్యాససంకలనం) – ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (3–1994)

152. **త్యాగరాయకృతులు– స్వరలయభావపోషణ** (సిద్ధాంత గ్రంథం) – డా॥బి.ఉషాలక్ష్మి (4–1994)

153. **ప్రశ్నార్థకాలు** (వచనకవితా సంపుటి) – తాళ్ళపల్లి మురళీధర గౌడ్ (10–1994)

154. **జక్కన చరిత్రము** (పద్యకావ్యం) – డా॥తిరుమల కృష్ణదేశికాచార్యులు (12–1994)

155. **పాలసముద్రం** (వచనకవితా సంపుటి) – యస్.బాబు (3–1995)

156. **శ్రీకృష్ణుడు జ్ఞానసారథి** (వ్యాసాలు) –అడవి సూర్యకుమారి (3–1995)

157. **రావిశాస్త్రి ధర్మేతిహాసం** (విమర్శనాగ్రంథం) – ముదిగొండ వీరభద్రయ్య (8–1995)

158. **విశ్వనాథ నవ్య సంప్రదాయం** (విమర్శ గ్రంథం) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం (9–1995)

159. **కొలమానం** (వ్యాససంపుటి) – డా॥జి.వి.సుబ్రహ్మణ్యం–పత్రికా వ్యాసాలు (9–1995)

160. **విశ్వనాథసాహితీ సమాలోచనం** (ఉపన్యాస వ్యాససంకలనం) – విశ్వనాథ సాహిత్యంపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (9–1995)

161. (వివరాలు అలభ్యం)

162. **స్వతంత్రస్వర్ణభారతి** (వచనకవితా సంకలనం) – యువభారతీయులు (9–1997)

163. **దివాకర్ల వేంకటావధాని జీవితం–సాహిత్యం** (సిద్ధాంత గ్రంథం) – డా॥జి.కుమారస్వామి నాయుడు (1998)

164. **వ్యక్తిత్వ వికాసం–ఆరోగ్యసూత్రాలు** (ఆరోగ్యగ్రంథం) – డా.నాగినేని భాస్కరరావు (12–8–2001)

165. **గోరంతదీపం కొండంత వెలుగు** (బాలసాహిత్యం) – రెడ్డి రాఘవయ్య (9–2001)

166. **హాస్యలహరి** (వ్యాస సంకలనం) – తెలుగు సాహిత్యంలో హాస్యంపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (29–12–2002)

167. **నవజీవనం** (నాటకం) – డా॥నాగినేని భాస్కరరావు (21–8–2003)

168. **ఆలోచనం** (వ్యాస సంపుటి) – నందిని సంచికలలో డా॥జి.వి.సుబ్రహ్మణ్యం గారి సంపాదకీయ వ్యాసాలు (3–2007)

169. **అక్షతలు** (వచనకవితా సంపుటి) – అయ్యదేవర పురుషోత్తమరావు (4–9–2007)

170. **అనంత గీత** (గేయసంపుటి) – డా॥మాడభూషి అనంతాచార్య–భగవద్గీత అనువాదం) (4–9–2007)

171. **సాహిత్యం ఎందుకు చదువాలి?** (విమర్శ గ్రంథం) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య (4–9–2007)

172. **చేగొండి కథాకదంబం** (కథాసంపుటి) – చేగొండి రామజోగయ్య (4–2008)

173. **ఇరివెంటి బాలసాహిత్యం** (బాలసాహిత్యం) – డా॥ఇరివెంటి కృష్ణమూర్తి బాలసాహిత్య గ్రంథాల సంపుటి (24–8–2008)

174. **శ్రీకృష్ణదేవరాయలు** (చారిత్రక నవల) – అయ్యదేవర పురుషోత్తమరావు (2008)

175. **మరో జంఘాలశాస్త్రి** (ఉపన్యాస వ్యాససంపుటి) – మరో జంఘాలశాస్త్రి మొదటి, రెండవ సంపుటాలకు పరివర్ధిత ప్రచురణ – అయలసోమయాజుల నాగేశ్వరరావు (2009)

176. **వేదవిజ్ఞానలహరి** (ఉపన్యాస వ్యాససంకలనం) – వేదాలపై ప్రముఖుల ఉపన్యాస వ్యాసాలు (1-11-2009)

177. **విజయానికి అభయం** (వ్యాససంపుటి) – గంధం నారాయణ – వ్యక్తిత్వ వికాసవ్యాసాలు (11-3-2011)

178. **ఉపనిషత్సుధాలహరి** (ఉపన్యాస వ్యాససంకలనం) – ఉపనిషత్తులపై ప్రముఖుల ఉపన్యాసవ్యాసాలు ( 12-4-2011)

179. **వ్యక్తిత్వవికాసం-సూక్తులు** – ఆచార్య వంగపల్లి విశ్వనాథం, డా॥నాగినేని భాస్కరరావు (సం) (3-6-2012)

180. **దివాకరప్రభ** (పద్యం) – డా॥తిరుమల శ్రీనివాసాచార్య-ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి జీవితచరిత్ర (2012)

181. **ప్రభావం** (వ్యాససంకలనం) – నందిని సంచికలలో ప్రచురింపబడిన ప్రముఖుల జీవితాలను ప్రభావితం చేసిన వ్యక్తుల, గ్రంథాల, సంఘటనలను గూర్చి వారి కలం నుండే జాలువారిన వ్యాసాలు (2013)

182. **దాశరథి కవితావైభవం** (కావ్యం) – డా. తిరుమల శ్రీనివాసాచార్య

183. **చౌరవ** (కవితాసంపుటి) – డా.నాగినేని భాస్కరరావు (2016)

184. **నగరం నిద్రపోదు** (దీర్ఘకవిత) – డా.నాగినేని భాస్కరరావు (6.11.2016)

185. **మీ మార్గం-మీ గమ్యం** (యువతకు వ్యాసాలు) – ఆచార్య వంగపల్లి విశ్వనాథం మరియు శ్రీ 'వేగేశ్న' గోవిందరాజులు (2017)

186. **వ్యక్తిత్వ వికాసం** (వ్యక్తిత్వ వికాస రచన) – ఆచార్య వంగపల్లి విశ్వనాథం మరియు డా.జి.ఎల్.కె.దుర్గ (2017)

187. **Personality Development**, (వ్యక్తిత్వ వికాసం) – ఆచార్య వంగపల్లి విశ్వనాథం (2018)

188. **You & Your Life** (వ్యక్తిత్వ వికాసం) –ఆచార్య వంగపల్లి విశ్వనాథం (2018)

189. **గాంధీమహా(త్ముని)సూక్తులు** – సంకలనం: సుధామ (2018)

190. **గాంధీ సందేశపథం** (కవితాసంకలనం) – యువకవుల కవితాసంకలనం (జనవరి 2019)

191. **అమరుడు బాపూజీ** (జీవితచరిత్ర) – దేవులపల్లి ప్రభాకరరావు (అక్టోబర్ 2019)

192. **తెలుగువారి నాల్కలపై నడయాడిన నాటక పద్యాలు** (వ్యాఖ్య) – విహారి (అక్టోబర్ 2019)

193. **పుంభావ సరస్వతి–పుట్టపర్తి** (జీవితం–సాహిత్యం) – డా. పుట్టపర్తి నాగపద్మిని (అక్టోబర్ 2019)

194. **అభినవపోతన వానమామలై** (జీవితం–సాహిత్యం) – డా. తిరుమల శ్రీనివాసాచార్య (అక్టోబర్ 2019)

195. **తెలుగు సొగసులు** (విద్యార్థి యువతకు పరిచయ వ్యాసాలు) – సుధామ (ఆగస్టు'2020)

196. **విజయపథం** – అయలసోమయాజుల నాగేశ్వరరావు

197. **నేర్పుగా జీవించడం ఎలా?** – ఎర్రాప్రగడ రామకృష్ణ

198. **చేగొండి కథా కదంబం** (రెండవ భాగం) – చేగొండ రామజోగయ్య

199. **చేగొండి కథా కదంబం** (మూడవ భాగం) – చేగొండ రామజోగయ్య

200. **అమృతభారతి** (వ్యాససంపుటి)

201. **ద్విశత భారతి** – సం॥ పత్రి అశ్వనీకుమార్ (2022)

202. **దక్షణభారత వణితా వాగ్గేయ వాఙ్మయం** – డా॥ వై. కృష్ణకుమారి (2022)

203. **భారత భారతి** – డా॥ ఆచార్య ఫణీంద్ర

204. **నన్నయ సూక్తిసుధ** – అయలసోమయాజుల నాగేశ్వరరావు (2023)

205. **మహాభారతోపన్యాసలహరి** – (2022)

206. **శ్రీమద్రామాయణం మానవీయ సంబంధాలు** – బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు (2023)

207. **యువభారతి వజ్రోత్సవ హారతి** – (2023)



## యువభారతి 'వజ్రోత్సవ హారతి' సంచికకు విరాళాలు అందజేసిన వదాన్యులు

| | |
|---|---|
| ✳ శ్రీ మాడభూషి అనంతాచార్యులు | 40,000/– |
| ✳ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్ అండ్ కామర్స్ | 20,000/– |
| ✳ శ్రీ ఎం.ఎస్.ఆర్. ఆంజనేయశర్మ | 10,116/– |
| ✳ డా॥ వంగపల్లి విశ్వనాథం | 10,000/– |
| ✳ అల్లంరాజు వెంకటరావు (సుధామ) | 10,000/– |
| ✳ శ్రీ ఎస్.నారాయణరెడ్డి | 10,000/– |
| ✳ శ్రీ పరవస్తు గోపాలకృష్ణ | 10,000/– |
| ✳ శ్రీ ఎస్.వి.ప్రభాకరరావు | 10,000/– |
| ✳ డా॥ వై.కృష్ణకుమారి | 10,000/– |
| ✳ డా॥ జి.ఎల్.కె.దుర్గ | 10,000/– |
| ✳ డా॥ సి.మృణాళిని | 5,116/– |
| ✳ శ్రీ గుత్తికొండ సుబ్బారావు | 5,116/– |
| ✳ శ్రీ ఆడెపు సుధాకర్ | 5,116/– |
| ✳ శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు | 5,000/– |
| ✳ శ్రీ డి.ఎల్.ఎన్.ప్రసాద్ | 5,000/– |
| ✳ శ్రీ టి.కె.విజయకుమార్ | 5,000/– |
| ✳ శ్రీ ఆమాతి రవీంద్ర | 5,000/– |
| ✳ డా॥ బి.జయరాములు | 5,000/– |
| ✳ శ్రీ అల్లంరాజు రాధాకుమార్ | 5,000/– |
| ✳ శ్రీ పత్రి అశ్వనీకుమార్ | 5,000/– |
| ✳ శ్రీ అంచూరి మల్లయ్య | 3,116/– |
| ✳ శ్రీ సింగంపల్లి వెంకటేశ్వరరావు | 3,000/– |
| ✳ డా॥ ఆచార్య ఫణీంద్ర | 3,000/– |

